శ్రీః

# శ్రీ శ్రీశ తత్త్వామృత మంథనమ్



శ్రీః

# శ్రీ శ్రీశ తత్వామృత మన్థనమ్

## జగద్గురు శ్రీమన్ మధ్వాచార్యులవారి ద్వైత తత్వభక్తిమార్గము

(ఐదాశ్వాసముల ఆంధ్ర పద్యకావ్యము)

రచన :- సుధీంద్ర ప్రహ్లాదః

*Rs - 51/-*

ముద్రణ : నయాగర నోట్ బుక్స్ ప్రై. లిమిటేడ్., 205, ఆటోనగర్, నెల్లూరు-4.
Phones : Offi:25550: Fac :23565: Res : 25815

సర్వస్వామ్యములు గ్రంథకర్తవి

ప్రతులకు

C/o Sri P.L.N.Rao
Development Officer
C&I and S.I.B
State Bank of India , Zonal Office
TIRUPATI - 517 501.

C/o సుధీంద్రరావు విజయబ్యాంకి
3.18.4 పాత పట్టాభిపురం
గుంటూరు 522 006.

C/o విజయీంద్రరావు
ఇంగ్లీషు లెక్చరరు
19/26 సంగయ్యపేట
నందికొట్కూరు 518 401.

ఈ కావ్యము
శ్రీమత్ తిరుమల తిరుపతి
దేవస్థానము వారిచే ఆధ్యాత్మిక
పుస్తకప్రచురణల సహాయార్థము
అనుగ్రహింపబడు ప్రణాళిక నుండి
పదివేల రూపాయల ద్రవ్య సహాయము చే
ప్రచురింపబడినది.

# అంకితము

వేంకన కీకృతి కన్యక
అంకితయైవిరులబూయ - నలమేల్సతిపి
ణాంకనిభ, దరస్మితరుచి
మంకెన చెక్కిళులు మదన -
మంజరులగుతన్

శ్రీవిష్ణున్ శ్రవణన్ బరీక్షితుడు, గీర్తింపన్ శుకుండబ్దిజా
సేవింపన్, పృథురాట్పు పూజనల, వాసిన్మ్రొక్కన క్రూరుడున్,
ఏ వేళన్ బ్రహలాదుడున్ స్మరణ, కీశేంద్రుండు దాస్యమ్మునన్
భావేత్సాఖ్యమునన్ గిరీటి, బలిస - ర్వస్మాత్మనర్పించుచున్
సేవింతుర్నవ భక్తిముక్తి పథని - శ్రేయాళ్లైవైవిధ్యులై

ఇతి సమర్పణమ్ సుధీంద్ర ప్రహ్లాదః

# కృతజ్ఞతలు

ఈ భక్తి జ్ఞాన కావ్యమంథనము దాదాపు మూడేండ్ల నుండి సాగుచున్నది. శ్రీ సుజయీంద్ర స్వాముల వారి యాశీర్వాదముచే ఇందలిరెండు శార్దూల విక్రీడితములు 1985 నాటి సుధాకావ్యమంగళ సందర్భమున మంత్రాలయములో విద్వజ్జన బృందావన సమక్షమున సభాముఖమున గానము చేయబడినవి.

1985లో నాఉద్యోగవిరమణానంతరము 1988 లో రచన సాగి సంపన్నమైనది. విద్వజ్జన పండితాభిప్రాయముల మేరకు కావ్యముద్రింపించుటావశ్యకమని, హరి,గురు వాయు. హితపండితులచే ప్రేరేపింపబడి ముద్రణా కార్యమునకు గడిగినాను. తిరుమల తిరుపతి వేంకన్న తన సంస్థానమునుండి పదివేలరూప్యముల సహాయ మనుగ్రహించి నాడు. నాఅగ్రతుల్యుడు కీ॥శే॥ ధార్వాడ హనుమంతరావుగారి రెండవ అల్లుడు చి॥ పల్లె లక్ష్మీనరసింహారావు. చి॥ సౌ॥ ఇందిర విశేషశ్రద్ధవహించి గ్రంథముద్రణకు తోడ్పడినారు. మామిత్ర వంశములోని బంధువర్గము. హితైషులు అభిమానులు, మాన్యులు చేయూత నొసగి ప్రోత్సహించినారు.

పండితరాజ, సచ్ఛాస్త్రరత్నాకర బిరుదాంకితులు, సుధా తత్వప్రకాశికా, దశప్రమాణములు, భారతతాత్పర్య నిర్ణయం పాఠములను సులభసుందర శైలిలో బోధించిన, కేంద్ర అకాడమీ గౌరవము పొందిన మధ్వశ్రీ మాగడిరంగనాథా చార్యులు గారు, శ్రీ శ్రీ సుజయీంద్ర శ్రీపాద పుత్రులు సుధా ప్రవచనాచార్య పండిత రాజా. యస్ గిరిరాజాచార్యులు ( సుజ్ఞానేంద్రాచార్యులవారు ) పండిత రాజ పాణినీ వ్యాకరణ పీఠాధ్యక్షులు ఆత్మకూరు పండిత పద్మనాభాచార్యులు, ఉత్తరాది పీఠాస్థాన విద్వాంసులు బాల్గొండ నరసింహాచార్యుల వారు; వ్యాసరాయపీఠా స్థాన విద్వాంసులు, పురాణ భాస్కర కంబాలూరు వేంకటేశాచార్యుల వారు కావ్యగత కించి ద్దోషముల నటనిటుసవరించి, సచ్ఛీలతను బెంచినారు.

తెలుపి లేని ముద్రణా ప్రాజెక్టులలో క్షణంతీరికలేని కార్యపరంపరలలో, క్లిష్టతరమైన వర్ణసముచ్చయ భూయిష్టమైన గీర్వాణ మయమైన పద్యమయాత్మక కావ్యమును హిందీ, ఆంగ్లము, తెలుగు సంస్కృతముల నేక కాలమున సులభమనునట్లు బహుసుందరమైన ముద్రణతో జనహృదయము పరవశమగునట్లు తయారుచేసిన వాణీప్రింటర్సు, నయాగారా నోట్‌బుక్స్ ప్రై లిమెటెడ్., నెల్లూరు వారికి కృతజ్ఞతాపూర్వక ధన్యవాదములు నామమాత్రములు కావు ఆర్ద్రహృదయవినిర్గతములు . దైవము సదా వారికి తోడుండు గాత.

శ్రీ మన్మధ్వాచార్యుల భాష్యగ్రంథవ్యాఖ్యాన గ్రంథములు - పండిత శ్రేష్ఠుల అభిమానపూర్వక బోధనలు. **Dr. B.N.K. Sarma, K.T. Pandu Rangi** గార్ల రచనలు జ్ఞానభిక్షనిడి ధన్యుని జేసి గ్రంథకర్తగా దీర్చి దిద్దినవనుటలో సందియములేదు. ఎందరో మహాను భావులు. అందరికీ వందనములు. వైదిక సూత్రముల, ప్రమేయముల భాష్యముల, వ్యాఖ్యల చదివి సారము గ్రహింప లేని నేటి వారికి దైవముపై శ్రద్ధ భక్తి గలిగించి జీవుల పారమార్థ సిద్ధికి యీ కావ్యము తోడ్పడ జాలినచో నా ప్రయత్నము సార్థకమై నన్ను ముక్తి భాజునిగా జేయగలదని నమ్ముచున్నాను.

ఇతి సుధీంద్ర ప్రహ్లాదః

నందికొటుకూరు - 518 401
శ్రావణ బహుళ ద్వితీయ
ప్రజోత్పత్తి 27.8.91

**అందందు దహరించిన అపౌరుషేయ మంత్రములకు**
**గ్రంథరత్నములకు సాష్టాంగ నమస్కృతులతో**

సప్రణవ - సశ్రీకములు

1. శ్రుతులలోని మంత్రములు
2. ఉపనిషత్తులు
3. స్మృతులు
4. బ్రహ్మ సూత్రములు (తత్వప్రకాశిక)
5. త్రిమత భాష్యములు
6. పాంచరాత్రములు
7. అను వ్యాఖ్యానము మధ్వాచార్యులు
8. విష్ణుతత్వ నిర్ణయము ,,
9. పురాణములు
10. శ్రీమద్భారత తాత్పర్య నిర్ణయం మధ్వాచార్యులు
11. శ్రీమద్భాగవ తతాత్పర్య నిర్ణయం ,,
12. శ్రీమన్న్యాయ సుధా - టీకాచార్యులు
13. శ్రీమత్ చంద్రికా - వ్యాసతీర్థులు
14. శ్రీమత్ పరిమళ - రాఘవేంద్ర తీర్థులు
15. తత్వ సంఖ్యానమ్ మధ్వాచార్యులు
16. తత్వ ద్యోతము ,,
17. తంత్ర ప్రదీపమ్ రాఘవేంద్ర తీర్థులు
18. సదాచారస్మృతి మధ్వాచార్యులు
19. తారతమ్యసద్రత్నమాలా - అధరాపురపు పురుషోత్తమాచార్యులు
20. సర్వజ్ఞ - వచనములు
21. అక్కమహాదేవి వచనములు
22. దాస సాహిత్యము
23. పురందర దాసు, అన్నమాచార్య - త్యాగయ్య కీర్తనలు
24. History of Dwaita Philosophy Dr. B.N.K. Sarma
25. Comparative Study of Trimata Bhashyas on Brahma Sutras Dri B.N.K. Sarma
26. Comentry on Geetha - Balagangadhar Tilak etc

శ్రీమన్మధ్వాచార్యమూల సంస్థానం శ్రీరాఘవేంద్ర స్వామి పీఠం మంత్రాలయం॥

జగద్గురు శ్రీమన్మధ్వాచార్యుల మూల సంస్థానమ్ శ్రీ 1008 శ్రీ సంపన్న మంత్రాలయ రాఘవేంద్ర స్వాముల పీఠా స్థాన విద్వాంసులు, పండితరాజ, పండిత రత్న విద్యా విశారద, శాస్త్ర వారిధి, విద్వన్మణి న్యాయ వేదాంత చూడామణి, వేదాంత భూషణ, తర్కశాస్త్ర, అలంకార శాస్త్ర ద్వైత వేదాంత శాస్త్ర విద్వాన్, శ్రీ వ్యాసరాజ మఠాస్థాన, శ్రీమంత్రాలయ రాఘవేంద్ర మఠాస్థాన విద్వాంసులు, ధర్మాధి కారులు రాష్ట్రపతి నుండి జాతీయ బహుమతి, కర్ణాటక రాష్ట్ర బహుమతి ఉడుపి పర్యాయ శ్రీకృష్ణ పూజా మహోత్సవమున శ్రీ 1008 శ్రీ విశ్వేశ తీర్థుల వారిచే శ్రీ కృష్ణాను గ్రహ ప్రశస్తి పత్రికా గ్రహీతులు, ద్వైత వేదాంత ప్రాధ్యాపకులు గవర్నమెంటు సంస్కృత కాలేజి ప్రిన్సిపాలుగా రిటైరైన మహోదయులు. శ్రీమన్ న్యాయ సుధా ప్రవచనాచార్య, ప్రాధ్యాపకాధ్యాపకులు, శ్రీగురు సార్వభౌమ సంస్కృత విద్యాపీఠము మంత్రాలయము, శ్రీగురు సార్వభౌమ మాస పత్రికా సంపాదకులు మాగడీ రంగనాథా చార్యులు :-

శ్రీమద్రాఘవేంద్ర గురుసార్వ భౌమ మఠీయ శిష్యకోటి ప్రవిష్టైః, శ్రీ సుధీంద్ర ప్రహ్లాద నామధేయ భూషితైః అస్మదంతేవాసిభిః ఆంధ్ర భాషాయాం పద్యమయం ..... శ్రీ శ్రీశతత్వామృత మన్థన సంజ్ఞకం, గ్రంథ రత్నమేకం నిరమాయి! గ్రంథ రత్నస్యాస్య అధ్యయ నేన, వివిధ సాంసారిక దుఃఖ స్వపరిశ్రమీణాం, ముముక్షు చేతనానాం అనంత కల్యాణ గుణ పరిపూర్ణే, భగవతి నారాయణే, సర్వోత్తమే, భక్తి భావః ప్రవర్ధత ఇత్యత్ర నాస్త్యేవ విశయ లేశోఽపి అనేన భక్తి ప్రచోదక జ్ఞాన కార్యేణ శ్రీమద్రాఘవేంద్ర గురు సార్వ భౌమాంతర్గత శ్రీభారతీ రమణ ముఖ్య ప్రాణాంతర్గత శ్రీమన్మూల రామచంద్రః సుప్రీతః ఏతేభ్యః ఇలోఽప్యధికం జ్ఞాన భక్తి వైరాగ్యా దికంచ ప్రదద్యాతిత్యా శాస్మహే

ఇతి

25.10.91 — మాగడీ రంగనాథాచార్యః

ఆశ్వయుజ కృష్ణద్వితీయ — మంత్రాలయ క్షేత్రమ్.

శుక్రవాసరః

శ్రీ మూల గోపాలకృష్ణో విజయతే శ్రీ మన్మధ్వాచార్యమూల మహాసంస్థాన
శ్రీ రాజేంద్ర తీర్థ పూర్వాది మఠీయ శ్రీ వ్యాసరాజ మహా సంస్థానమ్

శ్రీ ప్రజోత్పత్తి నామ సంవత్సరపు శ్రావణ కృష్ణాష్టమీ పర్వదినమున

శ్రీ వేదవ్యాసుల వారిచే సాక్షాత్ ప్రతి గృహీతమైన, శ్రీనీలా దేవి కరార్చితం, తథా శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్యులైన, పదవాక్య ప్రమాణ పారావార పారీణ సర్వతంత్ర స్వతంత్రులైన, శ్రీమద్వైష్ణవ సిద్ధాంత ప్రతిష్ఠాపనాచార్యులైన, శ్రీ సర్వజ్ఞాచార్య కరార్చిత శ్రీ మూల గోపాలకృష్ణ పట్టాభి రామ వేదవ్యాసాది దేవుల దివ్య శ్రీపాదపద్మారాధకులైన, శ్రీ వ్యాసరాజ గురుసార్వభౌముల వారి విద్యా కర్ణాటక సింహాసనా ధీశ్వరులైన శ్రీమద్విద్యా వారిధి తీర్థ శ్రీపాదుల వారి కరకముల సంజాతులైన శ్రీ మద్విద్యా ప్రసన్న తీర్థ శ్రీపాదుల వారి కరకమల సంజాతులైన శ్రీ 1008 శ్రీ శ్రీమద్విద్యా పయోనిధి తీర్థ శ్రీ పాదుల వారు తమకు పరమ ప్రియ శిష్యులైన శ్రీ సుధీంద్ర ప్రహ్లాదులకు ఇహపర్యాధిక శ్రేయోభి వృద్ధ్యర్థమై నారాయణ స్మరణ పూర్వకముగా వ్రాయించి పంపిన నిరూపము.

మీరు రచించిన ' శ్రీ శ్రీశతత్త్వామృత మన్థనం " కావ్యమును మీరే చదువగా విని సంతోషమైనది. ఆంధ్రభాషలో తమ కవనాశక్తి, ద్వైత వేదాంత శాస్త్రమున తమ పరిచయము సుందరమూ, సమీచీనమూ అయివుండుట ప్రశంశ నీయము. ఒక్కొక్క చోట శ్రీమదాంధ్ర భాగవతపు శైలినీ కాంచి యున్నాము. ద్వైత వేదాంత సమీక్షను చేసిన పద్య కావ్య రచన ఇంత వరకు తెలుగు భాషలో రాలేదు. తమయీ కృషి ఆదరణీయమై యున్నది. ప్రమేయ భాగములను సరళముగా సామాన్య జనులకు తెలుపగల ఈ కావ్య ప్రయోజనము యావదాంధ్రులకు గలుగు గాత.

ఇతి నారాయణ స్మరణాని

(కన్నడ మూలమునుండి గ్రంథకర్తచే అనువదింప బడినది)

# శ్రీ మన్మధ్వాచార్య మూల సంస్థానమ్
# ఉత్తరాది మఠమ్

శ్రీ 1008 శ్రీ సంపన్న పరమహంస పరివ్రాజకాచార్యేత్యాద్య నేక గుణగణ మండితానాం, శ్రీసత్యాభిజ్ఞతీర్థ కరకమల సంజాతానాం శ్రీమన్మధ్వా చార్యమూల సంస్థాన ఉత్తరాది మఠాధీశానాం, శ్రీసత్యప్రమోద తీర్థానా మనుజ్ఞయా లేఖకః అస్థాన విద్వాన్ బాలకొండు నరసింహాచార్యా ......

ఏతైః సుధీంద్ర ప్రహ్లాదైః నందికొటుకూరు గ్రామ వాసిభిః కృతం ఆంధ్ర భాషాయా.. శ్రీ శ్రీశతత్వామృత మన్థనమ్ పద్యకావ్యమ్ సర్వగుణ సమ్మిశ్రితామ్ శ్రీమన్మధ్వాచార్య నిర్మిత ద్వైత సద్ధాంత ప్రతిపాదక తయా విశిష్టతాం భజతే। ఆంధ్రానాం, మాధ్వానాం పరమోప కారక మిత్యత్ర నాస్తి విశయ ఇతి ।

శకే 1913 భాద్రపద శుక్ల

సౌమ్యవాసరే

18.9.1991

ఇతి బాలకొండు నరసింహాచార్య

సువర్ణ గ్రామ (మండల నిర్మల్. జిల్లా

ఆదిలాబాద్ - ఆంధ్రప్రదేశ్)

# శ్రీ 1008 శ్రీ విశ్వేశ తీర్థస్వామీజీ
# శ్రీ పేజావర అధోక్షజ మఠమ్
# జగద్గురు శ్రీమన్మధ్వాచార్య సంస్థానమ్
# ఉడుపి 576 101 ద.క

ఫోన్ : 20498

## సప్రేమ నారాయణ స్మరణాని శ్రీ సుధీంద్ర ప్రహ్లాద

మహోదయైః విరచితం శ్రీ శ్రీశ తత్వామృత మన్థనాభిధానం ఆంధ్ర భాషామయం కావ్యమస్మాభిః సందృష్టం, పరిశీలితంచ। అత్రత్యం, ఆధ్యాత్మిక, భౌతిక, ప్రముఖ విషయాను బంధి, సరళ, సుందర నిరూపణమ్ నిరీక్ష్య నితరాం ప్రముదితాస్మః సమీచీన తత్వవాద వేదాన్త సంబంధితాత్విక ప్రమేయ జాతమపి హృదయ స్పర్శిన్యా సుమధుర పదబంధు రతయాచ శైల్యా సమ్యగ త్రావిరకారి । ఈః దృశ కృతిరత్న విరచయిత్వాన్ సుధీంద్ర ప్రహ్లాద మహోదయాన్,వయం సమభినన్దామః । భగవదను గ్రహం చ ఏతేషు సంప్రార్థయామః

ఇతి సప్రేమ నారాయణ స్మరణాని
(సం) విశ్వేశతీర్థ స్వామిజీ.

శ్రావణ కృష్ణసప్తమి
పూర్ణప్రజ్ఞ మహావిద్యాలయం
బెంగుళూరు.

॥ శ్రీః ॥

# ॥ శ్రీ హరిశ్శరణమ్మమ ॥

శ్రీ ప్రహ్లాదాపరనామభిః సుధీన్ద్రాభిధైః
శ్రీశతత్త్వామృతమన్థనం నామ లఘుకావ్య మాన్ద్రా
గిరా సన్దృబ్ధం మయ్యాద్యావలోకి । నరసంసుందరం
లోకోప కారిచవిద్యతే । ప్రసక్తానుప్రసక్త్యా
శ్రీ మదానన్ద తీర్థీయమపిక్వశిచ్చన్యన్నిరూపిసరలయా
ధోరణ్యాఽతో వశ్య మార్త్యైః సంగ్రహణీయ మితి మామకీన
ఆశయః

పండితరాజాద్యనేక పదవీకః
పండిత పద్మనాభాచార్యః

అధ్యక్షః,

శ్రీ పాణినిమహావిద్యాలయః
ఆత్మకూరు ( కర్నూలు జిల్లా )
ఆశ్వీనకృష్ణప్రతిపత్తిథౌ ।

# శ్రీవ్యాసరాజ మహాస్థాన విద్వాన్

పురాణ భాస్కర డా॥ కంబాలూరు వేంకటేశాచార్య

శ్రీ సుధీంద్రప్రహ్లాదుల శ్రీశత త్వామృత మంథనము, తిరుమలేశుని సంబోధించి వ్రాసిన వ్యంగ్య కావ్యము, సర్వజ్ఞని త్రిపదుల ననుసరించి వ్రాసిన రచనలు చదివి, వారేవినిపంచగా విని, సంతోషించితిని.

ఇది ఛందో విదుద్ధమైన కాలము. పాండిత్యవిముఖమైన సాహిత్యయుగము. ఈనాటి రచయితలకు భావతీవ్రత మెండుగా నున్నదికానీ వ్యుత్పత్తి అల్పము శాస్త్రాధ్యయనము పూర్తిగాసన్నగిలిపోయినది. దేనికైననూ రాజీపడవలె, రాణింప వలెనన్న కండూతిమెండు.

ఇట్టి వాతావరణములో సుధీంద్రులరచనలు చూచి ఆశ్చర్యమైనది. వారు ద్వైత విద్వాంసులైన శ్రీ మాగడి రంగనాథాచార్యులు. శ్రీపళ్ళె పూర్ణప్రజ్ఞాచార్యులు మొదలైన సాహిత్యవేదాంత విద్వాంసుల యొద్దవ్యాసంగము చేసినవారు. సంస్కృతాంధ్ర కన్నడ భాషలందు చాలినంత పరిచయ పాండిత్యము కలవారు. సంప్రదాయమునెడగౌరవము. సమాజమునెడ స్పందన కల కవిహృదయులు. సమాజ స్పృహ యొత్తిడిచేయగా సంప్రదాయము వాహికగా పరమార్థమైన విష్ణుతత్వము మొదలుకొని పామరజన భ్రష్టాచారమువరకు నెన్నో విషయములు కావ్యవస్తువులుగా ప్రత్యక్షము చేయించినారు.

వీరి ఈ రచనలలో గహనమైన వేదాంతతత్వమున్నది. లలితమైన భావలహరులున్నవి, అలతి అలతిగా నవనీతిని మందలించుటయున్నది. అన్నింటికిని తోడుగుగా సాంప్రదాయక సంస్కారమున్నది.

సంప్రదాయముపైన, ఛందస్సుపైన, ప్రాచీనసంస్కృతీ వైభవముపైన విశ్వాసమున్నవారు.విజ్ఞతకలవారు వీరి రచనలను చదివి ఆనందించ గలరు.

ముఖ్యముగా త్రిపదులను ధారావాహికగా నే పత్రికాముఖముననైన ప్రచురించినచో నవిబహుజనాదరణమును కూడ చూరగొనగలవని నావిశ్వాసము. భక్తులకిది సంసార సాగరమును తరింప గల దివ్యమైన నావ

నందికొట్టుకూరు బలిప్రతిపత్ విభవము — బుధజన విధేయుడు

ప్రిన్సిపల్ గవర్నమెంటు డిగ్రీ కళాశాల — డా॥ కంబాలూరు వేంకటేశాచార్య

## శ్రీగాయత్రీ పంచాయతన పీఠం కొవ్వూరు ప.గో

గోష్పదీక్షేత్రము.

సద్గురు పరబ్రహ్మణేనమః

మహారాజ శ్రీ సుదీంద్ర ప్రహ్లాద గారిచే రచింపబడిన శ్రీ శ్రీశతత్వామృతమ స్తవమ్ అనురచనను ఆమూలాగ్రముగా పరిశీలించితిమి -

విశ్వవ్యాపి నిశ్శబ్దస్వప్న సాక్షాత్కారరూపరసగంధస్పర్శామిళిత చాతుర్యమున సంభాషణము జరుపుట రచయిత పూర్వజన్మఫలముగా భావింపుచున్నాము. ఆత్మవంచన గావించుకొను నరమాధమ మానవరూపదానవులకు సర్వోత్తమ సర్వశక్తిమంతునిగాదైవమొకడున్నాడని ఈ రచనల ద్వారా విశ్వశ్రేయుని దర్శనమును చేయింప సత్సంకల్పము కల్గి ఇట్టి ఛందోబద్ధమయిన రచనచేయుట మిక్కిలి ముదావహము .

పద్య రచన హృద్యముగాను భక్తి రసప్రాధాన్యముగాను సాగినది. ఈ రచన వీరి సంస్కృతాంధ్రభాషా నైపుణ్యమును జాటుచున్నది. ఇహలోక వాసులను మేల్కొనజేయు ననేకరచనలను విశ్వవ్యాప్తి శ్రీ విష్ణువు ప్రహ్లాదునిచేరచింపజేసి ఇతనిని కృతార్థునిజేయవలసినదిగా మదుపాస్యదైవమగు జగన్మాత శ్రీగాయత్రీదేవిని అనేకానేకముగా ప్రార్థింపుచున్నాను.

ఇట్లు
భవదీయుడు
జ్ఞానానందతీర్థదీక్షా నామ
ఓగిరాలవీర రాఘవ శర్మ
దేవీగాన సుధాకర
కర్ణాట సంగీత విద్వాంసులు
వాగ్గేయ శిఖామణులు
శ్రీగాయత్రీ పంచాయతన పీఠాలంకృత యతీంద్రులు
గోష్పదీక్షేత్రము

కొవ్వూరు
ప.గో 1.8.88

# అభినందన

దాదాపు ఏడాదిక్రితం శ్రీ సుధీంద్ర ప్రహ్లాద గారు తమ శ్రీ శ్రీశతత్వామృత మంథనము అన్న కృతిని వినిపించారు.

ద్వైతాద్వైతసిద్ధాంతములను చక్కగా అధ్యయనమొనర్చిన శ్రీ సుధీంద్రగారు సమకాలీన సమాజమునకు ఉద్బోధకంగా ఈ రచన చేసినారు.

సంస్కృతాంధ్రములలోను, ఆంగ్లంలోను పండితులైన యీ కృతికర్త గహనమైన తాత్విక విషయములను సుబోధకంగా రచించి నందుకువారిని అభినందిస్తున్నాను.

మరికొన్ని ఉత్తమ రచనలు సాగించుటకై ఆయురారోగ్యములను ప్రసాదింప వాగ్దేవికి వేడికోలు


జానమద్ది హనుమచ్ఛాస్త్రి

కడప — ప్రొఫెసరు ఇంగ్లీషు, తెలుగు

28/9/91 — మహతి

1/1845

గాంధి నగరు

కడప, 516004

డా॥ చతుర్వేదులనరసింహ శాస్త్రి
( అమరేంద్ర )రిటైర్డు ప్రిన్సిపాలు
2- 2- 3/6 బి శివం ప్రక్కన
శివం రోడ్డు
హైదరాబాదు.

శ్రీ సుధీంద్రప్రహ్లాద గారికి నమస్కృతులు

మీరు పంపిన శ్రీ శ్రీ శతత్వామృత మంథనం జెరాక్సు కాపీ అందినది. రచనలు ప్రౌఢంగా గంభీర భక్తి భావసుందరంగా వున్నాయి. చదివి చాలా ఆనందించినాను.
విశ్రాంత జీవితం వీణా పాణి నలువ రాణి సమర్చనంతో
సార్థకం చేసుకోగలందులకు వెలసిన ధన్యజీవులు తమరని విశ్వసిస్తున్నాను.

శుభాభివందనాలతో

17 - 9 - 88 అమరేంద్ర

డా॥ బిరుదురాజు రామరాజు
తెలుగు ప్రొఫెసరు ఉస్మానియా విశ్వవిద్యాలయం
1 - 8 - 117 /2 చీకటిపల్లి , హైదరాబాదు - 20

శ్రీ యుతులు, ఆప్తులు శ్రీ సుధీంద్ర ప్రహ్లాదగారికి అనేక నమస్కారములు.

మీజెరాక్సు కాపీ అందినది. బహుకార్యమగ్నుడనై పర్యటనలో నుండి వెంటనే మీకు వ్రాయలేక పోయినాను.నాయనికృష్ణకుమారిగారికీ, రఘునాధాచార్యుల వారికీ చూపినాను. మీరు రచించిన శ్రీ శ్రీశతత్వామృత మంథనం అనుకావ్యమున ప్రాచీనులైన పండిత కవుల పోహళింపూ, ఆధునికుల భావసౌందర్యములు మేళవించిన మీ కవితాశైలి సరసులూ, సహృదయులందరికీ ఆమెత పెడుతుంది. మీకృతీ, మీరూ సుకృతులు.

నమస్కారములు

25 - 9 - 88 బి. రామరాజు

ఏరూరు సీతారామశర్మ,
రిటైర్డుప్రిన్సిపాలు,ఆదోని కాలేజి
గురుసార్వభౌమ పాఠశాల, మంత్రాలయం
హైదరాబాదు

## అభినన్దనము

సుధీనా మింద్రా : సుధీంద్రాః, తేషామా హ్లాదకోఽయితి ప్రహ్లాదః అని తమ నామధేయమును చమత్కరించి బుధజనవిధేయతను వినయముగా తెలిపినారు సంతోషము. మీరచనలు పరిశీలింపగా నిజముగా నాహ్లాదత్వము వెల్లివిరియుచున్న దనుటలో నతిశయోక్తిలేదు.

శ్రీ శ్రీ శతత్వామృత మంథనం నన్ను బాగుగా ఆకర్షించినది. భావములు, భాష పరస్పరం పోటీ పడ్డాయి. ఈ పద్ధతి పూర్వకవి పంగళి సూరన రచనలను పదేపదేజ్ఞప్తికి దెచ్చున్నది. ద్వైతాద్వైత విమర్శలు స్నిగ్ధములై సద్భావదీప్తములై వెలుగుచున్నవి.

మంత్రాలయప్రభువులను గురించి వ్రాసిన పద్యములు మధురాతి మధురములు తుంగభద్రానది అనన్యవిలాసగామిని. తెనాలి రామకృష్ణాదులచే మనోహరముగా వర్ణింప బడినది వీరి " తుంగభద్ర వర్ణనమ్ము "
షడ్ ఋతువుల శీతలాంబువుల రూఢిమునుంగుచు బాసెదరెల్ల పాపముల్ " అను నూతన స్వతంత్ర భావము కడురమ్యముగా నదికి అఘమర్షణత్వమును సూచించినది. కావ్యము ధారాశుద్ధితో నడచినది.

రెండవ యాశ్వాసములో "సంకట వినాశ, మముబ్రోచువేంకటేశ వరదపద్మావతీ శ్రీశ తిరుమలేశ "అను మకుటముతో వ్యంగ్యసీసములతో చమత్కరించిన నిందాస్తుతి. సర్వాలంకార సమన్వితము. ప్రశంసనీయము సంప్రదాయ కవిత్వమునకు గీర్వాణాంధ్ర భాషల నేటి దుస్థితిని గూర్చి కవిగారియారాటము. వేదన హృదయ పూర్వకముగా నున్నది.

మూడవ యాశ్వాసము త్రిపదులలో నడచినది. తెలుగువారికిది క్రొత్తగనేయుండును. సర్వజ్ఞుడను కన్నడ కవి త్రిపదులను వ్రాసి అజరామరుడైనాడు. ఆఛందస్సును కొద్ది మార్పుతో గ్రహించి సర్వజ్ఞుని కొన్ని మంచి నీతులను తెనుగులో

భావానువాదములుగా వ్రాసిన ప్రక్రియగానున్నది.

లోకములోని వైదిక ధర్మగ్లానికి సాంఘిక దురాచారములకు స్పందించి సులభ ముక్తక త్రిపద శైలిలో సర్వజ్ఞుని, అక్కమహాదేవి వచనములు అనుసరించిన భావములు మెండుగా గలవు.

స్వతంత్ర కావ్యరచనా పాటవముగల రచనలను విశ్వశ్రేయోభిలాషతో ఇతోధికముగా కవిగారు సమర్పింప గలరని ఆశించుచున్నాను.

ఏరూరు సీతారామశర్మ

M. A. Eng M.A Telugu.Retd, Principal.

శ్రీదేవీగాన సుధాప్రపూర్ణ

డా॥ పి. నాగమణి M.A;M.Phil;Ph.D;

Lecturer in Telugu, T.J.P.S. College, GUNTUR.

శ్రీగురుభ్యోనమః

శ్రీసుధీంద్ర ప్రహ్లాదగారు సహజకవులు, సంస్కృతాంధ్ర ఆంగ్ల భాషా కోవిదులు. వారి భాషా వైదుష్యమునకు నికషోపల మీ " శ్రీ శ్రీశతత్వామృత మంథనం" అను కావ్యం

ఉద్దండ పండితులగు శ్రీ సుధీంద్ర ప్రహ్లాదగారి పురాకృత పుణ్య విశేషము ఫలరూపమై నిసర్గ సుందర కవితాధారతో కావ్యమై భాసించినది. ఇందలి సంస్కృత సమాస బంధుర రచనా పటిమ వీరికి గీర్వాణ వాణీ శైలి యందుభిరుచి మెండని చాటు చున్నది. వాగ్దేవతాఽపార ప్రసాదలబ్ధమైన యీ " శ్రీ శ్రీశ తత్వామృత మంథన కావ్య రసఝరీ ప్లావితముగు భక్తిమాధురీ భాగ్యలాభము ఆంధ్ర పాఠకలోకమునకు భాగధేయమగుగాక.

పిన్ననైనను మదభిప్రాయ స్వీకృతి జేసి కృతినైతిని. మదుపాస్య దైవమగు శ్రీ గాయత్రీ మాత యీకవికి ఆయురారోగ్య సంపద నిచ్చి వీరిచే పెక్కుకృతుల వెలయింప జేయగాక యని విశ్వసర్వాంతర్యామిని ప్రార్థించు చున్నాను.

సుధీజన విధేయ

నాగమణి.

# ఆశంసలు

హరిః ఓమ్

శ్రీ సీతారామా భ్యాంనమః

మధ్వ శ్రీ సుధీంద్ర ప్రహ్లాదగారు రచించిన "శ్రీ శ్రీ శతత్వామృత మన్థనమ్ అనుకావ్యమును పరిశీలించితిని. గ్రంధము సర్వాంగ సుందరము. కర్ణానందకరము. అందందు అలతి, అలతి పదములతో దేశి కవితను, కొన్నియెడల, సమాసభూయిష్టమగు మార్గ కవితను , మరికొన్ని యెడల గ్రొత్త పోకడలతో, గ్రొంగొత్తరుచులతో , కవితా కన్యకను భావ లాస్యాభినయములతో నడిపించి త్రివేణి సంగమమని పించినారు.

ప్రాచీన, అర్వాచీన, అత్యంతాధునికులనుగూడ సమన్వయ పరచినారు. సంస్కృతాంధ్రములందున, పెక్కురీతులలో కవిత్వము సాగినది. ద్వైతాద్వైత, విశిష్టాద్వైత ములలోని మర్మము, తర్క, వేదాంత షడ్దర్శన పారిభాషిక పదములలోని గూఢార్థములను సయితము, సులభముగా అర్థమగునట్లు చెప్పుట ఇందలి విశేషము కావ్యము దాత్తాది గుణముల గని·

సందర్భోచితముగ, ఉపమాద్యర్థాలంకారములు, కర్ణానందముగూర్చు శబ్దౌచిత్యములు ధ్వనులు శయ్య కలదియై కావ్యము సర్వాంగ సుందరమనుట నిర్వివాదము.

ఇట్టి ఇహపరార్థ బహుళార్థ సాధకగ్రంథములు వెలయించవలయుననియు, శ్రీహరి తమకు ఆయురారోగ్య భాగ్యములనిచ్చి రక్షించు గాత అని మా ఆశంసలు.

" లోకాః సమస్తాః సుఖినో భవంతు "

ఇత్థం

ప్రతాపగిరి కృష్ణమూర్తి శాస్త్రి

నివృత్త సంస్కృతాంధ్ర

భాషాధ్యాపకులు,

ఉన్నత గవర్నమెంటు పాఠశాల నందికొటుకూరు,

శ్రావణ శుద్ధద్వితీయ ప్రజోత్పత్తి

# అభినందనాభిప్రాయము

" ఆర్థ్యం, తథ్యం, హితం, వాక్యమ్ లఘుయుక్తమనుత్తరం " అని విజ్ఞాన దాయకమైన రచన యెట్లుండ వలెనో శ్రీ వేదవ్యాసమహర్షిపై శ్లోకపాదముననిర్వచించినాడు. పెక్కు కావ్యములు సుధాపరిమళ తత్వప్రకాశి కాది. వ్యాఖ్యానగ్రంథముల నధ్యయనమొనర్చిన మధ్వశ్రీ సుధీంద్ర ప్రహ్లాద పుణ్యశీలుని శ్రీ శ్రీశతత్వామృత మంథనం అను ఐదాశ్వాసముల కావ్యము శ్రీ వ్యాస ముఖోక్తరీతి భాష్య, వ్యాఖ్యానములు వ్రాసిన శ్రీ మన్మధ్వాచార్యుల ద్వైతతత్వ భక్తి మార్గముననుసరించి యున్నది. ప్రబంధరీతులగాక, జనతాశ్రేయోకాంక్షులైన, కవిత్రయము పోతనాదుల వలె కవిత్వము దివ్య భక్తి ప్రేరకమై, విశ్వశ్రేయోప్రయోజన మునకై సాగినది. రచన హృదయాహ్లాద దాయకముగానున్నది. మంత్రాలయ మున శ్రీ రాఘవేంద్ర ప్రభువుల బృందావన సేవతో పెక్కేండ్లు గొలిచిన పుణ్యపరిపాకమే యీ దివ్యకావ్యా విష్కృతి

సంస్కృతాంధ్ర కర్ణాటకాంగ్లేయ భాషా కోవిదుడైన యీ రచయితనుండి ఆంధ్రావని ఇతోధికమధుర భక్తిరస పూరిత కావ్య ఫలములాశించుట, అత్యాశ అతిశయోక్తికాదు.

శ్రీ లక్ష్మినారాయణులు రచయితకు ఆయురారోగ్యభాగ్యాభీష్ట సిద్ధిని ప్రసాదింతురు గాత !

శుభం భూయాత్

శ్రీ విభవ వ్యాసపూర్ణిమ
శుక్రవారము 29.7.88
ఏలూరు పశ్చిమ గోదావరి

మధ్వశ్రీ చారాల నరసింహామూర్తి
నివృత్త వ్యవసాయాధికారి
రచయిత, సాహితీవేత్త

# दो बातें

श्रीश तत्वामृत मथन काव्य के बारे मे।

यह पद्योका सुदर काव्य है। इसमे हैतुवाद की महत्ता स्पष्ट की गई है।

कवि का राय यह है कि, मानव परब्रह्म का अश लेश होने पर भी, छोटे से प्रयत्नो से एक ही दफा अचानक अक्षर परब्रह्म बनजाना या परब्रह्म मे लीन होना असभव है। अपरा प्रकृति मे जकड़ा मानव जल्दी से जल्दी आवरण विच्छेद करके अपने अपने स्वरूपानन्द तत्व मे लीन होकर ब्रह्मतत्व के समीप नहीं पहुँच सकता लौकिक जीवन बिताते हुये जो कोई अपने आपको परब्रह्म माने तो, वह केवल मूर्खता दभ या अहकार की प्रदर्शन है। परब्रह्म मे लीन हो जाना सभव हो जाय तो फिर सृष्टि की आवश्यकता ही नहीं रहेगा, याने सृष्टि का उद्देश्य गौण हो जायेगा।

[illegible] वश जन्म–मरण की वृत्त मे पडे मानव के पहले प्रभु और [illegible] भाति द्वैत भक्ति का अपनाने की आवश्यकता है। अतः द्वैत भक्ति के आनद को प्राप्त करते हुए मुक्ति को पाना या सहज मुक्तानद स्थिति [illegible] प्रभु के निकट रहना श्रेष्टतम विधान है।

सृष्टि स्थिति लयादि कार्य को अलग–अलग सत्तावों की रूप मे निभाना केवल विष्णु की धर्म है। वह सर्व प्राणियो मे चैतन्य को जगाने का महा पुरुषाधि दैव है।

पचतत्वों से बना यह–जहाँ नर–नारायण का क्रीड़ा क्षेत्र है। आदि पुरुष के सकल्प से सारी विश्व प्रकृती बनी है। व्रह्म की संगिनी, विष्णु की हृदय–वासिनी, शिव की अर्ध नारीरूप

बनकर प्रकृति माई विभिन्न नामों से विराजमान होती है। इस प्रकार सारे ससार मे, प्रकृति पुरुष एक दूसरे के पूरक बने हुए है। मुक्ति मार्ग मे अतः स्त्री–हुरुष दोनों एक–दूसरे के, सहायक बन सकते है । यों बताते हुए कबि शक्ति के तत्व को सही मान्यता प्रदान किये है।

कवि कहते है, कि भक्ति क्षेत्र मे मानव को मार्जाल किशोर न्याय को अपनाने का आवश्यकता है। ऐसा करने से सारी जिम्मेदारी भगवान की हो होती है। गलत रास्ते पर कदम रखने का भूल नहीं हो सकता।

लक्ष्मी नारायण की चरणों मे भक्ति से मानव का मन, शात, निश्चल तथा विशाल बन जायँगा तन्मय भक्ति के द्वारा मानव के अतः शरीर अधोमुखी मुकुलित हृदय पद्म ऊर्ध्व मुखी बनकर खिलेगी और प्रभु की सेवा मे मग्न होकर देह भ्राति से छुटकार पायेगा।

कवि अपना खेद इस प्रकार प्रकट करते हैं कि दुनियाँ मे भक्तिभाव केवल कोरी कल्पना बन गई है। अपने को भक्त या योगी मानने वाले केवल ढ़ोंगे भक्त बने होते हैं।

"श्रीश तत्वामृत मथनम्" की परिसमाप्ति मे दशावतार का वर्णन सुदर ढ़ग से किया गया है जिससे काव्य को महत्ता और भी बढ़ गई है। यह द्वैत भक्ति की ओर सकेत करने वाला सच्चा विष्णु काव्य है। इसकी रचना मे भाव व्यक्त करने मे कवि पूर्ण सफल हुए हैं। काव्य के भाव ऊँचे तथा आदर्शमय है। भाषा सुदर व हृदय स्पर्शी है।

इति के. भाग्य लक्ष्मी

उच्च श्रोणी हिंदी

प्राध्यापिका, सरकारी बालिका उच्च पाठशाला।

# శ్రీ మద్రాఘవేంద్రగురుసార్వభౌమాంతర్గత శ్రీ ముఖ్యప్రాణాంతర్గత శ్రీ వేంకటేశః శ్రీశ సదావిజయతే

## గ్రంథారంభ స్తుతి

శ్రీ మదఖిల జీవుల నుండు - శ్రీ విభుండు
విశ్వసృష్టిస్థితి వినాశ - విధి హితుండు
సర్వ తంత్రస్వతంత్ర సత్ - శాసకుండు
సతము నను బ్రోచు సద్బుద్ధి - శాంతి నొసగి

శ్రీ రమాఽమేయ శుభదాయి - శ్రీ ప్రదాయి
విశ్వసముపేయి వేదసద్ - విధి విధాయి
జలధి ' అహిశాయి ' హృదిశాయి - చెలునిగొలిచి
కరుణబ్రోచుత మత్కావ్య - గరిమసిరుల

అజ - పవన - ఖగాహిశివేంద్ర - యమ వరుణుల
తత్ సతిసుతుల రవిశశి - తత్వదేవ
తల విధులనెంచి పాలించి - ధవుని యాజ్ఞ
విశ్వమేలుత శ్రీమాత - విష్ణు దయిత.

చతురముగ ధాత జిహ్వపై - శ్రుతులగులికి
వీణపై రాగభావసుతాన - బాణిజిలికి
జనుల కనికమ్ము నిజసౌఖ్య - జ్ఞానమొసగి
తెలిసుధ్వనులిడువాకు - జదువులమ్మ

చిత్తగతినొత్తి శివకర - మెత్తిసతము
శ్రవణ మననాల నిధిధ్యాస - సాధనముల
ధ్యానసుసమాధి దైవ ప్ర - త్యక్షమిడెడు
మానసేశుడుమాపతి- మనల బ్రోచు

దివ్య భాషా సుసంస్కృతీ - దివ్యప్రభల
దశ దిశల వెల్గ భరతోర్వి - నిశిదినమ్ము
సాగ్నభమ్ముల రవిశశి - ప్రభల వోలె
విశ్వ శ్రేయమ్ము లిడు మత్క - విత్వతతుల

భరత వాగ్దని గీర్వాణి - భవ్యజనని
బహుళ భాషా మతల్లిస - ద్భావ సంస్కృ
తగరిమ విశ్వ విద్యాధి - దేవతహిత
విమల వాఙ్మయా మృతదోగ్ధ్రి- వెలయు గవిత

వ్యాస, వాల్మీకి, శూద్రక, - భాస, బాణ
హర్ష, కాళిదాస, మయూరు, - డార్య,దండి
భట్టి, భవభూతి, కయ్యట - భర్తృహరులు
అమరులైనారలమృతోక్తి - సుమసుసూక్తి

దక్షిణాపథాంధ్రసుకవి - తానికుంజ
సుందరోద్యాన మాకంద - మందిరాల
కవిత్రయాదుల, పోతన్న - కావ్యరుచులు
మరగి పికపంచమాల్గాయు - మధుర గతుల

ధ్యనుల శయ్యల గడుకమ్మ - దనములెరిగి
సంస్కృతపు మాతృకలమించి - సంచరించి
తెనుగు తేటకు దియ్యని - తేనెలద్ది
దివ్యులై వెల్గిరి, మును మా - తెలుగు కవులు

ద్రవిడ, కర్ణాట, ఆంధ్ర, స - త్కవుల కృతుల
దేశ భాషల లెస్సని - తెలుగు మెచ్చు
భువన విజయాల గవితకు - భూషలొసగు
పండితుని కృష్ణరాయ, నృ - పాలు దలతు

రసమయాలంకృతి, గులుకు - రచనలందు
శబ్దములు దివ్య భావార్థ - సంగమముల
తమకు దామే శ్రుతి, లయాది - గమక గతుల
సుమసుకావ్యాల నటియించు - నమర శైలి

ఋషులు గాకుండ, రచియించు - టెందు, లేదు
విశ్వశ్రేయముల్ గాకుండ - వెడల వెందు
వేద వేద్యము జేయని - విద్యలేదు
నాటి మునివాటికలమేటి - సాటిలేదు

అట్టి కవికుల సోముల - కర్ఘ్యమొసగి
లాక్షణిక కావ్య బోధోప - లబ్ది కతన
అక్షరాంజలులిచ్చినే - నవ ధరింతు
భక్తి మార్గాన ప్రభుసేవ - బడయు కొరకు

హనుమ, భీమమధ్వాది, ది - వ్యావతార
ములను శ్రీ విష్ణు ననయమ్ము - గొలుచు నట్టి
భక్తికి ప్రమాణ మగువాని - బవన సుతుని
ప్రప్రథమ, గురు, ననిశమ్ము - భక్తి గొలుతు

**మంత్రాలయ రాఘవేంద్ర స్వాముల పీఠం**

రమ్యమంత్రాలయపు మూల - రామపూజ
లనుదినముసేయు శ్రీమధ్వ - ముని, సుపీఠి
వెలుగు రాఘవేంద్రులసేవ - విశ్వశ్రేయ
మునకు భక్తికై రచియింతు - ముక్తి గనగ

గరిమ సుయమీంద్ర సేవిత - కల్ప తరువు
సుయతి సుజయీంద్రసేవిత - సుమిత, ఫలిత
మహిత మంత్రాలయగురురా - ణ్మహిమ వలన
పరిమళించెడు సుశమీంద్ర - గురుడునేడు

రాఘవేంద్రుల మంత్రాల యోఘ వెలుగు
సువ్రతి, సుజయీంద్ర, శ్రీపాద - సుత, సుధాప్ర
వచన/గురురాజ, గిరిరాజ - పండితునకు
నతులొనర్తు సుజ్ఞానేంద్ర - జ్ఞాన నిధికి

తర్క వేదాంత సాహితీ - దార్శనికుడు
పరమ భాష్యాసువ్యాఖ్యాన - పరిణతుండు
మాగడి రంగనాథాచార్య - మధ్వ సర్వ
మూల గ్రంథార్థ భాండారు - మ్రొక్కుచుందు .

పండితరాజా, విద్వజ్జన - మండితుండు
సకల సచ్ఛాస్త్ర రత్నాక - రకుల పతియు
ప్రకట ప్రాధ్యాప కాధ్యాప - కకుల, మౌళి
పండితుల దీర్చు గురురాట్ - పాఠశాల

**శ్రీమదుత్తరాది గురుపీఠం**

జయరఘూత్తమ సత్జ్ఞాన - సత్యధ్యాన
సత్పరంపరాగతమధ్వ - శాస్త్రగరిమ
మోదమొసగు శ్రీ సత్యప్ర - మోదగురుల
విపుల వాక్యార్థ చంద్రికల్ - వెలుగులిడగ

మధ్వ విజయంపు శ్లోకార్థ - మహిమబొగడి
నేను బడసితి శ్రీ సత్య - ధ్యాన గురుల
వలన నేబది నిష్కముల్ - తొలుత, చెన్న
పట్టణోత్తరాదిసుపీఠి - బాల్యదశను

శ్రీల నుత్తరాది తన్మధ్వ - మూల పీఠి
వరలు సత్యప్రమోద, స - ద్గురువరేణ్య
ద్వైత సచ్ఛాస్త్ర ప్రావీణ్య - తాయశాప్తి
పద్మబాంధవ ప్రభవెల్గు - భరత భూమి

**శ్రీ సోసలె వ్యాసరాయపీఠం**

రాఘవేంద్రులు మనువ్యాస - రాట్ సుజన్మ
సోసలెను సుధా, చంద్రికా - శోభలిడగ
నొప్పుతత్పీఠి విద్యాప - యోనిధిగురు
మౌళి మధ్వ శ్రీ పదధూళి - మౌళి దాల్తు

వరుస ద్విషడాబ్దములు గొల్చి - తిరుమలేశు
రాయల కువహా రుజ హరించి - రాజ్యమరసి
బ్రాహ్మ్య క్షాత్రాల వెలుగొందు - వ్యాసరాయ
పీఠి విద్యాపయోనిధి - వెలుగు నిపుడు

### శ్రీ పేజావర స్వాముల పీఠం

పూర్ణప్రజ్ఞ విద్యాలయ - పూర్ణబోధ
ద్వైత సద్భక్తి పరిపక్వ- పూత రీతి
మధ్వ సర్వమూల గ్రంథ - మహిమ, మూల
గురుకులశైలి నిడు, పేజా - వరపు గురువు

విమల భాష్యాను వ్యాఖ్యల - విపుల సర్వ
మూలగ్రంథసదాచార - ముఖ్య స్మృతుల
బెంగళూరున నెలకొల్పు - పేజ వరపు
స్వామి విశ్వేశ తీర్థునే - భక్తి గొలుతు

### ఇతర గురువులు

మధ్వ విజయము మణిగుచ్ఛ - మధుర కావ్య
మమర వాణిని తొలి బోధ - లమర నేర్పు
కొప్రనరసింహ, నారాయ-ణప్రముఖుల
వాదు గురువరేణ్యుల వంద - నముల గొల్తు

పాణినీయ మలంకృతీ - భావ రీతి
పంచకావ్యాల గీర్వాణి - వాగ్విలాస
కళల, దర్శనముల నాకు - గరపినట్టి
పల్లెపూర్ణాఖ్య గురువర్య - భక్తి గొలుతు

గరిపెనన్నప శాస్త్రి వ్యా - కరణ విధులు
కుప్పు బైరాగి శాస్త్రులు - గూర్చె - తర్క
భాష్య మద్వైత రీతుల - వ్వారి నెంతు
యోగపాతంజలము జెప్పె - నోరుగంటి

విమల సుస్వర శ్రుతి సూక్త - నమక, చమక
దశ విధోప నిషత్ శాంతి - విశదములుగ
పురుష, శ్రీ, మంత్ర సుమసూక్తి - గరపు చెరుకు
మిల్లి కామావ ధాని , నే - మిగుల గొలుతు

బలిజెపలి లక్ష్మి కాంత, దీ - పాలసూరి
రామకృష్ణులు వేంకట - రామగురులు
అలిదివాకర వేంకటుల్ - తెలుగుకవిత
మెరుగులిడినేర్పిరి రసాల - మృదుల రుచులు

లక్ష్మి, నరసమ్మ, వేంకమ్మ - లకు విభులగు
మహి, నృసింగ, గుండూ, కృష్ణ - మత్పితరుల
లక్ష్మి నరసింగ, సుతుడబ్ర - హ్లాదుడనగ
యొజ్జలు సుధీంద్రుడన, మా - యూరుకోస్గి

మధుర కర్ణాట భాష, నా - మాతృభాష
నాంధ్ర గీర్వాణి వాగ్గేయ - మలర జేసి
కావ్య నాటక శతకాళి - గరిమ బెంచి
విమల భాషామతల్లి,నే - విరులగొలుతు

తల్లికి, దండ్రికి, గురులకు
అల్లన శుభ తత్వతతికి - హరిణికి హరికిన్
బల్లిద హిత రిపులకు, నతు
లెల్లరి కిడిప్రాతు విశ్వ - హిత కావ్యమ్ముల్

## ఇతి సుధీంద్ర ప్రహ్లాదః

## గ్రంథకర్త వంశ వృక్షము

బాగల్ కోట నుండి వీరి పూర్వీకులు శ్రీ రాఘవేంద్రస్వామి వారితో పాదయాత్రలో జేరి ఆస్తిపాస్తులు విక్రయించి మంత్రాలయం పరిసర ప్రాంతంలో కోసిగి - రాయచూరు - సింధనూరు సవణూరు- ఆదోని - బళ్లారి మొదలగు ప్రదేశాలలో స్థావరాలేర్పరుచుకొన్నారు. వీరిది కోసిగి.

కోసిగి కృష్ణారావు ( భార్య శ్రీమతి వెంకమ్మ )

కోసిగి గుండూరావు ( శ్రీమతి నరసమ్మ ) కౌతాళం

( కోసిగి ) కౌతాళం నరసింగారావు ( శ్రీమతి లక్ష్మి దేవమ్మ )
చిత్రదుర్గం అమల్దారు
శ్యామారావు కావేరమ్మల జ్యేష్ఠ పుత్రి

చి। ల। సౌ। లు

- సుధీంద్రప్రహ్లాద గ్రంథ కర్త, జననం - చిత్రదుర్గ — శ్రీమతి రుక్మిణి పత్రి శ్రీనివాసరావు రమణమ్మల ద్వితీయ పుత్రి
  - రాఘవేంద్ర — శ్రీమతి విజయలక్ష్మి
    - చి। చంద్రిక
    - చి। దీప
  - శ్రీమతి పరిమళ — శ్రీకృష్ణమూర్తి
    - చి। ప్రమోద్
    - చి। సౌమ్య
  - సుధీంద్ర — శ్రీమతి కృష్ణ
    - చి। చైతన్య కృష్ణ
    - చి। ప్రణవ ప్రియ
  - విజయీంద్ర — శ్రీమతి కల్యాణి
    - చి। వంశీకృష్ణ
    - హరిణి
- శ్రీమతి నర్మద — శ్రీ సత్యనారాయణ రావు
- నరసింహమూర్తి — శ్రీమతి పద్మావతి
- శ్రీనివాసమూర్తి — శ్రీమతి ప్రమీల
- గోపీనాథరావు — శ్రీమతి సత్యవతి
- కాశీ నాథరావు — శ్రీమతి వత్సల
- శ్రీమతి సుధా — శ్రీసత్యనారాయణ రావు

## గ్రంథకర్తృ పితృస్మరణ

కీ। శే। నరసింగరాయ శర్మ పితా

కీ। శే। లక్ష్మీదేవమ్మ - మాతా ఆత్రేయ ( వసు)

కీ। శే। గుండూరాయ శర్మ - పితామహః

కీ। శే। నరసమ్మ - పితామహి ఆత్రేయ ( సంకర్షణ)

కీ। శే। కృష్ణారాయ శర్మ - ప్రపితామహః

కీ। శే। వేంకమ్మ - ప్రపితామహి ఆత్రేయ ( ఆదిత్య )

కీ। శే। శ్యామరాయ శర్మ - మాతామహః

కీ। శే। కావేరమ్మ - మాతామహి హరితస

కీ। శే। కృష్ణమూర్తి - మాతులః ,,

కీ। శే పత్రి శ్రీనివసరాయ శర్మ - శ్వశురః

కీ। శే। రమణమ్మ - శ్వశ్రూ కౌండిన్యస

కీ। శే। పల్లెపూర్ణ ప్రజ్ఞాచార్యః - గురు కాశ్యప

కీ। శే।ధార్వాడ హనుమంతరావు భ్రాతృ వర్గ -
భారద్వాజ

కీ। శే। రాధమ్మ - వదినె

కీ। శే। వేముగంటివేంకట కిషన్ రావు -భాతృవర్గ భారద్వాజ

**కీ। శే। పత్రి శ్రీనివసరావు (గంథ కర్తృ శ్వశరులు) రమణమ్మ (శ్వశ్రూ) కౌండిన్యస**

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| రాధమ్మ ధార్వాడ హనుమంత 'వు | వెంకట్రావు పద్మావతి | రుక్మిణి సుధీంద్ర రావు ప్రహ్లాద | జగన్నాథ సీతమ్మ | లక్ష్మిబాయి పురుషోత్తమ రావు | లలిత రామ మూర్తి | లీల గోపాల కృష్ణ | గోపాలకృష్ణ మూర్తి తులసి | నాగమణి ఆనందతీర్థ |

వెంకట్రావు పద్మావతి:

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| మా )జయ షన్ | వరసింహ రావు భవాని | భాను వసుం ధర | కల్యాణి విజ యీంద్ర | మదు | శారద సుబ్బా రావు | చంద్ర శేఖర్ |

గోపాలకృష్ణ మూర్తి తులసి:

| | | |
|---|---|---|
| శరత్ | కుందన లత | శ్రీకాంత్ |

## 1. భాతృవర్గః - భరద్వాజ

ధార్వాడ శేషగిరిరావు - సీతారామమ్మ

హనుమంతరావు ( రాధమ్మ )




## 2. భాతృవర్గః కాశ్యప

పల్లెసేతునారాయణరావు 1. శారదమ్మ 2. కమలమ్మ 3. గంll భ కృష్ణవేణమ్మ




**పల్లె లక్ష్మీనృసింహ తత్పత్ని - ఇంది**
**రలు, మదీయ కావ్యసుయశోరమ్యరూప**
**రసుగంధ చంద్రికల దిగ్దిశల గూర్చు**
**వారివెల్ల ప్లు ప్రోమత - శ్రీరమణుడు**

# 3.భాతృవర్గము భారద్వాజ

వేముగంటి నరసింహాచార్యులు - ప్రయాగమ్మ

పురుషోత్తమాచార్యులు - తిరుమలమ్మ

చినవేంకట కిషన్ రావు - గం| భ|| భారతమ్మ

చి|లు, సౌ|లు పురుషోత్తమరావు - లక్ష్మిబాయి



# 4. భాతృవర్గము ఆత్రేయ

చింతామణిభొట్ల వేంకట రెడ్డి పంతులు గారు

రామదాసు పంతులు గారు - పద్మావతమ్మ

శ్రీ కృష్ణమూర్తిగారు - కీ। శే। భీమాయమ్మ

చి।లు, సౌ।లు.



| | | | |
|---|---|---|---|
| పద్మ | రమా | సుబ్బారావు | లక్ష్మి |
| అణ్ణాజీరావు | సీతారామారావు | వాణి ఉషశ్రీ | రఘు రామకుమార్ |

## ఈ గ్రంథ రచనకు ప్రచురణకు
## నన్ను ప్రోత్సహించిన బంధు, మిత్ర
## హితైషాభిమానుల కభినందనలతో

సర్వశ్రీ సకుటుంబం

కంకణధారులు ఇందిర పళ్లె నరసింహారావు సకుటుంబం, తిరుపతి

| | | |
|---|---|---|
| 1. | చింతామణి భోట్లకృష్ణమూర్తిగారు | విశాఖపట్టణం |
| 2. | పి.వి.ఆర్.కె. ప్రసాద్ గారు | " |
| 3. | ధార్వాడ రజని, మురళీకృష్ణ | " |
| 4. | ధార్వాడ శారద, రామకృష్ణ | అనకాపల్లి |
| 5. | ఓగిరాల శంకరశర్మ గారు | కొవ్వూరు ప.గో |
| 6. | చారాల రుక్మిణ్ది , నరసింహమూర్తి | ఏలూరు ప.గో |
| 7. | వేలాల అరవింద, నరసింహారావు | విజయవాడ |
| 8. | హెమగంటి మాలతి, రామచంద్రరావు | " |
| 9. | శ్రీమతి లీలగారు | " |
| 10. | పత్రితులసి గోపాలకృష్ణమూర్తి | గుంటూరు |
| 11. | రాజామానూరు లీల, గోపాలకృష్ణ | " |
| 12. | పళ్లెనాగమణి, ఆనంద తీర్థ | " |
| 13. | కౌతాళం కృష్ణ సుధీంద్ర | " |
| 14. | పత్రి పద్మావతి వేంకటరావు | సత్తెనపల్లి |
| 15. | పత్రి సీతమ్మ జగన్మాథరావు | " |
| 16. | వేముగంటి లక్ష్మిబాయి, పురుషోత్తమరావు | హైదరాబాదు |
| 17. | వేముగంటి రమా విజయకిషన్ | " |
| 18. | వేముగంటి అనూరాధ, రవీంద్ర | " |
| 19. | చింతామణి భోట్ల ఉష, సుబ్బారావు | " |
| 20. | మాళిగె భీమాసేనాచార్యులు మధ్వసమితి | " |

21. చారాల సరోజని, విఠ్ఠలరావు	హైదరాబాదు
22. ఉమ్మెత్తాల మాధవరావు	,,
23. మానూరు జానకి కృష్ణారావు	,,
24. సాయి బాబా గారు, సాయిప్రత ి గారు ఎం.పి	కడప
25. కోడిహళ్లి నంజప్పగారు	బెంగుళూరు
26. కోడిహళ్లి పరిమళ, కృష్ణమూ ్తి గారు	,,
27. కౌతాళం సత్యవతి, గోపీనాథరావు	,,
28. మైసూరు నర్మద, సత్యనారాయణరావు	,,
29. మైసూరు శ్యామారావు, రామారావు	,,
30. మైసూరు సావిత్రమ్మ రాఘవేంద్రరావు	మైసూరు
31. కౌతాళం ప్రమీల శ్రీనివాసమూర్తి	కే.జీ. యఫ్
32. కౌతాళం, పద్మావతి నరసింహమూర్తి	హిందూపురం
33. ఏ గోపాల రావు గారు మధ్వసమితి	అనంతపురం
34. పరిగి రాఘవేంద్రరావుగారు	అనంతపురం
35.. పరిగి సుబ్బారావుగారు	అనంతపురం
36. మేడం విమలమ్మగారు	నందికొటుకూరు
37. మేడం కమలమ్మగారు	,,
38. మేడం శ్యామలమ్మగారు	,,
39. మేడం నిర్మలమ్మగారు	,,
40. కల్యాణి, విజయీంద్రరావు	,,
41. విజయలక్ష్మి రాఘవేంద్రరావు	కొణిదెల
42.. గుడిపల్లి నాగలక్ష్మయ్యగారు	,,
43. మాదిరాజు నాగరత్నమయ్యగారు	,,
44. ఓబుగారి సుబ్రహ్మణముగారు	,,
45. ఓబుగారి రత్నయ్యగారు	,,
46. తాతగారి మల్లారెడ్డి గారు	,,
47. దాస్ ప్రకాశ్ గ్రూప్స్	మద్రాస్

# శ్రీ రాఘవేంద్ర గురుసార్వభౌమాంతర్గత
# శ్రీ భారతీరమణ ముఖ్య ప్రాణాంతర్గత
# శ్రీ వేంకటేశః శ్రీశః
# సదా విజయతే

## పీఠికా

హరిః ఓమ్

ఓం శన్నో మిత్రః శం వరుణః।
శన్నో భవత్యర్యమా।
శన్న ఇంద్రో బృహస్పతిః।
శన్నో విష్ణురురుక్రమః।
నమో బ్రహ్మణే। నమస్తే వాయో।
త్వమేవ ప్రత్యక్షం బ్రహ్మాసి।
త్వమేవ ప్రత్యక్షం బ్రహ్మ వదిష్యామి।
ఋతం వదిష్యామి సత్యం వదిష్యామి।
తన్మామవతు తద్వక్తారమవతు।
అవతు మామ్ అవతు వక్తారమ్।
ఓం శాంతిః శాంతిః శాంతిః।

అజుని రచనలో అత్యంతాశ్చర్య కరమైనది, అత్యద్భుతమైనది, అత్యంతానందామృత దాయకమైనది మానవుని మేధోశక్తి.

విశ్వవిన్యాసములను, దాని కవతలనుండి విశ్వవ్యాపారములను శాసించు అచింత్యాద్భుత, పరాత్పర, సర్వస్వతంత్ర సర్వోత్తమ తత్వమును దర్శించి, అనుభూత్యానందమందగలది , మానవమేధస్సు మాత్రమే యనిన సత్యదూరము కాదు. అతిచపల మైన మనస్సును నియమించి, విచక్షణాజ్ఞానంతో సత్యగమ్య సన్నిధానమును చేర్చగల ఏకైక దివ్యసాధనము భక్తితో గూడిన మానవ మనీషా శక్తియే. విశ్వశ్రేయో

భిలాషతో సత్యసుందరతత్వసందర్శనాసక్తితో నిరంతర సాధనానుభూతితో , నేకా గ్రతతో స్వస్వరూప జ్ఞానానందముతో, నిత్యసత్యసన్నిధానములో నైజసుఖమను భవింపుచుండుటే ముక్తజీవుల సహజ స్థితి. హా....హూ.....అను సామగాన మిదియే.

దీనిని సాధించుటకే జీవులకు శ్రేష్ఠమైన మానవ జన్మలభించును. దేవతలు కూడ మోక్షసాధనకు మానవ జన్మలను వాంచింతురు. ఈ సత్యాన్వేషణముల కొరకు తీవ్రముగ కాంక్షించు శ్రద్ధయే భక్తి, దైవాభిముఖముగ మనస్సంకల్పములను నియమించి, త్రికరణ శుద్ధితో దైవము నారాధించుటయే జీవుల ప్రధాన కర్తవ్యము ప్రాకృతిక రీతి చరించుచు, కాయిక, లౌకిక కర్తవ్యములవశ్యముగ బాలింపుచు, గర్మము లాచరింపుచు ప్రపంచమును, అందలి సంఘములను మిథ్యలని యేవగించు కొనక, చిత్తము హరిపై నిలిపి జీవయాత్రలను సలుపుటే మానవుల మానవత్వమునకు నికషాయ మానధర్మము.

జీవులు స్వయంభువులు కారు. అనాదినుండి యుగకల్ప్రప్రళయాల, పరమాత్మచెంత బీజస్వరూపమాత్రులుగనుండి , జీవ కర్తృత్వాధికార కారణమున ప్రాక్తన పుణ్యపాప పరిపాకములతో వివిధోపాధులాశ్రయించి చతుర్దశ భువనాలలో జనన మరణచక్రములలో దిరుగుచుందురు. ప్రాపంచిక విషయానందములే పరమావధులని, యెండ మావుల వంటి సుఖముల కర్రులు జాచుచు జీవితములను వ్యర్థము చేయుచుందురు.

ఈనిర్విరామ యాతనామయ యాత్రాగత జననమరణ జగచ్చక్రభ్రమణములచే విసిగి, తమ జన్మములకు హేతువేది? ఈ కష్ట పరంపరల కంతులేదా? అని విచారముసేయుటకు మొదలిడుదురు. ఇదియే జిజ్ఞాస, ముందునిస్సార యంత్రవజ్జీవనముపై వ్యథ, తదుపరి దానిని దొలగించుకొనుప్రయత్నము, శాశ్వతానందమును సాధించు దీక్ష. ఈ ప్రక్రియలకే భక్తి యనిపేరు. ఇది మూఢాచారముకాదు. ప్రతిజీవుని నైజస్థితి. జీవన్ భద్రాణి పశ్యతి యనువాక్యార్థమిదియే. పరబ్రహ్మ పరమానంద ప్రసాద మనుగ్రహింపుచుండగా, తద్దివ్య సాన్నిధ్యమున నిరంతర ధారాపాతంగాస్వస్వరూపానందమునుతారతమ్యానుసారంగా గ్రోలు చుండుటే ముక్తిస్థితి బ్రహ్మైక్యమను జీవాస్తిత్వనాశనముకాదు. ఐక్యమనునది యొక అపోహ. ప్రపంచమున వస్తువులకు మార్పేకాని నాశనములేదు. (LAW OF

INDESTRUCTABILITY) దైవవ్యాపారమును జీవులు గ్రహించి యానందిం చుచుండుటయే జీవుల పరమావధి అమృతత్వము. భక్తి రవ్యభిచారణీ అనగా నిదియే.

మన ఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః " అనువాక్యము వలన యీసాధనము ఆటుపోటులకు గురియగునని తెలియ వచ్చుచున్నది. గమ్యము మరియు దానికైచేయు సాధనము , సక్రమమైన దనుటకు నికషాయమానమగు బుజువేది? మానవుని మనస్సా; అదిచపలమైనది మానవుని బుద్ధియా; అదిమనస్సుపై నాధారపడిన వక్రమగును. మరి నిజమగు దారి జూపునదేది. నిశ్చయముగ ప్రతి హృదయమునందు సర్వాంతర్యామిగ వెలుగు చున్న జ్ఞానజ్యోతి బింబమే. మనుజులకే యీ నిర్ణాయక శక్తి గలదన్నచో ఏ మానవుడు దానవుడుకాలేడు. అస్వతంత్రులైన జీవులకు ఏది సక్రమమైన మార్గమోతెలియదు. తెలిసినచో జన్మలుండవు. జన్మించినాడు గనుక మంచి మార్గమెంచుకోవలెను. సర్వ తంత్ర స్వతంత్రుడైన భగవంతుని కృపలేనిదే మనమార్గము సవ్యమైనదని మనకు తెలియదు. అందులకే " మోక్షసాధన సామగ్ర్యాం, భక్తి రేవ గరీయసీ "అని సర్వమతముల వారు నిర్ణయించిన సిద్ధాంతము " అనన్యా; శ్చింతయంతో మాం యేజనాః పర్యుపాసతే తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహం " అని దైవసమయము.

ఐనచో మానవుల దుఃఖమయ జీవితములకు హేతువేది? సత్యాసత్య వివేచన, విధి, నిషేధముల సక్రమముగ గ్రహించు బుద్ధి; చపల చిత్తుడు అస్వతంత్రుడు గనుక, సంశయములచే భాధింపబడుచుండును. ఇట్టి దశలో సరియైన దారిజూపువారెవరు. వేదవేదాంతదర్శనములు. ప్రత్యక్ష - ఆగమ అను మానమను ప్రసిద్ధములైన మూడు ప్రమా ణములు. బ్రహ్మసూత్రములు- భాష్యములు, ప్రస్థాన త్రయి. పరంపరా గతముగా మనకు లభించుచున్న మాదు పూర్వజుల అపారానుభవములు. ఇవి యే మనకు దారిజూపు దివ్యజ్యోతులు.

శాస్త్రములన్నియు ఎవనిని జూపుచున్నవి.? ఈ విశ్వమున కాధారమేమి? ఆమహాశక్తిపురుషుడే అని ఎవరునిర్ణయించిరి? అను పరిశోధనలు అనాదినుండి మనకు సంప్రదాయసూత్రముల లభించుచున్నవి. విశ్వరహస్యము లెరుగుట రుచించినచో అంతకన్నమహోత్సాహకరమగు దివ్య పరిశోధనానందము వేరేకలదా.' స్వతంత్రం -

అస్వతంత్రంచ తత్వం ద్వివిధ మిష్యతే అను సూత్రమువలన అచ్యుతుడు, అనంతుడు, అవాఙ్మానస గోచరుడు, - అనామయుడు- అచింత్యాద్భుత శక్తిమంతుడు విశ్వవ్యాప్తుడు, విశ్వాంతర్యామి విశ్వపాలకుడు- విశ్వసృష్టి స్థితిలయకారకుడు, విశ్వహేతువు అగునొక విశ్వమూలపు శక్తి మహాపురుషోత్తముడని విశ్వశోధకులు నిర్ణయించిరి. ఇతడొక్కడే; ఇతడొకడే సర్వస్వతంత్రుడు ఇతడే పరాత్పరుడు, బ్రహ్మశబ్దవాచ్యుడు విశ్వహా, విశ్వేశ - వేదములలోని ఇంద్రశబ్దవాచ్యుడు. విష్ణు సర్వోత్తము డితడే . ఇతడు పురుషుడే అనుటకు నిదర్శనములు.

" యోరాయో వనిర్మహాన్

సుపారః సున్వత : సఖా 4-10-(8)

తస్మా ఇంద్రాయ గాయత " ఋగ్వేదం 40 వ మంత్రం

ఈ మహాద్భుత విశ్వమూలశక్తి పురుషుడే యని వేదోక్తి పురుః- పూర్ణములైన షః- షడ్గుణములు గలవాడు పురుషుడు ఆషాడ్గుణములేవనగా :-

ఐశ్వర్యస్య, సమగ్రస్య, వీర్యస్య, యశసః, శ్రియః

జ్ఞానవైరాగ్యయోశ్చైవ - షణ్ణాంభగ ఇతీరణా "

ఇట్టిగుణములు భగవంతుని యందుగలవి కనుకనే అతడు పురుషుడైనాడు. " పురేశేతీతి పురుషః అనియు, పురూతమం పురూణా మీశానం, వార్యాణామ్

* ఇంద్రం సోమే సచాసతే" *

ఋ - 42 మంత్రం (5)(2)

" సఘానో యోగ ఆభువత్

సరాయోపురంధ్యామ్ ఋగ్వేదం - 42 వ మంత్రం (5)(6)

గమద్ వాజేభి రాసనః "

పురూతమం అనగా నిరవధికమైన పూర్ణత గల పురుషుడనియు, వార్యాణాం, అనగా అన్ని తత్వముల కన్న శ్రేష్ఠతత్వుడనియు, పురూణాం, వార్యాణాం మీశానం, శ్రేష్ఠ, శ్రేష్ఠతమ పురుషోత్తముడని ఋగ్వేదములు ప్రగాయంతి - కీర్తించు చున్నవి. '

"పురుషః పురోఽగ్రో అజాయత ।

కల్పయన్నాసం ద్వేచ్ఛా అద్భ్యః సంభూతః

పృథివ్యైరసాచ్చ| విశ్వకర్మణః
సమవర్తతాధి । తస్యత్వష్టావిదధత్
రూపమేతి । తత్పురుషాయ విశ్వ
మాజానమగ్రే । "అని ఋగ్మంత్రస్థ
పురుష సూక్తమునందు భగవంతుని
పురుషోత్తమునిగా బేర్కొనబడినది.

" ఏకం సత్ విప్రాబహుధావదంతి ( ఋ । - 164 - 46)
" యోదేవానాం నామధా ఏక ఏవ"(ఋ - 82 - 3)
" యచ్చకించిత్ జగత్సర్వం దృశ్యతే
శ్రూయతే పివా । అంతర్బహిశ్చ తైతిరీ యారణ్యకం
తత్సర్వం వ్యాప్యనారాయణ స్థితః "
" ఏకోవిష్ణుర్మహద్భూతం
పృథక్ భూతాన్యనే కశః శ్రుతులు
యతః, సర్వం జాతం,వియదనిల ముఖ్యం, జగదిదం స్థితౌ,
నిఃశేషం, యోఽవతి, నిజసుఖాంశేన, మధుహా,
లయే, సర్వం, స్వస్మిన్ హరతి, కలయాయస్తు, సవిభుః
శరణ్యో, లోకేశో, మమభవతు కృష్ణో, అక్షి విషయ ః అని శంకరాచార్యులు
పృథ్వీ రేణు రణుః పయాంసి కణికాః, ఫల్గుస్ఫులింగోఽనలః
తేజోనిశ్వసనం, మరుత్తనుతరం, రంధ్రం సు సూక్ష్మం నభః
క్షుద్రారుద్ర పితామహప్రభృతయః కీటాః సమస్తాః సురాః
దృష్టే యత్రసతావకోవిజయతే, భూమావధూతావధిః
( ముకుందమాల- కులశేఖరాళ్వార్ శ్రీవైష్ణవం)
అజస్యనాభౌ అధ్యేకమర్పితమ్ ఋగ్వేదం,
సబ్రహ్మ సశివః సేంద్రశ సోఽక్షరః పరమః స్వరాట్ నారాయణ సూక్తం
బ్రహ్మణి బ్రహ్మరూపోఽసౌ, శివ రూపి, శివేస్థితః
ఉద్దీపయన్ దేవగణాంశ్చ విష్ణుః దేవేనరూపేణ (స్మృతిః)

తత్రతత్ర స్థితో విష్ణుః తచ్ఛక్తి ప్రబోధకః        శ్రీ మధ్వాచార్యుల వారి
ఏక ఏవమహాశక్తి కురుతే సర్వమంజసా"        అణు భాష్యం

" యోనఃపితా జనితా నామానివేద " - ఋగ్వేదము

" నామాని సర్వాణి య మావిశంతి
తంవైవిష్ణుం పరమ ముదాహరంతి "        ఋగ్మంత్రములు

" విశంతి సర్వే శబ్దాః అత్ర ఇతి విష్ణుః " విశ్వేవిశన్
శంసనం, శాసనం, యః కరోతిసః విష్ణుః అని వైయాకరణుల వివరములు.

ఓం కార మయమైన శబ్ద బ్రహ్మయే జగతికి బునాది. అ- ఉ- మ అను శబ్దము లోంకారమునకు మూలస్వరములు "అ" బ్రహ్మవాచ్యము కాగా " ఉ " తద్విభూతికి ప్రతీకయగు విశ్వావృతి కాగా , " మ" కారం తత్సున రావృతికి మూలాధారమగు శేష పరిధియని మూడు శబ్దము లేక నాదమై ప్రణవమై సృష్టిస్థితిలయాది త్రిగుణాల కాకరమై వైయాకరణుల మహావిస్ఫోట వాదమునకు ఆధారమగుచున్నదందురు.

అవ్యక్తము, వ్యక్తమై బోధ్యమగుటకు శబ్ద బ్రహ్మయే మూలము. చతుర్దిశల బ్రసరించును గనుక చతుర్ముఖుడను పౌరుష శబ్ద వాచ్యమైనది. శబ్ద ధాతువులను సృజించును గనుక స్రష్టయైనది. " ధాతా" యైనది. ప్రజనన హేతు బీజమగుటచే ప్రజాపతి యని పిలువబడుచున్నది. ఇదియే శబ్దము యొక్క శక్తి. సమస్త భావములకు సంజ్ఞాభిధలొసంగి సంకల్ప తరంగములచే విశ్వమును పాలించుటకు శబ్దమే యాధారము " ఆనోభద్రాః క్రతవో యన్తువిశ్వతో" అనగా ఉదాత్త భావములు విశ్వమును పాలించు గాక అని యర్థము. భాషకు వాణి - వాహిక. సరస్వతి. శబ్దబ్రహ్మమునకు తోడుగానుండును. గనుక విద్యమాన జ్ఞానశక్తియై బ్రాహ్మిబ్రహ్మణి యని పిలువబడుచున్నది.

విశ్వములో, వాఙ్మయములో సంజ్ఞాప్రకరణం మొట్ట మొదటిది. వ్యక్తికి గాని, వస్తువునకు గాని అభిధలులేక గుర్తించుట కష్టము. వ్యవహారము సాగదు. సమస్త దేవతల పేర్లుకూడ యీవిధమాగ సేర్పడినవే. దేవ, దానవ, యక్ష రక్ష కిన్నర కింపురుష మానవ వర్గముల స్థావర జంగమములకు పేర్లపట్టిక అమరకోశము. ఇవి మానవ మస్తిష్కము నుండి అనాదిగా వచ్చుచున్న శబ్దవాచ్యములు దేశదేశముల ఖండఖండాంతరముల

మానవ భాష రమారమి పోలికల తో నుండును. ETY MOLOGY శబ్దోత్పత్త్యర్థ శాస్త్రము విశ్వవాఙ్మయమున కొక మాతృకను కనిపెట్టును. ఈ భాషలలో అతి ప్రాచీనములైనవి సంస్కృతం ( పేరులోనే బాగా సంస్కరింపబడిన భాష మితికి, విస్తృతికి, భావప్రకటనకు నాగరికతకు మకుటాయ మానమైన దేవ నాగరిలిపిగలభాష) లాటిన్, పర్షియన్ గ్రీకు, హిబ్రూ ఈ గీర్వాణ భాషనుండి ప్రాంతీయ భేదములచే మార్పుచేర్పులు గలిగియున్నవని, నిర్ధరించిరి కొన్ని ఉదాహరణలు :-

ఓం - A MEN-OMEN-OMNI
మాతృ - MOTHER, మా, మాదర్
పితృ - PETER బా బాప్
ఘృతః - GHEE ఘీ
నక్త - NOCTURNAL
కృతక - CRITIC
సర్ప - SERPENT
శైలి - STYLE
పశ్ - PERCEIVE
నావిన్ - NAVY
సోమ - SOMO
హోమ - HAOMA (ZEND)
ఓజస్ - OZONE
దైవ - THEISM , THEOS

తత్-THAT త్వం-THOU
ఏకం - ఏక్ -A
ద్వి-ద్వే-ద్వౌ DYAS DYAD TWO
త్రి-THREE-తీన్
పంచ FIVE పాంచ్
సప్త -SABBAT - సాత్
అష్ట - EIGHT -ఆఠ్
నవ NINE - నౌ
దశమ DECIMAL- దస్

ఇట్లే సంతోషము, దుఃఖము, భయము ఆశ్చర్యము కలిగినపుడు సర్వదేశములలోని మానవులు ఒకే విధముగా శబ్దము చేసెదరు.

ఈ సూత్రముల పైననే విశ్వమూల తత్వరహస్యా విష్కృతికి విశ్వమానవ మేధస్సు లొకే విధముగ వికసించినవి.*కాలానుగుణ్యముగ పుష్పములు సర్వత్ర మొకే కాలమునందు వికసించును కదా. in florescense is universal. ప్రాక్పాశ్చాత్య సమానభావస్ఫోరక సమకాలీన రచనలు విశ్వశోధనా పరిణతికి వివిధ దేశాల మానవుల

మేధోవికాసములిందుకు నిదర్శనములు. ఋషితుల్యులైన వీరల అనుభవ సారములే వేదములు. విశ్వస్రష్ట విశ్వపాలకుడు, అని వేదములు. LORD of the universe అని పాశ్చాత్యులు అల్లా అని మహమ్మదీయులు . అఖండ జ్యోతియని పారశీకులు. నానా విధములుగా గుర్తించిననూ, యొకే యొక మహాద్భుత శక్తియని గుర్తించి, దానినే తలచి, ధ్యానించి ఆమహాశక్తి వినా మనమనుగడ కల్లయని నిర్ధారణ చేసినారు. సంజ్ఞలు, అభిధలు వివిధములుగనున్నను వస్తునిర్దేశము -ఔపయోగికవ్యవహారము సామాన్యముగా సమముగనే తోచును. భౌతిక, వైజ్ఞానిక, రసాయనిక, ఖగోళ శాస్త్రములలోని పాశ్చాత్యపండితుల సంజ్ఞాప్రకరణము లీవిధముగనే యున్నవి.

ఈ విశ్వమును పాలించు శక్తి విష్ణువనియు విష్ణుమండలములు పెక్కు గలవనియు. ప్రాక్పశ్చిమ ఖగోళ శాస్త్రములలోకే పోలికల యభిధలు గలిగియున్నవి.

ఉదాహరణ

| | |
|---|---|
| హరి : విష్ణువు కమలనాభుడు | HERCULESఅని పాశ్చాత్యులు విష్ణు నక్షత్రమండలమును పిలుతురు. హరికులేశః అనునది HERCULES గా మారి యుండును. హరి యనగ సూర్యుడనియు అర్థము కలదు హరి కులములనగా ద్వాదశాదిత్యులు |
| దుగ్ధాబ్ధి | MILKY WAY |
| పాలవెల్లి | GALAXY |
| శేషాహి | విష్ణునక్షత్రమండలము శేషాహి పై శయనించును. శయనైకాదశి నాడు దక్షిణముగ్రవాలి శయనించును. ఈ విష్ణు నక్షత్రమండలముల ప్రభావముచే విశ్వాంతరాళాల, గ్రహసంచారాల మార్పులు సంభవించును. ఇది విష్ణువు యొక్క అద్భుత శక్తి. విశ్వములను పాలించు శక్తి గలది. గనుక సవితృ నామకుడగు సూర్యుడొక విష్ణువనియు. సూర్యాంతర్గత విష్ణుశక్తియనియు. ఇటువంటి సూర్యులు ద్వాదశులుగా నున్నారనియు వీరి ప్రభావము వలననే |

విశ్వములేర్పడుచున్నవనియు సిద్ధాంతీకరించిరి. ఆషాఢస్య
ప్రథమదివసే -- శాపేన అస్తంగమితమహిమా -- అని
విభువిరహం శాపాంతే భుజగశయనాదుత్థితే శార్జ్గ పాణౌ అని
కాళిదాసు విష్ణుని శయనోత్థానములు వర్ణించినాడు.
తేజోమయ విరాట్ హిరణ్మయ స్వరూపమును నుతించు
మంత్రములు ఋగ్వేదములైనవి
తేజోఽదధియే పాలవెల్లి యైనది.
సదా శేషముగా విస్తరించి యుండుటచే
అనంత (unending) తత్వమైనది.

ఆపః – ఆబో AQUA, నారా - సిద
తత్వము అయనము అనగా
మార్గముగా గలవాడు నారాయణ
అయినాడు. ఆ పోవా అగ్ర ఆసీత్
అని పంచభూతములను
పరిశీలించి తదంతర్గత
మూలతత్వము పృథివ్యాపః
స్తేజోవాయురాకాశములందు
చోదకముగ నున్నను తద్భిన్న
ముగా నున్నదని సూత్రీకరించినారు.

శ్రీ, లక్ష్మి పద్మాసనా – LOTUS NEBULA పద్మగేహ నివాసిని

బ్రహ్మః– NYRA

సరస్వతిః– EPPILAN NYRA

హనుమంతుడుః– ARC TURAS వాయు మరుత్తులు.

గరుడ, పృథ్వీ తత్వము ః– AQUILA - MATTER

ం వినాయకుడు
విష్వక్సేనుడు ARSA MINOR
సప్తర్షిమండలం :- ARSA MAJOR

అను నక్షత్రమండలములలోని వివిధతత్వముల ప్రాముఖ్యతను, తదంతర్గత మహాప్రచోదక సర్వాంతర్యామి తత్వమును గుర్తించుకొన్నారు. కానివారివారి రీతులలో శోధనలు విశ్లేషణలు చేయుచున్నారు.

విశ్వమొక నియమాను సారము జరుగుచున్నదనియు, దృశ్యమాన విశ్వమున కవతల పెనుచీకటి యగాధములు BLACK HOLES కలవనియు - వాటి కవతల విశ్వాధారుడు పరాత్పరుడై ఏ కాకృతి వెలుగుచున్నాడనియు అతని దివ్య సంకల్పములే యీ విశ్వములనియు అంగీకరించినారు. అలోకంబగు పెంజీకటి కవ్వల నెవ్వండే కాకృతి వెలుంగు అనిపోతన భాగవతం

హిరణ్మయేన పాత్రేణ, సత్యస్యాపి హితం ముఖం

తత్త్వం పూషన్ - అపావృణు సత్యధర్మాయ దృష్టవే

బంగారు పాత్రవలె వెలుగు సూర్యాంతర్గత శతకోటి సూర్యప్రభా భాసమాన విష్ణురూపమే వృథి వ్యాపస్తే జాంతర్గత తల్ త్వంTHAT THOU ART LORD పూషాంతర్గత విష్ణువా!సత్య ధర్మదృష్టి తో చూస్తున్నావని యర్థము.ఈక్ష్యతే లోకాన్.

తల్ - త్వం- అసి అమహాశక్తి నీవై యున్నావు అని వేదములు పొగడుచున్నవి. ఆ దైవము నరుడని కాదు. తల్- అవిశ్వాంతర్గత, విశ్వచోదక విశ్వపాలక - విశ్వపోషక, విశ్వనాశక ఇతి విశ్వేవిశ్వమునందు నువమ్ పొగడ బడుచున్న విష్ణు శబ్దవాచ్యుడని బ్రహ్మ ఇంద్ర ఇత్యాది శబ్దములకు పూర్వమైన ఋగాదులకు పూర్వమే నిర్ణయింపబడిన శబ్దము విష్ణువు అని తెలిసిన పిదప అని తత్వమసియనగా జీవుడే బ్రహ్మ అన్న అర్థము సరికాదు. విష్ణువే బ్రహ్మయని తెలిసిన పిదప " అథాతో బ్రహ్మజిజ్ఞాసా" అను ప్రప్రథమ బ్రహ్మ సూత్రము వెలువడినది. అథః అనంతరము అనగా అమహాశక్తి పురుషోత్తముడైన విష్ణువే అని నిర్ధారణ చేసినపిదప అతః అందువలన అవిష్ణువే బ్రహ్మ ఇంద్ర శబ్దవాచ్యుడని అతనిని గురించి తెలుసుకొను కొరిక యే బ్రహ్మ జిజ్ఞాసా, అను ప్రథమసూత్రమైనది. అథ, అత అను రెండు అవ్యయములు " తదనంతరము, " అందువలన " అనునవి బ్రహ్మజిజ్ఞాసకు పూర్వమే పరిచిత మైన విష్ణువే అని తెలిసినతదనంతతం అవిష్ణువే బ్రహ్మ - ఇంద్ర శబ్ద

వాచ్యుడని తెలిసినందువలనను – బ్రహ్మజిజ్ఞాసకు అధికరణం లభించినది. అథశబ్దో మంగళార్థో అధికారానంతర్యార్థశ్చ అథశబ్దో హేత్వర్థః అథాత శబ్ద పూర్వాణి ప్రారంభంతే (ఏవముక్తంచ గారుడే) ఇందువలన బ్రహ్మసూత్రములలో ప్రతి పాదింప బడిన బ్రహ్మశబ్ద వాచ్యుడు, చతుర్ముఖ బ్రహ్మగాదనియు జననజరా మరణములేని విశ్వాంతర్యామియగు విష్ణుతత్వమని తేటతెల్లముగా రూఢియగుచున్నది. ఈ శబ్దములు సంజ్ఞాభిధలు విశ్వజనీనములు– ప్రత్యేకించి యొకానొక మతమునకు జెందినవి కావు. విశ్వపాలకుడైన విష్ణువు యొకే యొక మతానుకూల దైవముగాదు. విశ్వాంతర్యామి సంకుచిత ములైన నేటి కుటిలకులకూటముల సొత్తుకాడు. ప్రతినామమునకు సహస్రానేకార్థములగల విష్ణుసహస్రనామముల విశాల విస్తృతి సార్వభౌమత్వము సర్వాంతర్యామిత్వములకు సరియైన అర్థమిదియే, సంకుచిత మత ప్రతీకకాదు.

ఆమహోన్నత శక్తి విష్ణువే అని నిర్ధారణమైనది కనుక, తన్మహిమా విష్కారమునకు పీఠిక (BASE) INFLUENCED FIELDఅవ్యక్తమును వ్యక్తమొకరించు యవనిక ఆవశ్యకము కదా అదియే అస్వతంత్రమైన ద్వితీయ తత్వము. తానవ్యక్త యయ్యు అష్టైశ్వర్యమయ విభూతి భరిత విశ్వప్రకృతి, ప్రసవిత్రీ, లోకమాత, ఈశునకురమణస్థానమైన రమా, హిరణ్మయీ, జ్యోతిర్మయీ. పరమాత్మయైన విష్ణుని సంకల్పముల విశ్వదర్పణమున దర్శింపచేసి పాలించు పరాప్రకృతి. స్త్రీ తత్వము. శ్రీ – శకార రకార యీకార శబ్దసమ్మిళిత శ = శాసించి, శంసించి రక్షింపగా రకారము విభూతులందింపగా యీకారము అష్టైశ్వర్యములను విశ్వేశుని మహిమా విష్కారమునకు దోహదము జేయగా , భగవంతుని సన్నిధిని మనకు ముక్తిని ప్రసాదింపజేయగల జగన్మాత విష్ణుహృదయనివాసిని పరమాత్మునకధీన – జననమరణాదులులేని,నిత్య ముక్తతత్వ పరమాత్ముని సంకల్పములు పాలించు ద్వితీయతత్వ హిరణ్యవర్ణాంహరిణీం సువర్ణ రజతస్రజాం చంద్రాం హిరణ్మయీాం లక్ష్మీంజాతవేదో మ ఆవహ" అని శ్రీ సూక్తము నుతించుచున్నది. అంభృణీ సూక్తములో ( ఇదియును లక్ష్మీసూక్తమే ) తాను శ్రీవిష్ణునాజ్ఞచే సర్వతత్వములను శాసించి పాలించు చున్నానని చెప్పుచున్నది. చెప్పుట యనగా మానవ మేధలో దైవము విశదీకరించు అంతర్బోధ.

"అహం రుద్రేభిః వసుభిః చరామ్యహం
ఆదిత్త్యైః ఋుతవిశ్వ దేవైః ।
అహం మిత్రావరుణో బాబిభర్మ్యహ
మింద్రాగ్నీ అహమశ్వినోభా ।
అహం సోమమాహనసం బిభర్మ్యహం
త్వష్టారముత పూషణం భగం
అహం దధామి ద్రవిణం హవిష్మతే ।
సుప్రావ్యే ఽఽఽ యజమానాయ సున్వతే ।"

అనితాను జగన్మాతృస్థాననియూ, వసువులు, రుద్రులు ఆదిత్యులు , విశ్వేదేవతలు సూర్య, వరుణ, ఇంద్రాగ్నులకు, అశ్వినీదేవతలు చంద్రునకు, చతుర్ముఖ బ్రహ్మకు, ఐశ్వర్యం ధనం, తేజస్సు యిచ్చివారి పనులను నిర్వర్తింప చేతుననియు

" అహం సువే పితరమస్యమూర్ధన్మమ యోనిరప్స్వంత సముద్రే ।తతో వితిష్ఠే భువనాని విశ్వోతామూంద్యాం వర్ష్మణోఽపస్పృశామి । "

తనకు స్వామి, భర్తయగు వాడు అప్స్వంతములో అనగా సముద్రమధ్యములో నున్నాడనియు. తాను గూడ అక్కడే యుండి అతనియాజ్ఞచే భువనాలను పాలిస్తున్నానని చెప్పుచున్నది.

ఈమెయే కమలా- కమలాసనస్థా
చతుర్ముఖ బ్రహ్మకు తల్లి, బ్రహ్మమరుత్
రుద్ర, ఇంద్ర యమ వరుణ మదనాదులకు
మాత - చిచ్ఛక్తి - పరాత్పర హృదయాంతరస్థ
కనుక - పరాత్పరి - పరాశక్తి - త్రిమాతరాద్యా
అష్టైశ్వర్యదాయియైన ఆదిలక్ష్మి - " సిద్ధలక్ష్మి, మోక్షలక్ష్మి
జయలక్ష్మిసరస్వతీ । శ్రీ లక్ష్మివరలక్ష్మిశ్చ
ప్రసన్నామమసర్వదా " అని శ్రీసూక్తము. శ్రీ- శ్రీశులు పకృతి పురుషులే.

" ఓం స్వాచ్ఛోభయ నామ్నాత్ ఓం " ఏషస్త్రీ, ఏషః పురుషః (బ్రహ్మసూత్రం)

మాయాంతు ప్రకృతిః మాయిఇతి పరాత్పరం (ఇతిబ్రహ్మాండే)

స్వతంత్ర మస్వతంత్రంచద్వివిధం తత్వమిష్యతే అను మధ్వాచార్యుల వారి సిద్ధాంతము రీతి స్వతంత్రుడు విష్ణువొక్కడే ఇక రెండవతత్వమగు అస్వతంత్ర తత్వ రమా ప్రకృతియే, యావద్విశ్వము, అందలి సమస్త జడజీవ చైతన్యమయప్రకృతి సర్వస్వము రమా ప్రకృతి కధీనములైన స్త్రీతత్వములే , పురుషోత్తముడైన శ్రీ మహా విష్ణువే పురుషుడు. తదితర మంతయు స్త్రీ ప్రకృతియే. ఇదియే లక్ష్మీనారాయణ, వాణీ చతుర్ముఖ యుమామహేశ్వర, రాధా మాధవ యగళ తత్వముల - ప్రకృతి పురుష ద్వైత తత్వోపాసన.

" ఓం పూర్ణమదః, పూర్ణమిదం
పూర్ణాత్ పూర్ణముదచ్యతే
పూర్ణస్యపూర్ణమాదాయ
పూర్ణమేవా వశిష్యతే " ఇదియే స్వతంత్రం - అస్వతంత్రచ అనుద్వివిధ ద్వైత తత్వములు - పూర్ణుని నుండి పూర్ణ సంకల్ప ములు గ్రహించి పూర్ణపురుషుడగ్రా హ్యుడచ్యుతుడప్రమేయు, డనామయుడవ్యయుడు గనుక, తద్ద్వైష్ణవశక్తి ప్రతీత రమామహిమచే, పరాత్పరుని లీలా విభూతిమయ జగద్వ్యాపారముచే విశ్వమయాంతర్గత విష్ణు మహిమనుజూపగల దర్శా దర్పణమే, ఈ విశ్వము విశ్వజనని, లోకమాత పదము లాశ్రయించిననే మనకు ఆమె విభుని అనుగ్రహము కలుగుట. లోపము లేని సాన్నిధ్యవైకుంఠ నివాసము జేరగల్గుట.

" నను బ్రోవమని చెప్పవే " అని రామదాసు వేడికోలు.

"సీతమ్మ మాయమ్మ శ్రీరాముడు మాకు తండ్రి " అనుత్యాగరాజుని పితృభక్తి. " వాగర్థా వివసంపృక్తౌ, వాగర్థప్రతిపత్తయే జగతః పితరౌ వందే, పార్వతీప, రమేశ్వరౌ " అను కాళిదాసుని జగజ్జననీ జనకుల భేదాభేద ద్వైత సంస్థితీ స్తవనం. ప్రకృతిపురుషులగు, రమా రమాపతుల లక్ష్మీనారాయణుల రాధామాధవుల " అమలిన ప్రణయ " శృంగార ,భక్తి దైవీ ద్వైత తత్వము లైన యీ దివ్యయుగ్మములకే పూర్ణ యోగమనిపేరు. బ్రహ్మసత్యం, జగంచ సత్యం " స్వతంత్రం - అస్వతంత్రం చ " అను

చకారప్రయోగము. "విశ్వం సత్యం మఘవానా " అను తీర్పు. ఇదియే విశ్వవ్యాపార రహస్యము. జగత్తుమిథ్యకాదు. బ్రహ్మసత్యమైన అతని వ్యాపారము సత్యమే.

వివిధ మతానుయాయులు, వివిధ రీతుల, ఈ మహావిశ్వరహస్యమును విశదీకరింపయత్నించిరి. బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులనియు, పరదేవతా, పరాశక్తి యనియు అల్లా, యోహోవా, జొరాస్టరు అని నానా విధముల విశ్వవిభునిలీలలు గ్రహింప యత్నించిరి.

వేద, వేదాంత దర్శనములకిరవైన భారత భూమిలో, అధిభౌతిక శాస్త్రమనంతము గానున్నది. క్రీస్తునకు పెక్కువేలేండ్లపూర్వమే మనదేశములో, వేదాంత విజ్ఞానము మహోచ్చ పరిపక్వదశలోనున్నది. ఇతర ఖండములు అజ్ఞానాంధకారమున నున్నపుడు ప్రాగ్భానుప్రభచే మనదేశము విశ్వమున దివ్యజ్యోతులను ప్రసరింపజేసినది. కొలంబస్ వాస్కోడిగామాల వలె నెవ్వరు కనిపెట్ట లేదు. అనాదియని మన ఋషులానాడే తెలిసికొనిరి.

త్రయీ అని పిలువబడిన వేదముల రాశిని సముద్ధరించి, ఋగ్యజు, స్సామ, అధర్వణములని నాలుగు భాగముల వింగడించి, అష్టాదశ పురాణములు వెలయించి, ఈశ, కేన, కఠ, ప్రశ్న, ముండక, మాండూక్య, తిత్తిరి. ఐతరేయ, ఛాందోగ్య, బృహదారణ్యక, శ్వేతాశ్వతర, కౌషీతక, తలవకార అను ఉపనిషత్తుల వెలయించి, వేదములకు వ్యాప్తి, విస్తృతి కెంచిన పారాశరి, బాదరాయణుడు, కృష్ణద్వైపాయనుడు, సాత్యవతేయుడు, అను పెక్కునామములతో శోభించు శ్రీవ్యాసభగవానుడు సాక్షాత్ విష్ణువు యొక్క అవతారమనియు. అ-ఆ. అం - అః పురాణార్షి వ్యాసః శాఖాసహస్రకృత్ మహాభారత నిర్మాతా, కవీంద్రో బాదరాయణః కృష్ణద్వైపాయనః సర్వపురుషైకార్థ బోధకః విష్ణుం సహస్రనామ్ని, వ్యాసం సాక్షాత్ నారాయణం విద్ధి మహాప్రభుమ్ - (గుర్వర్థ దీపికా). వేదవేదాంత శాస్త్రములకు మూలఋషియై చిరంజీవియై, నేటికిని ఉత్తర హిమాలయపర్వతాలలో వ్యాసబదరిలో నున్నాడని విద్వజ్జనుల విశ్వాసము.

వేదవేదాంత శాస్త్ర సర్వస్వము వ్యాసప్రోక్తమే ఎంతవివరించిననూ తృప్తి జెందక ముముక్షువులకు సులభ గ్రాహ్యముగా వేద విజ్ఞానము నంతయు 564 బ్రహ్మ సూత్రములలో క్రోడీకరించి క్లుప్త పరిచినాడు .

బ్రహ్మ సూత్రములకు ఇరువదిరెండు భాష్యములు గలవు. అందున పరమ ప్రసిద్ధిజెందినవి మూడు - శాంకర రామానుజ మాధ్వభాష్యములే. త్రిమతాచార్యుల భాష్యములని వేదాంత మనీషులచే నిగ్గుదేల్చబడినవి.

భాష్యమును జేయువారలకొక నియమముండును. పూర్వ భాష్యములనన్నింటిని పూర్వపక్షముజేసి - ఎదురించి - అవశ్యముగ ఖండించిన గాని వీరి భాష్య మారంభణీయము కాదు. ప్రఖ్యాతి గన్న పందొమ్మిది భాష్యముల శ్రీ శంకరులు, శ్రీశంకర భాష్యములతో సహా ఇరువదిని శ్రీ రామానుజాచార్యులు ,మొత్తము ఇరువది యొక్క భాష్యములు ఖండించి శ్రీ మధ్వాచార్యుల వారు ఇరువది రెండవ భాష్యమును వ్రాసిరి. వరుసగా అద్వైత, విశిష్టాద్వైత, ద్వైత భాష్యములని త్రిమతాచార్యుల భాష్యముల పేర్లు జగద్గురు శ్రీ మన్మధ్వాచార్యుల వారి భాష్యమే అధునాతనమైనది. వీరితరువాత భాష్యకారులు లేరని ప్రతీతి. త్రిమతాచార్యుల జీవిత కాలము ఈవిధముగా నున్నవని విజ్ఞుల వివరణ.

| | | |
|---|---|---|
| శ్రీ శంకరాచార్యులు | 768 - 820 | A.D |
| శ్రీ రామానుజాచార్యులు | 1017 - 1137 | A.D |
| శ్రీ మధ్వాచార్యులు ( ఆనందతీర్థులు) | 1238 - 1317 | A.D |

వల్లభాచార్య, నింబార్క శ్రీధర స్వామి జ్ఞానేశ్వర, చార్వాక, సౌగత, ఆర్హత, పాశుపత, న్యాయమౌక్తిక, సాంఖ్యనైయాయిక, కౌమారిలక వైయాకరణ, యాదవప్రకాశ, మొదలగు వ్యాఖ్యలు లేక భాష్యములు పరాస్తములుగాగా త్రిమతాచార్యుల భాష్యములే నిగ్గుదేలి విశేష ప్రచారములో నున్నవి. అందు, శ్రీ మన్మధ్వాచార్యుల వారి భాష్యమే ఆధునిక, భౌతిక విజ్ఞాన శాస్త్రమునకు చేరువగా సమన్వయించు నిత్యసత్య తత్వ సంఖ్యానములను (ETERNAL ELEMENTS ,MOLECULES, ELEC-TRONS, PROTONS etc) జగత్తు యొక్క సత్యత్వమును ఆవృత్తములను (CYCLES)పరమోత్కృష్ట శక్తికి (SUPER ENTITY) విధేయత్వమును (LAW OF GRAVITY) ప్రతిపాదించుచున్నవని. పెక్కు పాశ్చాత్య

ప కీతుంప్రకంప నేటి మన శాస్త్రజ్ఞులు 120 దాకా మూలతత్వములను (INDIVISIBLE ENTITIES) కనుగొన్నారు. ద్వైత తత్వ సంఖ్యానము ప్రతి... మనదిదియే

ఆచార్యులు మహామనీషులు ప్రజ్ఞాపాటవమున, భక్తి గరిమమున, వేద వేదా... తర్క న్యాయ మీమాంసా దార్శనిక సామర్థ్యమున, బోధనా చాతుర్యమున, నిష్క... త్యాగమయ వైరాగ్యజీవనమున, నిస్తులమాన్యులై వెలుగుచున్నారనుటలో సందేహములేదు. వీరిమార్గములు యీషత్ప్రభిన్నములే, గమ్యముమాత్రము పరమాత్మసందర్శనమే తాముతరించి ఇతరులను తరింపజేతురనుటలో వివాదములేదు.

నేటి కుహనామతాచార ప్రచారకుల వలె వీరు పరస్పర నిందా పూరితసంకుచిత మనస్కులనుట కేమాత్రము ఆధారములేదు. వీరు సమకాలీనులు కారు. బ్రహ్మ సాక్షాత్కార సందర్శనానందమే వారి గమ్యము. విశ్వశ్రేయమే వారిలక్ష్యము. జగద్ధిత కార్యములే వారి నిత్యకృత్యములు. రోష కావేషములకు లోనై కుల, మతవర్ణవైషమ్య భూయిష్టమగు నేటి కుహనా బోధనలు వారి మార్గములలేవు. అవి నేటి పండితుల క్షుద్రవ్యాఖ్యలు. వారు జగద్గురువులుగా , భగవంతుని యవతారములుగా, గుర్తింపబడినారు. సర్వదేశకాల పరిస్థితులలో వారమృత మూర్తులే.

శాస్త్ర ప్రగతి, నిరంతర, పురోగమసాధనామయ ప్రవాహిని. పెక్కు నూతన ప్రక్రియలు , బహిర్గతములగు సద్భావములు తరంగములవలె తీరములను తాకుచునే యుండును. ముఖేముఖే సరస్వతియనునట్లు విజ్ఞానవైవిధ్యములు , నిత్యనూతన వ్యాఖ్యాన ప్రస్తావనలు వచ్చుచునే యుండును కదా. భగవంతుడు నిత్యనూతనుడుకదా. ఉత్తమోత్తమములైన అధునాతనాధునాతములు వాటి ప్రాబల్యములను చాటునుకదా. OLD ORDER CHANGETHY ELDING PLACE TO NEW.

ఈ దృశ ప్రాదుర్భావములు భారతావనికే పరిమితములనుటలో సంకుచితత్వము బాధించును. గెలేలియో అరిస్టాటల్. న్యూటన్ , ఐన్స్టీన్. కన్ఫ్యూషియస్, సోక్రటీసు, ప్లాటో, బైరన్, రస్సెల్, మొదలగు శాస్త్రవేత్తలు, తత్వవేత్తలు,

విశ్వవిజ్ఞానావిష్కారమునకు యెనలేని సత్యసూత్రములందించినారు.నేడు వారి అభిప్రాయానుభవములకు మెరుగులు దిద్దునవి, ఖండించునవి పెక్కునూత్నవ్యాఖ్యలు వచ్చుచున్నవి. అంతమాత్రమున, వారివాదనలధమములనియు, వారజ్ఞానులనియు అర్థములు చెప్పరాదు.

సనాతన ఋషి సాంప్రదాయ భావనామనీషులైన వారి ధిషణా సామర్థ్యములు వారి సచ్ఛీలము శంకింపవీలులేదు. వ్యక్తి గత దూషణలు పనికిరావు. భావఖండనమె గాని, వ్యక్తిని కించపరచుటకాదు. ఋషితుల్యులైన ఆమహానుభావులు సజీవులై యున్నచో, నూత్నప్రగతికి సంతసింపుచుండిరేకాని, ఖిన్నులయ్యెడు వారుకారు.

మూలప్రవక్తల సత్యాన్వేషణలను భ్రష్ట మొనరించు నేటి కొందరు కుహనా చార్యుల కుటిలాలోచనలే వర్గకుల, మత వైషమ్యములకు హేతువులగుచున్నవి. శిష్టుల కన్న దుష్టులే పటాటోపకులుగదా.

శాస్త్రసదవగాహన, నియమబద్ధజీవనముపై శ్రద్ధాసక్తిలేక,స్వార్థ విషయానంద పరమావధియే వీరిని యీ నీచస్థితికిదెచ్చినది. ఇటువంటి పాక్షిక కుటిల దృష్టులకులోను గాక సుందర సత్యాన్వేషణమే జీవితాశయముగా గలవారికి సహేతుకములైన ఖండనములు మండనములుగనే యుండును.

వేదబాహిరముగా , బౌద్ధము, మాధ్యమ మార్గమున క్షీణదశలో సమాజము నష్టవ్యస్తముజేసి , మత యుద్ధముల, నంతః కలహముల తక్షశిల, నలంద, నాగార్జున, సారానాధ్ అనువిశ్వవిద్యాలయములు శిథిలముగాగా సంశయాస్పదసూత్రముల " సర్వం క్షణికం క్షణికం " య ద్దృశ్యంతన్నశ్యం అను వ్యాఖ్యల, యొకప్రాణి నింకొక ప్రాణి తిని జీవించు ధర్మమును విస్మరించి " అహింసా పరమోధర్మః " అను అనుసరింప వీలులేని వాచా వేదాంతమును బోధించి జనులను నిరాసక్తులుగా. నిర్వీర్యనిస్తేజులుగా చేయుచున్నప్పుడు వేదప్రాశస్త్యమును పునరుద్ధరించి, భగవద్భక్తియే శ్రేష్ఠమని, త్రిపిటకములకు వైదిక ధర్మాసక్తిని బెంచి జీవులకు మానవ జన్మశ్రేష్ఠతనుజూపి, వైదికాచారములను పునరుద్ధరించినకీర్తి నిస్సందేహముగా శంకరులదే .......... **నిర్వీర్య,** నిష్ప్రాణ, నిర్వ్యాపార నిరాసక్త, నిద్రాలసులగుజనులకు ’

1. అహం బ్రహ్మాస్మి

2. తత్వమసి

3.అయమాత్మా బ్రహ్మ

4. నేహనానాస్తికించన

5.ఐతదాత్మ్య మిదం సర్వం

6.ఏకమేవా ద్వితీయం బ్రహ్మ

అను వాక్యములచే జీవుని, దేవునితో గల , పోలికలు జూపి, సాధనౌన్నత్యమును ఫలాపేక్షలేని కర్మాచరణమే జీవుల కర్తవ్యమని బోధించిరి, యుక్తి యుక్తముగా . జీవుడధముడు కాడనియు. దైవాంశుడనియు. నిరాసక్తుడై, నిర్వీర్యుడై, నిరయపాంథికుడై మ్రగ్గ చుండుట వివేకము కాదనియు. నూతనోత్సాహమునకై జీవులందు దైవత్వమును చూపించిరి. కాని వారు " భక్తి రేవ గరీయసీ " " భక్తి రవ్యభిచారిణీ " అనియు సదా దైవధ్యానమున, తాదాత్మ్యము జెందుడని ప్రబోధించిరి.

కాలాపమార్గమున నేసూత్రమై నను కొందరి విపరీత వ్యాఖ్యలచే, మూల విరుద్ధ భావములకు తావిచ్చుననుట సత్యదూరము కాదు. శ్రీ శంకరాచార్యుల " భక్తిరేవ గరీయసీ " అను బోధనల ప్రాముఖ్యమును తగ్గించి, తామే బ్రహ్మల మని, తమకు కర్మలాచరింప పనిలేదనియు బ్రహ్మానందము నందుందుమనియు రావణాదుల వలె విపరీత వ్యాఖ్యలచే అద్వైతము నధోగతి కీడ్చిరి

" ఏకమేవాఽద్వితీయం బ్రహ్మ " "సర్వం ఖల్వి దంబ్రహ్మ ." " అహంబ్రహ్మాస్మి "

అను వాక్యములకు - జీవులకు , బ్రహ్మకు అభేదము సాధించు వ్యాఖ్యల వల్ల భక్తి నశించి ఉపకారము కన్న నపకారమే మిక్కిలి యెక్కువగునని శ్రీ రామానుజులవారు ఇరువదియొకటవ భాష్యములో శాంకర భాష్యమును ఖండించిరి.

వేదమంత్రములకు, స్వతంత్ర వ్యాఖ్యలు పనికిరావనియు, శిక్షా - కల్ప వ్యాకరణం, నిరుక్తం, ఛందస్సు జ్యోతిషం అను షడంగములు, ఉపక్రమము - ఉపసంహారము అభ్యాసము - అపూర్వతా - ఫలము అర్థవాదము, ఉపపత్తియను తాత్పర్య నిర్ణాయక లింగములు, శ్రుతి లింగసమాఖ్యా, వాక్యస్థానప్రకరణ ములను,

సూత్రముల వేదవాక్యార్థము జేయనగును గాని, విశ్రుంఖల రీతి వివరింపరాదని " సింహోమాణవకః అనగా బాలుడే సింహమైనాడనుట సమంజసము గాదనియు. సింహము వలె బాలురలో పరాక్రమవంతుడనియు. ఆమాదిరి గనే అహంబ్రహ్మాస్మియనగా నేనే బ్రహ్మము కాదనియు. బ్రహ్మవలె జీవులను నేను గూడ భాసించుచున్నాననియు " తత్వమసి " అనగా దానివలె నీవును యున్నావనియు, అదియే నీవనుట అసమంజసమనియు, " గావః గోష్ఠే ఏకీభూతాః" అనునట్లు జీవులందరు దైవసన్నిధినిజేరుట, జీవబ్రహ్మైక్యము కాదనియు, తత్సమీపావాసమేననియు, ఆవులన్నియూ మందలోజేరినవనగా నొకచోట గుంపుగానున్నవి కాని, అఖండైక్యము పొందినవనుట సరికాదనియు. " ఏకోవిష్ణుః మహద్భూతం । పృథక్ భూతాన్యనేకశః సర్వోత్తముడైన విష్ణువొకడే, మహాశక్తిమంతుడనియు. వేర్వేరు అంశలతో జీవులు అనేకులనియు వివరించిరి. ఇవి శంకరులతరువాత 500 ఏండ్లకు వెడలిన మెరుగుపడిన శ్రీ మధ్వాచార్యుల వ్యాఖ్యలు

శ్రీమన్మ ధ్వాచార్యుల వారు " స్వతంత్రం - అస్వతంత్రంచ ద్వివిధం తత్వమిష్యతే " అని సూత్రీకరించిరి. " సర్వం ఖల్విదంబ్రహ్మ " కు ఇది సూత్ర విధేయ వ్యాఖ్య. బ్రహ్మసత్యం జగం మిథ్యా " అను వాక్యఖండనం సర్వాంతర్యామి పరాత్పరుడు జీవులకన్న భిన్నుడైన ఉత్తమ స్వతంత్ర తత్వమనియు. బ్రహ్మతత్వము ద్వివిధములుగ నున్నది గనుక అస్వతంత్ర తత్వములతో విశ్వము లేక జగత్తు సత్యమని నిర్ధరించి రెండు వ్రేళ్లు జూపించి ద్వైతమును ప్రకటించిరి. వీరి సిద్ధాంతము ఈ విధముగా నున్నది.

శ్రీమన్ మధ్వమతే, హరిః పరతరః "సత్యంజగత్ " తత్వతో
భిన్నాః, జీవగణాః. హరేరనుచరాః నీచోచ్చభావంగతాః
ముక్తిః నైజానుఖానుభూతిః అమలాభక్తిశ్చ, తత్సాధనం
హ్యక్ష్యాది త్రితయం, ప్రమాణం. అఖిలామ్నాయైకవేద్యోహరిః

అని - ప్రత్యక్ష - ఆగమ - అనుమాన - అను ప్రసిద్ధ ప్రమాణముల వలన, వేదమంత్రము వలన నిరూపించి తత్వప్రస్తారము కావించిరి. జీవులు వేరు బ్రహ్మవేరు.

భేదము లేక నీచోచ్చ తారతమ్యము నిశ్చితము. భేదములైదు రకములు.

1. జీవులు - పరమాత్మ - భిన్నులు
2. జీవులు - అన్యజీవులు - భిన్నులు
3. జడములు - జీవులు - భిన్నులు
4. జడములు - అన్యజడములు - భిన్నులు
5. జడములు - పరమాత్మ - భిన్నులు

ఈ ప్రభేదములు పంచకములగుటచే " ప్రపంచ " మైనదని ప్రపంచ శబ్దమునకు ఉత్పత్త్యర్థము సిద్ధింప జేసినారు. ఈ పంచభేదములు " అనాది నిత్యము " లగుటచే " బ్రహ్మ యొకడే సత్యము జగము మిథ్యా అనుట సరికాదనియు

" విశ్వం సత్యం మఘవానా "

యచ్చికేత సత్యమిత్ తన్నమోఘం "

అను ఋగ్వేద మంత్రముల ఋజువు చూపించినారు. భగవంతుడు సత్యమే అయినప్పుడు - అతడు సృజించిన జగములు సత్యములేకాని, అసత్యము లెట్లగునని ప్రశ్నించినారు. బ్రహ్మసత్యము విశ్వము సత్యము. దేవుడొకడే శ్రేష్ఠుడు జీవుల భిన్నులు. దేవుని అనుచరులు పెద్ద - చిన్న అను భేదము కలవారు వారుసదా భగవంతుని యందు సేవ్యసేవక భావముంచుటే సహజముక్తిస్థితి; దీనిని సాధించుటకు నిర్మల భక్తి యొకటే సాధనము. దీనికి ప్రత్యక్ష ఆగమ అనుమానమనునవియే మూడు ప్రమాణములు దేవుడు వేదములచే మాత్రమే తెలియ బడెడువాడు - అన్యనిదర్శనములకు దొరకడు. అని మధ్వమత సూత్రముల ప్రాశస్త్య మును ప్రబోధించి నారు. జగము మిథ్యయని అనాసక్తిలో నుండక, కర్మాచరణలుత్యజింపక భగవంతుని దర్శించు కోరికను పెంచుకొని సమస్త కర్మఫలముల బ్రహ్మార్పణ మొనరింపుచు జీవించుటే, భక్తియనియు భక్తి పరిపక్వస్థితియే జీవికి నైజముక్తి యనియు జననమరణ చక్రభ్రమణ, రహిత స్వస్వరూపానంద తారతమ్య కలిత ముక్తి యని నిరూపించినారు.

త్రిమత ముల సారాంశము మూడు మాటలలో చెప్పవలెననిన

శ్రీశంకరుల అద్వైతము జీవులను బ్రహ్మతో సమానమనుటవలన

అహంకారము ప్రబలినది రావణ, భస్మాసుర - మొదలగుదైత్య ప్రవర్తనల బ్రహ్మసర్వోత్తమత్వమునకు భంగము వాటిల్లినది. జీవ బ్రహ్మైక్యము సాధింప బూనుట వలన, అనశ్వరులగు జీవులకు నాశము ఆరోపింపబడినది. Law of in-destructability అను ప్రప్రథమ భౌతిక శాస్త్రమబద్ధమైనది. జగము మిథ్య అనుటవలన ఈశ్వర రచన యైన విశ్వమును నిందించినట్లైనది. జగద్వ్యాపారముల పట్ల అనాసక్తత, వైరాగ్యభ్రమచే విద్వేషము. అసత్యములైన సాధనానిచయంతో సత్యశోధనకు అసత్యారంభమై అసత్యమే గమ్యమై భాసించినది. పరస్పరవిరుద్ధసందేహాస్పద వ్యాఖ్యలు పొడసూపినవి. ఈ సందేహము మధుసూదన సరస్వతుల వారి కుండినదని Dr B.N.K. Sarma garu త్రిమతాచార్యుల బ్రహ్మసూత్రవ్యాఖ్యల సమ్యక్ పరిశీలనలో జెప్పియున్నారు కనుక శాంకర భాష్యమునకు నూత్న భాష్యము ఖండన రూపమున వెలువడినది. అదియే శ్రీ రామానుజుల భాష్యము

శ్రీ రామానుజుల వారు బ్రహ్మశ్రేష్ఠత్వమును. జీవబ్రహ్మభిన్నత్వమును సేవ్యసేవక దాసదాసాను దాస భక్తి ప్రపత్తి మార్గమును నిరూపించి, అహంబ్రహ్మాస్మి మొదలగు వాక్యముల నిరాకరించిననూ, జీవబ్రహ్మైక్య వాదము విడువకుండుటవలన జీవ నాశము తదుపరి జీవబీజ శూన్యప్రళయము సూచితమయ్యెను. ముక్త జీవులు బ్రహ్మతో నైక్యము జెంది. విష్ణునితో సమానమగు నానందము బొందుదురనుటవలన తారతమ్య ముక్తి దూషితమయ్యెను. ఉచ్చనీచతత్వముల స్వస్వరూపగత సత్యస్థితి అనిత్యమని చెప్ప బడెను. బౌద్ధుల శూన్యవాదమును కించిత్ భేదముచే మాయగా మార్చి జగంమిథ్యా అను శూన్యప్రతిపాదకమును విడక శ్రీ శంకరులు, జీవబ్రహ్మైక్యమును విడక విశిష్టాద్వైతమని శ్రీరామానుజులు - సారూప్య - సాయుజ్య. ముక్తులను చెప్పుటవలన మరి యొకసారి భాష్య ఖండనమవసరమైనది. సాలోక్యమే జీవుల సహజముక్తానంద స్థితియని శ్రీమధ్వా చార్యుల సిద్ధాంతము. "నత్వే వాహమ్" (గీత) నిత్యోనిత్యానాం, చేతనశ్చేతనానామేకో బహూనాం యోవిదధాతి కామాన్.... తేషాం శాంతిః శాశ్వత "కాఠకం" 2.2.13, నిత్యో నిత్యానాం

చేతనశ్చేతనానాం.... జ్ఞాత్వాదేవం ముచ్యత సర్వపాశైః శ్వేతా 6-13. జీవులు నిత్యులు దేవుడు పరమనిత్యుడు. ఇద్దరు శాశ్వతులు బ్రహసత్యం విశ్వంతు సత్యం. శ్రీరామానుజులవారు ఉపనిషత్తులు లేక వేద శిఖలకు భాష్యము వ్రాయలేదు. వారితరువాత శ్రీరంగరామానుజ యతీంద్రులు వ్రాసిరి.

త్రిమతాచార్యులలో మూడవవారైన శ్రీ మన్మధ్వాచార్యులు (ఆనందతీర్థులు) ఇరువది రెండవ భాష్యము రచించిరి.

విష్ణువు శ్రీహరి యే సర్వోత్తమ స్వతంత్రుడు. జగత్తు పారమార్థిక సత్యము జీవులు భగవద్భక్తులనుటలో శ్రీరామానుజ శ్రీమధ్వులకు వివాదములేదు

ముక్తజీవులకు, బ్రహ్మకు, తారతమ్య ముండునని మధ్వాచార్యులవారు సిద్ధాంతీకరించిరి. విష్ణువునకు అప్రాకృతశరీరము షాడ్గుణసంపూర్ణమై నందున - జనన -మరణాదులు, దేహధారణ త్యాగము - బంధమోక్షములులేవు - అతడు నిత్యముక్తుడు. అతడే కాదు. రమా ప్రకృతియగు శ్రీ కూడముక్తయే . ఆమెయు పురుషతత్వమే. పురుషోత్తముడు విష్ణువే. వీరిద్దరిలోనే తారతమ్యమున్నది. నిత్యముక్తులౌ విష్ణు, రమాదేవతలకు, ముక్తికైనిరంతర సాధనచేతపించు - బ్రహ్మవాయు రుద్రాది తత్వములకు - అధమాధమ జీవులకు, యథా శక్తిముక్తి యోగ్యులై సహజానందస్థితి అనగా బ్రహ్మ యొక్క వ్యాపారమును గ్రహించు చుండుస్థితి కాక - సమానమనుట దూష్యమని సిద్ధాంతీకరించిరి. ముక్తజీవులు బీజప్రస్వరూపముల నానందము గ్రోలుచు యుగకల్పకళల భగవత్సంకల్పములచే మగిడివచ్చుటయో, దైవకార్యమున నియోగింపబడుటకో సిద్ధముగా నుండవలెను. భక్తివలన ముక్తి సిద్ధించినది. ఇకదైవము నైనానుగనుక వేరేదైవములో నాకేమివని అనునట్లు సృష్టి స్థితిలయాదుల నధిగమించినట్లు భ్రమకల్గును. మరల యదార్థజ్ఞానమునకై అధోలోకప్రవేశము తప్పదు.

" ఆబ్రహ్మ పర్యంతముగల దేవ, ఋషి, పితృ, ప, నర, మర్త్య, రాక్షస, పశు పక్షి చేతనాచేతనములవరకు తారతమ్యమున్నదని తత్వసంఖ్యానమును శ్రీ మధ్వా చార్యులు విస్తృతించినారు. దేవతాస్తుతి గూడ తారతమ్యామ సారము (ORDER OF

SENIORITY) చేయవలెనని చెప్పినారు.

" వందే విష్ణుం, నమామి శ్రియమథచభువం
బ్రహ్మవాయూచవందే గాయత్రీం భారతీం గరుడమనంతంభజే రుద్రదేవం"
దేవీం వందే సుపర్ణీం అహిపతి దయితాంవారుణీ
మప్యుమాంతా మింద్రాదీన్ కామముఖ్యాన్, సకల
సురాన్ తద్గురూన్ మద్గురూంశ్చ "

పంచభూతముల, పంచజ్ఞానేంద్రియముల పంచతన్మాత్రల, మనస్సు, అహంకారము బుద్ధి, ప్రకృతి మరియు పురుషుడు, అను పంచ పంచ ( 5 x 5) గుణకార భేదిత ప్రపంచమున పృథివ్యాపస్తేజోవాయు రాకాశాదికి, రుద్ర, యమవరుణేంద్రాగ్ని సూర్య చంద్ర తారకాళికి, దిక్పాలకాది చతుర్వింశతి తత్వములకు తత్వాభిమాన దేవతలకు జగద్వ్యాపార నిమిత్తమై తత్తత్తారతమ్యానుసారములైన పదవులందధికారమివ్వ బడినదవియు, వీరికి మాతృదేవతయైన శ్రీ - విష్ణుపత్ని, ప్రకృతి, శాంతా, రమా ఇత్యాది పేర్లచే పిలువబడు ద్వితీయతత్వమే పరా. ప్రథముడు సర్వోత్తముడగు విష్ణువు కదా. లోకమాత యగు ఈమెయే సర్వాంతర్యామియగు విష్ణుని యాజ్ఞచే తత్వాధి దేవతలను నియమించు చున్నది. (Power of Attorney వలె)

ఈ రెండు తత్వములు నిత్యముక్తులు, పరా పరాత్పరశబ్దములచే కోబిల్లు ద్వైతతత్వాలు. వీరికి బంధమోక్షములు. సాధనలులేవు.

వీరితరువాత దేవజీవ సాధనాయుత వివిధ తత్వములు అందు ధాత, వాయువులు సమానులు. అధికారము వలన బ్రహ్మపదవిచే ధాత ప్రథమగణ్యుడు. .జీవులలో శ్రేష్ఠుడైన తత్వుడు వాయువే సర్వజీవుల్ప్రతినిధి. " హరిః సర్వోత్తమః వాయుజీవోత్తమః " భావిబ్రహ్మ పదవికితడర్హుడు. వాయుతత్వము జొరని శూన్యప్రదేశమున భగవత్తత్వ ముండదు. (Nothing passes throu;h Vacum) వాయువే సమస్తమును మోయు " శేష" తత్వము (Vehicle for sound, odour, light etc) ఆమాదిరిగనే ప్రాణప్రతిష్ఠకు నిర్గమమునకు ప్రాణుడే యాధారము పృథివ్యాపస్తేజోఽనలనభాదులకు తన్నియామక దేవ వాయువే మూలస్తంభము. దీనిని గురించి వేదములలో కథగలదు. గోష్ఠమునకు దంతెలకన్న దూలమెట్లు ప్రధానమో,

ఇతర దేవతలకన్న ప్రాణాధారుడగు ముఖ్యప్రాణుడే దేవ - జీవ సంధానకర్తయని చెప్పబడినది.

" వాయుర్భీమో, మహౌజాః సర్వేషాం ప్రాణినాం
ప్రాణభూతః । అనావృత్తిర్దేహినాం దేహపాతే ।
తస్మాత్ వాయుః దేవ దేవో విశిష్టః "

అన్నారు. ఈతత్త్వమునే మాతరిశ్వుడనియు లాతవ్యుడనియు, ప్రాణాపాన ఉదానవ్యాన సమానుడనియు పిలుతురు. ఇందుముఖ్యప్రాణుడే మర్త్యులకు జీవాధారమగు (OXY-GEN) ప్రాణవాయువు. హనుమభీమ - మధ్వాది చిరంజీవ తత్త్వలీ యంశమువారే. అవతారమూర్తులు. దశప్రమతి యనగా వీరే.

**పంచభూతములు**

పృథివి :- భూమి - గరుడుడు - శేషుడు పార్థివ తత్త్వమును (Matter)మోయు వారు. యీతత్త్వముపైననే భగవత్తత్త్వము శయనించునది. ( శేష శాయి ) ( గరుడవాహనుడు ) నిలుగడయైనతత్త్వము దీనికి ప్రవాహ గుణములేదు - సమస్తజీవరాసులకు వాసభూమి.

ఆపః, నారః వరుణః - జలాధిదేవత. నీరుపల్లమునకు ప్రవహించుగుణము కలది. పృథివీతత్త్వమునకు లేని ప్రవాహశైలి, పాత్రానుగుణరూపము,ఆవిరిగా మారు ద్రవ్యగుణము కలది. నారః యస్యః అయణః నారాయణ తత్త్వమనియు -జీవులలోని సోమరసమను జీవద్రవ్యము. భువన జీవ జీవనము

తేజస్సుః - సూర్యచంద్రులు భగవన్నేత్ర ములని, అగ్నియు తద్రూపమనియే ప్రతీతి " అగ్నిర్యథైకో, భువనం ప్రవిష్టో, రూపం, రూపం, ప్రతి రూపం బభూవ( కారకం ) దక్షిణాగ్ని - ఆహవనీయాగ్ని గార్హపత్యాగ్ని అనిమూడు త్రేతాగ్నులు " " అహం. వైశ్వానరో భూత్వా, ప్రాణినాం దేహ మాశ్రితః ప్రాణపాన పమావిష్ట పచామ్యన్నం చతుర్విధం " అని భగవదూక్తి బడబాగ్ని అనునది. సముద్రమధ్యమున్న దావానలం కాననమున, జఠరాగ్ని ప్రాణుల యుదరమున దేహమున జాతవేదములు."అగ్నిమీళేపురోహితం " అనునది

ఋగ్వేదప్రథమ మంత్రం. అగ్ని ఎప్పుడూ పురా –భావి, హితము చేయవాడని

వాయుతత్వము ః–ఇంతకు మునుపే వర్ణింప బడినది.

ఆకాశతత్వము ః– శబ్దాధిదేవత అన్ని తత్వముకు ఆశ్రయమివ్వగలది

## మానవ దేహములో, తత్వములు, తదభిమాన దేవతలు

## శ్రీమదానంద తీర్థ విరచితం తత్వ సంఖ్యానమ్

1

స్వతంత్ర మస్వతంత్రంచ, ద్వివిధం, తత్వమిష్యతే ।
స్వతంత్రో, భగవాన్ విష్ణుః భావాభావౌ, ద్విధేతరత్ ।

2

ప్రాక్, ప్రధ్వంస, సదాత్వేన, త్రి విధోఽభావ ఇష్యతే।
చేతనాచేతనత్వేన, భావోఽపి, ద్వివిధో, మతః ।

3

దుఃఖస్పృష్టం, తదస్పృష్టమితి, ద్వేధేవ, చేతనమ్ ।
నిత్యాఽదుఃఖా, రమాఽన్యేతు, స్పృష్ట దుఃఖాస్సమస్తశః ।

4

స్పృష్ట దుఃఖా, విముక్తాశ్చ దుఃఖ సంస్థా, ఇతి ద్విధా ।
దుఃఖ సంస్థా, ముక్తియోగ్యా, అయోగ్యా, ఇతి చద్విధా ।

5

దేవర్షి, పితృ,ప,నరా, ఇతి ముక్తాస్తు, పంచధా ।
ఏవం, విముక్తి యోగ్యాశ్చ, తమోగాః సుత్రిసంస్థితాః ॥

6

ఇతి ద్విధా ముక్త్యయోగ్యాః, దైత్య, రక్ష, పిశాచకాః ।
మర్త్యాధమాశ్చతుర్థైవ, తమోయోగ్యాః, ప్రకీర్తితాః ।

7

తే,చ ప్రాప్తాంధతమసః స్రుతి సంస్థా ఇతి ద్విధా।
నిత్యా నిత్య విభాగేన, త్రి ధైవ చేతనం మతమ్ ।

8

నిత్యా వేదాః పురాణాద్యాః, కాలంః ప్రకృతి రేవచ।
నిత్యా నిత్యం త్రిధాప్రోక్తమనిత్యం, ద్వివిధం మతమ్ ।

9

అసంపృష్టంచ, సంపృష్టమ సంపృష్టం, మహావహమ్ ।
బుద్ధిర్మనః ఖాని దశ, మాత్రా, భూతాని పంచచ ।

10

సంపృష్టమణ్డం, తద్గజ్చ సమస్తం, సమ్ప్రకీర్తితమ్ ।
సృష్టిః, స్థితిః, సంహృతిశ్చ, నియమోఽజ్ఞానబోధనే ।

11

బన్ధో, మోక్షః, సుఖం, దుఃఖ మావృతిః జ్యోతిరేవచ।
విష్ణు వాఽస్య, సమస్తస్య, సమాస వ్యాస యోగతః ।

# శ్రీః తత్వవృక్షః

## తత్వమ్




5 ఖానిదశ (పంచజ్ఞానేంద్రియాః పంచకర్మేంద్రియాః

6. మాత్రాః - రూప, రస, గంధ, స్పర్శ, శబ్ద

7. భూతాని - పృథివీ, ఆపః తేజః వాయుః ఆకాశ

| తత్వములు | తత్వాభిమానదేవతలు |
|---|---|
| 1. అవ్యక్త | శ్రీ మహాలక్ష్మి |
| 2. మహత్ | బ్రహ్మ, వాయు. సరస్వతి, భారతీ |
| 3. అహంకార | గరుడ - శేష - రుద్ర |
| 4. మనస్ | రుద్ర - ఉమా |
| 5. శ్రోత్ర | దిగ్దేవతలు |
| 6. త్వక్ | అహంకారిక ప్రాణ దేవుడు |
| 7. చక్షు | సూర్యుడు |
| 8. జిహ్వ | వరుణుడు |
| 9. ఘ్రాణ | అశ్వినీ దేవతలు |
| 10. వాక్ | అగ్ని |
| 11. పాణి | ఇంద్ర - శచీ |
| 12. పాద | జయంతుడు. |
| 13 వాయు | మిత్రనామక సూర్యుడు - దక్షుడు |
| 14. ఉపస్థ | స్వాయంభువమను - యముడు |
| 15. శబ్ద | బృహస్పతి ప్రాణుడు |
| 16. స్పర్శ | అపానవాయు |
| 17. రూప | వ్యానవాయు |
| 18. రస | ఉదానవాయు |
| 19. గంధ | సమానవాయు |
| 20. ఆకాశ | విష్వక్సేనుడు |
| 21. వాయు | ప్రవాహవాయు |
| 22. తేజస్ | అగ్ని |
| 23. ఆపః | వరుణుడు |
| 24. పృథివీ | ధరణీ - శనైశ్చరః |

ఇవి చతుర్వింశతి తత్వములు తదభిమాన దేవతలు.

25. పరా — అప్రమేయ యగుపరా శ్రీ - లక్ష్మితో గూడిన విష్ణువు నవతారములు. శ్రీరాముడు శ్రీకృష్ణుడు షోడశ కళల పూర్ణావతారాలు

26. పరాత్పరుడు — లక్ష్మిచేతగూడ తెలియ బడని పరబ్రహ్మ విశ్వపా విష్ణు శబ్దవాచ్యుడు.

### శ్రీమన్మ ధ్వాచార్యులుదాహరించిన

### తారతమ్య శ్రేణి

### పరమాత్మతత్వము

తారతమ్య క్రమము

1వ కక్ష్య - విష్ణు, విశ్వపా, పరాత్పరుడు పరబ్రహ్మ తత్స్వరూపాభిన్న దశాద్యనేకవిష్ణ్వా వతారములు. సాధనములు లేవు. నిత్యముక్తుడు

2. కక్ష్య - ప్రకృతి - విశ్వా - శ్రీ , భూ, దుర్గా ఆంభృణీ - హ్రీ - మహాలక్ష్మి - దక్షిణా జయంతీ - జానకి - సత్యభామాద్యనే కావతారములు సాధనములు లేవు నిత్యముక్త

3 వ కక్ష్య (i)బ్రహ్మ, (ii) వాయు

అవతారములుపురుషనామకబ్రహ్మ, కాలనామక విరించి, సూక్ష్మ వాసుదేవ,. మహన్నామక అనిరుద్ధరూపబ్రహ్మ చతుర్ముఖ ( నాభికమల జాతుడు ) సాధనాకల్పములు - నూరు

వాయు - బ్రహ్మతో సమానమైనను పదవిలేదు గనుక కక్ష్యలో రెండవ వారు ( భావిబ్రహ్మ )

అవతారములు 1. ప్రాణ 2. సూత్ర 3. ధృతి 4. స్మృతి 5.మేధా 6. ముక్తి 7. విష్ణుభక్తి 8. చిత్తము 9. వాయు 10. బలము 11. స్థితి 12. ఋజు 13. యోగ 14. ప్రజ్ఞ 15. జ్ఞాన 16.మహాగురువు. 17. మహాధ్యాతా 18. విజ్ఞాత 19. వైరాగ్య

20. రోచన 21. సుఖ 22. హనుమంత 23. భీమసేన
24. మధ్వ శ్రీమదానందతీర్థ దశ ప్రమతి.

4వ కక్ష్య - బ్రహ్మాణి సరస్వతి (బ్రహ్మదేవుని భార్య ) భారతీ
( వాయుదేవుని భార్య )
సరస్వతియవతారములు - 1. హరిప్రీతి 2. సర్వవేదాత్మిక
3. భుజి 4. గాయత్రి 5. గురుభక్తి 6. శ్రద్ధా 7. ప్రీతి
8. సుఖాత్మికా
భారతి యవతారములు - 1. కాశీరాజపుత్రి 2. ద్రౌపది
3. శివకన్యకా 4. ఇంద్రసేన 5. చంద్రా
సాధనములు బ్రహ్మవాయులకున్నట్లే

5వ కక్ష్య - (i)గరుడ శేష (ii)రుద్రాదులు
(i)గరుడ శేష - 1. విష్ణువాయ్వావేశ సహిత " నర " నామకుడు
2. శుక్లకేశావేశయుత బలరాముడు 3. సంకర్షణావేశయుత లక్ష్మణుడు
భారతములోని భీమార్జునులు శేష గరుడాంశులు.
సాధన - 50 కల్పములు
రుద్రుడు - అవతారములు . 1. సదాశివుడు 2. తపోనామకుడు
13000 ఏండ్లు లవణాంబుధిలో తపస్సు జేసిన వాడు 3. అహంకార
తత్వాభిమాని 4. ఊర్ధ్వవట ఊర్ధ్వరేతుడు 5. అత్రిచే
ననసూయకు జనించిన దూర్వాసుడు 6. వాయ్వావేశుకుడు
7. అశ్వత్థామ 8. జైగిషవ్యుడు 9. వామదేవుడు10. సద్యోజాతుడు
11. అఘోరనామకుడు ( అఘోరా పాపకాశినీ )
12. తత్పురుషనామకుడు 13. ఔర్వుడు
సాధన - 40 కల్పములు.

6 వకక్ష్య - షణ్మహిషీ మణులు - జాంబవతీ, నీలా, భద్రా,
మిత్రవిందా, కాళిందీ, లక్షణా
సాధన - 50 కల్పములు.

7వ కక్ష్య - వారుణీ - శేషుని భార్య

సౌపర్ణీ - గరుడుని భార్య

పార్వతీ - రుద్రుని భార్య

సాధన - 50 కల్పములు.

8వ కక్ష్య - ఇంద్రుడు, మన్మథుడు.

9వ కక్ష్య - అహంకారనామక ప్రాణదేవుడు.

10వ కక్ష్య - మన్మథుని కొడుకైన అనిరుద్ధుడు రతీ, శచీ, బృహస్పతి

స్వాయంభువమనువు దక్షప్రజాపతి.

11వ కక్ష్య - ప్రవాహ వాయువు

12 వకక్ష్య - సూర్య,చంద్ర, యములు.

13వ కక్ష్య - వరుణుడు

14వ కక్ష్య - నారదుడు

15 వ కక్ష్య అగ్నిహోత్రుడు, భృగుప్రసూతి, ప్రహ్లాదుడు. (శంకుకర్ణ సత్యలోకతత్వము)

16వ కక్ష్య - మరీచి, అత్రి - అంగిరస్, పులహ, క్రతు, వశిష్ఠ, పులస్త్య,

విశ్వామిత్ర, వివస్వాన్, అను ఋషులు.

17వ కక్ష్య - మిత్రనామకసూర్యుడు, బృహస్పతి తార, నిఋతి, కుముద్వతి

18వ కక్ష్య - కుబేరుడు. విష్వక్సేనుడు, విఘ్నేశ్వరుడు, ఉక్తులు ఉక్తశేషులు

**ఉక్తులు** - 1. ముఖ్యప్రాణవాయుమూర్తి 2. అష్టవసువులలో

ప్రధానాగ్ని 3. ఏకాదశ రుద్రులలో భవనామకరుద్రుడు.

4. ద్వాదశాదిత్యులలో 12 వ ఉరుక్రముడు

5. ద్వాదశాదిత్యులలో 1 వ వివస్వత్

6. ద్వాదశాదిత్యులలో 10 వ మిత్ర

7. ద్వాదశాదిత్యులలో 9వ వరుణ

8. ద్వాదశాదిత్యులలో 11వ శక్ర

9. గంగాది కక్ష్యలో పర్జన్యుడు

10. మరుత్తులలో 48వ అహంకారవాయువు

11. మరుత్తులలో 11 వ ప్రవాహవాయువు

12. బృహస్పతి

13. ద్యావాపృథివియందు ద్యులోకాభిమాని భారతి

14. ముగ్గురు పితృవులలో " యమ"

15. ముగ్గురు పితృవులలో "సోమ "

ఉక్తశేషులు 85 మంది. అష్ట వసువులు, ఏకాదశరుద్రులు. ద్వాదశాది త్యులు, ఏకోనపంచాశన్మరుత్తులు, విశ్వేదేవతలు. ఇద్దరు అశ్వినీ దేవతలు. వీరిలోకొందరు. పితృవులలో కవ్యవాహనుడు. ద్యావాపృథివియందు పృథ్వి, ఋభుగణములు.

19వకక్ష్య - 1 దేవావరులు 2. కర్మజ దేవతలు

1. దేవావరులు - బ్రహ్మమానస పుత్రులగు సనకాదులు నలుగురిలో మన్మథాంశుడగు సనత్కుమారుడు తప్పతక్కిన 1. సనకుడు 2. సనందుడు3. సనత్సుజాతుడు.

2. కర్మజదేవతలు :- జయ విజయాది ద్వారపాలకులు 56 గురు చతుర్దశ మనువులలో 11గురు దైవత, చాక్షుష - స్వారోచిష - ఉత్తమ- సావర్ణి - బ్రహ్మసావర్ణి - రుద్ర సావర్ణి - దేవసావర్ణి - ఇంద్రసావర్ణి దక్షసావర్ణి - ధర్మసావర్ణి అనువారు చతుర్దశ ఇంద్రులలో 7 గురు. బలి, అద్భుత, శంభు విధృతి, ఋతధాను, దివస్పతి, శుచి అనువారు, పావకుడు- చ్యవనుడు - ఉపధ్యుడు - అను మునులు - కార్తవీర్యార్జున - శశిబిందు - పృథు - ప్రియవ్రత - మాంధాత - గయ - కుకుత్థ - దుష్యంత సుతుడగు భరతుడు అను మహారాజులు. సప్తపితృవులు, అష్టగంధర్వులు.

20వ కక్ష్య - రోహిణి - చంద్రుని భార్య

సంజ్ఞా - సూర్యుని భార్య

శ్యామల - యముని భార్య

గంగా - వరుణుని భార్య

పర్జన్య మేఘాభిమాని సూర్యుడు

అనిరుద్ధుని భార్య విరాట్ నామకురాలు

21వ కక్ష్య - అప్రసిద్ధ దేవతలు

22వ కక్ష్య - అగ్నిజాయా - స్వాహా

23వ కక్ష్య - ఉదకాభిమాని బుధుడు

24వ కక్ష్య - నామాభిమాని

25వ కక్ష్య - పృథివ్యభిమాని శనైశ్చరుడు

26వ కక్ష్య - కర్మాభిమానియగు పుష్కరుడు ఇతి అణుతారతమ్యే అథ, అథో చ - అపి - ఉత- పదానాం మధ్యోక్తాః దేవాః సమానాః

27వ కక్ష్య - అజానజదేవతలు

గంధర్వులు తుంబురుడు, నారదుడు చిత్రరథుడు, కిశోరనామక అక్రూరుడు, ధృతరాష్ట్రుడు, హూహూ, హాహా, విద్యాధర ఉగ్రసేన, విశ్వావసు, యుధామన్యు, పరావసు, చిత్రసేనుడు, వీరు పన్నెండుగురు కాక 88 మంది గంధర్వులు ;

ఊర్వశీ- మొదలగు అప్సరస్త్రీలు అథయేశతం, కర్మదేవానాం, ఆనందంస ఏకః అజానజ, దేవానాం, ఆనందయశ్చశ్రోత్రియో అవృజితో కామహత - ఇత్యాది వాజసనేయశ్రుత్యా "తే, యే, శతమజానజానాం ఆనందాః, స ఏకః - కర్మదేవానాం ఆనందః, స ఏకః - కర్మదేవానాం ఆనందః " అని తైత్తిరీయోప నిషత్తునందున్నది.

28వ కక్ష్య - సప్త పితృవులు తప్ప తక్కిన చిరపితృవులు.

త్రిభిః పితృగణస్య ( ఇతిప్రకాశ సంహితాయాం )

కల్పేషు త్రిషు బ్రహ్మేషు జన్మతః ఆత్మా, బ్రహ్మ పరోక్షంతు

పితరః చిరనామకాః ( ఇతితత్వ సారే )

29వ కక్ష్య - 19వ , 27వ, కక్ష్యలలోని, అష్టోత్తరశత గంధర్వులు కాని దేవగంధర్వులు, దేవతలచే ఆజ్ఞాపింపబడువారు.

30వ కక్ష్య - మనుష్య గంధర్వులు ( దేవతల వలన దేవగంధర్వుల ద్వారా ఆజ్ఞాపింపబడువారు)

31వ కక్ష్య - చక్రవర్తులు

32వ కక్ష్య - మనుష్యోత్తములు, పశుపక్ష్యాది జంగమ జీవులు, వృక్ష, లతాది స్థావర తృణజీవులు

అర్ధకల్పం తృణాంతానాం, యోగ్యాణాం, హరిదర్శనే
నియమోయం సర్వకల్పేషు, ఏవయేవ, నచాన్యథా కల్ప సంఖ్యా
బ్రహ్మ మానాత్, విజ్ఞేయంయోగ్యచేతనైః ప్రోక్తైః కల్పైః
విముచ్యంతే, తావత్కల్పైస్తు సాధనమ్ తత్పూర్వం, అపరోక్షస్య,
కర్తవ్యమితి నిశ్చయః

( ఇతి ప్రకాశ సంహితాయాం)

33వ కక్ష్య - సంకర జాతివారు.

34వ కక్ష్య - నీతి, జాతి, పజ్త బాహ్యులు.

35వ కక్ష్య - పశుపక్ష్యాదులు

36వ కక్ష్య - కీటకాదులు

37వ కక్ష్య - వృక్ష, గుల్మ, లతాది, తృణజీవులు

38వ కక్ష్య - నిత్య సంసారులు, స్వర్గ, భూ, నిరయప్రచురులు

39వ కక్ష్య - తమోయోగ్యులు

40వ కక్ష్య - మిథ్యా జ్ఞానులు.

41వ కక్ష్య - దైత్యులు

42వ కక్ష్య - కిర్మీరులు

43వ కక్ష్య - విప్రచిత్తులు

44వ కక్ష్య - అలక్ష్మి

ఇతి తారతమ్య సద్రత్నమాలాయాం హరికథా మృత సార, ప్రకాశ సంహితా, పదార్థ సంగ్రహ, అనువ్యాఖ్యా, తత్వసారాది గ్రంథోక్త విషయాని ఇతి శ్రీ అధరాపురపు పురుషోత్తమా చార్యులవారి శ్రీమత్తారతమ్య రత్నమాలా వివృతి సారమునందు వివరింపబడియున్నది.

ఇరువది నాలుగు తత్వములు, ముప్పది మూడుకోట్ల దేవతలు, ఎనుబదినాలుగు లక్షల జీవులగల, తారతమ్యముల జగత్తు నందు, సాధనామయ, దేవ, ఋషి, పితృ స్థావర, జంగములు, దేహధారులైయున్నారనుట ప్రత్యక్షప్రమాణమే కదా. భక్తి సాధన లేనిదే, కక్ష్యలన్నింటిని దాట నిదే జీవులు ముక్తిబడ యుదురనుటసత్యదూరము కదా. శ్రీమధ్వాచార్యుల వారు, తత్వప్రస్తార మును , నిత్యకర్మాను ష్ఠానమునకై సదాచారస్మృతి యనుగ్రంథమును, వేద, వేదాంగ, వేదశిఖలకు విస్తృత వ్యాఖ్యానములు వ్రాసి, భాష్యములు రచించి, ముప్పదియేడు గ్రంథముల మానవాళికి సన్మార్గము జూపి, జగద్గురు స్థానమున శోభించు చున్నారనుట అతిశయోక్తి కాదు. ప్రాక్పాశ్చాత్య పండితులు, అరవిందయోగి. రవీంద్రులు, మధ్వుని భక్తి మార్గమే - తత్వతారతమ్య సాలోక్య ముక్తి మార్గమే - శంకరుని, అద్వైత సారూప్య - సాయుజ్య వాదముకన్న అధునాతనము, అనుసరణీయము సులభగ్రాహ్యమని సెలవిచ్చియున్నారు.

"The revelation authentically interpreting Brahma Sutras is well answered from within the tradition of Madhwa and his school, starting from the sutra interpretation of great Acarya. Confronting with those of Sankara and Ramanuja, Madhwas often widely differing opinion is made clear, as to its motivation and augmentation. Advantageously, the broad back ground of interpretation at disposition of this learned savant in the field of DWAITA VEDANTA, includes the vast literature of sub commentaries eg., Bhamati and Kalpa Taru for the ADWAITA,

sudarsanas sutra Prakasika for the VISISTA ADWAITA and the works of Jayatheertha Vyasa Teertha, the followers of Madhwa school of thought , to mention just the most important ones, offering thus a large amount of material unexplored until today .. .......... and thus the Madhwa sampradaya have begun to gain the attention they deserve, only in more recent times

Gerhard Ober Hammer proffessor of indólogy (university of Vienna ) and NINIAN inian Smart university of Lancaster (England)in their preface to the Brahma sutras and their principal commentaries A critical expostition by Dr B.N.K. sarma, distinguished sanskrit scholar retired proffessor and head of department of sanskrit Ardha magadhi Ruparel College Bombay.

The famous Bala Gangdhar Tilak. in his introductory to Geeta Rahasya Quotes " Therefore we must say that the first attempt to deprive the Geeta of its energisitic form ( KARMA YOGA ) and to give it a renunciatory doctrinal form was made by Sankaracharya "

About 250 years after the coming into existance of sankara tradition, which maintained the theory of illusion ( Maya ) Non - dualism ( ADWAITA) and renunciation ( Sanyasa) Sri Ramanuja Acharya ( 1016 A.D) Founded the qualified monism ( VISISTA - ADWAITA )

" Although Ramanuja Acharya had effected change, by substituting qualified monoism for non - duality, and devotion for renunciation , his interpretation must also be looked upon , as in a way, in favour of renunciation of action " ( KARMA SANYASA )

"Although Ramanuja Acharya may have been right that the theory of non reality of illusion is wrong. and ultimately attains

release, only by devotion to Vasudeva and yet looking upon the parabrahma and the conscious ego ( JIVA) as one in one way, and different in other ways, is a contradiction in terms and an inconsistancy "

Therefore ,a third school of thought became necessay. The protogonist of this school was Sri Madhwa Acharya Sreemad Ananda Teertha ( 1218- 1317 A.D) has shown in his commentoar-ies on the prasthana Trayee, that all these sacred books are in favour of DUALITY. He says that although desireless action has been extolled in the Geeta, yet desireless action is only a means and devotion is the true and ultimate cult and that when once , one has become perfect by following the path of devotion , ............ the abandonment of fruit of action ( Karma phala Tyaga) and not abandonment of action ( Karma Tyaga) ధ్యానాత్ కర్మఫల త్యాగః ( గీత) is whether one there after ( పరిపక్వ భక్తిపొందిన పిదప ) performs or does not perform the action is not just the same.He suggests that devotion to Vasudeva, together with phala Tyaga sahita karma, or performance of duty is the doctrine of Madhwas DUALITY

" BALA GANGADHAR TILAK"

మధ్వసాంప్రదాయమున, మునిత్రయులనగా 1. శ్రీ మధ్వాచార్యులు 2. శ్రీజయతీర్థ ( టీకాచార్యులు వీరే )3. శ్రీ వ్యాస తీర్థులు (సోసలె వ్యాసరాయలు)

1. **మధ్వాచార్యులు** :- ఉత్తర కర్ణాటకలో ఉడిపివద్ద పాజక గ్రామమున మధ్యగేహాఖ్యుడను భూసురుని పుత్రులు. వాసుదేవులని జన్మ నామము. " పూర్ణ ప్రజ్ఞ " బిరుదాంకితులు. " ఆనందతీర్థులని " వీరియతినామము. వీరు వాయ్వంశజులగు హనుమ - భీమ - మధ్వావతారులని చిరంజీవ తత్వులని ప్రతీతి. నేటికిని ఊర్ధ్వ బదిరిలోనున్నారని మాధ్వుల నమ్మిక, వీరు స్థాపించిన సాంప్రదాయ మునకే మధ్వమతమనిపేరు . స్వతంత్రుడు సర్వోత్తముడు అగు దైవము పురుషుడే, విష్ణువు అతడే. విశ్వము అతనికి కళత్రక్షేత్రమైన మహాలక్ష్మి - ఇవియేయొక పూర్ణ యోగము

యొక్క రెండు తత్త్వములు. ఒకటి స్వతంత్రుడు. మరొకటి అస్వతంత్రయగు పరా - ముక్తా రమా . శ్రీ యనువిశ్వవిభూతి. సమస్తదైవీశక్తుల కీమెయే తల్లి వీరందరు అస్వతంత్రలే. బ్రహ్మసత్యము తదర్ధ భాగమైన ( హృదయస్థయైన )

జగమూ సత్యమే - జీవులునిత్యులు

భగవదను చరులు - స్వస్వరూపానందమున

భగవత్సన్నిధిని సేవించుచుండుటే, సహజమగుముక్తి. దీనికి భక్తియే సాధనము. వేరే సాధనలులేవు. ఉన్ననూ భక్తి గనేపరిగణించవలెను. ప్రత్యక్ష - ఆగమ - అనుమానమను ప్రమాణ త్రయములు నిదర్శనములు.వేదములు మాత్రమే భగవంతుని గురించి తెలియజెప్పును. అన్యశాస్త్రములు జెప్పనేరవు. అని సిద్ధాంతీకరించి, భక్తికే పెద్దపీటవేసిన భాష్యకారులు. భాష్యకారులలో వీరే చివరివారు. వీరితరువాత భాష్యకారులులేరు. వాదములకు సమాప్తి అని ముద్రవేసి తీర్పు జెప్పినవారు. సాక్షాత్‌భగవంతుడైన శ్రీవేదవ్యాసుల వారిసూత్రములకు ఏమాత్రము భిన్నముగాని రీతి వక్ష్యామి శక్తతః అనకుండ వ్యాసముఖోక్తరీతి, వక్ష్యామి లేశతః అని వినమ్రభక్తి ప్రకటించినవారు. శ్రీమన్మహావిష్ణువు త్రేతాయుగమున శ్రీ రామునిగా చిరంజీవి హనుమంతుల వారిని, ద్వాపరముగమున శ్రీకృష్ణునిగా, చిరంజీవి భీమసేనుల వారిని, తన కార్యప్రచురమునకు వినియోగించుకొన్నారు. ఈ రెండు అవతారములు ఆహవ పరాక్రమ పూరిత వీరావతారములే. అందులకే జ్ఞాన ప్రచారావతారమైన శ్రీకృష్ణద్వైపాయన విష్ణుభగవానునకు ఆనవాయితిగా నవవ్యాకరణ పండితుడు - గానకళానిధియగు - మారుతాత్మజ తత్త్వము శ్రీమన్మధ్వాచార్యులుగా అవతరింపవలసివచ్చినది. అందులకే భగవత్సేవను ఏయుగమునందైననూ క్షణకాలమెడబాయని చిరంజీవి వాయుసుతుడవతరించుట. అందులకే వీరి వ్యాఖ్యసర్వోత్తమము. హృదయంగమము. సులభసాధ్యము. ఋగ్భాష్యములు, అణువ్యాఖ్యానము. అనువ్యాఖ్యానము, శ్రీ మధ్భారత, శ్రీమద్భాగవత తాత్పర్యనిర్ణయము. గీతాభాష్యము మొదలగు 37 ప్రసిద్ధ గ్రంథములు రచించి జీవులకు భక్తి బోధచే ముక్తిమార్గము చూపినవారు. ఉదయమునుండి సాయంత్రం సాయాదిప్రాతకాంత సంతతము (అహరహము) భక్తి మార్గమువిడక ప్రపంచమును నిందింపక , లౌకిక వృత్తుల కనుగుణముగా సాధన

క్రమములను జూపు " సదాచారుస్మృతి " యను దైనందిన కర్తవ్యబోధక గ్రంథమును ఫలాపేక్ష రహిత కర్మమార్గమున, భక్తి సుధతో జనులకు బంచినారు.

**2. శ్రీజయతీర్థులు** - ఇంద్రాంశచే జన్మించినవారు. ధోండోపంతు జన్మనామము మలఖేడు సంస్థానాధీశులు పూర్వ జన్మమున " అనడ్వాహ (ఎద్దు) రూపమున " శ్రీమన్మ ధ్వాచార్యుల వ్యాఖ్యాన పాఠములను వినుచు నెమరువేయుచుండెడి వారట. మధ్వాచార్యులు ప్రత్యక్ష శిష్యులగు అక్షోభ్యతీర్థులవారు తమ యనంతరపు శిష్యునికై వెదకునపుడు పూర్వజన్మవాసనవిడక గుర్రమునుదిగకనే, నదిలో మూతితో జలప్రాశనముచేయు చుండ కిం పశో ! అని సంబోధించి కర్తవ్యస్ఫురణను జేసి యత్యాశ్రమమొసంగిరట. అప్పటి నుండియే అనగా నూత్నవధూవమాగమ ముహూర్తప్రయాణ సమయముననే సన్యసించి లోకోపకారార్థమై స్వీయ రాజ్యరమను, గృహలక్ష్మిని త్యజించిన లోకోత్తర మహిమాన్వితులు శ్రీమధ్వాచార్యులవారి గ్రంథములకు విస్తృత వ్యాఖ్యలు, టీకలు వ్రాసి ద్వైత శాస్త్రమును దశదిశల శోభింప జేసినందువలన వీరికి టీకాచార్యులని బిరుదువచ్చినది. అను వ్యాఖ్యలకు శ్రీమన్ న్యాయసుధా అను బృహత్ వ్యాఖ్యానగ్రంథము వీరిదే. " సుధా పఠనం వా వసుధాపాలనంవా" "చేస్తేసుధాగ్రంథపాఠమైనా చేయాలి. లేదా రాజ్యమైనా పరిపాలించాలి " అని సుధాకావ్య పఠన ఫలశ్రుతి, మహాత్మ్యము ఘోషింప బడినది.

**3. శ్రీ వ్యాసతీర్థులు**- సోసలె పీఠాధిపతులు. ముళుబాగలు శ్రీమదక్షోభ్య మఠాధిపతులు శ్రీ శ్రీపాదరాజవారి ప్రియశిష్యులు. శైశవదశనుండియే స్వామివారి పరి రక్షణలో అపారమైన బ్రహ్మవిద్యను కూలంకషంగా, అనాయాసంగా అభ్యసించినవారు. " శ్రీమన్ న్యాయసు ధాగ్రంథమునకు " చంద్రికా అను వ్యాఖ్యానము వ్రాయుటచే వీరికి చంద్రికాచార్యులని బిరుదు. వీరి అసమాన వాగ్వైఖరి, తర్కచాతురి సమయస్ఫూర్తి వీరికి " ప్రత్యర్థిగజకేసరి "అను బిరుదును ప్రసాదించినది. వీరు శ్రీకృష్ణదేవరాయల వారికి కులగురువు. రాయలవారు కుహువ్యాధితో బాధపడుచున్నప్పుడు నిత్యతీర్థ జలప్రోక్షణచే వారి రుజను నివారించిరి. ఆ కాలమున వారు రాజ్యపీఠమలంకరించి పరిపాలించిరి. పన్నెండేండ్లు తిరుమలలో శ్రీ వేంకటేశుని నిత్య పూజలతో

సేవించిరి. దైవమాయాయోగము వీరికి సిద్ధింపజేసి అమూల్యసేవలను చేయించుకొన్నది. వీరు పూర్వజన్మమున శంకుకర్ణసత్యులని, ప్రహ్లాదావతారులని తదుపరి. శ్రీరాఘవేంద్రస్వాములుగా నవతిరించిరని మాధ్వులు ఋజువులను చూపించుచున్నారు.

శంకు కర్ణాఖ్య దేవస్తు బ్రహ్మశాపాశ్చ భూతలే
ప్రహ్లాద ఇతి విఖ్యాతో భూభారక్షపణేరతః

ప్రహ్లాద రాజః ప్రథమో వ్యాసరాజః సఏవచ
స ఏవరాఘవేంద్రాఖ్యః యతిరూపే కలియుగే (నృసింహపురాణే)

దేవాః శాపబలాదేవ ప్రహ్లాదాచిత్వమాగతాః (బ్రహ్మవైవర్తే)
దేవా శాపాఖి భూతాత్వాత్ ప్రహ్లాదాద్యా బభూవిరే (అధ్యాత్మగ్రంథే)

ప్రహ్లాదోఽపి మహాభాగః కర్మదేవ సమః స్మృతః (గారుడం బ్రహ్మకాండే)
ఋతేతు తాత్వికాన్ దేవాన్ నారదాదీంస్త థైవచ
ప్రహ్లాదా దుత్తమః కోను, విష్ణు భక్తి, జగత్రయే ॥ (స్కాందే)

వాయ్వా వేశాచ్చ ప్రహ్లాదో నారాదాదుపరిస్మృతః (బ్రహ్మకాండే)
హిరణ్యకశిపోః పుత్తః ప్రహ్లాదో భగవత్ప్రియః
వాయు నాచసమా విష్టో మహాబల సమన్వితః
( శ్రీమన్మహా భారత తాత్పర్య నిర్ణయే)
భవంతి పురుషాః లోకే మద్భక్తా స్త్వామనువ్రతాః
భవాన్ మేఖలు భక్తానాంసర్వేషాం ప్రతిరూపధృక్
అని భాగవతం సప్తమస్కంధం 10అధ్యాయం ౭౭శ్లోకంలో నృసింహనామ వరం

ఈ ముగ్గురు మహానుభావులనే " మన్త్రయులని " ద్వైతానుయాయులు పరిగణింతురు.

మధ్వాచార్యుల తరువాత వారిపీఠపరంపర మూడు ప్రఖ్యాతవర్గములుగా విస్తరించినది.

## పరమాత్మనుండి నేటివరకు గల ద్వైతాచార్య పరంపర

1. శ్రీహంస నామక పరమాత్మ ( శ్రీవిష్ణువు )
2. శ్రీ చతుర్ముఖ బ్రహ్మ (చదుర్ముఖ)
3. శ్రీ సనకతీర్థులు
4. శ్రీ సనందులు
5. శ్రీ సనత్కుమారులు
6. శ్రీ సనాతనులు
7. శ్రీ దూర్వాసులు
8. శ్రీ జ్ఞానవిధులు
9. శ్రీ గరుడ వాహనులు
10. శ్రీ కైవల్యులు
11. శ్రీ జ్ఞానేశులు
12. శ్రీ పరతీర్థులు
13. శ్రీ సత్యప్రజ్ఞతీర్థులు
14. శ్రీ ప్రాజ్ఞతీర్థులు

......... 400 ఏండ్ల పరంపర లభించలేదు

15. శ్రీ అచ్యుత ప్రేక్షాచార్యులు పురుషోత్తను తీర్థులు
16. శ్రీ ఆనంద తీర్థులు శ్రీమన్మధ్వాచార్యులు
17. శ్రీ పద్మనాభతీర్థులు
18. శ్రీ నరహరి తీర్థులు
19. శ్రీ మాదవ తీర్థులు
20. శ్రీ అక్షోభ్యతీర్థులు

(17–20) శ్రీమన్మధ్వాచార్యుల వారి ప్రత్యక్ష శిష్యులు. వారి తరువాత వరుసగా పీఠమలంకరించిన వారు.

శ్రీమన్మధ్వాచార్యుల వారి శిష్య పరంపర (అష్టమఠములు వేరే)

(శ్రీమదానంద తీర్థులు) శ్రీమన్మధ్వాచార్యులు 1218-1317

ప్రత్యక్ష శిష్యులు (నలుగురు)

| | | | |
|---|---|---|---|
| 1. పద్మనాభ | 2. నరహరి | 3. మాధవ | 4. అక్షోభ్య - 1365 |
| 1324 | 1333 | 1350 | 5. జయతీర్థ |
| శ్రీపాదమఠం | | మజ్జిగేనహళ్ళి | టీకాచార్యులు |
| | | | 6. విద్యాధిరాజ1402 |

| | | |
|---|---|---|
| 7. రాజేంద్ర 1440 | | 7. కవీంద్ర 1412 |
| శ్రీవాసరాయపీఠం | | 8. వాగీశ 1420 |
| సోసలె | | 9. రామచంద్ర1430 |
| 8. జయధ్వజ 1448 | రాఘవేంద్రపీఠం | ఉత్తరాదిపీఠం |
| 9. పురుషోత్తమ 1460 | 10. విబుధేంద్ర 1470 | 10. విద్యానిధి1444 |
| 10. బ్రహ్మణ్య 1476 | 11. జితామిత్ర 1475 | 11. రఘునాథ 1502 |
| 11. వ్యాసతీర్థ | 12. రఘునందన 1504 | 12.రఘువీర్య1557 |
| 12. శ్రీనివాస | 13. సురేంద్ర 1539 | 13. రఘూత్తమ1596 |
| 13. రామ | 14. విజయీంద్ర 1595 | 14.వేదవ్యాస 1619 |
| 14. లక్ష్మీకాంత | 15. సుధీంద్ర 1623 | 15. విద్యాధీశ 1631 |
| 15. శ్రీపతి | మంత్రాలయ పీఠం | 16.వేదనిధి 1636 |
| 16. రామచంద్ర 1635 | 16. శ్రీమద్రాఘవేంద్ర | 17.సత్యవ్రత1638 |
| 17. లక్ష్మీవల్లభ | స్వాములు 1671 | (సత్యప్రజ్ఞ) + |
| 18. లక్ష్మీనాథ 1663 | (యాదవేంద్ర) + | 18. సత్యనిధి1648 |
| 19. లక్ష్మీపతి 1690 | 17. యోగీంద్ర 1679 | 19.సత్యనాథ1674 |
| 20. లక్ష్మీనారాయణ 1700 | 18. సూరీంద్ర 1692 | (సత్యనంద) + |
| 21. రఘునాథ 1709 | 19. సుమతీంద్ర 1725 | 20.సత్యాభినవ1706 |
| (లక్ష్మీనిధి) + | 20. ఉపేంద్ర 1728 | సత్యాధీశ+1681 |

| | | |
|---|---|---|
| సోసలె | మంత్రాలయ | శ్రీమదుత్తరాదిపీఠం |
| వ్యాసరాయ పీఠం | శ్రీరాఘవేంద్రపీఠం | |
| 22. జగన్నాథ 1760 | 21.వాదీంద్ర1743 | 21.సత్యపూర్ణ 1726 |
| 23. శ్రీనాథ | 22.వసుధేంద్ర1761 | 22. సత్యవిజయ 1737 |
| 24. విద్యానాథ 1787 | 23.వరదేంద్ర1774 | 23. సత్యప్రియ 1744 |
| 25. విద్యాపతి 1798 | (ధీరేంద్ర)+ | 24. సత్యబోధ 1783 |
| 26. విద్యావల్లభ 1809 | 24. భువనేంద్ర1799 | 25. సత్యసంధ 1794 |
| 27. విద్యాకాన్త 1827 | 25. సుబోధేంద్ర1835 | 26. సత్యవీర 1797 |
| 28. విద్యానిధి 1845 | 26.సుజనేంద్ర 1836 | 27. సత్యధర్మ 1830 |
| 29. విద్యాశ్రీసింధు1863 | 27.సుజ్ఞానేంద్ర1861 | 28. సత్యసంకల్ప1841 |
| 30. విద్యాపూర్ణ | 28.సుధర్మేంద్ర1872 | 29. సత్యసంతుష్ట 1842 |
| 31. విద్యాధర 1884 | 29.సుగుణేంద్ర1884 | 30. సత్యపరాయణ1863 |
| 32. విద్యానివాస 1890 | 30.సుప్రజ్ఞేంద్ర1903 | 31. సత్యకామ 1870 |
| 33. విద్యాసముద్ర 1906 | 31.సుకృతీంద్ర1912 | 32. సత్యేష్ట 1872 |
| 34. విద్యారత్నాకర1915 | 32.సుశీలేంద్ర 1926 | 33. సత్యపరాక్రమ1880 |
| 35. విద్యావారిధి 1940 | 33. సువ్రతీంద్ర1933 | 34. సత్యవీర1884 |
| 36. విద్యాప్రసన్న 1969 | 34. సుయమీంద్ర1967 | 35. సత్యధీర1907 |
| 37. శ్రీవిద్యాపయోనిధి | 35. సుజయీంద్ర1986 | 36. సత్యజ్ఞాన 1913 |
| ప్రస్తుత సోసలె | 36. శ్రీ సుశమీంద్ర | 37. సత్యధ్యాన 1942 |
| శ్రీవ్యాసరాయపీఠా ధిపతులు. | మంత్రాలయ | 38. సత్యప్రాజ్ఞ 1945 |
| | శ్రీరాఘవేంద్ర ప్రస్తుత | 39. సత్యాభిజ్ఞ 1948 |
| | పీఠాధిపతులు. | 40. శ్రీసత్యప్రమోద |
| | | ప్రస్తుత ఉత్తరాది |
| | | పీఠాధిపతులు |

పీఠాధిపతుల ప్రక్కన వేసిన సంవత్సరములు కొన్నిచోట్ల నిర్ణీతములు కావు

+ గుర్తుగల స్వాములు పీఠాధిపతులు కారు. ఇవి ముఖ్యమైన మూడు పీఠముల

పరంపర గ్రంథవిస్తర భీతిచే తదితర 37 పీఠస్థులైన స్వాములు వారి పట్టిక వ్రాయలేదు

అష్టమఠములందు

1. పలిమారు 28 గురు ప్రస్తుతం శ్రీ విద్యామాన్యతీర్థులు

2. అదమారు 30 ప్రస్తుతం శ్రీ విబుధేశతీర్థులు

శ్రీ విశ్వప్రియతీర్థులు (భావి)

3. కృష్ణాపూరు 35 ప్రస్తుతం శ్రీ విద్యాసాగర తీర్థులు

4. పుత్తిగె 29 ప్రస్తుతం శ్రీసుగుణేంద్ర తీర్థులు

5. సిరూరు 30 ప్రస్తుతం శ్రీ లక్ష్మీవర తీర్థులు

6. సోదె 35 ప్రస్తుతం శ్రీ విశ్వోత్తమతీర్థులు

7. కాణూరు 29 ప్రస్తుతం శ్రీ విద్యావారిధి తీర్థులు

8. పేజావర 31 ప్రస్తుతం శ్రీ విశ్వేశతీర్థులు

శ్రీవిశ్వవిజయతీర్థులు (భావి)

ఇతరమఠాలు :- భండారు కేరి - ప్రస్తుతం శ్రీ విద్యామాన్యతీర్థులు పలిమారు పీఠాధిపతులు గూడా (మధ్వాచార్యుల గురువు అచ్యుత ప్రాజ్ఞ పూర్ణ ప్రజ్ఞ పరంపర)

శ్రీపద్మనాభ తీర్థుల పరంపర ( శ్రీ పాదరాజపీఠం ముళుబాగలు)

మధ్వాచార్యుల ప్రత్యక్ష శిష్యులు ప్రస్తుతం శ్రీవిజయనిధి తీర్థులు

మాధవ తీర్థ పరంపర మజ్జినేన హళ్లి పీఠం. ప్రస్తుతం శ్రీ సత్యమాధవ తీర్థులు

అక్షోభ్య పరంపర - ప్రస్తుతం శ్రీ రఘుదాంత తీర్థులు

వీరుగాక తుళువ శిష్యులు గోకర్ణ, సుబ్రహ్మణ్య - కాశి బాళెగారు అక్షోభ్య, మాధ్వగౌడీయ (చైతన్య) బెంగాలు చిత్రాపూరు, భీమన కట్టె, కూడ్లి. పీఠ పరంపరల పెక్కు ద్వైత సాంప్రదాయ యతి వర్యులు మధ్వ శాస్త్ర ప్రచారము గావించు చున్నారు. ఆంధ్ర, కర్ణాట, మహారాష్ట్ర తమిళనాడు, యుత్కళవంగ ప్రదేశములందు ద్వైతతత్వ భక్తి ప్రబోధముచే విష్ణు సర్వోత్తమత్వమును బోధించు స్వాములు భారతావనిని పరమ పవిత్ర క్షేత్రమొన రించు చున్నారు.

ద్వైత మత వ్యాప్తి మిక్కుటముగా జెంది ఉడిపి అష్టమఠములు - గోకర్ణ, భీమన కట్టె భండారుకేరి పేజావర కాణూరు పుత్తిగె, సుబ్రహ్మణ్య. ఇత్యాది 37 మధ్వాచార్య

పీఠములు వెలసినవి.

ఉత్తరాది మఠం సోసలె వ్యాసరాయల మఠం, రాఘవేంద్రస్వాములవారి మఠములు పెక్కు శిష్యులతో, మందిర. క్షేత్ర, జడ - జంతు జీవ- మానవ పరివారములతో శ్రీహరికి నిత్యసేవజరిపించి జనులకు మార్గదర్శకులుగానున్నారు. శ్రీ సత్యాభిజ్ఞులు శ్రీ రఘూత్తమ తీర్థులు, శ్రీ సత్యజ్ఞాన శ్రీ సత్యధ్యాన తీర్థులు ప్రస్తుతము శ్రీ సత్యప్రమోద తీర్థులవారు ఉత్తరాది పీఠమున మిక్కిలి జ్ఞాన వైరాగ్య భక్తి సంపదలతో ప్రఖ్యాతి గన్నారు. వీరిభక్త కోటి తండోపతండములుగా నున్నది.

శ్రీ సోసలె వ్యాసరాయపీఠములో

" శ్రీ వ్యాసరాజతీర్థులు గురించి ఇంతకుముందే చెప్పబడినది. వీరితరువాత మిక్కిలి ప్రఖ్యాతి గన్నవారు శ్రీ రఘునాథతీర్థులు ( శేష చంద్రికాచార్యులు ) శ్రీ జగన్నాథతీర్థులు ( భాష్యదీపికాచార్యులు ) శ్రీ విద్యావారిధి తీర్థులు, శ్రీవిద్యాప్రసన్నతీర్థులు పరమగురు, గురువుల శిష్యులైన శ్రీ విద్యాపయోనిధి తీర్థులవారు ప్రస్తుత శ్రీవాసరాయపీఠము (సోసలె)నలంకరించి మిక్కిలి విద్వద్యశోసంపద్వ్యాప్తిచే శిష్యుల నను గ్రహించుచున్నారు.

శ్రీవిబుధేంద్రతీర్థుల వారినుండి ప్రత్యేకమైన శాఖ తిరునల్వేలి, శివపుర హంపి, మధురలోనుండి శ్రీరాఘవేంద్రస్వాముల పరమగురువులగు శ్రీ విజయీంద్ర స్వాములవారిచే కుంభకోణమున వెలసినది. వీరు అరువది నాలుగు విద్యలలో నిష్ణాతులు. శ్రీ అప్పయ్య దీక్షితుల వారిని అరువది నాలుగు విద్యా వాదనలో గెలిచినవారు మహామనీషులు. వీరితరువాత శ్రీ సుధీంద్ర స్వాములవారు శ్రీ రాఘవేంద్రస్వాముల వారిగురువులు కుంభకోణమున ప్రఖ్యాతి గన్నవారు హంపి విజ.యనగర సామ్రాజ్యములోని భువనగిరిలో శ్రీ కృష్ణ దేవరాయలవారి ఆస్థానవిద్వాంసులగు వీణ కృష్ణభట్టు కుమారులు వీణ తిమ్మనభట్టునకు పుత్రులైన వేంకన భట్టుగారే శ్రీ రాఘవేంద్ర స్వాములవారు. వీరు కుంభకోణము వదలి సంచారమున, బొంబాయి పూనా, బిజాపురం మీదుగా ఆదవాని దగ్గర మంచాలె అను క్షేత్రమును ఆదవాని నవాబు సిద్దిక్‌మసూద్ వద్ద అగ్రహారముగా స్వీకరించి క్షేత్రపాలిక యగు మంచాలమ్మ దేవత యనుజ్ఞచే " మంత్రాలయ" అను దివ్యక్షేత్రమున బృందావనస్థులై 320 సంవత్సరములైనది. ఇంకనూ 380 యేండ్లు బృందావనమున విరాజిల్లుచు ద్వైత భక్తి

మార్గమున భక్తులకు మోక్షమార్గమును జూపుచుండగలరు. కల్పవృక్షమని కామధేనువని, భక్తచింతామణియని భక్తులంచే కీర్తింపబడుచున్నారు. వీరి అపారమహిమ జగద్విదితము. మూలమధ్వ పీఠముల వారు, భక్తులనేకులు. వీరిబృందావన మందిరములను, ఢిల్లీ బొంబాయి. మదరాసు ఇది అదియననేల పెక్కునగరములలో వెలయించి నిత్యపూజలచేసమర్పించి జగద్గురు శ్రీ మన్మధ్వాచార్యుల వారి ద్వైత తత్వవాద భక్తిమార్గమును, సులభసూత్రముగ జనులకు అందించుచున్నారు.

మధ్వాచార్యుల ద్వైత సంస్థకు యెనలేనికీర్తి, జ్ఞాన భక్తి వైరాగ్యసంపదలు గురిపించిన ప్రాతః స్మరణీయులు, నిత్యసంస్తవనీయులు, శ్రీ జయతీర్థ (టీకాచార్యులు) శ్రీవ్యాసతీర్థ శ్రీరఘూత్తమతీర్థ శ్రీవిజయీంద్రతీర్థ శ్రీరాఘవేంద్రస్వాములు మనదదేశమాత ప్రసాదించిన మహామనీషా పుత్రరత్నములని చెప్పక తప్పదు. సత్యలోకమున శంకుకర్ణయను నిత్యతత్వము, ప్రహ్లాద బాహ్లీకవ్యాసతీర్థ శ్రీరాఘవేంద్రస్వాములుగా నవతరించి నారనిప్రతీతి " భవంతిపూరుషాః లోకే మద్భక్తాః స్త్వామనువ్రతాః అని భాగవతప్రమాణము మందేచెప్పబడినది. మంత్రాలయ స్వాముల పరంపరలో శ్రీ రాఘవేంద్రస్వాముల కీర్తిని యిబ్బడి ముబ్బడిగా పది దిక్కుల విస్తరింప జేసిన శ్రీ సుజయీంద్రతీర్థులవారు నిత్యసంస్మరణీయులు ఎడతెరపిలేని యాత్రికులకు నిత్యాన్నదాన వసతులు మెరుగు పరచిన మహనీయులు .

ప్రస్తుతము ఉత్తరాది పీఠమున శ్రీసత్యప్రమోదతీర్థులు, సోసలె వ్యాసరాయపీఠమున శ్రీ విద్యాపయోనిధి తీర్థులు, మంత్రాలయ రాఘవేంద్రస్వాములపీఠమున శ్రీ సుశమీంద్ర తీర్థులు విరాజిల్లుచున్నారు.

పేజావరు మఠాధిపతులగు శ్రీ విశ్వేశతీర్థులు,

ప్రస్తుత కాలము వారికి హృదయమునకు హత్తునట్లుగా శ్రీ పూర్ణప్రజ్ఞమహా విద్యాలయమును ( UNIVERSITY OF MADHWA PHILOSOPHY) బెంగళూరులో నెలకొలిపి మహావిద్వాంసులను ఆచార్యులను భక్త శిఖామణులను తయారుచేయుచున్నారు. ఆసేతు శీతాచల ప్రదేశంతమంతయు నిండిన వీరి జ్ఞాన భక్తి విద్యాప్రావీణ్యతా వ్యాప్తి నిష్కస్వర్ణాక్షరముల లిఖింపదగినది. ఈ మహాను భావులందరిని నిత్య సంస్మరణజేసిన మాత్రముననే జ్ఞాన భక్తి వైరాగ్యములు లభించును. వీరి

విద్యాగురువులు భండారు కేరి స్వాములు శ్రీ విద్యామాన్య తీర్థులు వారిగురువులు శ్రీసత్యధ్యానతీర్థులు ఈ దృశ్జ్ఞాన భక్తి వైరాగ్యములను దైనందిన చర్యలలో తెలుపు ద్వైతమార్గ ప్రకాశమే యీ కావ్యమునకు హేతువు

ప్రథమాశ్వాసమున, దీని ప్రాశస్త్యముచెప్పబడును. ద్వితీయాశ్వాసమున శ్రీమద్వేంకటేశ వ్యంగ్యవైభవమను చతురోక్తులతో శ్రీ తిరుమల తిరుపతివేంకటేశుని సంబోధించి శతకశైలిలో ద్వైత శాస్త్రప్రస్తావన, ప్రాచుర్యము ఆవశ్యకత, నిర్దుష్ట త, నిరూపించుటకు ప్రయత్నింపబడినది. లౌకిక విషయములు అధునాతన వాదములుతడవబడినవి.

శ్రీమన్మహా విష్ణువు దశాద్యనేకావతారముల వివిధ సత్యరూపముల, లీలా మానుషవేషముల స్వీయప్రభలను వెలయించి, " యదాయదాహి ధర్మస్య గ్లానిర్భవతి భారత, అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజామ్యహం "అను శపథాను సారము. తదాతదా కృత, త్రేత, ద్వాపర యుగముల నాల్గు పాదముల ధర్మమును నడిపించుచు ప్రస్తుత కలియుగమున " కలౌ, వేంకట నాయకః, అనియు " కలౌ నామ సంకీర్తనం అనియు నిరంతర హరి నామస్మరణమే శతకోటి యజ్ఞయాగాదుల ఫలమని, కర్మయోగఫలసారమని, దివ్యభక్తి సాధనమే పరమోత్తమ ముక్తి మార్గమని నిత్యకల్యాణము పచ్చతోరణముగా ప్రపంచమునందలి దివ్యక్షేత్రములన్నింటికి తలమానికముగా, " కలియుగ వైకుంఠము గా వెలసిన శ్రీ మత్తి రుమలేశ, శ్రీ శ్రీనివాస, శ్రీ పద్మావతీశ, శ్రీ వేంకటేశ, శ్రీ బాలాజీ, తిరుపతి వేంకన్న, కొండలరాయడు మలని యప్పన్. తిరుమల దొరె (LORD OF SEVEN HILLS ) అను దివ్యనామముల సర్వమతముల వారిని, ఆబాలవృద్ధులను నరనారీజన సందోహమును, ధనిక - దీన దేశ - విదేశ జనుల, వేలు, లక్షలు, కోట్లకు పైగా, నిత్యము తనదరికి రప్పించుకొనుచు. భక్తి జ్ఞాన వైరాగ్యములు ప్రసాదించుచు శ్రీ వైష్ణవ మహిమా పూర్ణప్రబోధమూర్తిగా వెలుగుచున్నాడు. కలియుగమున భక్తి యొకొటియే ధర్మ పాదము. ఆ ప్రభువును మ్రొక్కుచు, చిక్కుప్రశ్నలు వేయుచు వ్యాజస్తుతి శతకరూపమున గొలుచుటే ద్వితీయాశ్వాసము

వేదవేదాంత, తర్కమీమాంసాది తర్కప్రామాణ నిరూపణాదులచే భక్తియే

పరమోత్కృష్ట సాధనమని భగవత్సమక్షమున, మొఱవెట్టుకొనుటే యీ శతకప్రక్రియ. వ్యంగ్యమర్యాదచే వ్యాజస్తుతిచే చిత్తము హత్తునట్లుగా జెప్పుటే యీ యాశ్వాసో సోద్దేశము " ముక్కన్య ముక్కార్థ " మనుటకంటె కోరుకుడు బడని న్యాయతర్కసూత్రముల తర్జన భర్జనల కంటె, నోరు దిరుగని జటిల పదబంధములకంటె, తేలికగా, హృదయంగమముగా, జానపదులకు అమాయక భక్తులకు బోధించుట శతక వాఙ్మయకారుల కాచారమై యున్నది. అమాయక మనిపించు చమత్కార ప్రశ్నలతో, సన్నిహితత్వంతో, జంకులేని రీతి దైవమును సంభాషణలలోనికి, లాగుటయే వ్యంగ్యవాగ్గర్భ మహిమ, చనువుచే సన్నిహిత మగు భక్తి,

వచన కవితా పితామహుడైన అన్నమాచార్యుల, మరియు వారి సమకాలీనులని జెప్పబడు పురందర దాసుల మరియు త్యాగరాజు, రామదాసు కనక దాసు, విజయ విఠల దాసు మొదలగు దాస సాహిత్యముల నలరారు రాగ భావ తాళ రూపరసప్రక్రియా విష్కారములైన సంగీత సాహిత్యవాగ్గేయ కారకుల బోధనల నిమిడ్చి భగవంతుని ప్రశ్నించి సమాధానములు బడసి సుషుప్తితో స్వప్నాను భూతిజెందుట యీ ఆశ్వాసమున నడచినశైలి. దాక్షిణాత్య శైలీ మనోహరములై, భక్తిపుంజ నికుంజములై, పరిమళ భరితపుష్ప దామములై చంపక, పున్నాగ దవన మరువ తులసీ దళ సమర్పనములై నిత్యసేవలను గొల్చు వాక్కుసుమములే యీ సీసపద్యముక్తకములు. ప్రహేళికల నిపించు చతురోక్తులు తృతీయాశ్వాసము, త్రివిక్రమ వామనుని పాదములు, భూ, నభో పాతాళముల నాక్రమించి విక్రయించునట్లు, త్రిపద ఛందస్సున దాదాపు 650 లకుపైగా ముక్తకములతో అలతి అలతిపదములతో సాగినది. వామనమూర్తియయ్యును ముల్లోకముల మూడు పాదముల నాక్రమించు విష్ణుసర్వోత్తముని త్రివిక్రమమును, మూడు పాదముల త్రిపద ఛందస్సుతో వర్ణించుట దైవీప్రేరణ. మదల్పశక్తిచేగాదు.

ఆంధ్రవాఙ్మయమున త్రిపద ప్రక్రియ నెవ్వరూ ప్రయోగించినట్లగ పడదు.సర్వజ్ఞుడను జంగమ శివయోగియే కన్నడ వాఙ్మయములోదీనిని ప్రవేశింప జేసెనన వచ్చును. కన్నడ భాషలో షట్పది. - కంద, రగడడ, ఉత్కళికలను తరువోజ, మధ్యాక్కరలవలె దేశి ఛందస్సును గ్రహించిన ఉభయ భాషా ప్రాజ్ఞులైన, పాల్కురికి సోమనాథుడు, ఉడుసోమనాథుడు చామరసుడు త్రిపదుల నెందులకోతెనుగున బ్రయోగింపలేదు. సర్వజ్ఞుని వచనములకే త్రిపదులను పేరు. పది మాత్రలకు యతితో

మాత్రల మొదటి పాదమును, యతి పాటింపక పదునేడు లేక పదునెనిమిది మాత్రలతో రెండవ పాదమును. పదుమూడు మాత్రలతో మూడవ పాదమును కుదించినాడు: ప్రాసనియమము - ప్రాసయతి పాటించినాడు. గచ్చుచ్చెరిలో వచనము వలె నాళువుగా నుడివికొనుచు జంగమ శివయోగియై దేశాటనము గావించినాడు. సొగసైన ప్రాసతో అలంకారములతో, సామెతలతో, లోకానుభవసూక్తులను బసవేశ్వర, బసవణ్ణ, వీరబసవంత అక్కమహాదేవి - నిజగుణ కవుల వలె శివశరణ భవుల వలెనుడువుచు, నిలచిన చోట నిలువక నడచి వెళ్లెడి వాడని జనవాక్యము. ఏడు కోట్ల ఏడు లక్షల ఏడువేల డెబ్బది వచనములు చెప్పితినని స్వయముగా జెప్పుకొన్నాడు. ఉత్తంగి చెన్నప్ప గారి యభిప్రాయమున, నితడు సుమారు పదునారవ శతాబ్దము వాడనియు, ఇతని వచనములు ఆరువందల వరకు సేకరించి తాత్పర్యము వ్రాసిన " కలమదాని గురురాయ అను కన్నడ కవి నుడివినాడు.

సర్వజ్ఞుని నిజమైన పేరు తెలియదు. ఇతని తండ్రి ధారవాడ జిల్లా మాసూరు గ్రామ వాసియైన భూసురుడు. తల్లి అంబాలూరు గ్రామమునకు జెందిన మాళి. ఇతడు అక్షరముల దిద్దినవాడు కాడు ." శర్వు శివునండలో సర్వహితనుడినేర్చి గర్వహీనత శాస్త్ర పర్వతమునైతినని సర్వజ్ఞుడనియె జనులార " అనిజెప్పు కొన్నాడు.

ఇతడు వీరశైవుడైననూ, సర్వమత సామరస్యం - నియమనిష్ఠల పాటింపని వారిపై నేవగింపు - అన్నిమతముల లోటు పాట్లను నిర్భయముగ ఖండించుట - విశేషాను భవములనే నీతి వాక్యములుగా చెప్పుట సాగించినాడు. కొన్ని చోట్ల పరుషములుగా నున్నను. నిజము నిష్ఠూర మని వెరవక చెప్పవలసినది నిర్భీతిగా నిస్సంశయముగా నుడివినాడు. సర్వజన సమ్మతములైన యీతని కొన్ని వచనములను, అక్కమహాదేవి వచనములను దూషణలు లేని వాటిని నిసర్గ రమణీయములైన వాటిని " అనియె " నని భావాను సారమొనరించితిని. త్రిపదులను ఆంధ్ర వాఙ్మయ లోకమునకు బరిచయ మొనరింపబూని నాల్గవ ఛందః ప్రస్తారమున, ఐదక్షర గణముల ఇంద్ర, చంద్ర, భల, నలలతో, ప్రాసనియమములతో, ప్రాసయతి సౌలభ్యములతో, మొదటిది రెండవదియగు పాదముల సమముగా నిరువది మాత్రలతో, పదిమాత్రలకు యతిబాటింపుచు, మూడవ పాదమును ప్రాసతో పదమూడు మాత్రలకు ,కుదించితిని.

తెనుగున " ఆటవెలది " సొగసు, కులుకు, నడక, వేమనయోగికొకనికే తెలుసున్నట్లు కన్నడపు త్రిపదసూక్తుల, యందము ముక్కు సూటినడక, నిర్దాక్షిణ్యపు వ్యంగ్యము, క్లుప్తత, సుమసౌరభము సర్వజ్ఞుని కొకనికే చెల్లును. అణ్వంశమున, అఖిలాండ దర్శనము జూపించు, భావసౌకర్యము. నిశితవాగ్ధాటి పదముల పొందిక ఇతని మకరంద బిందు తుందిలమగు కవితలోగలదు. వీరమాహేశుడైనను సర్వమత సహనమును బోధించిన మహాయోగి. సంఘమున, సకలాచారముల గల కుళ్లను, కుళ్లబొడిచిన సహజవాగ్మి. నిర్దుష్టమైన నీతివాక్యముల హృదయ స్పర్శరీతి లాలించి, ముక్కుచెంపలు వేయించి నేర్పుగ త్రోవజూపింపగలదిట్ట. అందులకే అతనికి సర్వజ్ఞబిరుదము, లోకప్రియ కవిత్వము. జంగమ శివయోగ ద్వైతభక్తి సంపన్నత్వము. "ఇతడహంబ్రహ్మాస్మి" యన్నవాడు కాడు. బౌద్ధుల, జినశ్రమణకుల, మూఢాచార భూసురుల మెచ్చడు.

అక్కమహాదేవి వచనములు నట్లే శైవభక్తి సాహిత్యమున మకుటాయమానములైయున్నవి. వాటిలో ననర్ఘరత్నముల గొన్నింటిని త్రిపదుల సంపుటీకరించితిని.

అక్కమహాదేవి జన్మస్థలము కర్ణాట రాష్ట్రమున " ఉడుతడి " యనుగ్రామము తల్లిపేరు సుమతి, తండ్రి నిర్మల శెట్టి దైవ ప్రసాదముగా జనించిన యీమె బాల్యమునుండియే, లౌకికమార్గ విరక్తయనియు, కర్ణాట, సంస్కృత, భాషల, ఆగమ పురాణేతి హాసముల జక్కగా నభ్యసించినదనియు, ఈమె కన్నడపు వచనములను తెనుగులో ననుసరించిన రేకళిగె మఠం వీరయ్యగారు వ్రాసియున్నారు

ఆప్రాంతపు రాజు, కౌశికుడను వాడు. యీమె సౌందర్యమునకు ముగ్ధుడై బలవంతమున, వివాహము చేసికొని, తీసుకొని పోగా, యీమె యాతనికి, వశముగాక, అంగసంగములు హేయములని, శ్రీశైల మల్లికార్జునుడే తన భర్తయనియు, గనుక తానగ్నిశిఖసమాన ననియు. అన్యులు తనను తాకలేరనియు, వసనాదుల విసర్జించి. దీర్ఘకబరీ, కేశజటామాత్రాచ్ఛాదితయై, పాదచారియై కదలుచున్న జ్యోతివలె శ్రీశైల ప్రాంతమును జేరి, కదళీవనములో శివుని ధవునిగా నారాధించి సజీవ శివసాయుజ్యమందెనని తెలిపియున్నారు.

శివ శరణ కవులవలె యీమెయు అనర్గళమైన శైలిలో ననుభవసారముల

వచనములునుడివినది.

శైవమైనను, వైష్ణవమైననూ అన్యమేదైననూ పరమాత్మనుసర్వోత్తమునిగా నెంచి సేవించు భక్తిమార్గము ద్వైతమే. పరాత్పరుని, వివిధనామరూపముల గొలుచు వారు. ముక్తియోగ్యులగు ద్వైతభక్తి శిఖామణులే, సంస్తవనీయులే, వారి నీతి వాక్యములు సుగ్రాహ్యములే కనుక, యీమహాసాధ్వి వచన మౌక్తికములను కొన్నింటిని " అనియె " నని ద్విపదుల నను సరించితిని.

చతుర్థాశ్వాసము దండకము మంత్రాలయ శ్రీ రాఘవేంద్ర గురుసార్వభౌములనుద్దేశించి వ్రాసినది. 1944 లో నంద్యాలలో శ్రీరాఘవేంద్ర బృందావనారాధనా సమయమున భక్తితో పాడినది. ఆనాటి విద్వజ్జనులు, మెచ్చినది. సార్వభౌమబిరుదము శ్రీ సోసలె వ్యాసరాయలవారికి, శ్రీ మంత్రాలయ రాఘవేంద్రరాయులవారికే జెందును. ఇరువురును "ప్రహ్లాద రాయ " నామక నృసింహభక్తశిఖామణి ప్రహ్లాదుని యవతారములే కదా. ఏడువందలయేండ్లు బృందావనములో వెలసి భక్తులకు వరము లిచ్చుచు. మోక్షమార్గమునుజూపుచు, దేశ దేశాంతరముల వారిని జేరబిల్చుచు తిరుపతికి తరువాత అంతటి దివ్య యాత్రాస్థలమైన మంత్రాలయ గ్రామ రమ్యక్షేత్రమున అఖండమహిమాజ్యోతిలో వెలుగు భక్తజనచింతామణి. నతజన కామధేను, - ఆర్తత్రాణ పరాయణ ద్వైత భక్తిపుంజము - కలియుగ కల్పతరువు అని ప్రసిద్ధిజెందిన శ్రీ మూలరామపాదసేవాసక్త వేదవేదాంగ న్యాయ వ్యాకరణ శాస్త్రపారీణ పరిమళేతి సుధాచంద్రికా వ్యాఖ్య ప్రస్తారక శ్రీమత్ రాఘవేంద్రగురు సార్వభౌముల దండకము నిత్య పఠనకై కూర్పబడినది.

పంచమాశ్వాసమున, సకల తత్వదేవతా కృతి రత్నమంజరి యను కృతులు సంగీత శాస్త్ర పారీణులు, గాయకులు పాడుకొనుటకనువుగా సమర్పింపబడినవి.

శ్రీమన్ మధ్వాచార్యుల ద్వైత పీఠ పరంపరలో శ్రీ సుధీంద్ర స్వాముల వారి తరువాత పీఠమలంకరించిన శ్రీ రాఘవేంద్రస్వాములవారికి సుధీంద్రసుతులని ప్రతీతి. శ్రీ రాఘవేంద్రస్వాములగురువులు శ్రీ సుధీంద్రస్వాములవారు. వారికి ముందు గురువులు. పీఠాధీశులు అగు శ్రీ విజయీంద్ర స్వాముల వారు పరమ గురువులు." సుధీంద్రసుతనుత " అను ముద్రతో దైవానుగ్రహముతో నాకించిత్సంగీత జ్ఞానముతో కృతులు రచించి పాడుకొన్నాను. ఈ ముద్ర శ్రీరాఘవేంద్ర స్వాముల వారి

దివ్యానుగ్రహం.
సుధీంద్ర సుతులైన శ్రీ రాఘవేంద్రులచే నుత, పొగడబడిన, అనుదిన షోడశార్చనలచే పూజలందుకొనుచున్న బ్రహ్మకరార్చిత శ్రీమూల రామవిగ్రహస్థ సర్వోత్తమ సర్వాంతర్యామియగు విష్ణునకు అంకితముద్రచే సమర్పింపబడినది.

కొందరు భక్తులచే కడపరేడియో వారిచే గానము చేయబడుచున్నది. ఈశుడు పురుషుడే, అతడు విష్ణువే సకల నామములతనివే అతడే జగదీశుడు - సృష్టి స్థితి లయకారుడు - జీవులు అతని సేవకులే, భక్తి యొక్కటే అతని చెంత జేరుమార్గము. వేదములచే మాత్రమే అతనిని దర్శించుటకు వీలగును. అతడు సత్యం - అతని చర్యలు సమస్తం సత్యం అందువలన యీజగత్తు సత్యమే.

నాహం కర్తా హరిః కర్తాత్వత్పూజా కర్మ చాఖిలం
తథాపి మత్కృతాపూజా - త్వత్ప్రసాదేన నాన్యథా
త్వదేయం వస్తు గోవింద తుభ్యమేవ సమర్పితమ్
ఓం శన్నో మిత్రః శం వరుణః
శన్నో భవత్వర్యమా ।
శన్న ఇంద్రో బృహస్పతిః ।
శన్నో విష్ణురురుక్రమః ।
నమోబ్రహ్మణే । నమస్తేవాయో ।
త్వమేవ ప్రత్యక్షం బ్రహ్మాసి ।
త్వమేవప్రత్యక్షం బ్రహ్మవాదిషమ్ ।
ఋతమవాదిషమ్ । సత్యమవాదిషమ్ ।
తన్మామావీత్ । తద్వక్తారమావీత్ ।
ఆవీన్మామ్ । ఆవీద్వక్తారమ్
ఓం శాంతిః శాంతిః శాంతిః

ఇతి సుధీంద్ర ప్రహ్లాదః

27.8.1991 నందికొట్కూరు 518 401.

# శ్రీ రాఘవేంద్ర గురుసార్వభౌమాంతర్గత
### శ్రీ భారతీ రమణ ముఖ్య ప్రాణాంతర్గత శ్రీ వేంకటేశ శ్రీశ సదా విజయతే
# శ్రీ శ్రీశ తత్త్వామృత మంథనమ్
## ప్రథమాశ్వాసము

1

శ్రీమూలోంకృతి భూర్భువస్సువ సవిత్
సృష్టిస్థితి ధ్వంసక
స్వామీ యిర్వదినాల్గు తత్త్వ తతిపై
సర్వాధిపత్యమ్మునౌ
నీ మాహాత్మ్య మచింత్యమద్భుతమనున్
నిత్యమ్ము లామ్నాయముల్
ప్రామాణత్రయి, పంచభేదములు జీ
వశ్రేణులున్ శ్రీపతీ

2

వేదనిరూపితుండజూడ!
విశ్వవిభుండవు నీదు శక్తిచే
చోదితు లస్వతంత్రులును
జూడ రమాది సమస్త దేవతల్
వేదితు లుచ్చనీచగతి
విజ్ఞత నిన్గను జీవు లెల్లరున్
మాధవుబోలు దైవమును
మధ్వసముండు గురుండు లేరనన్

3

సిరియే విశ్వవిభూతి, కాల మదియే శేషాహి, బ్రహ్మాండమే
సరి పృష్టిప్రజ, ప్రాణముల్ పరిజనుల్-సంహారుడే రుద్రుడౌ
వరపృథ్వ్యాప న భానిలానలగతుల్ - భాస్వజ్జగచ్చక్రముల్
హరి నీవే సకలాంతరంగముల నంతర్యామివౌ సత్యమున్.

4

సిరి తా బాదములొత్తగా నమృతముల్ క్షీరాబ్ధి నుప్పొంగగా
నురగంబే శయనంబుగానలువవే దోక్తుల్ప్రబోధింపగా
హరు డింద్రాదులు మెచ్చ విశ్వగతిబర్యాయమ్ము రక్షించునో
హరిసర్వోత్తమ ముఖ్య ప్రాణ గురురాజాంతర్గ తా వింటివా

5

గరిమన్ గావ్యము విశ్వశ్రేయమునకై - గైసేయు కాలమ్ము దా
నరిగెన్ స్వార్థమె గమ్యమౌ రచనలం-దశ్లీల, దౌర్భాగ్యదు
ర్భర దుర్భావ కుశబ్ద భాండకములే ప్రఖ్యాత పాకాలుసుం
దరసౌహార్ద సుగంధ సూక్తముల సందర్భాలుగా దోచెరా

6

వ్యాసప్రచేతసాదులను-బాణుని దండిని గాళిదాసులన్
భాసు గవిత్రయమ్మును, బ్రబంధ క వీంద్రుల, బోతనాదులన్
గోపిటబూలబూజలిడ-దుర్వ్రతమందురు నేటివార్వృథా
యాసమలంకృతుల్ రసము. వ్యాకరణమ్మనియాసడిం తురే

7

పడికట్రాళ్ళను భావకర్దమములన్ బాషాణ పాకమ్ముతో
నడుసుల్ద్రొక్కెడువ్యాకృతీరహిత శ-య్యాభావ దుశ్శాసనుల్
నడివీధిన్గవితాలతాంగి వసనాల్వానా విభూషాదులన్
వడిదూయన్ విరసుల్దిగంబరులుగా - భాషంబ్రవేశింతురే

8

లలిత నిసర్గసుందర క-లాప తరంగ తరంగిణీ ధ్వనుల్
కలిత కుహూకుహూరవ పి-కమ్ముల కమ్మని రాగతానముల్
చలితమృదంగసంగతుల-సొగు మరాళ మయూరయానముల్
వెలసెడు దివ్యకావ్యములు వెల్తివటందురు నేటి పండితుల్

9

ఛందస్సుందరరీత్యలంకృతుల విశ్వశ్రేయ కావ్యాల, పే
రిం దేవీకృతులంచు ముట్టరుకదా-రిక్తప్రబోధాగ్రణుల్
వందే విప్లవజ్వాల కీలరచనా - పారీణ వాగ్జ్వాలలన్
సందేహింపరుబూదె సేయుటకు విశ్వశ్రేయ సౌభాగ్యమున్

10

కటుతిక్తామ్ల కషాయనిర్లవణపుం గద్యంపుబద్యమ్ములై
రటనార్భాట దివాంధ ఖంజగతి గుంట్రాళ్ళంగడుందూలు త
త్కుటిలాచార సురాప్రమత్త గణికా-గోష్టిస్థలీ శ్లేషలో
పటిమార్థంబుల గావ్యసుధ్వనుల స-ద్భావంబు లెందుండునో

11

విషమ గ్రామ్య నిషిద్ధ శబ్దతతితో-విశ్వోపయోగంపు స
ద్విషయంబు ల్పలుకంగరాదనుచు సం-వేదింపరే ధీనిధుల్
సుషమోల్లాసజగద్ధితంబులగు సత్సూక్తుల్ప్రసాదింపుచో
బుషులైగాని వచించిరే రచనలం-దింపైన సత్కావ్యముల్

12

అమిత ప్రజానురంజకములైన సమాన సమాజశ్రేయముల్
ప్రముఖత గాంచవే జగతి భాను శశాంక సువంశ భోజకా
లములను, కాళిదాసునుడి రాయలకీర్తిని, దిగ్గజాల స
ద్విమల సుకావ్య ధారలను-వెండి తదున్నతి నేడు గాంతుమే

13

ఏతత్పాదృశహీనదీన దశయం-దేమూలనున్నాడవో
ధాతేశాన సురేంద్ర ముఖ్య వినుతా-తప్పేంద్రు నిన్నెచ్చుటల్
తాతల్తండ్రుల పాతపచ్చడుల వ్రాతల్గోతల ధ్యాన్నముల్
గోతుర్ధియుడు పూడ్చుడందురుగదా -గోవింద దిక్కెవెరా

14

సిరిపతివీవు పాల్కడలి- శ్రీసతిసేవల బాముపాన్పుపై
గిరిజగిరాం శచీపతుల - గీతములన్విని తన్మయింపుచున్
దోరవలె దూగు కాలమిక -దూరములయ్యెనిమీలనేత్రముల్
విరియగ, విశ్వశాంతి మురిపంపగ-గల్కివిక్రమ్ము లెమ్మికన్

15

యదా యదా ధర్మము-యాచ్యమౌనో
పదేపదే దానిని - బాదుకొల్పన్
సదావతారమ్ములు-సల్పుదేవా
గదాధరా-కల్కివి-కానరావా

16

ఆస్తికులుం గపటులరై
నాస్తిక విషయప్రసక్తి - నరపశువులరై
వాస్తవమగు సత్యమ్ము బ
రాస్తము గా వింప జాతు రరుదెంచగదే

17

మతము లతి ప్రమాదకర-మౌఢ్య తిరోగమ స్వార్థనీచ సం
గతులను నైక్య భావుకులు-గాంతురె సర్వము నేకరీతిగా
చతురకుయుక్తి కుట్రల ప్రజామతముల్గొను రాజకీయ పుం
మతముల న వ్యరీతులవి - మానవజాతికి మేలుగూర్చునే

18

మనసుహితమ్మదే మతము-మానిసి కిదర భిన్నభిన్నమై
నను, సహనమ్ముతో మనుట-నాణ్యత, యైక్య మసాధ్యమేకదా
మనుజాని స్వేచ్ఛసమ్మతము-మాన్పగ లే మది మంకుపట్టుతో
మనమత మేదియైన మరి-మానగరాదుగ మానవత్వమున్

19

లోకము భూమి గ్రామము నిలుం దలి దండ్రి కళత్ర బాంధవా
నీకదశేంద్రియా స్థ.మత-నిష్ఠలు భిన్నము లాత్మతృప్తికై
తేకువతో స్వకీయ హిత దివ్య విధానము బాయలేరు ము
ల్లోకము లేకమైన మరి-లోకువకారు జనాంతికమ్ములన్

20

అవిరళ త్యాగ యోగవ్రతయజ్ఞ తపో విధి సాధనక్రియా
ప్రవిమలశీలురై, మతప్రవక్తలు దివ్యపథానుగాములై
వివిధహితోపదేశముల-వెల్లులొసంగిరి విశ్వశాంతికై
యెవరిహితమ్ము వారలు గ్రహించి చరించి తరించురీతులన్

21

మతము ల వేవియైన మన -మంచి రచించెడు దివ్య సంస్థలే
మతముల త్రోవ లెల్లబర-మాత్మ పదమ్మును జేరుదారులే
మతముల గీడులేదు మద-మత్తులు గొందరి దుష్ప్రవృత్తులే
మతముల సాకుతో బ్రజల -మాన ధనమ్ముల దోచునైచ్యముల్

22

వివిధమ్ముషాకుభాష్యముల-బీరములైన విచిత్రనీతులన్
ఉవిదల పొందు ,తీర్థసుఖ-యోగ మలంకృతి దక్షిణార్పణల్
పవలును రేలుబాసలు, కు-భాషణ, నోటుప్రనోటుశక్తితో
వివశత రాజకీయకుల పీఠములాలు మతాల మించవో

23

కులములు జన్మమాత్రమున, గుంపన లివ్వ సుమాలుకావు త
త్కులముల సత్సుతుల్ యశము-గూర్పగజల్లని చంద్రకాంతులౌ
కులములు ధర్మకౌశలవు గుర్తులు కానియ సహ్యమైన యీ
కులముల రొచ్చుకాదు మృగ-కూటనరాధమ నీచసంగతిన్

24

పులుగులు జంతువుల్ నరులు-బోలికలం దెగలై మెలంగి, త
త్కులపుగులాయమందు గుమి-గూడుట దోషముకాదు నైజమే
కులమున నెచ్చుతగ్గులిడి గొప్పలకోసము తన్నుకొంటలే
తులువతనమ్ము మాను డది-దొడ్డ మనస్సుల విశ్వశాంతికై

25

కులములమధ్య వైరముల గోరిరచించెదు నీచమానవుల్
కులపు విపక్షలో గొలువు - కూటము లెంతురు స్వార్థబుద్ధిచే
కలుపులు దీయుకై వడిని - కల్మష చిత్తుల దూరముంచు చో
కులపుప్రసక్తు లుండవు ని-గూఢ విచారము మాసిపోయెడున్

26

ప్రళయము సంగరమ్ముల వి-పత్తుల బుట్టుక చావులందు కా
నల నడిసంద్రమందు గగ-నాల విషూచి మశూచి వేళలం
గలవె కులస్పృహల్ కలిసి కట్టుటగాక, ఖలోపజీవులే
కులముల జిచ్చుబెట్టెదరు, కోవిదు లెప్పుడు మెచ్చరీ గతుల్

27

ఎవరి మతమ్ము వారలకు-నింగితమైన నదేమి తప్పు,వే
రెవరికి ముప్పురాని విధ-మేర్పడు మార్గములం చరించుచో
భువిగల జీవకోటి తత-భుక్తికి ముక్తికి కోటిమార్గముల్
దవిలిన నేమి శ్రీయురగ-దంతులబోలె సుభక్తి నెన్నుచో

28

హితులు సహితులైన పరుల-నేకరీతిగ మంచి నెంచి
వితథ గతుల బాసి విమల-విజ్ఞాన సద్బోధ లెంచి
మతవైర కులవైర గతుల-మరచి మానవతమ బెంచి
మతములేవైన మానవత-మనుజాల మతి మండవలయు

29

రుచుల భిన్నతలు వ్యక్తి స్వరూప స్వభావ ప్రభావ
నిచయానుసార మైస్వీయ-నిరతినిల్పుకొను యత్నాన
పచరించు, బల్మితో నితర-పంథాల నిజస్వేచ్ఛగూల్చ
విచలితమ్మై స్వీయ ధర్మ-విషయాల సందిగ్ధపడును

30

ఎవరియనూచాన సరళి-నింకొక గతి మార్చలేక
ఎవరి వంశాచారగరిమ -నింకొక విధిజూడలేక
పవలురేల్ పర ధర్మమందు - భయమంది యుభయభ్రష్టతల
చివరిదాకను శాంతిబాసి-జీకాకు పడు మానవాళి

31

తలిదండ్రిభ్రాతృవర్గముల దనరారు నలవాట్ల జీవి
కులకులాయమునందు బెరుగ -గోరుట నైజమ్ము గాదె
కులములన్ గార్చిచ్చుగూర్చి-క్రూరస్వార్థము బెంచు వికట
కులపాంసనుల నీచకుటిల-కులసర్పముల కాట్లవేల

32

పలువురు పలురీతిభిన్న - పంథాలుబూన తప్పేమి
జల భువి గగనాల జీవ-జాలము ల్వేరు గావేమి
కులమతాల్వేరైన శాంతి-కూటాశ్రితము గోరవేమి
కులమతా ల్మంచివే కాని - కులవై రమది కోతిబుద్ధి

33

ఎవరికిన్నేది సద్వ్యహిత-మెద్ది సాధ్యముగాగబరగు
సువిధమ్ము నద్దానినెంచు-సుకృతి వ్యక్తిత్వంపుస్వేచ్ఛ
వివిధవర్గంపు వ్యత్యాస-విషయమ్ము హరియింపుచేక
సవరణ కలగల్పుకతన-సమశాంతి సిద్ధింపగలదె

34

అసమతం త్రిగుణ సంఘముల-నధికృతమేధో ప్రవృత్తి
విశదమై వేర్వేరు విధులు-విధియింప, జీవముల్జెలగ
కుశలతల్ ల్గన కర్మరీతి-కులమత స్తంభాల నూను
నిశిత సమ సమాజహితము-నిర్మలాంతర్వాహినియగు

35

యవనహూణాభిజాత్యాల-నగ్రవర్ణాధిపత్యాల
నవయు స్త్రీగోల్పంచజముల - నరపశువులుగాగ జూచు
భువిని యస్పృశ్యతా పైత్య - మూఢ సంగతుల లధమము
లవి నీచము ల మానుషములు ప్రవిమల ధర్మముల్గావు

36

ధనిక దరిద్ర భేదముల-దర్పస్వార్థాహం కృతులను
మనుజవర్గములు మానవత-మరచి దానవరీతి మించి
జనులను వంచనా శిల్ప-చాతుర్యముల ముంచి, నమత
జనహిత కులమత రహిత-సమసమాజమని నటింత్రు

37

మతవర్గ వైషమ్య రీతి-మానవరూప దానవులు
ప్రతిచోట కలహాలుబెంచి ప్రజలపై పెత్తనాల్బూని
సతతద్వేషాగ్ని రగిల్చి-జనసంఘముల జీల్చుచుంద్రు
నతిస సౌఖ్యసాధముల - స్వార్థమ్ము సాధించుకొరకు

38

జలములు బ్రాణమిచ్చు మరి-చంపు నవే ప్రళయార్భటిగతిన్
జ్వలనమహోపకారికదు-భగ్గున మండు బ్రచండకీలలన్
మలయసమీరుడే ప్రళయ-మారుత భంజకుడగ్ని గూడుచో
కులముల ధర్మభూమి మరి -కూళలు బుట్టగ బ్రేతభూములౌ

39

కులములు లేక పోయినను-గొప్పమతా లవికూలిపోయినన్
తొలి మనవారు వెంగలులు-దుష్టులరే యని తీర్పు జెప్పినన్
ఇలగలవర్గభేషజము-లెచ్చులు తగ్గులుబాసిపోవునే
ఖిలులు గులాల కుండముల కాష్ఠ ఘటా లెగద్రోయుచుండగా

40

లోకాల్పిన్నరుచింబరంగుటలు దాలోకోపకారార్థియై
లోకేశుండొక సాక్షియై వెలుగుటా లోచింప భిన్నత్వమం
దేకత్వమ్మొక దర్శనమ్మ నిజమే-నీగోత్రవిచ్ఛేదముల్
సాకుల్జేసిన విశ్వశాంతి హిత సత్సామాజికా ఢ్లుగ్గవే

41

గీతమ్మొ గుణకర్మభాగితమునై - కీర్తిం సదాచారమై
యోతప్రోతమునై పురోగతికి శ్రేయోధర్మమార్గమ్మునై
చాతుర్వర్ణ్య వ్యవస్థితిం సహజ స-త్సంతాన సౌభాగ్య మీ
రీతిం గూడని వర్ణసంకరవు గేళిందేలుటే భవ్యమా

42

ఒకపనిచేయ నల్వురకు-మండు నియోగ మదెవ్వ డెల్లెడన్
బ్రకరణముం రచించుటకు-వస్తు సమీకరణమ్మ రక్షణల్
బ్రకటవుగాయకష్టమును బంచుక నల్వురు నాల్గు వృత్తులన్
సకల సమాజ సన్నిహిత-శాంతి బ్రతిష్ఠ కవశ్యమే కదా

43

మానవశ్రేయస్సునకై
బూనెడు ధీ. ధనబలాఢ్య-పురుషార్థములున్
వానికి శ్రమదానములున్
వేని కవే శ్రేష్ఠమైన-వృత్తులుగావే

44

వివిధోపాధుల జీవులు
జనములతోస్వ స్వరూప సహకారముతో
బ్రవిమల ధర్మాచరణల
వివరించు నిజాత్మనిష్ఠ-విడువగదగునే

45

మత సహనమ్ముతో సకల-మానవ విశ్వవికాస వేద సం
హితల సుశాస్త్రబోధనల - నెల్లరు మెచ్చెడు విశ్వశ్రేయముల్
అతిసహజమ్ములై వెలుగు హైందవ సన్మత ధర్మమార్గమం
దతినుతి గాది దెల్లజగ-మంత యెరింగెడు భారతోన్నతుల్

46

మనుజ పురోగతి సద్గతి
మన మనుస్మృతి మనమె దెగడి-మానుట దగునే
పవిగాని గతిమార్చగలమె
ఇన శశి గ్రహతారకాదు-లెరిగెడు గ్రమమున్

47

ఎందరు బోధజేసినన - నెన్నివిధాల బురాణ శాస్త్రముల్
చందముబూని వేదములు - జిక్కని మార్గము లేరికూర్చినన్
గొందరు స్వార్థకాముకులు -కుత్సితబుద్ధుల నెల్ల శాస్త్రమం
దందుగుతర్కముల్బూనిపి - యచ్చపు శాంతికి హాని సేతురే

48

సాటి మనుజాల మేల్గోరు-సహజ మానవతను బాపి
వేటిమానవులు బూటకపు -వేర్పు బ్రదర్శించు చంద్రు
నోట తేనియ తీపిమాట-నోవట వెక్రింతలు కాల
కూటమ్ముదరమున గ్రక్కు-కుటిల తంత్ర మదేమి హాయి

49

సమరస భావులై మనుజ-జాతులు విశ్వసుశాంతి కాములై
తమతమ ధర్మమార్గములు -దప్పక హిందు తురుష్క క్రీస్తుమా
ర్గముల ప్రజాప్రయోజనపు-గాంగ్రెసు గమ్య్య విజమ్ము సోషలీ
జము జనతా వెదో నొక సు-సాధనజేసి తరింప రేలకో

50

అంచిత వేదదర్శనములారును వైగమ బ్రహ్మ సూత్రముల్
పంచమ వేదమౌ జయ వి-పంచిక గీత ప్రభాతరోచులన్
ఎంచి ప్రభల్ ఖురాను లటు-బైబిలు బారసికాలు చీనముల్
గాంచు దిశాంచలాల పిత -కాంతులు బ్రాగ్విభవాల వెల్గలై

51

ఏవం విధ కార్యమందు
నీవే గద సూత్రధారి-నిఖిలేశ హరీ
నీవే నిర్గుణు డనువెడ
నీ విజ్ఞానములు భక్తు-లిచ్చకమేనా

52

సర్వసమాన సౌహృదయ-శాంత సమాజ సుఖమ్ముకొండుయీ
సర్వము నేకపాకమును-శార్యమి కొండగుబొత్తులేదెటన్
సర్వము బ్రహ్మ సత్యమున - సత్యమదెట్లగు నక్షి సాక్షిన
త్సర్వ నిసర్గ సుందర బ్రశస్త విభిన్న భవాను భూతియున్

53

ఎనుబదినాల్గు లక్షల గు-హేంద్రియ - నాములు జీవరాసులున్
మునుపటి కర్మపాకముల ముక్కుచు మూల్గుచు నన్యరూపభా
వన కమవైన యూర్ధ్వగతి సౌఖ్యముఖులై పరమాత్మ సన్నిధిన్
గనుగొని గాక గాంచెదరె స సుఖమ్మగు ముక్తివైజమున్

54

వేనే బ్రహ్మ మటంచు దానవగతిన్ విష్కర్మ వైర్గుణ్య బ్ర
హ్మానంద మ్మని శూన్యమున్ మలచరే-మాయాప్రబోధమ్ముతో
జ్ఞానాజ్ఞానజ లస్తినాస్తియని ప్ర-చ్ఛన్నంపు బౌద్ధమ్మునిన్
నానా విశ్వవిభుం దలంపరు మృషా - జ్ఞానుల్ స్వయం బ్రహ్మలై

55

తామే బ్రహ్మములగుచో
నీ మాయా విశ్వమందు - నిడుముల నుడులన్
గామాదుల సంగాతము
స్వామిత్వము, రెంట, దాము, బ్రహ్మమ్ములరే

56

గగనమునము శశ శృంగము
నగవుల వంధ్యా సుపుత్రు-నటనార్పటియున్
అగుణుని జగదీశత్వము
జగతిని పర బ్రహ్మలుండు-సంగతి గలదే

57

ముక్తిస్థితి నద్వైతము
యుక్తిని సాధింప ద్వైత ముడిగెడు నముచో
ముక్తి నొసంగెడు శ్రీహరి
రక్తిని గ్రహియించు జీవ-లక్షణు లోకరా

58

ఇచ్చెడు నెవరికి ముక్తిని
పుచ్చుకు దరియించు జీవ -పుణ్యులు లేకన్
నిచ్చలు దమ మది హరి గురి
గ్రుచ్చెడు నిజ భక్తులెల్ల-గొల్లెల గములా

59

నేనే బ్రహ్మ మటన్న శంకరుని జ్ఞానిన్ సంతతాద్వైతప్ర
జ్ఞానానందుని యుక్తి భక్తి గరిమన్ శంకింప గాలేములా
నా నారాయణుగొల్వ నాతడిడ బ్రహ్మానంద నిష్యంద మౌ
జ్ఞానానందము-జీవ సౌఖ్యమును త-త్కాలైక దేశమ్మనెన్

60

హరి సర్వోత్తమున ద్వితీయమగు మాహాత్మ్య ప్రభామూర్తితో
విరహమ్మోర్వని భక్తిన వ్యభిచర ప్రీతిన్ సదాలీనమై
చరియింపుండనె శంకరుండు నెరుగన్ శక్యం బె తత్పన్నిధిన్
గరుణాళుం హరి గాంచు ద్వైత పదహంకార స్పృహేలేనిచో

61

నర నారాయణ జీవదేవు లుభయుల్ -నానా ప్రకారంబులన్
గురుతింపన్ గడు భిన్నతత్వ్వలు సదా-కూటస్థులౌ సాక్షులై
కరుణింపన్ హరి, మోక్షగామి నరుడా-కాలైక్య దేశైక్యతన్
బరగన్ ద్వైతము నద్వితీయ సుఖ మ-ద్వైతమ్మ నన్జెల్లునే

62

నరనారాయణు లేక స్యందనముపై-నానాజాలం గెల్వరే
గరిమన్ ఖాండవ దాహమున్ పరమ ప్రఖ్యాతిం గురుక్షేత్రమున్
అరయం గృష్ణుడు బోయబాణమున ని-ర్యాణింపడే యొంటరిన్
నరు డేకాకి-యశక్తుడై కుములడే నారీజనాక్రందనన్

63

జీవేశ్వర తత్వ్వ లుభయు
లా వరుస వియోగ రహితు-లన్యోన్యులు నా
జీవుల కర్మాచరణలు
దేవుని కరుణాప్రదత్త - దీప్తులుగావే

64

జీవులు జేసెడు బ్రతి పని
దైవ ప్రేరణలై గాని -తదితర మగునే
దైవ ప్రసాదమ్మఖిలము
జీవుల శుభ గమ్యమంచు జెప్పుట వినమే

65

హరి కర్త సకల క్రియలకు
హరి పూజలు సకల క్రియలు -హరి ప్రేరణచే
హరి దరి హరి బరికించుట
నరులకు నిజ సౌఖ్యమంద్రు-జ్ఞానులదెపుడున్

66

ఆధారము హరిబింబము
ఆధారా దర్శ బింబితాళులు జీవుల్
ఆధారా దర్శ యుగళి
వేదోక్త ప్రపంచ భేద - భిన్నత్వము లౌ

67

మా యజమాని నేనొకటి-మాటనటన్న మరిద్ద రొక్కటా
ఆ యజమాని సొమ్మును రవంత వహింపగ తాను స్వామియే
ఆ యజమాని సేవకుడు నన్ని విధాల సమాన మన్నచో
నీయుగ యాజమాన్యములు నీపరివారజగా ల్మమేకమా

68

రజతము శుక్తి పాముచెడు-రజ్జువు భ్రాంతియు సత్యజ్ఞాన దృక్
ప్రజిత పురానుభూతిస్మృతి - సత్య మనేకముగావు భిన్నముల్
నిజముగ దృశ్యమౌ జగతి-నిర్మితి జేసిన సర్వశక్తుడా
యజాడును దారతమ్యమున-నన్యులు భిన్న లజస్రతత్త్వలున్

69

హరితానివ్యక రావు జీవుల కనా-యాసంబుగా జన్మలున్
పరిపక్వంబగు భక్తినైజ సుఖమౌ- వైకుంఠ సంప్రాప్తియున్
నరనారాయణు లా నివాతకవచా జ్ఞానార్జితాల్జన్మలన్
వరుసం గూర్చినగాని సాధ్యపడెనే-బ్రహ్మాండ సంరక్షణల్

70

తమ తమ నైజముల్దెలిసి -, తామస వృత్తుల వీడజేసిని
ర్మమతభవోహ మస్మియను-మాయ భ్రమల్దొలగంగదోసి యా
యమనియమాది సాధనల-నాత్మసమున్నతిబెంచి జీవహృ
త్కమలమునందు శ్రీహరిని-గాంచెడు ద్వైతప్రవృత్తిముక్తియౌ

71

అతులిత కేశవాఖ్య మహిమాద్భుత శక్తి హృదంతరమ్ములో
స్థితమగు బింబరూపము న-ధిష్ఠమునైతత తత్వదేవతా
నతుల నృదేహ దేవళము-నాకమొనర్చి వికుంఠసాధన
ద్ధితముగ శ్రీసమేతముగ-దివ్యమునై మము బ్రోచు నెప్పుడున్

72

విశ్వంబెల్లన్ వివిధగతులన్ వృద్ధినాశమ్ము లందున్
భాస్వంతమ్మై మరల మరలన్ భావ సంవేదితమ్మై
శశ్వచ్ఛాంతిన్ హరిని గొలుచున్ జ్ఞాన భక్తి ప్రపత్తిన్
ఆశ్వాసింపన్ భువన భవ జీ-వాళి నిశ్రేయసమ్మున్

73

సర్వాంతర్యామియగు హరియే-సర్వసత్వ స్వతంత్రుం
డు ర్వీం జీవాళులు బహుళ - శక్త్యార్తిలో సాధుఅందున్
సర్వోత్కృష్టం డగు విభుని యా-జ్ఞన్ బ్రబోధాత్ములెవ్వా
ర్వార్వాచీన ప్రగతిగతులన్ - యానముల్ సల్పువారే

74

సందేహింపన్ వలముపడదే - శాస్త్ర సంపూర్ణతా వా
దేందూ ద్యత్కాంతి సిత లవరీ-దీవికాసమ్ము లెల్లన్
ఛందోబద్ధ శ్రుతులగతులన్ - జ్ఞాన ప్రసూనార్ద్ర భక్తిన్
జిందించున్ జీవహృదయములన్ - శ్రీశ సాన్నిధ్యముక్తిన్

75

జన్మల్నిర్వాణ ప్రాప్తి దినతల్ సౌఖ్య దుఃఖమ్ములెభా
వోన్మీలత్కాంతి తర తమ నీ-చోచ్చద్వంద్వమ్ములెత
చ్చిన్మూర్తిం గొల్చు వివిధములౌ జీవ తండమ్ములె శ్రీ
సన్మాన్యుండౌ బరమ విభు సత్ శాంతి సాన్నిధ్యమందున్

76

న్నిర్ణీతంబౌ జగతి గతియై విశ్వల జ్యోతియై దు
గ్ధార్ణోరాశిం భుజగశయనోదాత్త నాలీక నాభిన్
పూర్ణాత్మూర్ణ ప్రణవబులతమై ముక్తి బోధామృతమ్మై
కర్ణాకర్ణిం శ్రుతుల ద్యుతులం గాంచు భక్త్యైకగమ్యున్

77

అజ్ఞానాంధీకృత మనసిజాహం కృతీ నైల్య మెల్లన్
విజ్ఞానామ్నాయమధురసుధా - వీచికాసేచ నోద్యత్
సుజ్ఞానార్ద్రీకృతి వికచమౌ శుక్ల జ్యోతిన్ సుభక్తిన్
ప్రజ్ఞాపూర్ణుం డభయ మిడగా - ద్వైత సాన్నిధ్యముక్తిన్

78

అంతర్జ్యోతిన్ విమల లవలీ - యాంశు బాహ్మి ప్రశాంతిన్
అంతర్వృత్తిన్ మధుర మహిమా - వ్యక్త భక్త్యేక సిద్ధిన్
వింతల్గావున్ విభుడవిశమున్ - విశ్వపర్యాత్మకుండై
చెంతన్ జేర్చున్ దనదు హృదయ - శ్రీనివాసమ్మునందున్

79

మాధుర్యంబై జనన మరణ - మ్లాన నిర్మూలనంబై
బాధా సంక్లిష్ట మలిన మహా పంక ప్రక్షాళనంబై
వేదోదాత్త స్ఫురిత పరలీ వేదితోంకార నాదా
మోదంబై ద్వైతగతి సుఖమై - ముక్తి సాన్నిధ్య మిచ్చున్

80

వేదాబ్ధిం జిల్కొని గమత్రయీ విస్తృతిం నాల్గుభాగాల్
వేదవ్యాసుండమృత సుధలన్ -వేనవేల్సూత్ర గ్రంథాల్
బోధల్గాధాళి విధి విహిత ప్రోక్త సుద్వైత రీతిన్
వేదింపన్ జీవులకు నిలలో - ప్రీతి భక్త్యేక సిద్ధిన్

81

వేద్యంబై జీవఝరి ఝటితి స్ఫీత నీలాభ్రభ్రంపా
ప్రద్యోతంబై నిరవధిక నీవార శూకాగ్ర తన్వీ
సద్యోల్లాస ప్రకట పటనా - చాతురీ ద్యోత కంబై
హృద్యస్ఫూర్తిన్ నిగమ పదసం వేదితమ్మై లసించున్

82

అంతర్జ్యోతిం హృదయ ముకుర మ్మందు బింబ స్వరూప
స్వాంతమ్మందున్ హరిని గొలువన్ - భక్తిమార్గమ్మునంతల్
శాంతాకారుం భుజగశయనుం శాంతదుగ్ధాబ్ధి లక్ష్మీ
కాంతుం శ్రీద్వైతు ననుదినమున్ - గాంచుటే ముక్తికాదా

83

కావ్యాల భావము లహో - కరుణార్ద్ర శైలిన్
నవ్యంబులై హృదయ వీ-ణల బల్కు రీతిన్
దివ్య ప్రబోధ హరియే - ధిషణమ్ము లుంచున్
భవ్యంపు డెందములలో - బరమార్థ భక్తిన్

84

శైలేయ శీకరములై - ఝురులై సుభావా
ల్లాలించు. గీతశ్రుతులై - లయల న్నటింపన్
డోలాయ మానజగముల్ - దులదూగు హిందో
ళాలందు సుప్తి సుషమా - లవలీ ప్రశాంతిన్

85

విశ్వాత్ముడై హరిరమా-విధిమాతరిశ్వన్
శశ్వన్నభేశ రవులన్ - శశితారకాళిన్
వైశ్వానరు న్వరుణ భావజ తత్వశ్రేణిన్
భాస్వంత సృష్టి గతులన్ బ్రళయమ్ము లెంచున్

86

అత్యంత సూక్ష్మ మణువందవి భాజ్యశక్తిన్
సత్య ప్రకాశక మహా-జ్జవమంత రాత్మన్
నిత్యప్రచోదక గతిన్ నియమించు వాడై
ప్రత్యక్ష సాక్షి వెలుగున్ బ్రతి జీవకుక్షిన్

87

అన్నింటి కన్నఘనుడౌ నజుడెల్లవేళన్
మున్నుంజలంబు వెలుగుం-మరుదభ్రతేజ
మన్నింట దానుబరగు-న్నధిక ప్రశస్తిన్
వెన్నుండు లేని భువనా-ల్విడినుండ వెందున్

88

ఆధారుడైన హరితా-నఖిలాండ సృష్టిన్
మేధోవికాస మహిమా -మృతసేచనోద్య
ద్వేదోక్త సూత్ర సుగతిన్ - విమలంపు భక్తిన్
సాధించు నిత్య పదవీ- సదనాల నుంచున్

89

అద్దాన బింబము వలెన్ - హరియుండు సృష్టిన్
నిద్దంపు ద్వైతగతితో-నిఖిలాత్మ లందున్
బుద్ధుల్ భ్రమించు నెపుడున్ బోడసూపు దప్పున్
సద్ధర్మ భక్తియె సదా - సరిదారి జూపున్

90

బింబాన జీవ ప్రతిబింబితుల స్వతంత్రుల్
శంభుప్రజా పత్యులవ -చృవు శక్తులెల్లన్
దంభప్రలోభములతోత మవంచునెంచన్
కుంభీ ప్రకార నిరయాల్గాని తెచ్చు కొంటల్

91

నిత్య ప్రకాశు డజాడే - నిఖిల మ్మెరుంగున్
భృత్యాను భృత్య పరశిన్ - భృత జీవు లెల్లన్
సత్యంపు ముక్తి వరయన్ -హరి భక్తి యొండే
అత్యంత నైజ సుఖమై - యలరారు నెపుడున్

92

వాతాత్మ జండు శివుడ - ప్రతిమాన భక్తిన్
ద్వైతాళి విష్ణుపదమున్ - దిలకించరే; య
ద్వైతమ్ము స్వాతిశయమౌ - పరమేష్ఠి భ్రాంతు
ల్లైతావతా శ్రుతులలో నిది జెప్పరెందున్

93

'అ'కారాది 'హ'ందాక - నంద క్షరుండౌ
అకుంఠుండ జుండంచు నామ్నాయ మొప్పున్
నికాయుండు విష్ణుండు - నిర్ద్వంద్వు డైవన్
ప్రకామంపు జీవుల్ పరబ్రహ్మ లేవా

94

పరబ్రహ్మ జీవాల - బాలించు నన్నున్
పరబ్రహ్మ శేష్యవ - భావుండు గాడా
పరబ్రహ్మతాత్మైన - ఫాలాక్షుడౌనా
ధరంజీవ దేవర్షి - ధానుండలేదా

95

స్వతంత్రుండు శ్రీశుండు - సర్వేశ్వరుండ
స్వతంత్రంపు జీవాళి - చాంచల్య చిత్తుల్
ప్రతీపంపు కర్మాలు పాపాలు బెంపన్
ప్రతాపోజ్వల ద్దివ్య - బ్రహ్మంబు లేవా

96

సదాచార సంపన్న - శాస్త్రప్రబోధన్
సదామోద సంపూర్ణ - సచ్చిత్సు మాధుల్
నిదానమ్ముతో ద్వైత - నిష్ఠం జరించున్
విధానాలు భిన్నాలు - విశ్వాత్ముడొండే

97

సుపక్వంపు సద్భక్తి - శుద్ధ ప్రవృత్తిన్
కృపాళున్ విభున్మ్రొక్కి - గీర్తించుటొప్పున్
అపధ్యాన రీతిన్ - యహంకార వృత్తిన్
అపాయ మ్మద్వైత మప్రాప్య సిద్ధిన్

98

ప్రధాన ప్రభుండివ్వ - భక్తుల్ గ్రహింపన్
సదావాస పుంద్వైత - సాన్నిధ్య మబ్బున్
కదాపి ద్విధాభావ్య కానట్టి రీతిన్
తదైక్యంపు సిద్ధిం బ్రదర్శింపవౌనే

99

సదాపేక్ష జీవుల్ ప్ర-శాంత ప్రభుండున్
సదానం దవుంద్వైత - సాన్నిధ్య ముండన్
తదైక్యాన వ్యక్తిత్వ - దర్పమ్ము లూడన్
సదా జీవనాశంపు సారూప్యమెట్లో

100

వినాశమ్ముగారే స-విత్రంపు జీవుల్
ఘన బ్రహ్మశక్తింబ్ర - గాఢైక్య మొందన్
వినాశంబులేదే భువింజీవి కెందున్
తనస్వ స్వరూపాన - దర్శించు ముక్తిన్.

("యత్ర త్వస్య ఆత్మైవా భూత్-సయథా సైంధవ ఖిల్య అవినాశీ వా అరే ఆత్మా అను చ్ఛిత్తి ధర్మా బృహదారణ్యకం.)

101

విశాలంపు సద్దృష్టి - ప్రేమామృతమ్మై
విశుద్ధంపు శ్రద్ధే భువింభక్తి కాగా
భృశంబౌ సమాధిన్ ప-విత్రాత్మనిశున్
వెసం బాచుటే ముక్తి - విశ్రాంతి కాదా

102

ఇష్టఫలాలు మెక్కి బలహీనత - దైవ్యత గుందు జీవికిన్
ఇష్టమనిష్ట మొల్లని య-హీన మహోత్తమ దైవమూర్తికిన్
కష్టసుఖాల గ్రాలెడు వి-కార శరీరపు క్షుద్ర జీవికిన్
గష్ట సుఖాంకురాల మను -గాచెడు శౌరికి సాటియున్నదే

103

ప్రతియుగ కల్పకల్పముల - బ్రాణ ప్రపంచిత పంచకోశులై
వితత నిజ జీవ రూపులిటు - నిచ్చలు బుట్టుచు జచ్చుచుండదా
కలిపయ భక్తి యోగముల - జ్ఞానము బెంచి వికుంఠ ధామసం
స్థిత కమలాపతిన్గదిసి - దివ్యసుఖాను భవమ్ము గాంచరే

104

వితరణ బుద్ధి కౌశలము - విష్ణుని యందనురక్తి గల్గిస
న్మత న్మ తిభాషణాల శ్రుతి మార్గజ జ్ఞానసుధా సుమాల బ్ర
స్తుతి తత తత్వ దేవతలు - దోహద కార్యమును గ్రహించు విం
గితముల వేదవేద్యుడగు జ్ఞేయుని గమ్యుని విష్ణుజూవరే

105

అతడు చరాచర ప్రకృతికంత నియామక మూలకారణం
బతని వినా జలింప దణు మాత్రము గాంచెవు గడ్డిపోచయున్
అతడొక పూర్ణషడ్గుణు డనంతుడు విష్ణువు విశ్వవ్యాపకుం
డతని కృపా కటాక్ష సముపార్జనమే మన గమ్య ధ్యేయమౌ

106

జగదధీశుండొకనిజమ్ము - జగము నిజము
యుగయు గావర్త కల్పాల - జగతి సృష్టి
స్థితిల యాదులనియమించు - హితుడతండు
సుస్వతంత్రుండు జగతితానస్వతంత్ర

107

అతని కన్నను ఘనుడులేడతడు విభుడు
అతడు సకలమ్మునందుండు నప్రమేయు
చర్మ చక్షువుల కతడు గోచరుడు కాడు
అతని నేపేర బిల్చిన - హితము గూర్చు

108

ఇట్టి విజ్ఞాన మరయమి - వట్టి వగును
సకల మానవ శేముషి - ప్రకట శాస్త్ర
జటిల కుటిలార్థ చాతురీ - చర్చ లెల్ల
బూదెలోనేయి గ్రుమ్మర బోసినట్లు

109

హృదయ ముత్ఫుల్ల పద్మమై - ముదము విరియ
దేహి దేహాన చైతన్య - దీప్తి జూపి
యెరుక గల్గించు నదయార్కు-డీశుడతడు
శ్రద్ధయును భక్తిలేనిదే - శాంతినిడడు

110

కోర్కెయున్నంత ఫలితమ్ము - కూడిరాదు
సత్ప్రయత్నము లేక దా సాధ్యపడదు
పట్టుదల శ్రద్ధ సహనమ్ము ప్రబల భక్తి
శక్తి గూడక పరమాత్మ ముక్తి నిడడు

111

"భక్తి రేవగరీయసి" - భావ గరిమ
వ్యక్త మొనరించు నవ్యక్తు నప్రమేయు
చపల చిత్త సముద్భూత - శాస్త్ర శుష్క
తర్కముల కల పరమాత్మ - తరలిరాడు

112

అవని సతిపతి సుతహితుల్ - అలుగువారె
ప్రీతియును శ్రద్ధ లేనట్టి - ప్రేమికులకు
శ్రద్ధ సత్ప్రేమ యనుభక్తి - సాధ్యపడక
దైవ మూరకే మముబ్రోవ దరలిరాడు

113

దైవము సృజించి భయభక్తి భావముంచు
భక్తులతి మూఢ జనులంద్రు - ప్రబలు రివుడు
నేతల వరించి తలవంచి - భీతి మట్టు
తిరుగు చుండుట లేలకో - దెలుపలేరు

114

పనులకైయధి కారుల పదములంటి
లంచముల నిచ్చియో దలల్ - వంచివంచి
చెప్పులరిగెడు రీతిబల్ - సేవ తిరిగి
తిరిగి గతిజెడు టేలకో దెలుప లేరు

115

కలికి కడకంటి చూపులో - కులుకు లెంచి
ప్రాణము పణమ్ము గానొడ్డి పరువు మరచి
శ్వానముల వోలె వెంటాడి - దీనులగుచు
వలచి వగచుట లేలకో దెలుపలేరు

116

అవయవమ్ములు ముప్పునం -దలిగిపోవ
సతిసుతుల్ప్రుమక్కుల శక్తి గతిజెడంగ
పాపకర్మండ నమ్రబోచు - వాడెవండో
బలుక రాడను టేలకో-దెలుపలేరు

117

దశవిధేంద్రియ రతులతో - దనువు జెడగ
చిత్తము గలంగిసద్బుద్ధి రిత్తపడగ
చంచల ప్రవృత్తి నాత్మాతి శయము బెరుగ
తమరహంబ్రహ్మ లెట్లొకో తలపలేరు

118

యంత్ర తంత్రాలతో వ్యోమయానములను
అంతరిక్షాల కంతలు పుంతలగసి
శాంతి గనకుండ జగతిని క్రాంతిఁబెంచు
అణురణమ్ముల వేలకో- అరయలేరు

119

వస్తుకపు దృష్టి సరుకుల వసలు తగ్గ
ధరలు మిన్నుముట్ట కక్షలు పెరుగుచుండ
జగతి కల్యాణమును రిక్త శపధములను
ప్రజల వంచించు టేలకో పలుకలేరు

120

మనుజ మస్తిష్క మాలిన్య దనుజ కళల
చిత్త చాంచల్య గతులు బ-ర్వెత్తు చుండ
పట్టి నియమించు పరిపూర్ణ బలుడతండు
దైవము విభుండు హితుడన్న తప్పులగునె

121

అమహోన్నతుడ వ్యక్తుడచ్యుతుండు
సృష్టి రక్షించి శిక్షించు శ్రేష్ఠుడతడు
విపుల విశ్వాంతరాళాల విదితుడగుచు
వెలుగు బింబన్నరూపుడౌ - విష్ణువతడు

122

అతని యానతి లేక నాకైనదుదకు
గడ్డిపోచైన కణమంత కదలలేదు
సత్యసంకల్పు డత్యంత- నిత్యుడతడు
అతని దయలేక మనకెట్టి బ్రతుకులేదు

123

అతడు హరిహరుడంబయు నల్లక్రీస్తు
అన్ని నామములాతని - యభిధలగును
సకల గుణపూర్ణ శ్రేష్ఠుసత్యుడతడు
అతని మహిమలు గాంచుటే యరయముక్తి

124

అట్టిప్రభునీకు నుతియంచుటల్పమగునె
మతప్రవక్తల మౌఢ్యంపు మాయలగునె
కాసు కొరగాని చరణాలు కడగు కన్న
హీనమై తోచెనే దైవ ధ్యానమకట

125

సకలక్రియాప్రచోదితాను సత్యుడు జీవుడు గర్మప్రేరణన్
ప్రకటవిజిష్వరూప పరిభావ విశుద్ధ సదూర్ధ్వ రేతుడై
వికచహృదబ్జ స్నిగ్ధదళ - పీఠవిహారి హరింస్మరించుటే
సకల సుశాస్త్ర సమ్మత ప్రశస్త విధానమదెంచి చూడగా

126

పొలుపుగ విష్ణునౌషధిని భుక్తి జనార్దను బద్మనాభుశ
య్యలను ప్రజాపతిం బరిణయమ్మున యుద్ధమునందు జక్రినా
వలసద్రి విక్రమున్ దనువు బాయగ నారయణాఖ్య శ్రీధరున్
గులపతి సద్రతిన్ గలల గోపకిశోరుని సంకటమ్ములన్ ;

127

అలమధుసూదనున్ వనము లందు నృసింహుని యగ్నికీలలన్
జలధి శయాను క్రోడునడి సంద్రమునంగిరులందు రాఘవున్
కలిగతి వామనున్ సకల కార్యములందుర మాధవున్సుమాం
జలులను షోడశాఖ్యముల సంస్మరియించి నగల్గు సద్గతుల్

128

స్వామీ!నాప్రభుచీవు ! ప్రాణములు నీ పాదార్చకుల్గేహమే
నామేనౌ విషయోపభోగ రచనల్-నావార్చనల్నిద్రయే
సామీప్యంపు సమాధి కాల్నడకలే సద్యాత్ర నామాటలే
నీ మంత్రమ్ములు నానమల్ప కలముల్ నీకన్న సద్భక్తియా

129

విహిత సమస్త కర్మలు పవిత్ర రమారమణార్చ నార్పణన్
విహిత దశేంద్రియానుభవ నిర్మల చర్యలు ముక్తిదమ్ములౌ
మహారభిమాన స్వార్థగతి మోహవశమ్మున నెండమావులై
యహిత భవాబ్ధి బంధనములై జనిమృత్యు ప్రవర్తకమ్ములౌ

130

జలముల మాధురీ మధుర సారమొసంగెడు జీవధారలున్
మలయ సమీర శీతసుకుమార సుఖమ్ము లొసంగు ప్రాణముల్
జ్వలన హవిష్పలాల జవసత్వసుతేజ మొసంగు నాహుతుల్
జలజ సునాభుడైన ఫణి-శాయి సుధాజలశాయి న్యాయముల్

131

జలముల గ్రుంకినన్ మలిన సంగతి బాయవునింద్రియాల్పదాఽ
నిలముల బ్రాణ సంయమన నిశ్చల వృత్తి సమాధిరాదు యు
జ్వల మహిమానలాహుతుల బక్వములూర్ధ్వ ముఖాలుగావు స
న్నిలయుని శ్రీపతిన్ హృదయ-నీరజ పీఠివిగాంచకున్నచో

132

శకములు మారినన్ రవి శశాంకులు తారలు దారి మార్తురే
సకల సుశాస్త్ర సమ్మతము సత్యము మారునె పేర్లు మార్చినన్
ప్రకటత్రి విక్రమోత్తమ ప్రభావుడనంతుడు క్షుద్రజీవియా
సకలము గేశవాం కితము - సత్యము విశ్వము మిథ్యయెట్లగున్

133

ఆధునికోత్సుఖాల కొరకై సులభీకృత యంత్ర ప్రక్రియా
సాధిత నవ్య శోధనల సాగర గర్భ గ్రహాంతరన్వయం
చోదిత రోదసీ గతుల జొచ్చుట మానవ మేధచే గదా
మాధవుడా పురాణములు మౌఢ్యమటందురు మాటిమాటికిన్

134

మానవ జాతివిశ్వముల మానవకోటికి మేలు గూర్చన
జ్ఞానవు దైవ ధ్యానములు కర్మలు భక్తులు పాపపుణ్యముల్
దోసము కోసమై కుటిల బుద్ధులు గూర్చెడు స్వార్థప్రక్రియా
దీనవు భోగయోగ వికృతీకృతులంద్రు నవీన పండితుల్

135

ఇందలి సూక్ష్మ సంగతుల నెల్లన పక్షవిపక్ష నిర్మమం
బందరలోన్న సద్విధము వాద్భుతి బూడిదగప్పు నిప్పుగా
విందువణంగియున్నదది యింగితమున్న గనంబడుంగదా
సుందర సత్య సంగ్రహణ సూక్త మతింగ్రహియించు సత్యమై

136

మానుష మేధసత్కృతుల మానవశ్రేయము లెన్నమంచిదే
మానవతా విహీనమణు మారణ హోమము నింద్యమే కదా
దీన శుభాశుభాల్మతి య దీనము దేవుడదేల నన్నచో
మానవ కీశ చంచలత మాన్పునియామకుడాతడేకదా

137

వానికి లేదు చంచలత–వానికి లేవు దశేంద్రియార్థలున్
వానికి లేవు స్వార్థములు – వానికి లేవు సుఖాలు దుఃఖముల్
వానికి లేవు జన్మమృతి–వానికి లేవు యధోవివాసముల్
వేవి వివాదృణమ్మునాక – వీసమునైన గదల్పలేమొకో

138

సకలవిశ్వమునేలు సకలార్థ సాక్షి జగదీశుడతనిక సాధ్యమ్ముగలదె
అకళంకమగు భక్తి సజాని గొల్వకను అజ్ఞానతిమిరమ్ము లంతరించెడిన
వికట ప్రవృత్తి చేవిభుని నిందింప-విశ్వరహస్యాలు వెలువడంగలవె
ముకుళిత హస్తాల ముల్లోక విభుని మ్రొక్కి సేవింపకమోక్షమ్ముగలదె

139

సృష్టిస్థితిలయాల సిరితోడగూడి చెలువుగానియమించు జీవాళినతడు
కష్టనష్టములందుగ్రాలు విశ్వముల గర్మాను సారమ్ముగాపాడు నతడు
తుష్టిసత్కర్మలం దొడగుసజ్జనుల దులలేని సౌఖ్యాల దులదూచునతడు
భ్రష్టమార్గము లెన్నుపాప కర్మరుల పలల పంకాలలో బడవేయునతడు

140

పంచభూతములందు బడుమిశ్రణముల బంచవింశతితత్వ భావదేవతల
వెంచి శక్తులొసంగి యెల్ల జీవముల నేలు కార్యమ్ముల కేర్పాటుసేయు
మంచి చెడ్డలనెంచు మహితజీవముల మాన్యసద్భక్తి సన్మార్గాల నుంచి
అంచిత వైకుంఠ మానంద పదము నందపరోక్ష మాత్యంతిక మ్మొసగు

141

విశ్వమూలపు శక్తి విష్ణుతేజమున వివిధాంతరంగాల వెల్గుగాజొచ్చి
నశ్వరపు దేహంపు నరకయాతనల నష్టకష్టముద్రుంచు నయభక్తులెన్ని
శశ్వదానందమ్ము సాధించు కొరకు సకల జీవాళికి సద్బుద్ధి గరపు
విశ్వదేవతలెల్ల వివిధ తత్వముల-వెల్గరే రవిశశుల్విమలతారకల

142

అంతరిక్షపు[1], పుంత-నటు, పాలవెల్లి[2]-అరయ,దుగ్ధాబ్ధి[3], హరి[4]రమా సదన
మంత, పద్మాసనుం[5]-డటు,సరస్వతియు[6]-అనిల[7]జగరుడులున్[8] అహి[9]వినాయకులు[10]
వింత సప్తర్షులున్[11]-విశ్వతారకలు-విశ్వదేవత తత్వ-విధులేలుచంద్రు
సంత,తానందంపు-శాంతి,ధామమున,-శాస్త్ర సంకేతాల-సంజ్ఞాభిధముల

1. Black hole 2. Milky Way 3. Hari-Hercules Harukulesh 4. Lotus Nebula 5. Nega Alpha Nyra బ్రహ్మ 6. Eppilan Nyra 7. Arc Turas అనిలజ లేక హనుమంత 8. Aquila గరుడ 9. Serpennue Applcuss శేష-అహి 10. Arsa Minor వినాయక ' 11.ARSA MAJOR' సప్తరిమండలము (పాశ్చాత్య ఖగోళ శాస్త్రము నందలి నక్షత్రమండలముల పేరులకు మనతత్వ సంఖ్యాన తత్వదేవతల పేరులకు గల సామ్యము గమనింపదగును.) భగవంతుని తత్వ ప్రస్తార జగచ్చక్రావృత్తి సర్వ స్వతంత్ర సత్సంకల్పము, తదాజ్ఞాను సారి క్రియాశీల విధేయ తత్వము అనుద్విధా విభాజ్య ప్రకృతి పురుష- శ్రీ శ్రీశ. ద్వైత సంస్థితి (Qualified Dualism )క్రియారహిత ఏకతత్వవాదము (MONOISM)కన్న శ్రేష్ఠమని బహుళ మనీష బవాంగీకృతము.

143

శయనించు విష్ణువా-షాఢ ప్రతీచి-సత్య,యేకాదశిం, జలజాప్నరథము
అయనాన,దక్షిణమ్మై మ్రాలు,వాన-లవనిపై గురిపించు-నటు,జాడ్యములును
స్వయముగా,నుత్థాన ద్వాదశిన్ లేచుసత్యకార్తీకాన శార్ఙ్గపాణియును
అయనమ్మదుత్తర మ్మై మ్రాలు చుండ హరిత కేదారాల వలరు సస్యములు

(ఆషాఢస్యప్రథమ దివసే...కశ్చిత్కాంతా విరహ గురుణా .... శాపేనాఽస్తంగ మితమహిమా..శాపాంతే భుజగశయనాదుత్థి తేశార్ఙ్గపాణి అను కాళిదాసుని దైవీ-పాకృతిక వర్ణనలు వేద-రహస్యములు)

విష్ణునక్షత్ర మండలము ఆషాఢ శుద్ధ ఏకాదశి (శయనైకాదశి) శేషపాన్పుపై పవళించును ద్వాదశాదిత్యులలోని సవిత్సనామక విష్ణువు ఉత్తర దిశనుండి దక్షిణమునకు బయనించును దక్షిణాయణమున మిక్కిలి వానలు అంటుజాడ్యములు ప్రబలును పునః శుద్ధకార్తీక ద్వాదశి (ఉత్థాన ద్వాదశి) శార్ఙ్గపాణి (విష్ణునక్షత్ర మండలము) దక్షిణ దిశనుండి ఉత్తర దిశకు బయనించును (ఉత్తరాయణము) సస్యశ్యామలముగా ప్రకృతి రమణీయ ఫలదాయి యగును. గ్రహతారకల గమనములతో పురుషోత్తమ తత్వము ప్రకృతి తత్వమును చైతన్యము గాచేయు విశ్వ వ్యాపారములు పెక్కు వేదాంత గ్రంథములలో వివరింపబడినవి. తిరువనంత పురం అనంత పద్మనాభ దేవాలయ సాంప్రదాయ రూప మిదియే.

144

ఆరుఋతువులందు షట్చక్రముల నవనిపై జీవాళు లావర్తమొందు
ఆరు యుగ్మమ్ముల వాదిత్య మండలాకర్షిత గ్రహాల నటు జన్మమృతుల
వారలే పితరు లైవసురుద్ర రవుల వరభూర్భువ సువాల పదములందెదరు
నీరజాక్షుని గొల్వ నిల్తురేగాని వేరుగా బ్రహ్మలై నిల్వంగలేరు
(అందరిలోపర బ్రహ్మయుండును కాని ఎవ్వరును పరబ్రహ్మకారు)

145

దేహాన జీవియో దేహిగాడతడు, దేహిబంధనమూడ్చు దివ్యప్రభుండు
దేహబంధన మద్ది - దేహికొక భ్రాంతి - దివ్యధామానను స్థిరులిర్వురెవుడు
సోహమ్మలనుటలు శుద్ధాత్మ విభుని జూచి మ్రొక్కెడు భక్తియేయగును
దేహిదేవులటువిదేహ నిత్యులును దేవుండు బోధింప దేహితానెరుగు

146

ద్వితయంపుతరతమ భిన్నులైయుంద్రు విష్ణువున్,తదధీన విషయబంధితులు
ద్వితయ భక్తి పథమ్ము తిమిరమ్ముగాదు, దివ్య సుస్థిరమైన తీరౌను సుమ్ము
అతడు స్వతంత్రుండు నస్వతంత్రులు మరందరాతనికి సే వాను సేవకులు
అతడున్నతుండన నద్వైత మొప్పు అతడు దాననుటయే అనరాని తప్పు

147

సకల షాడ్గుణ పూర్ణ సంపూర్ణు డతడు-జడుడు నిర్గుణుడైన-స్వామిగాలేడు
అకళంకుడప్రమే - యాచ్యుతుండతడు-అనిరుద్ధుడన్నింటికాధారుడతడు
సకలమ్ము నశియింప సమపిపోడతడు సర్వేశు డలిగిన జగములే లేవు
ప్రకట సత్యమ్మిద్ది ప్రభువు భక్తుడను ద్వైత సంస్థితిలోన వరలు నీజగము

148

భక్తి మార్గము రూఢి బహుసులభమ్ము-పరమాత్మపైశ్రద్ధ వాంఛా విరక్తి
యుక్తి నష్టాంగంపు యోగకౌశలము యూర్ధ్వాది నియమాల నౌనగూడు భక్తి
సక్తి ఫలమువీడు సత్కర్మ నిరతి సర్వమానవ సేవ సతతాను రక్తి
ముక్తి ఫలాపేక్ష-మోహాది నిరతి, మురరిపునన్నిధిన్ మురియుటే ముక్తి

149

మనకు జన్మంబివ్వ మరిబ్రహ్మయంద్రు మనల పత్స్థితిమంప మాధవుండంద్రు
మన చిత్తనియతికు మాధవు డంద్రు మనశ్వాస విశ్వాస మారుతియంద్రు
మనుగడల్వరుణాగ్ని మరణాలయముడు మరితత్వ దేవతా మహిమమ్ముల్లెల్ల
ఘనుడునంతర్యామి గల్గించు శక్తి ఘనుడనంతుండుదా గల డన్నిదిశల

150

అతని యానతి లేక నన్ని విశ్వములు నట్లాన వాదులౌ యఖిలదేవతలు
గతులు మానగలేరు కార్యదక్షతల గర్మపాలన మందు గడుభక్తి నంద్రు
అతడు శక్తినొసంగ నన్నియుబరగు అతడు విముఖుడైన నంతయు మునుంగు
అతడ కళంకుడౌ నజాడు విష్ణువును అతని గొల్చెడు భక్తి నరయవేముక్తి

151

శివకేశవులటంచు శ్రీవాణియుమల శ్రీపరదేవతా చిచ్ఛక్తి యనుచు
ప్రవిమలల్లాయంచు ప్రభువెహొ వనుచు వరజొరాస్టరటంచు ప్రభుసింహాడనుచు
వివిధ నామమ్ముల వివిధ రీతులను విశ్వేశు గొల్తురు వివిధ వర్గముల
వివరింప శివివిష్ణ విశ్వపాయనిన విష్ణుమూర్తి యెగాని వేరులేరెవరు.

152

కలహింప గారాదు - కంజాక్షుడనిన ఘనవ్యోమకేశుడౌ కాలుడే యనిన
వెలయు విష్ణువటన్న విధియతండనిన విలయరుద్రుండన్న పెనుశక్తియనిన
కలిత పరాశక్తి కళలెల్ల నతడు - కార్యకారణ ధర్మ కర్మంపు గతుల
పలుజీవతతిలోన పరిపక్వభక్తి పరిపూర్ణులకు దాను పరముక్తి నిడును

153

జ్ఞానమ్ము భక్తియు గడు వేరుగాదు గడుమూఢ భక్తుడ-జ్ఞానియే యగును
జ్ఞానమాత్రమునహం-కారమ్ము బెంచు సద్భక్తి లేనిదే జ్ఞానమ్ము లేదు
దీన దేహభ్రాంతి దిమిరాన దిరుగ దేహినిత్యుండంచు దెలియంగలేరు
నేను దేవుడనంచు నిక్కుచున్ జెడిన నిల్తురు శ్రుతివైర నిశ్రుతి సంస్థ

154

దేవుండు దేహము స్థిరులు శాశ్వతులు. దేహిదేహభ్రాంతి దెగడకంగుందు
దేవుండునియమించు దేహా లెల్లరము దేవుని దయలేక తిరముక్తిలేదు
భావములంటని పరమాత్ముడతడు భవబంధ భావాల భ్రష్టుడౌజీవి
దేవజీవులు ద్వైత ద్విజవిహంగములు తినిగుందునొక్కటి తినవిదింకొకటి

155

పరుని బ్రహ్మ భ్రాంతి పయపంచవమ్ము పరజీవితావిశ్వ నాథుండుగాడు
పరమువందైక్యావ బడుజీవవష్టి – బ్రహ్మము భవము జీవమెటుగ్రహించు
బరికింప విరువురు బహుశాశ్వతులని భాషణాల్ల ప్పించు భాష్యమ్ము లెల్ల
హరి పరలోకైరైన పచ్యుతానంతుడ ప్రమేయి యనుట కర్థమ్ము లేదు

156

పరమాత్మ విధిగొల్వ పరిపక్వభక్తి బ్రహ్మనేననుచో ప్రజ్ఞాన నష్టి
పరభక్తి ప్రేమతో బ్రహ్మమ్ము గొలిచి బ్రహ్మనేననుట సద్భావమ్ముకాదు
పరమాత్మ వలె నేనుభవ ముక్తుడనిన, భవపాలనము సేయుపరిపూర్ణుడగునె
కరుణచే జ్ఞానమ్ము గల్గించు విభుని – ఘనతగాంచుటమాని గర్వింపదగదు

157

నేను బ్రహ్మమనెనె నిష్ఠ రాముండు నిఖిల రాక్షస శక్తి నిర్జించునపుడు
నేనను ప్రాచీన నిజరూపుదెల్పె నేబ్రహ్మ ననిజెప్పెనే కృష్ణుడనివి
నేనను పరమాత్మ నిజవిశ్వమేలు, నేనను జీవుండు నిగళబంధితుడు
నేనను బ్రహ్మంబు నెరగొల్పు జీవి నిల్తురశ్రాంతమ్ము నిరతిద్వైతమున

158

పరమాత్ముడ ద్వైత పరుడొక్కడనగ, భవజీవరాసులు బ్రహ్మలయ్యేదరె
తరతమ భేదాల దనరు ద్వంద్వములు తరచి చూడగద్వైత ధర్మముల్గావె
పరమాత్మ విభవమ్ము భవపీతి జావుబహుయుపాధులవన్ని బ్రహ్మమ్ములగునె
కరుణాళు కృపచేత గాంచుజీవములు ఘనయజాండమునేలు ఘనుడుకాగలరె

159

సక్తితో యుక్తితో సకల జీవములు సతతమ్ము దేహ ప్రశాంతినింగనవు
భుక్తినింద్రియరతిన్ పాలుపైన రక్తి, శక్తితో జనిమృతింజహియింపలేవు
భక్తియే జ్ఞానమ్ము భక్తియే ప్రేమ భక్తియేసత్శ్రద్ధ బరమ సౌఖ్యమ్ము
భక్తిగాకితరంపు పంథమే లేదు, భక్తి తప్పని సరి భవబంధితులకు.

160

అష్టాంగ యోగంబు లలవర్చునంత వరచేత వైకుంఠమరయంగలేరు
శ్రేష్టశాస్త్రాలెల్ల చింతన ల్సలుప - సిద్ధి కైవల్యంబు - జేరంగరాదు
నిష్ఠతో సత్కర్మ నియమించి నంత నిత్యసత్సన్నిధిన్-నిలువంగలేరు
ఇష్టియై సద్భక్తి నిటుపక్వమైన ఇష్టుడై హరివచ్చు నితని బ్రోతునని

161

పరమాత్ము దర్శింప వలయు సద్భక్తి పరముగాంచిన వెంటబాయంగరాదు
పరమాత్ముడపరోక్ష వరజ్ఞాన మిడగ భక్తి వీడని నిత్య పదమంద వలయు
పరమాత్మవలె జీవి బ్రహ్మమే య నుచువడిబోధజేయు చో పతనమయ్యెదరు
సరళితో సద్భక్తి జ్ఞానమ్ము లరసిజనసేవ హరిసేవ సాగింప వలయు

162

వేనవే ల్జీవుల భిన్నత్వమందు, ప్రత్యేక దృష్టియే పెద్దదర్శనము
జ్ఞానమ్ము భక్తి సత్కర్మ మార్గముల కలిమి లేములచెల్మికడు సుఖంకరము
మానవుల్విశ్వాల మంచి సాధింప మనుజ మనీషులై మనుచుండవలయు
మానవత్వమ్మదే మనుజనైజమ్ము మానవ సేవయే మాధవసేవ

163

ఇదియే సువిధాన త్రయీగతిగా
సదయుల్ భువిలో బహుశాస్త్రములన్
విదితంబొనరించిరి - విశ్వగతిన్
ముదమిచ్చెడు భక్తియె ముక్తియనన్

164

భువినెన్నది నాలుగు ముఖ్యములౌ
జనజీవములుండు దిశంగనుచో
ననియెల్లనొకేక్రమ - మందెడినా
వివిధమ్ములుగానె వివిక్తములై

165

నరులందరు భిన్న విన్రమతలన్
గరిమమ్ముల దెక్కు ప్రకారములన్
పరికింతురు సన్మతపద్ధతులన్
పరమాత్మను గాంచెడువాంఛలతో

166

ఎవరే మతమెంచిన నిష్ఠముగా
భువమందున సోదరభావ మిడన్
వివిధమ్మున నేకత- వెల్వడదా
యవివేకపు వైరము నష్టమగున్

167

ప్రతిజీవము భద్రత ప్రాజ్ఞతతో
హితమెన్న మతాన జరించెడుచో
తతవిశ్వ హితమ్ము ప్రధానమగున్
సతతమ్ము సుఖమ్ము సుసన్నిధిలో

168

పరమాత్మనదేగతి భక్తిగనన్
స్థిరసన్నిధిముక్తిని - శ్రీశుడిడున్
పరమాత్మయొతానను - భావనలో
పరమాత్మ సుశాంతి వినాశమగున్

169

పలు జీవులు శ్రీశుని - భాసురవి
శ్వల కాంతిని స్వాత్మల - సత్యముగా
దిలకింతురు బింబగ-తింబ్రతిబిం
బంసద్వ్యక చాంబుజ - భక్తిసుధన్

170

తిలకింపగ దేహవు దేహియుపా
ధులద్వైత హృదిస్థితి తోయజమై
పులకింపుచు బింబపు మూర్తిగనం
గలుగంబ్రతిబింబము గావలదే

171

భవ బంధము బాపెడు భక్తిగతిన్
భువి జీవులు సాధన పుణ్యముతో
భువనేశుని గాంచుట ముక్తియగున్
భువిజీవియెబ్రహ్మన పూర్తిజెడున్

172

పరమాత్మ సుసన్నిధి భక్తిసుఖం
బరయన్ బహుదివ్యమనంతముత
త్స్ఫురతాంత సుఖమ్ముగ దోచెడుచో
పరబ్రహ్మ సుఖమ్మది నారకమౌ

173

అనురాగముతో బరమాత్మభజిం
చినచో నది భక్తియు చిత్సుఖమౌ
అనవద్యుడబ్రహ్మమ-హమ్మనుచో
నముయోజ్యుడు జీవి-నిరర్థకుడౌ

174

జీవుల దేహపు - చింతలు బాయన్
పావన భక్తి ప్ర-భావములందున్
శ్రీవిలసిల్లెడు - చిన్మయ శోభన్
దైవమునన్నిధి - తన్మయ మిచ్చున్

175

ఇంద్రియభోగము లెన్న సుఖమ్మే
సాంద్రపు రక్తిని - స్వార్థము పెంచున్
తంత్రములం దము - దర్పములాడున్
మంత్ర గతిన్ స్మృతి- మార్గములెంచున్

176

దీపముతో నిలు-దిద్దెడు రీతిన్
పాపము బాపెడు - భక్తి విశుద్ధిన్
శ్రీపురుషోత్తమ-చిన్మయ మూర్తిన్
జీవుల నిల్పెడుచో సుఖమబ్బున్

177

జన్మములందుట-సాధనకేగా
మృణ్మయ దేహము ప్రొందుటకేగా
చిన్మయ కాంతిని చేరుటకేగా
సన్మత ముఖ్యమ సత్యవతమ్ముల్

178

సర్వమతమ్ముం సారములెల్లన్
దుర్విధి పంచన దూరెడు జీవుల్
గర్విత కాయప్రకామము బాయన్
నిర్వచనమ్ముం నీతులు నేర్చున్

179

ఏమతమైనను - ఈశుని సేవన్
నీమము సాధన - నిశ్చల భక్తిన్
క్షేమముగా ప్రభు-చిత్సుఖ సంస్థన్
ప్రేమములో స్థితి నెంచుటగాదా

180

ఈజగమందున నెల్ల ప్రలోభాల్
నేజహియించిన నిర్జిత భక్తుల్
శ్రీజగదీశుని చిన్మయ సంస్థన్
రాజిలుచుందురు-రమ్యసుశాంతిన్

181

దేహము నందిరు- తేజములుండున్
దేహినెతల్పెడు దేవుడజుండౌ
దేహి విదేహిగ- దేవుని గొల్వన్
శ్రీహరి సన్నిధి - సేవలనుండున్

182

భావభవమ్ముల - బంధన చేదా
జీవస్వరూప వి-శేషముబాయున్
జీవి నిజస్థితి - శ్రీహరి గొలువన్
దేవుని సన్నిధి- దేలుసుఖాలన్

183

ఎల్లవుడుంగమియించు జగమ్ముల్
కల్లలు గావని- కానములౌయు
ఫుల్ల సరోజము బోలును సాధిన్
యుల్లములన్ హరి - యుంచు సుభక్తిన్

184

వేదిక లేకబ్రి వేశములోనే
విధిని నాటక వేషము లెల్లన్
తాదృశ జీవ వి-తర్డిక లేకన్
వేద విభుండెటు - వెల్గెడు సృష్టిన్

185

అమరులు గోరెద-రాత్మనృజన్మల్
యమ నియ మాదియహంకృతులూడన్
అమలిన భక్తి మహాంబుధిలోన
ద్యుమల మువన్నిధి- విష్ణుని గొల్వన్

186

కొదువలు దీర్పగ-గూడెడు జీవుల్
పదముల రీతుల - పద్యధులందున్
బదపడి శ్రీశుని - భక్తిని గొల్వన్
ముదమున గాంతురు ముక్తి పదమ్మున్

187

ఎనుబది నాలుగు - లెన్నినలక్షల్
జనుమల జీవులు -పాగిన్నృజన్మన్
ఘనునియనామయు - గాంచెదరార్తిన్
పునరపి జన్మము - బొందని భక్తిన్

188

భువులము జీవులు - బుట్టుటలెల్లన్
భవముల బంధము - బాయుటకేనల్
వివశత భక్తియు - విజ్ఞత తోడై
ప్రమిమల శాంతికి - బాటలు వేయున్

189

నిశిదినమున్నతి-నేర్పుసుతత్వాల్
పశుపతి బుద్ధిసు-పక్వమొనర్చున్
కుశలతతో హరి-గొల్వగ భక్తిన్
అసదృశ సౌఖ్యము - లందెడు జీవుల్

190

వితరణతో హరి - విజ్ఞత బెంచన్
వ్రతముగ జీవులు - భక్తిలసింపన్
ప్రతియుగ కల్పప్ర-భావము లెల్లన్
గతిగొను విశ్వవి - కాస ప్రవృత్తిన్

191

అవిరత రీతిగ్రహాల్గ మియంచున్
రవిశశితారలు - రాజిలు త్రోవన్
భువన వికాసము పుట్టును బెరుగున్
వివశత గ్రుంకెడు - విష్ణుప్రదీప్తిన్

192

ఇరువది నాల్గు శు-భేక్షక తత్వాల్
నరులకు శాంతిన-నశ్వర సంస్థన్
నిరత సుసాధన - నిశ్చల భక్తిన్
స్థిరముగ నుంచెడు - తెన్నులు జూపున్

193

నిగమ: సునిశ్చిత - నిర్మల భక్తిన్
సగుణ స్వరూపుని - సంస్మరియింపన్
జగదధినాయకు - సన్నిధియొందే
జగమున జీవుల సద్గతి బెంచున్

194

భువుల వనేక విముక్తి విధానా
లవిరళ భావప్ర -యత్నములైనన్
నవవిధ భక్తివి-వప్రుతలంచి
త్రపవిమలసన్నిధి - ప్రస్తుతిగాంచున్

195

నరుల జన్మలు జగదీశు నెరుగుకొరకె
సకల శాస్త్రమ్ముల విగూఢ - సత్యమిదియె
సత్యదర్శన మరయని - శాస్త్రచయము
లవియజాగళస్తనముల -నవసరములు

196

వచ్చినారము భువిజన్మ-మెచ్చికొనుచు
దవిలిమృగతృష్ణ సుకముల దడిమి దడిమి
చచ్చు చుందుము మరుజన్మ దెచ్చుకొనగ
నచ్చవుందిమిర వథమం-దుచ్చలిగియ

197

చదువులాటల బాల్యమ్ము-పొగిపోవ
కామవాంఛల యౌవన-కాలమేగ
పతిసుతాదులు విరసింప-జరభరించి
చచ్చుచును గొరెదముపున-ర్జన్మములను

198

గుడులు గోపురములు తీర్థ-కూటములను
పూర్తవిధుల దానమ్ముల పుణ్యగతుల
భోగత్యాగాల హఠయోగ పోడుములను
బెంచు చుందుము మరుజన్మ-మంచికొరకు

199

చదువు ధనము బదవి రిక్త - సాధనముల
వ్యర్థమయ్యెడు జన్మని-రర్థకముగ
తెలిసి తెలియని తెలివితో - వెలితి బడెడు
జ్ఞానమదియెంతయందని - బ్రూనిపండు

200

ఇహపరమ్ముల భోగము-లెంతవెగటు
సంపదలు కీర్తి సతతమ్ము-నింపుగావు
జనన మరణాల చక్రమ్ము-సాగుచుండ
బంధనము బాయుమార్గమ్ము - బయట పడదు

201

ఇట్టితరిగల్గు జిజ్ఞాస లెవడనేను
జగము జగదీశు లెవ్వారు- జన్మలేల
జన్మలేనట్టి గతియున్న- సత్యముగను
దాని సాధింతునముకోర్కె - తగులు కొనును

202

దినదిన గండమౌ బ్రతుకుతీరు శతాయువులంచు
ననుదినమవనిపై స్వార్థమతి శయింపుచునుండు పెరిగి
ఘనతయు సంపదల్మోహ-కారణముల శాశ్వతమని
జనులెరింగియు చిత్తములను - స్వార్థసంగతిబాయలేరు

203

తమసాన నింద్రియ సుఖము దన్మయతల జన్మసార్థ
కములంచు దలపోసి భ్రష్ట-కార్పణ్య కపటసంగతుల
సమసమాజములమ పేర-జనుల వంచన జేతురకట
అమలిన జీవితానంద - మది జనహితమంట మరచి

204

ఇది యాత్మవంచనాశిల్ప-మిద్దియ జ్ఞానంపుచేష్ట
చెదులు బట్టెడు దేహబుద్ధి - చిత్త చాంచల్య విభ్రమల
ముదిరిపోయిన పరాకాష్ట మూర్ఖప్రవృత్తి నీచంపు
మదిరామదవతీ విలాస-మదమత్తమాలిన్యపూలి

205

తనువుపైనధికారమూడ - దైన్యాన బ్రతుకీడ్చు చుండ
తనశక్తి తనకీర్తి ధనము - దనవారు దూరమ్ముగాగ
తనువు వీడగ లేక బ్రతుకు దారియుగనరాకవగచి
జనన మరణ చక్రగతుల సంసర్గముల జిక్కికొంద్రు

206

మనుజ మనీష ప్రభావ మహిమ విశ్లేషించి పొగడి
మనుజానేవిభునిగా గొల్చి- మత్తిల్లి మతిమాలితూలి
మునుపు జేసిన పాపచయముముసల మై పీడించువేళ
మనుజశక్తిని మించు విష్ణు-మాహాత్మ్య శరణమ్ము నెంత్రు

207

తనకనుకూలమై కలిమి తరలి వచ్చెడు వేళలందు
తనకన్న ఘనుడెవండన్న-దర్పాన గనుగానకుండు
తన సిరుల్దొలగంగ బరమ-దారిద్ర్యమున గ్రుంగువేళ
మనుజాని శేముషీ మహిమ-మసిబారుగడు దీనమగుచు

208

కుడిచి గూర్చుండు వారికిది - గొప్పసత్కార్యమ్మటంచు
కడుపేదలగు వారికిద్ది - కడుపు నింపని నష్టమనుచు
గుడులు స్వాములు భక్తులెల్ల-కుటిలాలప జనమ్ములనుచు
జడభౌతికాచార్యులెల్ల - పత్ప్రుతులబరిహసింత్రు

209

సమసమాజమటంచురిక్త-శపథాల రాజకీయాల
సమయాల వాగ్విలాసాల - జనులవంచన జేసి పాల
నము గూర్చు మాత్సర్యమాత్రముల నడిపించు శాస్త్రాల వెల్ల
సమలినంబౌ మానవత్వ-మవని నుద్దీపింప గలవె

210

ఒకడు మేధావియై వెలుగ-నొకడు జడభరతుడగును
ఒకడు సత్పురుషుడైయుండ - నొకడు దానవుడై బరంగు
ఒకడు సద్భక్తుడై వెలుగ - నొకడు నాస్తికుడై జెలంగు
బ్రకట సమసమాజ సౌఖ్య ఫలమద్ది,యొక యెండమావి.

211

ప్రకృతి కోపింపనీజగతి-పచరించు వివిధజీవాళి
యొకట దావానలకీల-నొకట దాబడబాగ్ని గ్రాల
నొకట ఝంఝూనిలహేల- నొకట జలప్రళయడోల
వికటాల్పక్రిమి నోలెనరుడు-వివశుడై యెగశ్వాసబీల్చు

212

జగతి నేలెడువాడు జీవ-జాలాల హృదయాబ్జములను
సుగతి బ్రవేశించి బుద్ధి-శుద్ధ మొనర్చు చైతన్య
ప్రగతి బెంచెడు శక్తినిచ్చు- పరిపూర్ణ జ్ఞానమ్మునొసగి
నిగమ వేదిత సత్పదమ్ము నిశ్చల సాన్నిధ్యమిడును

213

సకల జీవుల హృదయాల సంచార మొనరించు కతన
ప్రకటు డంతర్యామి నతని - బరమాత్మ భగవంతుడంద్రు.
సకల విశ్వాల లోకొచ్చి-శాసించి రక్షించుకతన
సకల సద్గుణ పూర్ణునతని - సర్వేశుడగు విష్ణువంద్రు

214

అతని దయగలుగ శశ్వ- దానంద మనుభోగ్యమగును
అతడాగ్రహించుచో సకల- మంధకారమున మునుంగు
ప్రతులెల్ల రందుకే వాని - పైభక్తి సత్ప్రవృద్ధలంత్రు
అతని గొల్చెడు శ్రద్ధంతని - నరయు దీక్షం భక్తియంద్రు

215

భువిని కార్యములు జరుగవు- మునుపు సంకల్పాలు లేక
భువిపునర్జన్మం వోలె - పుణ్యపాపవు శేషములకు
వివిధ జీవాం సద్గతికి - విజ్ఞాన సోపానములంమ
భువుల సంకల్పించు దివ్య-పురుషోత్తమ శేషశాయి

216

జగతినిర్వది నాల్గుతత్వ-సంఖ్యానముల నెంచు విభుడు
త్రిగుణాం బంచభూతాం - దిరిగెడు జీవాళులందు
అగణితో పాధుం మూల్గు - నకళంక భక్తాళినెంచి
నిగమ నిశ్చిత పదమిచ్చి - నిత్య సత్శాంతి నొసంగు

217

సహజమగు విదేహ వాస- శాంతి చిన్మయ జీవకళల
నహరహ మ్మోళుని - చెంత - నానంద సందర్శనముల
నహమికల్మరచుటే జీవి-కత్యంత సౌఖ్యగమ్యమ్ము
ఇహ సుఖమ్ములవెల్ల వశ్య - రేంద్రియ రతి సంగతములు

218

విందులేయనిపించు వివిధ - విషయాస్థల-వివీచగతులు
ముందు కాళ్లకు బంధనములు - మోహ విభ్రమకారకములు
ముందరానంద చిన్ముక్తి - సుఖమిచ్చు సద్భక్తి, విజ్ఞు
లందరెన్నెదరు సద్భక్తి - సత్యంత శ్రేష్ఠమ్మటంచు

219

తొల్లి ఘనమనీషులు శ్రద్ధ-గల్లనిజము
లేరి జీవనిమ్నోన్నతి - నెంచి చూచు
విధి వి ధానము శాసించు - విశ్వవిభుని
విపుల లీలల బాడిరి - వివిధ శ్రుతుల

220

తొల్లికవులెల్ల ఋషులన్న - గల్లకాదు
నియమ నిష్ఠల బరిపూత - నీతి రీతి
విశ్వ శ్రేయము అను భూతి - విరుల బూయ
వెడలు నిభృతంపు సుమసూక్తి - వేదలహరి

221

అమర మైనవి యామ్నాయ - విమల సూక్తు
లవని హిమగిరి దివ్యసా-నువుల దూకు
గగన గాంగేయ శీత శీ-కరము లట్లు
మధుర మంజుల భావార్ద్ర - సుధ లొసంగు

222

తుహిన మానస గంగోత్రి - తోయగతుల
ఋషుల మానస గంగోత్రి - ఋక్ప్రవంతు
లెగసి దూకెడు ఛందోక్త - నిగమ గిరుల
చెంగు చెంగున దూకు సా-రంగ గతుల

223

ఛంద మదిశబ్ద భావార్థ - సంగమార్ద్ర
సహజ కైశికీ రీతిప్ర - సారితపద
పల్లవ విసర్గ రమణీయ - వందనీయ
విశ్వశ్రేయో విధానమ్ము - శాశ్వతమ్ము

224

జగదధీశుని దరిచేర్చు - నిగమ గతుల
జాలు వారెడు ఛందస్సు - శైలఝురులు
సహజగమనాల శ్రుతిలయ - ల్గాలువార్చు
సాగరుని జేర నదులెల్ల సాగునట్లు

225

నవరసమ్ముల నాలికించు - కవితలందు
శబ్దములు నేను నేనంచు - సాగివచ్చు
భావగతి బయనించు స - త్పదములందు
తమకు దామే శ్రుతిలయ - ల్గమక మిచ్చు

226

భావశబలత లోపించు - వచన తతులు
గులక ర్లాళ్లిడి బిందెలో - గెలుకు పగిది
కరిన కర్కశ శబ్దసం - ఘట్టనముల
శ్రవణ సౌఖ్యము జెడగొట్టు - సత్వరముగ

227

సమయ సందర్భ శుచిలేక - శబ్దములను
కవితల బిగించి త్రాళ్లతో - గట్టరాదు
యెడద ను ప్పొంగు భావాల - వడివెరింగి
నవరసమ్ములు ద్రవియింప - గవితలగును

228

కావ్యములు గావు వేదము - ల్కథలుగావు
మాదు పూర్వ పూర్వజాల స - న్మేధశోధ
సాధనోద్భూత సహజ స - ద్బోధనముల
విదితమై వెల్గ యాత్మని - వేదనలివి -

229

నిత్యమను భూతి విశదమౌ - నిశిత దృష్టి
చిద్ర హాస్యము లాత్మ - నిర్నిద్రగతుల
హృదయ కుహరాన సాక్షియై - సదయుడొకడు
తనకు బరుడౌచు వివరించు - తత్వశ్రుతుల

230

వ్యాసవాల్మీకి ముమ్మట - బాణదండి
భాసకాళిదాసృవ భూతి - భారవులను
కవిత్రయుల్పోతనల దివ్య - కావ్యగతుల
దన్మయమ్మిచ్చు నిట్టివే - దర్శనములు

231

జ్ఞాన భాస్కరు లవ్వారి - కరుణ కిరణ
భరిత భావకేదారాల - ఫలములందు
భాష్యకారుల విజ్ఞాన - పథములందు
వెలుగు చున్నది భరతోర్వి - విశ్వవీధి

232

సంస్కృతాంధ్ర కర్ణాట భాషలను దేశ్య
దక్షిణోత్తరాహిక కవి దక్షులెంద
రెందరని చెప్ప సాధ్యమ్మ - దీధరిత్రి
వారలందరు భరతోర్వి - బండివారు

233

అరయ శ్రీ బ్రహ్మ పవనజా - లాహిగరుడ
రుద్ర సురపతి యమరవి - రోహిణీశు
లాదితత్వ దేవతలెల్ల - ననవరతము
వినుతి సేతురు విశ్వేశు - విష్ణుమహిమ

234

అట్టి స్వతంత్ర సుతత్త్వుడు
బెట్టిన సంపదలివెల్ల - విశ్వస్థితిలో
అట్టి విభున్ మన మెరుగము
గుట్టెరిగెడు బుద్ధినతడు- గూర్పకయున్నన్

235

ఎవ్వని మహిమ యపారము
యెవ్వడు మన కీశుడెవ్వడు - నిష్టుడు గురుడున్
ఎవ్వడు నామెదలు దుదియు
నవ్వలి సర్వోత్తముండు - సజాడచ్యుతుడున్

236

అణుకణ రేణుమహత్తుల
గణనల నాటంబ్రొటామ గతుల నమీబా
ఫణితుల జలతల మృగకపి
గుణ గణ నరజీవులెల్ల - గొల్తురునృహరిన్

237

ఈనాటి విధానమ్మగతి
జ్ఞానోద్ధతి నవ్యమంచు - గర్తించెదరే
న్యూనమ్ముగ నానాటిని
నానాటికి తీసికట్టు - నాగంభొట్లున్

238

మనుజ మనీష వికాసము
మనసిజ సుమశర విలాస- మహిమావృతమై
వెనుకటి నేటియు రేపటి
మునుపటి మాంధాత కథల - బునరావృతమౌ

239

ప్రతిదినమున తరణి జగ
ద్హితముగ దమసమ్ము బాపి-తేజమునింపున్
ప్రతి యుగమునదే గతి మతి
ప్రతిభలు నజ్ఞాన మణచి - ప్రగతిని బెంచున్

240

ఇదియహిపైపాల్కడలిని
పదివేసంపు దొరయు రమయు - బాచిక లాటన్
పదసోపానపు. గదులను
ముదమున వైకుంఠ పాళి - మురిపించుగతుల్

241

అణువొక్కంట మహత్తునం గణమునం - దంతర్గతిం వ్యక్తమై
ద్వ్యణుకంబై త్ర్యణు కంబునై య గణితం - బైతత్స్థితిం శాసకో
న్మణి యంగుష్ఠ ప్రమాణ పీత ప్రభయై మామాధవంబైతథా
కణనిర్మాణ ద్విధా పృథః కరణ శాఖా బింబమై భాసిలున్

242

తొలిలంకేశుడు రామునిం గెలిచెనే - దుష్టప్రతాపమ్మునన్
అలదు ర్యోధనుడచ్యు తుంగదిసెనే యగ్గంపు దగ్గమ్ములన్
దలపన్ బౌండ్రక వాసుదేవుడు హరిన్ - తద్రూపమున్ దాసెనే
బలగర్వాంధులు దుష్ప్రయోగములచే బంధింపనౌనే హరిన్

243

సదహంకారము జీవ హృజ్జలజమై - సద్భక్తినుత్ఫుల్లమై
యుదయింపన్ హరి కర్మ సాక్షిహితుడై - యొక్కొక్కనిం బ్రోచెడిన్
మదమత్తుల్దు రహంకృతిం జెలగగ్రీ-ష్మమ్మధ్య మార్తాండుడై
వధియించున్ తతరౌద్ర తేజప్రసరల్ - ఫాలోగ్ర కీలోద్ధతిన్

244

తలిదండ్రులు వ్వ సుదేవ దేవకి యశో-దానందులుం గొల్లలున్
లలిత ల్గోపికలున్మని వ్రజములున్- రాధాసుధా మాదులున్
చెలికాడౌ విజయుండు భక్త సులభున్-సేవింపరే భక్తిను
జ్వల దివ్యామల విశ్వరూప విభవున్- శాంతి ప్రదాతన్ హరిన్

245

అతడు మహోన్నతాద్భుతద - యాచల శృంగము వానియాజ్ఞచే
నితరము లైన సత్యము లవెల్లగ్రియా పరిచోదితమ్ములై
సతతము జన్మ చక్రముల - సత్వ ర జోగుణ తామ సాది సం
గతుల నియమ్య జీవుల జ-గమ్ముల బొందు ద దానుభూతులన్

246

జగము ప్రయోగశాలయిట - సద్గతి జీవులు పెక్కుయోనులన్
మగుడుచు సత్వరాజస త-మస్త్రిగుణాదుల దేహధారులై
యుగముల దత్వదేవతల - యోగసహాయములం సుతత్వులై
నిగమ పథోక్త భక్తి ఫల - నిశ్చిత సన్నిధి గొల్తు రాహరిన్

247

జగమొక పద్మవ్యూహ మిటు - సంగతులై తలిదండ్రిబం
ధుగులని మోహవైరముల - నొచ్చుచు జీవులు గర్మవశ్యులై
తగులము బాయలేక సువి-ధానసులక్ష్యము లేనితామసి
జగనిరయమ్ము లందు స్రుతి-సంస్థులుగా గడుగుందు చుండరే

248

జగమొక పాంథశాల బహు-చక్కని ముచ్చట మూడునాళ్లకై
యెగబడి గెంతి వత్తురిట - హెచ్చులు దగ్గులు మచ్చరంబులన్
సిగలు సిగల్పెనంగి కడు - చిత్రము గానిట శాశ్వతంబుగా
సుగమ నివాస మేర్పరు పజాతురహో సుఖజీవయాచకుల్

249

తొలి జన్మల కర్మల చే
నిలలో బహు దేహవాస - మేర్పడు గతులం
దలసట చే దారిగనక
విలవిల లాడెదరు గాని - విష్ణుని గనరే

250

పుట్టున దెల్ల గిట్టునను మున్నుడి యున్నది నిత్య సత్యమై
పుట్టుక లేక్క జచ్చుటయు-బూజ్యము జచ్చుట లేక బుట్టుటల్
వట్టివిగాన బుట్టుకల - బాపెడు బ్రాజదు వుల్ బ్రధానమై
నట్టి పవిత్ర భూమిని సు-రాదులు గోరివసింప రారాకో

251

బ్రతుకుట కోసమై తినుట - భావ్యము తిండి భుజించు కోసమే
బ్రతుకుట నీచ వృత్తి భవ -బంధము బాపెడు విద్యనేర్చుటే
బ్రతుకుల సార్థకమ్ము పరి-పక్వత లేనియవిద్యలే కదా
ఇతరపు విద్యలెల్ల బరి-కింపగ కూటికి కోటి విద్యలే

252

పదవులు సంపదల్ఘనత పొందితి శౌర్యజవమ్ము దర్పవుం
జదువుల తెల్వితోదుదకు-జావునుదప్పు కొనంగలేరు మై
ప్రిదిలెడు దేహవాసనల - బ్రీతిని మోహము బాయలేరుస
ద్విదితుని విష్ణునింగనువి-వేకపు విద్యగ్రహింప రేలకో

253

హరి ని జవక్షసీమ-గమలాలయ రమ్యరమాసమేతుడై
తిరముగ భక్త హృత్కమల - దీప్తి శుభంబిడు బింబరూపుడై
వరిమొనకైవడిన్ వెలుగ భక్తిని గొల్చెడు దత్వదేవతల్
నిరవధి సౌఖ్యదాయకుని నిత్యుని జూపగ గాంచరీజముల్

254

సిరి చెలికాడు లోకముల - చిక్కులు బాపెడు దొడ్డ వేల్పునం
దరి యెకిమీడు వాని చరణమ్ములు మ్రొక్కుట బాడియౌ పరా
త్పరుడను వేనుబ్రహ్మనను పట్టి ప్రగల్భుల శుష్కవాక్యసం
భరితము హైగ్ర రావణుల - మాయవు దారి జరించు టేలొకో

255

శ్రీపురుషోత్తము ప్రకృతి చేతన దుఃఖము తాకలేని ము
క్తా పరదేవతాకముల తామరసాక్ష్ర రమాలలామ దా
గాపుర ముండు విశ్వ విభు-కంజ హృదంతర రమ్య పీఠిపై
శ్రీపతి సేవసాల్కడలి - సేమము గూర్చి జగమ్ము లేలెడున్

256

విశ్వ వ్యాప్తవిభూతికి
దాస్యామీదృశ ద్వితీయ-తత్వ శ్రీతా
నైశ్వర్యాష్ట కములనిడి
శశ్వ ద్వైకుంఠధామ - సాన్నిధ్యమిడున్

257

వనితల దోలుబొమ్మలుగ - బాశవికేచ్ఛల భోగభా
జనులుగ జాత భీరులుగ - జంచల చిత్తలుగా దలంచు దు
ర్జన పురుషాధము ల్లదల - శాబకు లమ్మ ఋణమ్ముదీర్పరా
మమవు త్రి మూర్తులున్ పతుల - మక్కువ తక్కువ చేసినారలో

258

హరి హృదినుండు శ్రీ నగజ-కర్ధ శరీరము వాణివాక్కుపై
పరితకు గంగకున్ శిరము - పద్రతి దేహమవంగ భావమున్
ఋరుమల పుణ్య భాగ్యములు - బోటికి గౌరవ మెల్లలోకమం
దరయగ నిచ్చి పుచ్చుకొవ-వంగవ లేగతి బేలలౌదురో

259

అబల లటంచు వెక్కెసము - లాడు రపజ్ఞ వృకీటకాధముల్
గుబగుబ మాయ పంకముల - గ్రుంకుచు మాతల గర్భవాస్యులై
సబలపు వేడ్కతో జనని - చన్గవ లాని కృతఘ్ను లౌదురే
త్రిభువన స్వర్గసీమగల - దేసరి తల్లికి జన్మభూమికిన్

260

మాతాత్రయ మంబ పరా
సీతా సావిత్రి యాజ్ఞ - సేనియహల్యల్
అతారల్మండోదరి
ప్రాతస్మరణీయ లెల్ల - బలహీనులటే

261

గార్గీ మైత్రేయి సుమతి
దుర్గవు కిత్తూరు రాణి - దుర్జయ ఝాన్సీ
దుర్గాంబా రు ద్రాంబిక
స్వర్గాల్నరకాల కనుపు - సతులల్పులరా

262

పరకాంతా వ్యామోహము
మరియాదను పాతిపెట్టు మరణాంతకమౌ
సురపతి నుడుపతి నహుషుల
మరతుమె రావణుని భస్మ - మహిమల కథలన్

263

వనితల కెట గౌరవమో
మనియెడునట దేవతాళి - మహిమలు పిరుటున్
వనితలు గినిసిన చనె నా
శనమై రావణుని లంక - శతకౌరవమున్

264

ఆదియారాధన మంగనా పురుష ప్రేమాకర్షణం బూర్ణమై
హృదయ ద్వంద్వ ప్రమా వికాసమమృత - మ్మేకాంత సౌహార్దమై
త్రిదశుల్ గొల్చు రమారమాపతుల చిద్దీప్తి వికాసమ్మునై
ముదముంగూర్చు సుషుప్తి యోగఫలమై ముక్తి ప్రసాదమ్మిడున్

265

వనితలు బూరుషుల్ద్వి విధ-వర్గములంచు విరుద్ధ బుద్ధివా
దవల బరస్పరమ్ము మమ-తల్జెడ సేతురు గిల్లి కజ్జముల్
వనితలు లేక వల్లభులు - వల్లభులుండక వారిజాక్షులున్
వనజ భవాండవాస పరి - పక్వఫలాల శుభాలు గాంతురే

266

ఆహారనిద్రాభ-యామ్మైథునాల
సాహ చర్యల నరుల్ - జంతువుల్సములు

267

మోహాల మగలకు - ముదితలకైన
దేహస్వధర్మాలు - దీర్చుటే పాడి

268

కామమ్ము గీడను - స్వాములెల్లరును
కామ మార్గములంటి - భూమిపై బడరె

269

మామూల బుమ్మలైన - సామాన్యులైన
గామాగ్ని వేగక - గామారి గనిరె

270

ఏటికీ మాటలు - వీటిపైవ్రాలు
బాటింప సహజ స్వ-భావాలు కావె

271

ధర్మాల ముత్తర - దక్షిణ ధృవలు
ధర్మవ్రతాకర్ష - కర్మలంగూడ

272

మర్మమ్ము గుహ్యమ్ము - మాలిన్య మంచు
గర్మలంపట మంచు - గడు గుందవేల

273

అతిభుక్తి యతిరతి - యాపదల్పెంచు
కితవ దృక్పథమున్న - గీడౌనుగాని

274

వామదేవుని యజ్ఞ - పథమిద్దిగాదె
కామితార్థము లిచ్చు - కర్యమ్ముగాదె

275

సిరిగూడి హరియును - శివుగూడి యుమయు
వర సరస్వతి విధుల్ - స్మరుడును రతియు

276

జానకీ రాములు - శౌరి రుక్మిణియు
న్యాయమలే స్త్రీపుంస - యోగులుగాని

277

అతి పవిత్రము చిత్ర - మద్భుత వ్రతము
క్షితిని దుఃఖము బాపి - గతి గూర్చు హితము

278

రవి చంద్ర తారకల్ - రాజిల్లు దాక
భువి బంధమోక్షాల - భువులివి గావె

279

వారికి వీరు వీరలకు వారు హితార్థి సహావలంబముల్
గోరుచు ధర్మమార్గముం - గూడి చతుర్విధ పూరుషార్థులై
చేరుట మేలు దంపతులు - చిక్కుం దొక్కుచు క్షుద్ర విద్యలో
వారడి వామయోగ హతులై కృశులై నశియించుటేలొకో

280

ఋతువున దశమీ దినత్రయ
తత పర్వ పితృదిన దర్శదగు వర్జ్యములై
ఋతుషోడశస్మృత రాత్రుల
హితరతి సద్బ్రహ్మ చర్య - మింపతి సతికిన్

281

దంపతి యోగము భువిఘటి
యింపమి స్త్రీపుంపతత్త్వ మీశునకు సమ
ర్పింపుచు సత్సోదిత స్వా
త్పంపదలో జీవితాల - సాగుట హితమౌ

282

మాతృత్వ మహోన్నతి సతి
మాత్రంబెరుగు వరము మగ-మహరాజులదే
మాత్రంబు గ్రహింపని బహు
చిత్రంబౌ పురుటి నొప్పి - చెలువగు -సుఖమున్

283

బీజావాప్తికి బురుషుం
డోజాత్మక పుత్రవాను - కొదవ్వుడగుచున్
యోజన్ బ్రహ్మమవరత
వ్యాజమ్మగు దుఃఖమూడ్చు - భవసంతతులన్

దశమి - ఏకాదశి - ద్వాదశి - దినత్రయము

284

అట్టివివాహ బంధనము పట్టి పవిత్ర పురోభివృద్ధియు
న్నట్టి గృహస్థ ధర్మముల - వాత్మ సమున్నతి బుత్రపౌత్రులై
బుట్టిన మెట్టి నింట్ల శుభముల్గలి గింత్రుతతరాత్తరాలవె
పట్టున వంశజాల్ పసిడి వన్నెకు దావి లభించుకైవడిన్

285

స్త్రీలు బురుషులు విశ్వశ్రేయసు
మూలగావ్యసు గే యములలో
మేలుకొల్పు శకుంత తతులౌ మిథున జీవములై
కాలదేశ కళాతిశయసుఖ
పాలకుండగు శ్రీశుసన్నిధి
పాలకడలిని ముక్తి సుఖముల - భక్తి గాంచెదరే

286

ధరను నాలుగు నాశ్రమమ్ముల
బరమ శ్రేష్ఠ గృహస్థ ధర్మము
బరగు ని తర శు భాశ్రమమ్ముల - బహుప్రపోషకమై
నరుల శాస్త్ర సమస్త హితముల
తెరవుగాదె గృహస్థ ధర్మము
పరమ పురుషుని భక్తిగొల్చెడు - పరమ సౌఖ్యమిడున్

287

ద్వైత సంస్థితి భక్తి యోగము
నీతి కథల బురాణ శ్రుతులను
రీతిగా బరమాత్మ విభవము - లెన్ను వినిపించున్
ఖ్యాతిలో తత తత్వదివిజ
వ్రాతమెల్లను మిథున తతులై
ద్వైతులౌ హరి సిరుల దర్శన - భాగ్య మొనగూర్చున్

288
హరియె పురుషుడు రమయె శ్రీసతి
పరమ పావన క్షేత్రభువులే
పరమ యోగ యుగప్రసార ప్ర-పంచ సంపదలో
హరి యొకండుగ బాలకడలిని
అరకనుల శయ నింపు చుండిన
వర ప్రపంచము దివ్యగతులను పరిఢవిల్లెడినా
289
అతడు విశ్వము లేలు విష్ణువు
తత రమాసతి వైష్ణవీస్థితి
సతము దా జగమేలు చిత్సుఖ-శాంతి సంపదలో
ప్రతతి సర్వ ప్రధాన పదవుల
తత సుతత్వ ని లింపదంపతి
గతులతో నియమించు శ్రీసతి - కాంతునాజ్ఞలతో
290
జీవకోట్లు తృషాక్షు దార్తిని
భావరతులద శేంద్రియాష్టల
జావు పుట్టుక చక్రములలో - సతము దిరిగెదరే
జీవ దంపతు లేక యోగద్వి
ధావిభాజ్యాలు పూర్ణయోగప్ర
భావమరయక దివ్యజ్ఞానము - భక్తి బడసెదరే
291
ఒరపిడిం బపిడికిని వన్నెలు
బెరుగు కైవడి కష్టసుఖముల
బరగు శ్రేష్ఠ గృహస్థ ధర్మపు ద్వైతమార్గములో

చేరి సగమ్మగు బూర్ణఫలముల
నరయరే నరవారు లిర్వురు
బరమ పురుషుని దివ్యసన్నిధి – భక్తి సౌఖ్యములన్

292

చదువు నేర్వగ – బ్రహ్మచర్యము
బుధుల గొల్వగృహస్థ ధర్మము
విధులొనర్పగ వానప్రస్థము వెసదురీయమునై
సదయు గొల్చెడు సద్వి ధానము
తుది మొదల్గాన సాగగలదే
సుదతి తోడుగ లేనిచో బహు– శుభములందెడినే

293

జగతి బ్రగతి విరాగ బుద్ధిని
పగలు రేలు నిరంతరమ్ముగ
సుగతి కాని కఠోర నియమవు శుష్కసాధనలో
నిగమవైర ప్రవర్తనలతో
సగుణ నిర్గుణ సంశయమ్ముల
కుగతి నొంటరి పయనములలో – గుందుచెందులకో

294

సత్య సుందర శుభకరమ్ముగు
సత్య జగతి ని జానుభూతి న
సత్య మంచుదలంచి కర్మల – సన్యసించెడుచో
నిత్యసద్గుణ పూర్ణ పురుష న
నిత్య దేహాల దేవిధమ్ముగ
ప్రత్యపావన జేయు రొంటరి – పతములందిలలో

295

మనుజా లెవ్వుడును పంచు జీవులు
జనని జనకుల పతిసుతాదుల
విమల బంధము భక్తి లేనిదె వెలయరీ యిలలో
మును జేసిన పాపకర్మం
నను భవించెదు దంపతులరై
ఘన సుభక్తి రమేశు సన్నిధి - గాంత్రు చిత్సుఖముల్

296

శ్రీరస్తు శుభమస్తు సౌభాగ్యమస్తనుచు
భూరి దీవెనలందు పుణ్యదంపతులీశు
జేరు సన్మిథునాలు నిరు చక్రముల బండ్లు - జిక్కరే బంధాలలో
తీరు తెన్నులు లేని జారచోరుల ముళ్ల
దారిలో తిరుగాడు నేకాకి జీవముల్
జేరలే రాదివ్య సన్నిధిన్ తల్బ్రహ్మ - స్వియాతిరేకమ్ముతో

297

[illegible]తిపత్ని శుభయోగ సంపూర్ణ భావాల
ప్రతి[illegible] [illegible]సుఖాల ద్వంద్వాను భూతులం
దతి శ్రేష్ఠ విజ్ఞాన సుజ్ఞాన ప్రజ్ఞాను లెసత్య సందర్శకుల్
క్షితిలోన భవబంధ[illegible]గు జీవులై
తతశ్వ దానంద సద్భక్తి [illegible]
బ్రతుకులం గడదేర్చు శ్రీద్వైత వైకుం[illegible] వాసమ్ములో వెల్గరే

298

ఇదియే రాధా మాధవ
మిదియే ప్రకృతి పురుష హిత సంయోగం
బిది సంపూర్ణ సుతత్వము
విదితము గల్పాంతగతికి - విశ్వస్థితికిన్

299

మునుపటిజన్మలందలచి - మూలనివాసము దాక వేగి మా
ఘనతను గాంతుమేనిమన - గర్వమణంగెడు దుర్భరమ్ము లౌ
యెను బది వాల్గులక్షల గుహేంద్రియ వాసప్రసంగ సంగతిన్
దనియగనయ్యె జాలునిక - దాల్చెదమాత్మ సుశోధనక్రియల్

300

మెదడున జ్ఞాపికల్పొరలు - మీటగ స్వప్న దృశానుభూతులే
త్రిదశుల నాటివో.బలికి - దెల్పెడు జీవుల పూర్వవాసినల్
విదితము లీభువుల్ విడిది - వేశ్మములచ్చపు స్వగృహంబులా
సదయుని సన్నిధింగలవు శాశ్వత సౌఖ్యము సంగు రమ్మనున్

301

నయ హరి దారిజూపి సువి -ధాన సుఖంకర భక్తి మార్గ మా
శ్రయ మొనరింప కున్నగడు - జంచలమైన మతల్ప బుద్ధిచే
స్వయముగ బ్రహ్మ నేననెడు స్వార్థదిశన్ బహుకష్టనష్టముల్
భయముల నంధతామసవు బాటల నేనెటు గుందుచుంటినో

302

శ్రీనారాయణుడైనవ్యాస వచన శ్రీల్ బ్రహ్మసూత్రమ్ములన్
శ్రీనారాయణు నాజ్ఞచే బదరిలో - శ్రీమత్సమక్షమ్మునన్
శ్రీనారాయణ ధ్యాన సంస్థిత మతిన్ - శ్రీపూర్ణప్రజ్ఞుండు సత్
జ్ఞానోత్ప్లావిత ద్వైతభాష్య సుధచే గావించెసూత్రార్థముల్

303

జ్ఞేయు న్గమ్యుని బూర్ణషడ్గుణును దీర్ణేంద్రుం గురూణాం గురున్
ధ్యేయుం దోష వివర్జితుం జలధిశా - యిన్ విష్ణు నారాయణున్
శ్రేయోమోక్షప్రసాదు బంధపరిహారిన్ వేద వేద్యుంనదాఽ
మ్నాయోపాద్యుని బ్రహ్మవాచ్యుడని ప్రామాణించె మధ్వుం డిలన్

304

మధ్వుడు నిగమ కు వ్యాఖ్యా
ప్రధ్వస్తక ద్వైతభాష్య ప్రాగ్రవి ప్రభచే
సుద్వైత గరిమ బెంచెను
మధ్వశ్రీ మధ్య గేహ - మాన్యుని సుతుడై

305

భ్రాజిత పశ్చిమాబ్ధితట - భారత పుణ్యప్రదేశ మూడుపిన్
పాజక గ్రామ మొండు నటు - పండిత వర్యుడు మధ్యగేహుడన్
బూజితు డామహోదయుని - బుణ్యసుపుత్రుడు వాసు దేవుడే
రాజిలి మధ్వుడై వెలిగె - రమ్యమహోజ్జ్వల దివ్యకాంతితో

306

చిననాటనె పూర్ణ ధిషణ
ఘన పాండిత్యము గల్గు - కతనన్ యతులీ
తని మరు దైవాంశు డనిరి
హనుమయు భీముడును మధ్వ- లనిలజులనుచున్

307

గురుడచ్యుత ప్రాజ్ఞ డిడియె
మరియతి శ్రీపూర్ణ ప్రజ్ఞ మస్కరి దీక్షన్
గురుడచ్యుతప్రేక్షుడటులె
బిరుదిడి యానందతీర్థ పేరమ్మిడియెన్

308

వేదము మన్యు బళిత్థల
లోదగు శబ్దమ్ము మధ్వ - ఋక్కై చెలగన్
ఈధర మధ్వుని జన్మను
ప్రాదుర్భవము మధ్యగేహ ప్రఖ్యన్ బెంచెన్

యదిమను ప్రదివ మధ్వ ఆధవే గుహాసంతం - ఐతరేయం. ఇహామిత్ర ధరుణం
మధ్వో అగ్రముభా మన్యు శూక్తము మాతరిశ్వామథాయతి

309

విష్ణువు రాముడై ధరను వెల్గగ వాయుజా డాంజనేయుడై
విష్ణువు కృష్ణుడై జగతి - వెల్గగ మారుతి భీమసేనుడై
కృష్ణ సునామవ్యాసహరి - కేలిడ బ్రాణుడు మధ్యుడయ్యె శ్రీ
విష్ణువు వాయుజాండు జత- వీడరు ప్రత్యవ తార వేళలన్

310

హరి యన విష్ణువు విభుడున్
హరి యన మరియాంజనేయు డనిల సుతుండున్
హరి జీవోత్తము డితడే
హరి సర్వోత్తమ సుతత్వ-డచ్యుతుడుగదా

311

ప్రాణాపాన యుదాన వ్యాన సముడై - పంచాత్మక ప్రాణుడౌ
ప్రాణుండే గద ముఖ్య ప్రాణుడగు జీవశ్రేణికిన్ సృష్టిలో
ప్రాణోచ్ఛ్వాసని వృత్యి దేహమది ని -ర్వ్యాపార కంకాల మౌ
ప్రాణాంతర్గతుడైన శ్రీహరియు దా-వైకుంఠమున్జేరెడున్

312

బంధితులైన దానవుల - బంధవి మోచగదాభి ఘాతముల్
పొందగ జేసి యావిరజ - పూత జలాలను లింగభంగమౌ
బొందలు వీడజేసి హరి - పూర్ణ కటాక్షనువీక్షణార్ద్రితా
నంద వికుంఠ మందిరము నన్మము జేరెడు బ్రాణుడితడే

313

పరతత్వ రమాయుతునిన్
హరివి సదాగొల్చుచుండు ననిలసుతుండై
హరి వచ్చిన వచ్చునిలకు
చిరసన్నిధి ముక్తి నుండు జీవోత్తముడై

314

కృతయుగమున వాయుజాడై
ఛత త్రేతన్నాంజనేయ దను జాంతకుడై
నుత ద్వాపర భీముండై
యతిమధ్వుండయ్యె గలిని యచ్యుతుగొలువన్

315

నుత పరతత్వచతుర్విం
శతి తత్వ సుతారతమ్య చయ కక్ష్యలచే
శ్రుతి సూక్తులతో మధ్వుడు
వితరణచే తత్వ శాస్త్ర - విధి హరి గొలిచెన్

316

ఉడుపిన్ ద్వైత సు సంస్థితుం డగుచు శ్రేయోభక్తి మార్గమ్ములన్
"కడగోల్కృష్ణుని" గోపిచందన హితుంగం పారివర్చింపుచున్
వడిపాల్మీగడ లావు వెన్న బెరుగుంభక్ష్యాల మధ్వుండు దా
గుడుముల్లక్కులి గోరుముద్ద లిడునా గోపాల చిన్మూర్తికిన్

317

కవ్వముతో గోపాలుడు
మువ్వల మొలత్రాడు ముద్దు మురళీరవళిన్
నవ్వడి గజ్జెల గంటల
నవ్వుల వెన్నెలలనుడుపి - నడయాడుగదా

318

ఆబాలుని వంశీరవ
మా బాలుని దివ్యలీల - అద్భుత కథలా
ప్రాభవముల్మ ధ్వతచో
వైభవములు కృష్ణనుడుపి - ప్రత్యక్షములౌ

కవ్వముతో మువ్వకృష్ణుని

319

సతురామ్నాయ పుమంత్ర మూత్రమూలకున్ పత్పద్ధతిన్ ద్వైతమున్
బ్రతి పొలంపుచు వ్యాస చిత్తము సదా–బ్రస్తావన జ్ఞేయుచున్
శ్రుతి సూక్తమ్ముగ సత్యసమ్మతముగా శేషుండు దామెచ్చని
స్మృతి మానమ్ముగ వ్రాసెమధ్వుడు బహు ప్రామాణిక గ్రంథముల్

320

ఇరువది నాల్గు తత్వగతు లేర్పడగూర్చి జగమ్ము లేలునా
దార హరి శ్రేష్ఠతత్వుడని – దోసిటియొగ్గితదాజ్ఞలెందుబా
యరు సిరి బ్రహ్మగరుడాహి మహేశు డు మా యములుప్పురం
దరులు సముద్ధరింతురని – తత్వసుశ్రేణుల మ్రొక్కెమధ్వుడున్

321

జనికివిరించి శ్రీహరి ని – జస్థితి శూలిమనస్సు గౌరిభా
వన వచనమ్ము వాణి కర– పల్లవ మందు శచీ పురందరుల్
కనుగవ సూర్య చంద్రులును – కాళులు గంతుడు శ్వాస ప్రాణుడౌ
యనలుడు జారరాగ్ని యము డయ్యెడు మిత్రిన్పదేహ గేహళిన్

322

పటుతర పాంచభౌతిక ప్ర–పంచ గుణింతపు తత్వజాలమ
న్నిట హరి సాక్షియై మిగుల–నిల్చెడు నిర్వదినాల్గు తత్వముల్
పటిమ భువిందివింబలిని – బాదత్రయమ్మున నేల జాలు స
ద్వటుడగు వామనుండు పర–తత్వము విష్ణువు బంచవింశతిన్

323

ఇది విష్ణుని సద్విభవము
సదమల సర్వాంతరాత్మ – సామ్రాజ్యమ్మున్
మొదలు తుదల్మధ్యలహరి
యధిదైవంబనియె మధ్వ డమలిన భక్తిన్

324

ఇది ద్వైత విధానంబై
నది మార్జాలికిశోర - న్యాయ మనంగన్
తుది బ్రోచుట హరి ధర్మము
పదములఁ బరిపక్వ భక్తి -బాయని యెడలన్

325

అది చపలపు బుద్ధివశ
మ్మదియె కపికిశోరన్యాయ - మద్వైతమనన్
తుది మొదలు మమేకోద్ధతి
మదహంకృతి దనుజబుద్ధి మాంద్యమ్మనియెన్

326

మనదేహములో దిరిగెడు
ఘనుడౌ సర్వాత్మవర్తి - కరుణా ద్భుతునిన్
గన స్వీయోపాధి వశత
మనియెడు నీచోచ్చ భావ-మలినులు జీవుల్

327

అనుభూతిని తాదాత్మ్యము
గని యది బ్రహ్మైక్యమన్న - కడుదుర్గతియౌ
అనుభూతిని పెనుభక్తిని
గనుచుండెడు దివ్యస్పృహయె - ఘనముక్తియగున్

328

ఒక సూర్యుడు బహుజనులకు
నొక డొక్కడైతో చునట్లు - లున్నతి హితుడై
ఒకడే హరి సద్దైవము
సకలము గని బ్రోచువాడు సర్వోత్తముడై

329

సుకమిడు రుచ్యాహారము
వికటించు విషజ్వరార్తి - విపరీతులకున్
ప్రకట ప్రభున్ హరి గొల్వక
సకలము దమరే యటన్న - సద్గతి కలదే

330

గురుహితమాతా పితృడని
పరమాత్మను గొల్వముక్తి - బహునిశ్చితమౌ
నరుడు స్వయంబ్రహ్మననిన
బరము లిహమ్ములను రెంట - బరపతి చెడెడున్

331

నను దయగను మను నరునకు
ఘనుడగు పరమాత్మ - ముక్తి గరుణించుగదా
తనదు నహంబ్రహ్మ పదవి
మునుగాల్లకు బంధమైన - మోక్షము గలదా

332

మిడిమేలపు దనుబోద్ధతి
బుడిబుడి విపరీత బుద్ధి - బోధించుచు బల్
గడిబిడి జేసెడు జడులకు
గడుసౌఖ్యంబైన ముక్తి - కలుగన్ గలదే

333

శ్రీశుడు హరి సర్వోత్తము
డీశావాస్యంబు విష్ణు - వెప్పుడు హితుడై
తా సాన్నిధ్యంబు సుఖా
వాసస్థిత ప్రజ్ఞనిచ్చు - భక్తికి వశుడై

334

శ్రీ సదభీష్టద ప్రకృతిర
మా సకలైశ్వర్య దాయి - మాధవ హృదయా
వాస సరోజ వి వాస ము
హాసిని బంధనము లేని - హరి భక్తినిడున్

335

ధాతేతి చతుర్ముఖు డా
వాతాత్మజ మాతరిశ్వ - భావి బ్రహ్మల్
ఖ్యాతుల్ తత్సుతులు సములు
మాతల్గాయత్రి వాణి - మఱిభారతియున్

336

గరుడుడు పృథ్వీతత్వము
వరదుడు విష్ణుని విహంగ - వాహనము సుమా
యురగడు శేషు డనంతుడు
నరయగ దానబ్ధి శేష - శయనమ్ముకదా

337

రుద్రుడు సద్యోజాతుడు
భద్రములిడు వామదేవ - భవుడు శివుండున్
అద్రిజ చాముండచలవు
చిద్రూపనియామకుండు - జీవులకిలలో

338

యమవరుణాగ్ని పురందర
సుమశరరతిమిథున శ్రేణి - సూర్యుడు శశియున్
విమలుడు విష్వక్సేనుడు
ప్రముఖుడు గణపతియు విఘ్న - పరిహారకుడున్

339

ప్రథమార్చ్యుడు విఘ్నేశప్ర
మథపతి శివసతిసుతుడవ - మానించు శశిన్
శిథిలత గన నిడియె నప
ప్రథమూషిక వాహనుండు - వారణ ముఖుడున్

340

ఉక్తులు శేషులు సనకులు
శక్తిసనందన సనత్సు - జాతులు ముఖ్యుల్
భక్త నృపుల్ ముక్తనరులు
సక్తులు తతతారతమ్య - సత్రైణులలో

341

ఆతని శ్రీహరి దయచే
నీతిగ సద్బుద్ధి జ్ఞాన - నిశ్చితమతులీ
యాతనల భవాబ్ధిని ని
ర్భీతిగ సద్భక్తి నావ - విహరింతురనెన్

342

మధ్వము శ్రుతుల సుశబ్దము
మధ్వుడు మనమధ్యగేహ - మాన్యుని సుతుడున్
మధ్వుండే తతమారుతి
మధ్వమునుడి మధువనాల - మసలిన కతనన్

343

ఇరువదియొక్క భాష్యముల హేల జయించుచు బ్రహ్మసూత్రముల్
ఇరువది రెంట భాష్యవిశ - దీకృతివ్యాస ముఖోక్తరీతి త
ద్వరమువ వ్రాసె మధ్వయతి - భాష్యసుపద్ధతి ద్వైత శాస్త్ర సు
స్థిరముగ సప్తత్రింశతుల - దివ్యపవిత్ర ప్రమాణగ్రంథముల్

344

సకలాచార విచార సమ్మతముగా శాస్త్రీయ తత్వార్థ బో
ధక దివ్యార్చన పూజనా విధులని - త్యాహ్నిక సత్పద్ధతిన్
నికటాత్మన్ హరిభక్తి నైజసుఖమున్ - నిత్యంబు సేవించు న
త్యకలంకంబును వ్రాసె మధ్వుడు స - దాచార స్మృతిన్ సద్గతిన్

345

శ్రీ మన్మధ్వ మతమ్మునందు హరియే - శ్రేష్ఠుండు సత్యంబు తత్
శ్రీ మద్విశ్వము తార - తమ్యములతో - జీవుల్సదాభి న్నులై
స్వామిన్ గొల్తురు ముక్తి నైజసు ఖమౌ ప్రామాణముల్మూడు స
త్ప్రేమన్ భక్తి యె సాధనమ్ము శ్రుతిచే వేద్యుండుగున్ బ్రహ్మమున్

346

సేతుమొదల్ హిమాచలపు సీమల దాకను విష్ణుతత్వ వి
ఖ్యాతిని జైత్రయాత్రల వి - కాసక దిగ్విజయాల ద్వైత శా
స్త్రాతత భక్తిబోధనల - కద్భుత వ్యాఖ్యలొనర్చు శిష్యులన్
బ్రీతి దిశాంచలాల నిజ - పీఠ సుశాఖల నుంచె మధ్వు డున్

347

బలియుంబావని జామదగ్నికృపు డశ్వత్థామ పారాశరుం
డల భక్తుండు విభీషణుండు సతత - మ్మ ట్లే చిరంజీవులై
వెలయంగాంతు మదేగతిన్ బవనజ - స్వయాంశు డౌ మధ్వుడున్
జెలు వొప్పార వెలుంగు నూర్ధ్వబదరీ - సీమంజిరంజీవియై

348

మధ్వాచార్య సమక్ష శిష్యులగు శ్రీమత్పద్మ నాభుల్ త్రి ధా
సద్వేదాంతులు మాధవుల్ నరహరుల్ సద్వైష్ణ వాక్షోభ్యులున్
మాధ్వీచంద్రిక దిగ్దిశల్వెలు గగా - మానాథ శ్రీద్వైతమున్
సద్విద్యాధృత మాధ్వభక్తి పథప్రా - శస్త్యమ్ము వ్యాప్తింతురే

349

గురులక్ష్మోభ్యపరంపర
విరిరాజేంద్రమరి మూధ –వేంద్రుయ్యాగీ
శ్వర బోధల వంశ మహివి
బరగెన్ చైతన్యకృష్ణ – ద్వైతముశాఖల్

350

జయతీర్థుండక్షోభ్యుని
ప్రియశిష్యుడు మధ్వశాస్త్ర – విస్తృతి భాష్యా
న్వయ న్యాయసుధా వ్యాఖ్యా
చ్ఛ్రయటీకాచార్యుడంచు – పద్యశముగవెన్

351

శ్రీ పద్మనాభ పిత సు
తావన శ్రీ పాదరాజ – తపముల మహిమన్
శ్రీ పతి పదరాజీవ ద
యాపూర నృసింహ తీర్థమగు ముళుబాగల్

352

శ్రీ పదియంతలు గాగా
బ్రాపిడి శ్రీ పాదరాజా – జాతము గరవన్
పావక్షయ కావ్యసుధా
ధ్యావన గవెవ్యాసతీర్థ – తాపపిచెంతన్

353

వెపతలి దండ్రియు గురుడై
యవద్యశ పాండిత్యగరిమ – మాచార్య డిడన్
దశదిశలన్ మధ్వమహిమ
గనవృష్టము జేసె వ్యాస – రాయలు భువిలో

354

సొవలె బ్రత్యర్థి ద్విప
కేసరియై వ్యాసతీర్థ - కృష్ణార్పవచే
వ్రాసె సుధాచంద్రిక ను సు
ధాప దృశము న్యాయతర్క - తాండవ వ్యాఖ్యన్

355

సురభూజము శ్రీమధ్వుడు
సురపతి యంశ జయతీర్థ సూరి సురభి శ్రీ
కరవ్యాసతీర్థ ము నిత్రయ
వరులీ పరిపక్వ భక్తి - ద్వైతాచార్యుల్

356

పలిమారు అదమారు ప్రథిత కృష్ణాపుర
పుత్తి గెయు సిరూరు - బొలుపు సొదె
కాణూర్పె జావర - ఘనయష్ట - పీఠముల్
ఉడుపి పర్యాయాప్తి - వొప్పుచుండు
భండారు కేరి సు - బ్రహ్మణ్య గోకర్ణ
కాశి భీమన కట్టె గౌడి కూడ్లి
ముజ్జిగే హళ్లి బ్ర - హ్మణ్య చిత్రాపూరు
తుళు కొంకణాల్మధ్వ - తొలిమఠాల
ద్రవిడ కర్ణాట మహరాష్ట్ర - దాక్షిణాత్య
ముత్కళాంధ్రాల వంగోర్వి - నుత్తరాది
ద్వైత తత్వమార్గపు భక్త ప్రతతి బెంచి
మధ్వదానందతీర్థుడె మహిని బ్రోచు.

357

హంస మనామ్ముడైన బరమాత్మకు నీవలి షోడ శాస్త్ర ద్వా
వింశతి సూత్ర భాష్యమిడు విజ్ఞుడు మధ్వుడు వాయుజుండు నా
సంపది రాఘవేంద్రయతి – సద్గతి ముప్పది రెంట ను జ్వలత్
శంస దుపాసనామహిమ – జాటెను ద్వైత ను భక్తి తత్వమున్

358

ఆ విధి మధ్వ పరంపర
లోవిజ యీంద్రులు సుధీంద్రులున్ శోభితను
శ్రీ వెలిగిరి సద్వైష్ణవ
కోవిదులై రాఘవేంద్ర – గురుపరముల్తైరై

358

సత్యంబైన సలోక తత్వుడితడే సత్యంకు కర్తుండనన్
నిత్యున్ శ్రీ హరి వెల్ల వేళదలచున్ విష్ణాత్మప్రహ్లాదుడై
ప్రత్యక్షం దొలగించె రాయలకుహా ప్రారబ్ధమున్ వ్యాసుడై
దైత్యారిం గనె రాఘవేంద్రయతియై – తత్తుంగ భద్రాతటిన్

359

ప్రతివాది ద్విపకేసరి
యతి సోసలె వ్యాసరాయు – డల ప్రహ్లాదుం
డతి మహిమల మంత్రాలయ
యతి సురభిగ రాఘవేంద్రు డలరున్ ధరపై

360

మంత్రాలయ గురురాజై
తంత్ర ప్రదీపాఖ్య వ్యాఖ్య – తత్వోన్నత సా
తంత్రు హరింగొల్చెడు హిత
మంత్రాక్షత లిచ్చిబ్రోచు – మహిలో జనులన్

361

రాయలం భువన విజయ మెడ
బాయని వైణికుడు గృష్ణ - భట్టును విగమా
ధ్యాయి ప్రపౌత్రుడు వేంకన
యేయతి గురురాఘవేంద్రు - డిలసురతరువున్

362

వీణావంశజ కృపను
వైణిక కనకాచలార్యా - తతతిమ్మణ్ణల్
శాణీముఖుశ్వేంకనకి
ద్రోణిం గౌతమ సుగోత్ర - కులశేఖరులై

363

వేద శిఖల వ్యాఖ్యల ప
త్పోధన పవమాన మర్మ - మాక్తుం బలధిన్
మేదిని మధుర గ జారో
హోదుం మీమాంస భాట్ట - జయముల్పడసెన్

364

బృందావన మందిరమున
సందమ్ముగ రాఘవేంద్రు డందరి యెదుటా
నందుని గను వైజస్థితి
బృందావనమందునిల్చె - వేల్పులు బొగడన్

365

యతిగురు రాఘవేంద్రుని కృపార్ద్ర కటాక్ష శుభేక్షణార్థమై
వ్రత మువవాస సేవలను - భక్తు ల నేకులు తుంగభద్ర షడ్
బుతువుల శీతలాంబువుల - రూఢి మునుంగుచు బొర్లుదండముల్
జతగ బ్రదక్షిణార్చనలు - సల్పుచు బాపెదరెల్ల పాపముల్

366

భాష్యము వ్యాఖ్యలన్ - ద్వైతమ్ము స్థాపించి
హనుమ - మధ్వాచార్య - దైలపించె
వాకరాట్ జయతీర్థ - న్యాయసుధా వ్యాఖ్య
సుకృతి టీకాచార్య - సుయతి యయ్యె
ప్రహ్లాదుడే వ్యాస - రాయలై వ్యాఖ్యాన
చంద్రి కాచార్యు డై - చంద్రిక లి డె
శ్రీ వ్యాసతీర్థుండు - శ్రీరాఘవేంద్రుడై
పరిమళాచార్యుడై - పరిమళించె
మధ్వ జయతీర్థ వ్యాసరా - ణ్మొని త్రయు, స
దోఘ విజయీంద్రులు సుధీంద్ర - రాఘవేంద్ర
కలిత బృందావనపు మంత్ర - నిలయ మందు
ఏడు నూరేండ్లు గురురాఘ - వేంద్రు డలరు

367

ద్వైత తత్వ విస్తృతి మధ్వ - భక్తి పథము
సర్వ సమ్మత జనహిత - శాస్త్ర గరిమ
విశ్వ శ్రేయము గూర్చెడు - విష్ణు పదము
భక్తి పరిపక్వ సామీప్య - ముక్తి నొసగి

368

శ్రుతి ధర్మ సంరక్షణలో
యతు లవతారాలు హితము - లాకాంక్షింపన
మతి హీనులు విశి జొత్తురు
అతి వంకర కుక్కలోక - యము సామెతగా

369

చెడునడలన్ వ్యసనములన్
జడులై మానవులు బ్రతుకు - సాగించెడుచో
మిడి మేలవు రిపు లార్గురు
దడి పింతు రదంతులేని - తామి స్రములన్

370

కను పింపని పెను చీకటి
ఘనతి మిర భయోగ్రపిం - కర్కశనిశి, ని
ర్భిన నీరంధ్ర నిబిడకా
వన మక్షా వాంధకార - నరకోపమమౌ.

371

కితవ కలాపోద్ధతగతి
హితమతికలి జారచోర - హింస్రారతికిన్
శ్రుతి దూ ష్యక స్మృతి సంస్థల
దితిసు తులు జరించు వేళ - దిఙ్మూఢ నిశిన్

372

చిమ్మని చీకటి గ్రమ్మిన
ఇమ్మహిని రవి కిరణమ్ము - లిడు వెల్గువలెన్
ముమ్మరమ్ముద్రుతు దీధితి
ద్రిమ్మరు హరి యంతరాత్మ - దేజమునింపున్

373

హరి సప్తాశ్వనభోమణి
తరణి శ్రీ భువన శక్తి - దాయకు డఖిలా
ధ్వర హోతాధ్వర్యాధ్వగ
విరతుం డఖిలాండ సాక్షి - నిఖిలావనుడున్

374

రవిశశి తారాగతులం
దివముల నక్తముల దినుల - దిరిగెడు ఋతువుల్
పవనాలను జవ తేజో
భువనాలను భుక్తి శక్తి - ముక్తులు గూర్చన్

375

తరణికర ప్రఖర కిరణ
గురు భీష్మాతప ప్రతప్త - కుంభిని వార్యాం
బర తేజోఽనిల ధూమా
భ్రరటత్పవనాలు గ్రీష్మ - వర్షా ఋతువుల్

376

తత శరదాగమ సంగతి
క్షితివస్త్రైశ్వర్య వృష్టి - గిరి గింత లిడున్
మితిదప్పని సుఖములతో
రతి రాజ్యములేలు శ్రేష్ఠ - రసమయ జగతుల్

377

హరి యె రసోవై సః యను
నిరవధి సుఖదాయకుండు విష్ణాత్మలకున్
గరుణించును ముక్తి సుఖము
లరయందన సన్నిధాన మాత్యంతికమున్

378

నిచ్చం విడిజరి యుంచెడు
తుచ్ఛంలు సంసార చక్ర - దుర్దంష్ట్ర లలో
నిచ్చలు జచ్చుచు బుట్టుచు
వచ్చును జీకటి జరింతు - రహమహమికతో

379

పశుపక్ష్యాదులు బుతుగతి
వశమై సంసారయాత్ర - బరగెడు భక్తిన్
దిశలేని యహం బ్రహ్మం
వశమే సద్బ్రహ్మచర్య - బ్రహ్మార్పణమై

380

ఈశావాస్యము సర్వము
నీశున కర్పించి శేష - మిమ్మగ గొనకన్
ఈశుడ హంబ్రహ్మను నా
కేసకలమ్మని జెలంగ - గీడగు గాదే

381

పలురకమైన జీవులకు - బట్టని మేధను వాగ్విలాసమున్
గలిమి జవమ్మయుక్తినిడి గాంచుడునైజసుఖాలు మీరలం
చలము దయాపరుండు హరి - యానతులివ్వ నరు ల్పదేపదే
తులువతవాల దుష్కటిల - దూష్యగతిన్ జరియించుటేలొకో

382

త్రిదశులు జేయగోరు వ్రత - దీక్షల నైజసుసాధనాదిచే
సదమలసర్వరూపగత - సత్యమునౌ సదహంకృతిస్మృతిన్
సదయుని శ్రీ హరిన్ బరమ - శాశ్వత శాంత సుసన్నిధిన్ సదా
గదిపి పరోక్ష జ్ఞానమను - కమ్మని సౌఖ్యము గ్రోల రీ శతుల్

383

ఒక విష్ణువు జగమేలంగ
ముకుళితులై మ్రొక్కగలరు - మునులున్ సురులున్
అకలంకుని హరి దలపక
సకలము తమరే యటంద్రు - శాత్యులు దనుజాల్

384

దశదిశ లందు ధీమతులు - త్యాగ మొనర్చి హితాలు బల్కినన్
వ్యసనము స్వార్థ సంగతిని - బాయని కీదృశ యోగ కోవిదుల్
అశనము మాని నాసిక బ్ర - యాసల బెంపుచు లంబికాదులన్
త్రసితులరైన నేమి యగు - దామస రాజస వృత్తి బాయమిన్

385

మనదేశమ్మున లోటు లేదు ధిషణా - మాహాత్మ్యసంపన్నులౌ
ఘన యోగీంద్రుల శ్రేణికిన్ గరిమకున్ - గాణాచి మాభారతా
వని యేమున్న నదేమి నీచగతులం - బాధింపరే దుర్జనుల్
దనుజల్ కౌరవకీచకాధమని యంతల్పంపు విద్రోహులై

386

కృతయుగ మాది నేటికి బ్ర - కీర్ణత సర్వసదావతార స
ద్వృతి హరి దుష్ట శిక్షణ - దేర్చుచు శిష్టుల రక్షణ క్రియల్
సతతము సల్పుచుండినను - హైందవ సంతతి మిక్కుటమ్మునై
హితనుత భక్త బృందమతి - హీనముగా గను పట్టుచున్నదే

387

కలియో షడిపు మాయలోకుజన సాంగత్య ప్రభావమ్ములో
విలువల్విజ్ఞ తమారుస్వార్థ మతులే - వేత్తల్తు ధానేతలై
ఖలులై, తుచ్ఛులు రెచ్చిపోయెదరిదే గర్వాంధ చేతస్కులై
ప్రళయోత్పాదక మారణాయుధరణ దుష్ప్రావీణ్య పాషండులై

388

రాజుల పాలనల్గ డిచె - లక్షణ మైన చతుర్వ్యవస్థయున్
యోజన శూన్యమై బరగె నున్నత విద్యలు వేతి బీరలై
మోజులడంచె సమ్మతవు - ముద్రల నందల మెక్కు మాయ మా
రాజుల రాజకీయములు - రచ్చల కెక్కిన వెల్ల దిక్కులన్

389

నియత మతింజరించు ఘన - నిష్ఠల వాల్లరు గేలి సేతురే
నియమనముం గనంబడని - చిందుల నెప్పుడు మెచ్చికొంచునే
భయమును లజ్జ లేని బహు - పాపగతిం దమమూక బెంచి ని
ర్దయులగు దానవాళిదల - దన్నెడు క్రూరత మించి పోదురే

390

ఒకడు సుకంబునున్నగను లోపమి నీచులు వంచకాళులూ
రక నరచేత స్వర్గము ను - రంజిల జూపెడు గారడీల గో
ముఖముల వ్యాఘ్రముల్వ లెను-ముమ్మ ఆదీయని తేనె మాటలన్
అకటకటా యమాయకుల - నారడి బెట్టుట నేడుజాడమే

391

గుడిసెయు గూడు గుడ్డగుడి గ్రుక్కెడు నీళ్లను వెజ్జులొజ్జలున్
గడనకు సేద్యముం బనికి - గంజియు రూకలు బంచు రైతులున్
గడు దరి నీరు వంగడియు - గల్గి సుకమ్ముల దేల్చుబల్లె లే
గడిబిడి లేని తెల్గును డి - కమ్ముల గానిక గాను పింపవో

392

నిర్భయమైన జీవనము - నిత్యము రెండశనాలు నిద్రప్ర
దుర్భవ మిచ్చుసంపదలు - దూరగనిల్లు బొలమ్ము లేకబల్
దుర్భర వ్యాధిబాధల న - ధోగతినుండు దరిద్ర మూర్తులై
యర్భకులైన మానవుల - కబ్బునె భక్తియు జ్ఞానమార్గముల్

393

దారిద్ర్యము మను జాల నం
గారములన్ గాల్చుచుండ - గల్గునె జ్ఞానం
బారాముని పైభక్తియు
వీరిన్ నరజాతి నుండి - వెలివేసెదరే

394

సంపద దీబల పదవీ
గుంపనలం గొప్ప వారు - గుణకోవిదులై
ఇంపగు బరి పాలనముల
బంపకముల సమ సమాజ - భాగ్యము లి డరో

395

దినదిన గండమీ బ్రతుకు -దీరు, శతాబ్దము లాయువైన థో
జనముల నాల్గువ్రేళ్ళబిడ - చర్దిను భాగ్యముగానరాదు దు
ర్జనులును వెచ్చముల్దరలు - సంతతమెత్తెగ బ్రాకు చుండగా
మనసులు నిర్మలమ్ములుగ - మారునె. మారునె లోకమంతయున్

396

కమ్మని కూటిలో గనవు - గాదము గడ్డియు రాళ్లబెడ్డ బ్రా
ణమ్ములో పంగు మందుల - వినాశకరమ్మగు మిశ్రణాలు శు
ద్ధమ్మగు బాలలో జలము - దప్పుడు మాటల శాంతి వాచక
మ్మమ్మక చెల్ల శీలముల -సంగడిలో నిడి విక్రయింతురే

397

జీవులలో మానవులే
దైవమ్మును గాంతు రంద్రు -దార్శనిక గురుల్
యీవిలయపుదుష్కలిప
ద్భావిగతింగాంచలేరు - బహుదుర్మతులై

398

మంచివచించెడు కోవిదు
లెంచె డు ఋజు మార్గమందు - హితముంగనరీ
వంచక కుల గురులు సదా
కుంచిత కుటిలైక వృత్తి - కోపము లెపుడున్

399

సోమరి పరపీడను లై
వేమరు హింసింత్రు వ్యాళ - వృశ్చిక మకరీ
తామస వన మృగముల వలె
శ్రీమ ద్ధీమజ్జనులను - జెనకుచు నెపుడున్

400

వేనవేలు మృషాప్రవక్తలు
మానవాళినమాయకులకున్
జ్ఞానసంపదవిక్రయింతురు - సంఘద్రోహముతో
హీనులై పరమాత్మ పేరిట.
మానవత్వము సిగ్గుజెందగ
ధ్యాన యోగ మృషాసమాధుల - ధనము దోచెదరో

401

గరిమ ఖండెడు మనులు వెలిగెడు
పితులు దొరలెడు దేశ మందున
కరకు రక్కసి మూకదిరిగిన - ఘనతయుం గలదే
సతుల పీడన జేసిప్రబలికెతు
ఖితచరిత్ర సమస్త సంపుటి
సరస సుందర కావ్యగతియై జగతి వెల్గెడివే

402

మనుజ ధిషణా మహిమ లెల్లను
జనమనాశ్రయ శ్రేయమునకై
వినయ దీధితి విశ్వమంతట - వెలుగగా వలదే
కసవి వినవి కుయుక్తి వంచన
జనుల బహుగతి తోచు కొని యెడు
వివదనీయుల రక్తవిప్లవ - విష్ణ లెందులకో

403

ఇహపరమ్ముల హితము గూర్చెడు
దహనముఖమ్మగు భక్తితత్త్వము
సహరహ మ్మను భూతి - జెందక సహమహిమ్మక తో
సహజతత్త్వము మానవత్వము
సహ సమాన సమాజ సస్పృహ
విహరణము విడి విప్లవాగ్ని హ - విస్ఫురేల్చెదరే

404

ఫణిఫణోన్మణి వ్యాఘ్రనఖముమ
ఘృణిస ధోమణి గుణి కిణమ్ముల
ప్రణుత రీతి గుణించుచణులౌ - భవ్యమానవులే
అణు ప్రసూన శుభోత్పలమ్ముల
కణకణాంచిత దివ్య ఫలముల
సణురణాగ్ని ప్రచండకీలల - హవన మిచ్చెదరే

405

పుల్లుగాడుగుల రాజకీయపు
వట్టి మాటల నేతలతికెడు
లొట్టిపిట్టల కితవమతముల - లోటు పాటులతో
దిట్టతనముస మానవాళికి
గట్టి మేల్సమకూర్చుబెట్లౌకొ
మట్టి గతికెడు మోసకారుల - మాయమాటల తో

406

పెదవితుదలను తేనె సోనలు
హృదయమందున నగ్నికీలల
సదృశులై హసియించు చదురు - శంబరామర్థులై
ముదము గొలిపెడు మాయమాటల
గుదురుగా నయ వంచనముల
మదవతీమదిరాప్రమత్తులు - మాయమాంత్రికులే

407

ధరలు జాక్కలవంటువట్టులై
పరుకు లెల్ల కు మిశ్రణములై
పరగుణౌషధులెల్ల విషమై - పరమకృతకములై
ధరవణిగ్జన ధనముఖార్జన
పరమనీచప్రలోభములతో
బరగుచుండిన మనుజజాతికి - ప్రగతి కల్గునా కో

408

చదువులమ్మెడు పాఠశాలల
పొదుపు పాదవు - వ్రూటకూళ్లను
మదవతుల్యమమానమమ్మెడు - మలిన విపణులలో
పదయహృదయులు వేద వేద్యులు
బుధజనావళి నమ్మకస్తులు
వెదకిచూచిన గాను పింతురె విశ్వశ్రేయదులై

409

జాతిభేదము వర్ణ భేదము
రీతి భేదము వర్గభేదము
హేతువై వరజాతులెల్ల నశించిపోవు నాకో
నీతిలో మనసమాజ స్పృహలో
నాతిక్రమ్యవిధానతతిలో
ఖ్యాతమత నహనాల మనుజాలు - ఘనతమనవలదే

410

ఈరీతిన్ గితవాళిసీచగతులన్ హివాతి హిమస్థితిన్
జారుల్ చోరులు మద్యమాంసగణికా - సంపర్కులై మించుచో
నేరీతిన్ జగమెల్ల మంచి గను నీ - వేతేరి రాకున్నచో
నో రాజీవదళాయతాక్ష నృహరీ, - యుగ్రప్రభాకేసరీ

411

నీరం తిక్కగుదుర్వగ
శౌరివిహరి నీకు గాక - జడులకు వగునా
వారువమో వారసమో
నీరాపియొనీరి గూల్చ -వెడలుముకల్కి

412

శ్రుతియుగమందుదుర్జనులు - భ్రష్టమదాంధత మించి పోవుచో
ప్రతతిశుభావతారముం - భావప్రకాశమెనత్స్వమూర్తివై
హితములు గూర్చవేజగతి - కెల్లమదాంధుల గూల్చిధర్మ స
ద్గతి విధిగా నొనర్చిదహా - కాల సుశాంతిని గల్గ జేయవే

413

నినువలె వేరుదైవములు - నిక్కముగావవతారమెందుగై
కొనరుయదాయదావిధులు - గూలెడు వేళల సంభవింపుచో
హనుమరమలర్త్యదీయ పద - మంటుచు వెంటల వత్తురయ్యదే
గానబగు యానవాలు నిను గొల్వనృకేసరి శౌరి శ్రీహరీ

414

జలముల మీనమై నిగమ సంపదచోరుని సోమకాసురున్
జలధి వధించివేదముల శాశ్వత రీతి సముద్ధరించి త
జ్జలముల జీవజాలముల సద్గతి కూర్చు సథాధిగమ్యమౌ
కలిత వికుంఠవాసచిర - కాలముఖమ్మది గల్గజేయవే

415

మూపునమేరు మంథనము - ముప్పిరి వాసుకి పాముపగ్గమై
రాపిడి దేవదానవులు -రమ్యసుధాబ్ధిని జిల్కనమ్మృతాల్
రేపి సుషుమ్న గుండలిని - లేపి భవాబ్ధిని జిల్కుడంచు నో
పాపహరా హరీ యమృత - భాండము జిల్కగ గూర్మమై తివే

416

సకల ధరాతలమ్మునొక చాపగ జుట్టు హిరణ్యనేత్రునిన్
గ్రకచకరాళ దం ష్ట్రముల - ఖండమొనర్చిధరిత్రి బ్రోవవే
ప్రకటవరాహరూపమున - భ్రష్ట మదాంధులు దానవాధముల్
వికట మతిన్ జెలం గినను - విశ్వవిభున్నిను సైపనోర్తురే

417

అతితెలివిన్ హిరణ్యకశి - పాధము డెంత వరాల వింతలన్
మృతిని జయించెనే తనయ - మేయబలమ్ముల వైరమూని తత్
స్థితిగతులం జయించి వడి - జీల్తు వవేళను వాడిగోళ్లతో
జతుర మహోగ్ర కీర్తి కెది - సాధ్యము గాదునృసింహమూర్తికిన్

418

ఐదుగుం బాపడు బొట్టి వాడ్వటుడు బ్రాహ్మణ ప్రభన్ వామనుం
డడుగుల్మూడిడు వాకటంచు బలివర్యుంఢివ్వనర్థింపుచో
జెడుగంచున్ గురు శుక్రుడాడెడు వచః శ్రేయంబులంద్రోయరెం
డడుగు ల్బూన భుముల్ద్రయిన్ బలిని బాతాళమ్ము నందుంచవే

419

పరశువు బూని క్షత్రియుల వంశములేర్చితదేక వింశతుల్
పరమప్రచండ యుద్ధముల భార్గవ రామ పరాక్రమాలు ప
త్వరముగ విష్ణు చాప సహితమ్ముగ్రహించి స్వవిష్ణుశక్తి తో
విరుదెస బ్రహ్మ క్షాత్రముల వేలితి వే భృగురామ రాఘవా

420

మానవతా వికాస బుజా మార్గము సర్వము భవ్యదివ్యమా
ధానము జేసి చూపి తలిదండ్రికళత్ర సుపుత్ర భ్రాతృవి
జ్ఞానుల మిత్రులంరిపుల కంటకులంగడు ధర్మవర్తివై
భాను కులేందుమూర్తిమహి పట్టికి ప్రేముడి రాముడైతివే.

421

దశరథుడే దశేంద్రియరథ - ఢస్థవిమోహిత రాజసుండు త
ద్దశముఖుడీల్గెతామసపు - ధాత్రిజ శ్రీప్రకృతీజయేచ్చచే
భృశమగు సంయమమ్మునను - విష్ణు మసాత్విక రామమూర్తి వై
కుశలురు తమ్ములుం గొలువ - కుంభిని సూతి వరించి వెల్గవే

422

హలముసలీ గదాఢ్యుడవు - యాదవశ్యామున కష్ణవెమహో
జ్వల బలరామ నామమున - వైరుల గూల్చగతా ప్రయోగముల్
తెలుపుచు శిష్యనాకురుప - తిందరిజేర్చవు నాన ప్రష్టివై
వెలపెదవీవు యాత్రలను - విష్ణుని కృష్ణున కిష్టులార్థివై

423

పెదవిని వేణు గీతి శిఖి - పింఛముగస్తురి బొట్టు గౌస్తుభ
మ్మొదకటికింకిణుల్ సుధల -నిచ్చెడు గోవులు బల్లవాధరల్
గదియు శరత్ సు చంద్రికల - గాముని యామిని యామునీతటిన్
ముదితయుగాంతరాల హరి - మోహనుడౌదువు రాసక్రీడలన్

424

చేతన్లేదొక సాయకంబు కొవాటిప్యందవాల్తోదు సం
ప్రీతిందోలుచు బార్థ సారథివి వి - ర్భీతింగురు క్ష్మోణిలో
చేతోసంశయవృత్తి బాపివిజయ శ్రీగూర్పు గీతార్థముల్
వాతిక్రమ్య స్వధర్మమంచు-ననికా - జ్ఞాపింపవే చిద్గురూ

425

ఘనతర వేదమంత్రముల - గమ్యముమార్చుచు యజ్ఞహోతలై
దనుజకుయజ్ఞపూరుషులు - దామెహవిష్వుల మాహుతుల్గొనన్
పనిగొనివేదనింద్యులగు - వారిని గెల్వతథాగతాశిశూ
క్షణికము నశ్యదృశ్యమను - కారిక శ్లేషల బుద్ధుడైతివా

426

దేవానాంనామధృతిత్వ
మేవేకోయని శ్రుతిభువు- లెల్ల నుతింపన్
నీవెల్ల సునామకుడవు
శ్రీ విష్ణూవాసుదేవ - శివ ! హేస్థాణూ !

427

దివిభువి సర్వదేవతల - దివ్యపవిత్ర సునామ ధారివై
భువులను వేద ధామముల - పూత పితా జనితా విధాత సం
భవముల విశ్వదేవతల - మంగళ ప్రశ్నల జీవధారచే
భువనములందు నన్యముల - బూర్ణుడొకండవు విష్ణుమూర్తివై

428

ఉదయాస్తాచల సేతు శీతన గము - ద్యోత్కృష్ట ధామంబులన్
విదిత శ్రీ పతి వౌచు బ్రోచెదవిలన్ - వేదాద్రి వేలాద్రి వా
రిధి భద్రాద్రిని వెంకటాద్రి ఘటికా - శ్రీ రంగ శ్రీ పండరీ
బదరీ పూరిగయా ప్రయాగ మధురా - వారాణసీద్వారకన్

429

అలగోదావరి దివ్యవారి తటిపై - నాంధ్రోర్విభద్రాద్రిపై
లలిసౌమిత్రి కపీంద్రుడంజలి మణుల్ - రత్నాల్గనాలివ్వగా
నిలనిత్యమ్ముగ చైత్ర శుద్ధనవమిన్- యింపౌదలంబ్రాలతో
చెలిసీతందగ బెండ్లియాడెదవుగా - శ్రీ రామ చంద్రప్రభూ

430

ఫలముల్ తియ్యని వంచు వెంచు శబరీ - భక్త్యార్పితమ్మెంగిలుల్
తలమేలూవుచుదింటివో రఘువరా - ధన్యాత్మయో యాపెయెం
గిలియే లెస్స శుకమ్ముగ్రోల జయమై - గీతార్థమై భారత
మ్మలపై జైమిని శౌనకాదులకు గుప్పించె న్మరందమ్ములన్

431

యమునాకూలము వాలుబోతులను నం-బాయించులేదూడలున్
కమనీయమ్ములు బాలు వెన్న పెరుగున్ - గద్దల్కడు న్మీగడల్
ఘుమ ఘుం ఘుమ్మను నేతి వంటకములున్ - గోగోపి గోపాలురున్
గుములా నాటికినేటికిన్ మధురలో - గోవిందు మాధుర్యముల్

432

యమునానీల జలాల కాటుక కనుల్ల - య్యావులంకేకిపిం
ఛమునన్ వ్యాళ ఫణమ్ము పైన గబరీ - సంబద్ధధమ్మిల్లమున్
మమ గేహాల దమాల నీడల మధల్ - శోధించుభృంగాలమే
ఘములన్ గాంచితరింత్రు భక్తులిచటన్ - గంపారి మేనిస్మృతుల్

433

కొలహో పూరువ కేగెలక్ష్మి ప్రణయ - క్రోధమ్ముతో వంచునీ
వలమేల్మంగపురాన వింగిమలకున్ - హర్మ్యమ్ము నిర్మించి తి
ర్మల పైనందువు సంగవామములలో - మాహాత్మ్యముల్జూపుచున్
గలిలో వేంకట సామి వైబుణములన్ - గారుణ్యతన్ దీర్చుచున్

434

సలుగర్వాంధుల బాపనాశన జలా - పాతాలలో ముంచి కుం
తలన్నే శమ్ముల గట్టులందరిగి నానావర్ణసంకీర్ణమౌ
నిలపై వెల్లర వేరబిర్చి సుకముల్ - యీడేర్చి సాన్నిధ్యని
త్యుల వైకుంఠము గూర్చునే తిరుమలేశా వేంకటేశ ప్రభూ

435

కలిలో ధర్మమదొంటి పాదముపయిన్ - గాలూను నంచున్నదా
కలి సంకీర్తన జేయుటే మిగుల సౌ - ఖ్యంబన్న కర్తవ్యమున్
బలు మౌఢ్యమ్మని గేలి సేతురుగదా - పాషండు లైభక్తదే
వశ దైవమ్ముల నమ్మరాదనుచుబల్ - పాపాత్ము లిప్పట్టునన్

436

ప్రేమాగ్నిన్విషయేంద్రియాజ్య దహిత - ప్రేమైక సారూప్యతన్
బ్రేమేజీవము బ్రహ్మభావమగుత - త్ప్రేమన్ప్రమాది స్థితిన్
బ్రేమే దైవము జీవతత్త్వమపియన్ - వేదోక్తులంచున్నదా
ప్రేమాచార్యులు బోధ సేతురుగదా - పెన్జీకటిం బాతముల్

437

రజనీ పతితా నమలిన
నిజ దంపతి కమరభక్తి - నిజసౌఖ్యమిడన్
రజనీకాంతను - తుంటరి
యజనము రతి బ్రహ్మచర్య - మానందమనెన్

438

సర్వ మున బ్రహ్మకలడన
సత్యము సద్బ్రహ్మయంచు - ఛలవాదములో
సర్వజ్ఞేతి యహంకృతి
దుర్విషయాసక్తి దెంత్రు దుర్బోధలచే

439

మతముల మూల బోధకులు - మానవజాతికి మేలు సేయత
ద్గతులను స్వార్థదుర్విపణి - కర్మల రీతుల విక్రయించిత
వ్మతము ల టన్న రోత లను- మానము బెంచెడు రాజకీయముల్
మతముల గూర్చి మానవత - మాయ మొనర్తురు ధూర్తబోధకుల్

440

కితవాచార్యులు ఘనులై
ప్రతియూరవ్వేలయు చంద్రు - భగవానులుగా
హితములగరపెంత్రు చలు
వ్రతముల దయ్యాలు క్రతుల - వర్లించునటుల్

441

అందరు ఘనుల మటందురు
అందరు నవతారపురుషు - లనఘులరనగా
నిందలి వంచకులెవరో
మందర ధర మూర్తి మాకు - మదితెల్పుమయా

442

ఏ రూపంబు ధరింతువో ఖలుల నీ - వేరీతి ఖండింతువో
నీరూపంబన వంచకుల్లెలగిను - వీర్నలై మతోన్మాదులై
పారూవ్యంపు సమాధి బ్రహ్మనమ త - త్వామ్య భ్రమన్ మూఢులై
దారుల్తోచని బోధసేయ ఖహాథా - ధావింతురే పజ్ఞముల్

443

జలతల వాయు సంబరపు - సందులు గొందులు నిండిరిప్పుడీ
ఖలులు కు శాస్త్ర పారగులు - కాశ్యపి గాల్తురు కల్కివౌచు నీ
రల తల లోని నీచక్రిమి - రాశిని గూల్చి సమేధలిచ్చు చి
ద్గుళికల వేయుమయ్య మరి - కూళ కుబుద్ధులు పుట్టకుండగా

444

జగము సమాన సామ్యమని - చక్కని మాటలు సవ్యసించి ము
జ్జగముల యోగభోగముఖ - సారప్రసారనిశాపథమ్ములన్
ద్రిగతి సమాజ భోజ సరి - ప్రాజ విడౌజాల రాజ్య కాంక్షలో
దొగిలెడు మానవాళినిక - ద్రోవ విజమ్ముగ రమ్ము మాధవా

445

ప్రతియొకరున్మ హెూదయులె! - పావనులేమనులే మహాత్ములే !
హితకర బోధకాగ్రణులె - యింపుల సొంపుల తేనెవాకలే
బ్రతుకుట లొక్కతీరు మరి - బల్కుట లింకొకతీరు కంతలం
దతుకుల బొంతలీ జనుల - హంగుబయల్పడరమ్ము మాధవా

446

శ్రీ మత్షోడశ పూర్ణషాడ్గుణులరై - శ్రీ రామ శ్రీ కృష్ణులై
శ్రీ మానాథ దశావతార గరిమన్ - జెన్నొందగా నన్యులౌ
స్వాముల్ రిక్త పథాల దార్శనికులై - వాచాలతాచార్యులై
వామాచార ప్రచార ప్రేమగురులై - బాధింతురే భక్తులన్

447

పరమ పవిత్రభక్తి సరి - పక్వఫలమ్ముగు నైజసౌఖ్య సు
స్థిరమగు యోగమార్గములు - దెల్పు న యోధ్యయు ద్వారకావిభుల్
పరమగురూత్తము ల్మగు ల బల్కిరె బ్రహ్మల మేమటంచు స
ల్పరె హరి పూజలన్ నిగమ - పద్ధతులెన్నిన ద్వైత సంస్థితిన్

448

పదముల భక్తిసాధనల - సత్యపథాన సుశాస్త్రరీతి స
మ్ముదవు ప్రశాంతిముక్తిసుఖ - మున్ సహజమ్ముగ జూపి ద్రోతురా
పదయులు విష్ణువంశజాలు - సన్నిధి శ్రీ సతి వాయుజాండు ద
త్పదయుగ సేవలన్విడవి - ప్రత్యవతార సులక్షణాఢ్యులై

449

సదమల భక్తి బోధనల - సజ్జన శ్రేష్ఠులు సర్వకాలమం
దుదరతులై జగమ్ముల స - దూర్జిత శక్తుల వెల్గుచుంద్రు స
ద్విధి గురురాఘవేంద్రయతి - దీనుల దీపిక షిర్డిసాయియున్
బదపడి పాఠశాలల సుభక్తిని - వేర్పుబ్రశాంతి సాయియున్

450

వర మంత్రాలయ రాఘవేంద్రగురురాట్ వ్యాఖ్యాతటీకమ్ములో
విరులై దివ్యపరీమళంపు టలలై విశ్వాస దేశమ్ములై
గరిమన్ సర్వమతానుకూల గతులై - కాలాను కూలంబుగా
గురువిద్యాలయ పూర్ణప్రజ్ఞశ్రుతి సూక్తుల్ప్రోచు సద్వ్యక్తులన్

451

కలిలో నామావళితో
లలితభజనలు సల్పుచుండ - లక్ష్యము దొరకున్
తొలి పూజలు యజ్ఞమ్ములు
సులభము తో శుద్ధభక్తి - శుభఫలములిడున్

452

ఆశన వసన వ్యసనమ్ముల
నిశిదిన పర్యంతమందె - నిలువక భక్తిన్
అనవద్యశ మౌ హరిభజనల
వసియించి హసింపుమంద్రు - ప్రభుసన్నిధిలో

453

తురగపు వాల్గపాదముల - దూకెడు ధర్మము క్షాత్రతేజమై
దురితుల నీచకీచకుల - దూయుకృపాణము జ్ఞాన ధారయై
విరతము శాంతి సౌఖ్యమిడు - విశ్వచతుర్విధ పూరుషార్థమై
హరివిక గల్కివై వెలుగవయ్య జగమ్ముల సత్యశాలివై

454

మమతలు స్వార్థముల్విడచి - మాన్యశుభాధ్వరులై ద్విజోత్తముల్
దమనము సల్పి దుష్టులను - ధర్మప్రపోషకులై సుక్షత్రియుల్
ప్రముఖిత ధర్మతక్కెడల - భాగ్య ప్రదాతలరై వణిగ్వరుల్
అమర కృషీవలుల్శ్రమికు - లన్నములిత్తురు కల్కిరాగదే

455

జనులెల్లన్ సుకముండు యోజనలతో -సంకల్పము ల్పొంచుతన్
ధనికుండైనను నిర్ధనుండయిన దా - తత్వార్థ దౌదృష్టితో
గణకుండయినను పాలకుండయిన ను - జ్ఞానమ్ము లార్జించుతన్
వినత శ్యామల సస్యసంపద భువిన్ - బెంపొందు నీరాకతో

456

శ్రీ పతిరాగ లక్ష్మి విక - సించు వసంతరమా సుమార్ద్రతా
రాపథ చంద్రికా సితప - రాగ పరీమళ మంద వీచితో
నాపయి వ్యాసమౌనిసుమ ఖాష్టమధార్ద్రిత బ్రహ్మసూత్రమా
ద్వీపల మధ్వభాష్యములు - విశ్వశుభమ్ముల గూర్చునెప్పుడున్

457

హరుడువిరించి రాక్షసుల - కంతటి వింత వరాలొసంగ నా
దురితులు రెచ్చిపోవ మరి - దుష్టుల గూల్చ సదావతారముల్
హరిగొనుటాన నాయిటి స - దాను భవమ్ముత దాను రూపమున్
హరిధరియించి బ్రోచు విజ - మందరు గూర్చుడు స్వాగతారతుల్

458

ఇది హరిసార్వభౌమ జగ - మియ్యది సత్యము మాయకాదు, నె
వ్విధముగు తెల్పితో వరుడు - విశ్వవిభుండగు సీటులేదు స
ద్విధివిడి తాన యోనిజాడు - నిర్మలు డౌహరి భక్తి బ్రోచుటే
పదముల ముక్తి సౌఖ్యమని - జాటెడు భక్తివి సర్వవేదముల్

459

ఇది విని జదివిన వ్రాసిన
జదివించిన విశ్వవిభుడు - సన్నిహితుడగున్
సదయుడు శ్రీ హరి దయచే
సదమల వైకుంఠపదన - సద్గతి దొరకున్

460

మతులకు గుమతుల తతికిన్
హితులుం గితవులకు నెల్ల - నింగితముగనన్
శతకోటి ప్రణామమ్మిడుదు
తత సాక్షులు సూర్యచంద్ర - తారాజగతుల్

461

అది కర్ణాటక మాంధ్ర సంస్కృతములం- దాంగ్లేయహిందీవిధిన్
సదయాచార్యుల బోధ ప్రాజదువు లన్ - సద్భక్తి జిజ్ఞాస చే
మధురంబైన రమాపతీ మహిమ చే మధ్వోక్తి పియూషమై
నది నాకిట్లులభించె లక్ష్మి నరసిం - గాత్మజ ప్రహ్లాదుడన్

462

ఆత్రేయ అర్చనానస
అత్రుల్యావాశ్వతత్రిత - యాత్రేయ జస
ద్గోత్రీకుడ బ్రహ్లాదుడ
ఛాత్రదశ సుధీంద్రుడనిరి - సద్గురులు ననున్

463

నారాయణ కొప్రేశులు
బూరించిరి పాణిని నుడి - పూర్ణప్రజ్ఞం
డారీతివి సాహిత్యము
శ్రీ రంగా చార్యభాష్య - శిష్యాణువుడన్

464

లలి రామకృష్ణ బలిజే
పలి దినకర వేంకటాఖ్య వరులు దెనుంగున్
తలిదండ్రులు కర్ణాటక
మలవిద్యాలయము హింది - యాంగ్లము గరపెన్

465

ఎన్ని విధాల నేర్చి కడ-కెంత ఘనోద్ధతి విఱ్ఱవీగినన్
సన్నుతరీతి సన్మతిని - సత్యపథాన జరింపరేని యా
పన్నత మానవాళి పలు - పొల్ల గృశించెదరట్లు గాక నిన్
వెన్నుని విశ్వపోషకుని - వేడిన జాలు శుభాలు నిత్యముల్

466

నడచుచు నున్నవారి చరణంబుల గ్రుచ్చెడు రాళ్లకైవడిన్
కడకెటు వ్రాయనేమి సమ-కాలము వారలు మెచ్చరన్నత
న్నుడు ల పవాదులై మిగుల -నోముల బూచిన కావ్యపుష్పమున్
అడుకువ మ్రొక్కి శ్రీహరి సమర్పణ సేతునహీన భక్తితో

467

కవితా కండూతి కి నై
అవిరళ పాండిత్య హేల - నలరించుటకై
సువిచారా చార ఘనత
నవి కొరకే వ్రాయలేదు - సద్భక్తి వినా

468

శ్రీ మంతులు ధీమంతులు
సామంతులు సకల జనులు - సద్గతి గనగా
శ్రీ మానిని విభుని జగ
త్స్వామిని గడుమ్రొక్కు చుందు - సద్భకుడనై

469

జయ జయ జగదీశా - సర్వ జీవాధివాసా
భయ దురిత వినాశా - భక్త స్వాధీన వేషా
నియమిత సకలాశా - నిత్య లక్ష్మీ విలాసా
జయతు జయతు శ్రీశా - సచ్చిదానంద వాసా

ఇతి
శ్రీ శ్రీశతత్వామృత మంథనం నామ
కావ్యే
ప్రథమాశ్వాసం
సంపన్నమ్.

# శ్రీ శ్రీ శతతాళ్ళమృతమంథనం

# ద్వితీయాశ్వాసము

# శ్రీమద్వేంకటేశ వ్యంగ్య వైభవమ్

1

శ్రీనాథ నీదివ్య – శేషాద్రి యగుగదా
        తిరుమల వైకుంఠ – పరమ పదము
కమలాలయ ప్రణయ – కలహ కావ్యము గదా
        పద్మావతీ దేవి – పరిణయమ్ము
అబ్ధి జామాత తానబ్ధిజామాతయై
        యవతరించుట గదా–యద్భుతమ్ము
సిరియల్లి పోవగా – వరవాహముని వద్ద
        యపలు మించెడు గదా – యనుదినమ్ము

ఘనమడ వేతేఱ వివియెల్ల – గారణములె;
భక్తులను బిల్చి రక్షించు – యుక్తిగాని
సంకట వినాశ మము బ్రోచు – వేంకటేశ
వరద పద్మావతీ శ్రీశ–తిరుమలేశ

2

నీలాలకము లిచ్చి– విలువు దోపిళులిచ్చి
        నిన్నాశ్రయింపరే – నిఖిల జనులు.
అడుగడ్డు దణ్ణాల – వాపదమ్రొక్కుల
        ధనరాసు లొసగరే – ధనిక జనులు
సంకట వేళలన్ – వేంకటేశాయంచు
        యెలుగెత్తి పిలువరే – యెల్లజనులు

దశదిశల్ప్రయవించి - దరిజేరి నీపాద
　　శరణమ్ము వేడరే -సకల జన్ములు

క్రొండ కొనలందు గొలువుండి దండి జనుల
దటికి రప్పించు నీ నేర్పు - వెలుగ గలమె
సంకట వినాశ ముము బ్రోచు - వేంకటేశ
వరద పద్మావతీ శ్రీశ - తిరుమలేశ.

3

శుష్క వేదాంతులు - శూన్యవాదము లోడి
　　కలియరే కల్యాణ - కట్టయందు
ఉద్దండ పండితు - లిద్పుటార్పుటిమాని
　　యూర్ధ్వ పుండ్రాల్దిద్ది - యొప్పి కొనరె
సురమౌని - తుంబురల్ - సురపతి బృందమ్ము
　　వైతాళికాళియై - బలుగ లేదె
మునులెల్ల దిరునామ - ములబూని తిరుమంత్ర
　　దేశికోత్తంసులై - తేలలేదె

సంతలను దీర్పు వాత్సల్య - వ్రతము గాక
సంతమున్నదె నీచెంత - పాపనాశ
సంకట వినాశముము బ్రోచు - వేంకటేశ
వరద పద్మావతీ శ్రీశ - తిరుమలేశ

4

పదివేపములు జాల - వాయాది ముదిపావి
తిమ్మప్ప వైకొండ - దేలివావు
దేవేఱు లిద్దరు - దివియుటల్ జాలదా
బీబివాంచారివి - బిలిచివావు
వశవర్తి యై లక్ష్మి - వరలివంజాలదా
వక్షీలపై వప్పు - బడపి వావు
మోక్షాశలో భక్తి - మ్రొక్కవంజాలదా
తలలు బోడులు జేయ - దవిపెదీవు

ఎంత పమలయ్య తిరుపతి - వేంకటయ్య
భక్తులవ బ్రోవ బలుపాట్లు - బడెదవయ్య
పంకట వినాశముము బ్రోచు - వేంకటేశ
వరద పద్మావతీ శ్రీశ - తిరుమలేశ

5

కొండపై రావంచు - గోవరివాయలివేణి
అలమేలు మంగావు - రాంగణమ్మ
విష్ణుపాదజ గంగ - విడలేక దూకెవా
పాపనాశవ జల - పాతయురుల
విడలేక వచ్చిరా - పెమబాము పక్కియు
శేషాద్రి గరుడాద్రి - పిరుల గిరుల
అమబంధముడుగక - వాయశోదాతల్లి
వకుళయై యమ్మయై వచ్చెవయ్య

దరకు బరివారమును దెచ్చు - తంతుకాక
నీదు భక్తుల విడుతువా - నిముసమ్మైన
సంకట వినాశమును ద్రోచు వేంకటేశ
వరద పద్మావతీ శ్రీశ - తిరుమలేశ

6

పదునాల్గు భువనాల - తిరుపతి జాలదా
వజ్రకిరీటమ్ము - బడసినావు
సహజాంగ కవచంపు - సౌఖ్యమ్ము జాలదా
వజ్రంపు [illegible]కవచాన - వరలినావు
సకలాస్త్ర పాండితీ - వ[illegible]రతల్పాంచా
పెదవిపై చిరునవ్వు - పెట్టినావు
కస్తూరి తిలకస్వ - శస్త్రమ్ము జా[illegible]
సంగనామాల్పెట్టి - పొంగినావు

చెకిలి వేసంపు ద్రాజగంగ - వెల్లువెత్త
వేపి కొంటివి కలగూర - వేసమిపుడు
సంకట వినాశమును ద్రోచు - వేంకటేశ
వరద పద్మావతీ శ్రీశ - తిరుమలేశ

7

కనక గోపుర సక్తే - కలధౌత సౌధాల
మణిగణాంతచిత రత్న - మహిత దీప్తి
శ్వేత ఛత్రచ్ఛాయ - వింజామరలహేల
మంది మార్పుల వంది - మాగధాళి

మృగమద సౌరభ - మ్మెగయ గస్తురి ధూప
　　చందనార్ద్ర సుగంధ - మందిరాల
వీణామృదంగ నిక్వాణంపు శ్రుతివింపు
　　నప్పరో నాట్యాల - ననుదినమ్ము

కొండపై గొల్వుదీర్చుట - గొప్పకాదు
నతుల హృదయాల నడయాడు - హితము గాని
సంకట వినాశనము బ్రోచు - వేంకటేశ
వరద పద్మావతీ శ్రీశ-తిరుమలేశ

8

యతులకు మతిపోయె - నతివల గతియేమి
　　భువన మోహన సామి - చెలువ మేమి
వేదోక్త సూత్రాల - వాదాల తీటులో
　　వెఱుగ జెప్పెదవేమి - యెఱుకసోదె
యజ్ఞయాగాదుల కర్పనా విధులకు
　　శతగోప మిడుటయా- శ్రుతిఫలమ్ము
కైతవార్జిత విత్త - కాలుష్యమును బాప
　　హుండీల నింపుటే - యుక్తమేమి

ధర్మమోక్షము లెన్నని - దాల్చునయ్య
ఎల్లవారలు సద్భక్తి - వెఱిగి కొనగ
సంకట వినాశనము బ్రోచు - వేంకటేశ
వరద పద్మావతీ శ్రీశ - తిరుమలేశ

9

అష్టకష్టాల్పెట్టి - యాపన్నుఁ జేసి
కడసహాయము దాక - గాల్చికాల్చి
ధనదర్ప - ధనదాహ - ధనదస్యులను దూపి
కాన్కలన్ మూసలో - గలుగ బోసి
నిష్క్రియా ముష్కరా - విస్మృత దుష్టలం
ఋష్కరిణీ ద్రవాల - ముంచి ముంచి
బొజ్జ పెర్గిన వారి - బొర్లు దండాల్త్రిప్పి
పలువెతల్పట కార్ల - బట్టిగొట్టి

ఇడుములిడుబెల్ల గడముక్తి - విడుటకొరకె
పుతము వేయగ వపరంజి పాడమునటుల
సంకట వినాశమము బ్రోచు వేంకటేశ
వరద పద్మావతీ శ్రీశ - తిరుమలేశ

10

ఆదర్శ ధర్మాల - నాచరింపుచు జూపె
శ్రీరామచంద్రుండు - సీతమగడు
ప్రకృతి పూరుష యోగ - పరిపూర్ణతను దెల్పె
రాధాసమేతుడై - మాధవుండు
యుగప్రవర్తనా -ల్యుగళ పల్లభలతో
యుగధర్మమున నిల్ప - జగతి దిగిన
కుజవ ధనమునమ్ము - గొల్లగొబ్బెడు దొంగ
పట్ప్రతు హననమ్ము - నల్పుతేడ

దొడ్డ దోపిడుగాడవై - దోచుటిపుడు
కుటిల చర్యల నడగించు - ఇటిమగాదె
సంకట వినాశమును బ్రోచు - వేంకటేశ
వరద పద్మావతీ శ్రీశ-తిరుమలేశ.

11

భక్తివైరాగ్య శ్రీ - వ్యక్తహృత్సీమలో
నీదు హృదయమీను - వాదింక్షి
పెనుబాములందిడు - ఘనులరు భక్తాళి
పెనుబాముపై నిద్ర - గదెదవీవు
దామోదర దరిద్ర - ధాముల భక్తాళి
దామోదరుడవీవు - ధ్యానరమున
సకల కష్ట సముద్ర - సంచ్యాలక్తాళి
సంద్రమే గదనీదు - శ్వశుర గృహము

భక్తుల కఠినమఢ సటంచు - ఇలుకు కొరకు
సద్భక్త సామ్యములను సరి-సలిపెదీవు
సంకట వినాశముబ్రోచు - వేంకటేశ
వరద పద్మావతీ శ్రీశ - తిరుమలేశ

12

కష్టాలువావన్ని - కడదేర్పునీటులను
పరుగిడి వచ్చితి - [illegible] వరున

సముఖాన విన్నపం - బమరగా నివెదంచు
ఏకాంత మడిగితి - లోకవంద్య
ఇక్ష్వాంధ్రముగది - కౌర్తిక హెచ్చంచు
విహారార్థము గోరి - తీవితేడ
పదునాల్గు భువనాల - పాలించు దొరవంచు
పదసేవ అడిగితి - పద్మపాద

కమ్మ్యంలముమూపి యౌవని - గాదటంచు
పలుక కున్నావు నీదేమి - భావమయ్యా
సంకటు విహాశముముబ్రోచు - వెంకటేశ
వరద పద్మావతీ శ్రీశ - తిరుమలేశ

13

అక్కటికము జూప - నక్కటి బడునంచు
కమలర మూసితే - కమలనయన
మాటజారంగ్రది - మాదమ్మగు నటంచు
బెదవులు విప్పవా - మధుముఖాక్ష
లక్ష్మి కటాక్షింప - నక్షయ మగునంచు
హృదయాన దాతువా - మధుర హృదయ
పిలువు దోసిడి తల - నీలాల ముడులంచు
సదిమాన మూడ్చవా - అభయహస్త

జాడ జాడగ నీ తీరు చోద్యమయ్యె
చేసి జేపారి సతెదూచి - బ్రోచు విధము
సంకటు విహారముము బ్రోచు - వెంకటేశ
వరద పద్మావతీ శ్రీశ - తిరుమలేశ.

14

విష్ణుసర్వోత్తమ - వేంకటేశుడవేమ
కొండెక్కి వచ్చినన్ - గొల్వుడనుచు
సంసార సమదృష్టి - సంసర్గముల నెంచి
పుష్కరిణిని మున్గి - సార్థుడనుచు
జన్మ జన్మల బెంచు - జటిలక్లేశము దీసి
కల్యాణ కట్టలో - గలుపుడనుచు
అరమరలను మాని - తిరునామములు దిద్ది
తీర్థప్రసాదాలు - దినుడటంచు

చల్లగా వెల్లఊను బిల్వ - సరియెగాని
హెచ్చినది భక్తి సంచకుల్ హెచ్చిరేల
సంకట వినాశమ్ముబ్రోచు వేంకటేశ
వరద పద్మావతీ శ్రీశ- తిరుమలేశ

15

పదవులన్ సుకములన్ - గుదురుగా గొనితెచ్చు
పిదప బుద్ధులెగాని - చదువులేదు
జగతి వర్గస్వామ్య - పొగసెగల్ రగిలించు
పగల రాజ్యమెగాని - బ్రగతిలేదు
గొడవలన్ సృజియించి - చెడుసొమ్ముగడియించి
గుడుచుటే గానిస - ద్గడవలేదు
అణుశాస్త్ర పాండితీ - రణకేళి విన్యాస
విలయ భంగిమెగాని - సొలువులేదు

మనుజ వేషాల దనుజాలు - మగిడిరాగ
కదలిరా చక్రి గదబూని - గరుడు నెక్కి
సంకట వినాశనము బ్రోచు వేంకటేశ
వరద పద్మావతీ శ్రీశ - తిరుమలేశ.

16

ఇల్లువీడిన దాది - యిలు జేరువందాక
యేమేమి జరుగునో - యెఱుగలేము
మంటిపై నుదయించి - మన్నుజేరెడు దాక
మమతలు మోహాలు - మానలేము
వాచాలతను బెంచి - వాదాలు గుప్పించి
గుటిని విల్చి నినుభక్తి - గొలిచి కొనము
జీవబ్రహ్మైక్యంపు - భావమేవేవను
వింత వేదాంతంబు - వీడలేము

నెమ్మదిగ నిమ్మ వనమెక్కు - జెమ్మలిట్లు
కిమ్మనవు నవ్వుల ధరాల - గ్రమ్మ కొనగ
సంకట వినాశనము బ్రోచు వేంకటేశ
వరద పద్మావతీ శ్రీశ - తిరుమలేశ.

17

కొండపై జల్లగా - గుడిచికూర్చున్నావు
ఎండెక్కి వస్త్రాము - మండుటండ
కల్యాణ కట్టలో - గుఱుకు కత్తులవాడు
తలగచ్చకా మగా - దఱిగినాడు

పుష్కరిణివి మున్గి - పులుకు పుల్కనజూడ
మొగమున గండు పిల్ ముద్దులిడియె
దరిదాపు రానీడు - దర్శింప నీయండు
శరగోప మిడువేళ - క్షణమొకండు

దెచ్చుకొన్నట్టి పైకమ్ము - దీటిపోయె
పరమ పురుషుడ నినుజేరు పగిదియెట్లు
సంక వినాశమును బ్రోచు వేంకటేశ
వరద పద్మావతీ శ్రీశ - తిరుమలేశ

18

కొండెక్కి మెట్లెక్కి - గుడిగోపురము జొట్టి
నీ సన్నిధినిజేరి - నిలిచినాము
అభిమానములు బాసి - ఆత్మార్పణము జేసి
సంగనామాల్పెట్టి - పొంగినాము
అడుగడ్గు దండాలు - ముడుపులు మ్రొక్కులు
పొర్లు దణ్ణాల్పెట్టి - దొర్లినాము
జింగలవలె బీల్చి - పలు మోసగాండ్రతో
కొల్లగొట్టగ బడి - గుమిలినాము

కొమ్మ కొమ్మల దిమ్మన్న - మమ్ముదోచె
కలిని దైవమై నీవిట్లు - బలుక మేమి
సంకటు వినాశమును బ్రోచు వేంకటేశ
వరద పద్మావతీ శ్రీశ - తిరుమలేశ.

## 19

పడతికై యడవుల - నిడుములు గుడిచిన
కడుపామరుని దుఃఖ-ముడుగ లేదె
పత్నినంతర్వర్తి - వనవాసమునకంపు
ధర్మదీక్షం బింక దనియెలేదె
పదియారు వేలగో - పవనితా వితతితో
సరస సల్లాపాలు - జాలలేదె
లాతుల కాలమ్ము - గీతల సమ్మతమ్ము
నాతుల కధరంపు - నీతు లెన్ని

బమ్మతిమ్మని తిమ్మని - బమ్మజేయు
నీచమత్కార కథలిచ్చె - నీ తెలుంగు
సంకట వినాశ మముబ్రోచు వేంకటేశ
వరద పద్మావతీ శ్రీశ - తిరుమలేశ

## 20

చేపవై వేదాలు జాపిబ్రోతువు పునః
కమఠమ్మై కవ్వింతు - వమృతమబ్ధి
శ్వేత వరాహమ్మై పృథ్వి మోపితివిగా
నరహరి వైతివి - యరిని జీల్చ
బలితలవ్ బదముంచు - వటు వామనుడవుగా
బాపనయ్యవు పరశు - చాపమూని
రమణిరాజ్యము బాయు - రాజయోగివిగదా
గోవులవ్ బడుకోడె - గొల్లడివు

బుద్ధ కల్క్యాది మైత్రోతు - విద్యరీత్రి
తికమకలు జేసి మాతం - తిక్కదిద్ద
సంకట వినాశమముబ్రోచు - వేంకటేశ
వరద పద్మావతీ శ్రీశ - తిరుమలేశ

21

రాముండు దేవుండు - రక్షకుడే గాని
కలికల్మషంమమ్ము - గాంచరాడు
కృష్ణుండు గీతలో గేలూతలిడుగాని
వయవంచకులమమ్ము - దయనుగనడు
హరివాయు గురులెప్ప - పరమాప్తులేగాని
తామసులగు మాకు - దారినిడరు
ముక్కోటి దేవతల్ - ముడుపులందుటెగాని
ముష్కరులగు మమ్ము - ముట్టుకోనరు

విషయ వాంఛల జెఱపాల - వేగువమ్ము
తుదకు రక్షింప తిరుపతి - తోలివావె
సంకట వినాశమము బ్రోచు - వేంకటేశ
వరద పద్మావతీ శ్రీశ - తిరుమలేశ

22

మదవాంతకా బాదె - మైబాపి పలకాట
భూతాంతో ప్రొద్దు - పుచ్చ మనుచు
గుడి గోపురము లేక - మడిపూజ లవిలేక
గడువృష్టి గడువుమో - కొడుకటుంచు

దున్నెక్కి జీవాల - దోలు చుండుమటంచు
పవలిరు ల్బువనాల - దమల బంచి
శివ - నలువ - శమన-రవి-శశి-భువి - జలా
-నల ఖమ్మనిలు బంచి - జలధిమండి

పాల సంద్రాన లచ్చితో పాచిక లిడి
మఱల దిరుమల బెండ్లికి - మరులు గొంటె
సంకట వినాశనము బ్రోచు వేంకటేశ
వరద పద్మావతీ శ్రీశ - తిరుమలేశ

23

పాము పడక వీడి - పక్కిగుఱ్ఱము నెక్కి
శంకుగోలెము బూని - సాగినావు
తూర్య భేరీలతో - దొడ్డమేళాలతో
వేదఘోషం వీధి - వెడలినావు
పాశుర మాళ్వార్లు - పాటల ననమయ్య
సట్టువరాంద్రలతో నవ్వినావు
వెల్లగొడుగు నీడ - వింజామరల సేవ
కర్పూర హారతిన్ - గఱగినావు

నిత్య కల్యాణ గుణపూర్ణ - నిముసమైన
తేఱి జూడవు మఱి నాకు - దిక్కెవండు
సంకట వినాశనము బ్రోచు వేంకటేశ
వరద పద్మావతీ శ్రీశ - తిరుమలేశ

24

కనకమణికిరీట – ఘనవజ్రకవచావ
కర్ణికతురాయితో – గస్తురివిడి
ద్వందోర్ధ్వ పుండ్రాల – సిందూరమది మధ్య
మొగమెల్ల నామాల – సొగసు బెంచి
మృగమద ఘనసార – మెగయ గే పరి బూసి
మల్లెల జాజుల – మాల దాల్చి
తులసి దవనమ్ముతో – గలిపి మర్వంబు తో
చంపక పున్నాగ – సరులుదాల్చి

ఇరువతుల మధ్యరథములో – మెఱయ దిరుగు
పురుష దైవమ మమ్మేప్పు – బ్రోతువయ్య
సంకట వినాశమము బ్రోచు – వేంకటేశ
వరద పద్మావతీ శ్రీశ – తిరుమలేశ

25

శ్రీదేవి భూదేవి – సీతరుక్మిణిరాధ
పాత్రల నీవెంట – వచ్చెలంచ్చి
శేషుడే సౌమిత్రి – సిరియై విలిచె శ్రీ
రామానుజ యతీంద్ర నాముడగుచు
బ్రహ్మయై మారుతి – భండన భీముడై
మధ్వయతీంద్రుడై – మఱలవచ్చె
నారాయణుడు విష్ణు – శ్రీరామ శ్రీకృష్ణ
వేదవ్యాసాది నీ – వేసములకు

హంగు చూపు తెలితెరంగు - రంగులేక
సాగువే యాట - సొగసుగా జతుర చరిత
సంకట వినాశ మమ్ము బ్రోచు - వేంకటేశ
వరద పద్మావతీ శ్రీశ - తిరుమలేశ.

24

పురుడు సూతక మిచ్చి - పరమేష్ఠి శివులకు
పడుచు నల్లని సిరి - బడసి నావు
తత్వ దేవతలకు - దలకొక పనిబంచి
పగ్గముల్ నీచేత - బట్టినావు
తిని తిండి యరగించు - కొనుపని మాకిచ్చి
తినకనే పినుడా - ఘనుడవీవు
తప్పుల శిక్షించి - యొప్పులు బహుమెచ్చి
గొప్ప భక్తికి గొల్వ - గూర్తువీవు

పిచ్చుకల గొట్ట బ్రహ్మాస్త్ర విద్యలేల
ఇన్ని తడిపిళ్ల గడబీవు - తెన్నుగలవె
సంకట వినాశము బ్రోచు -వేంకటేశ
వరద పద్మావతీ శ్రీశ - తిరుమలేశ

27

హరియైన - హరుడైన - పరదేవతవు నైన
మాకంట బడకుండు - మహిమలేల
లాలాజలము బెంచు - అడ్డ మాయెదుటుంచి
తింటిరయ్యోయని - దెప్పుటేల

ఇన్ని ప్రలోభాల - నింపైకి మమునెట్టి
మాదోసగులనుచీ - వాదమేల
అస్వతంత్రులు మీర అంత నాకర్పించు
డనిమమ్ము వెతలతో నణచనేల

భువికి మము తేకు తెచ్చిన - పాపనీకు
చెంప వాయించి ముటిపించు సొంపునిది
సంకట వినాశమము బ్రోచు - వేంకటేశ
వరద పద్మావతీ శ్రీశ - తిరుమలేశ

28

శైశవ బాల్యాల - చదువు సంధ్యల హేల
ఇల తెల్వితలతట్ట - కెత్తుగోల
సరస సల్లాపాల - పరిణయ బంధాల
వరుస సంతానాల - బిడ్డిగుళ్ల
పంచ భూతపు మేడ - పడికట్లు పడలగా
బోసివోళ్ల ముణోల్లు - బుసులు కళ్ల
గతజల సేతువుల్ - గట్టుట కొన్నాళ్ల
మతిమఱుపు - గతిలేవి - బ్రతుకు వెతల

తుదకు మరణమ్ము మరుజన్మ వెదకు మాదు
బుద్ధి వైభవము గని బిట్టుతియు చుంటె
సంకట వినాశమము బ్రోచు వేంకటేశ
వరద పద్మావతీ శ్రీశ - తిరుమలేశ

## 29

గీర్వాణ వాణికి - గేల్మొక్కులే గాని
ఆంగ్ల వాణికిగల్గు - నాదరమ్ము
దేశభాషలయందు - దెలుగులెస్సయెగాని
పోల్లు గిత్తలు కవుల్ - పాడుచుకొంద్రు
పరసోక్తి సాహితీ - శ్రమలెన్నుటేగాని
గుణ రసాస్వాదకు ల్గాదువయ్యెరి
వచనాల బద్యముల్ - బల్మినీ కవితలు
గడుసు వాచాలతల్ - ఘనత కెక్కె

పాతచింత్రిణీ లేహ్యమ్ము - పగిదినుండు
కైత నీవొకండవె మెచ్చ - కాలమయ్యె
సంకట వినాశమును బ్రోచు వేంకటేశ
వరద పద్మావతీ శ్రీశ - తిరుమలేశ.

## 30

అచ్చంపు కైతల - విచ్చగింపరు మెచ్చి
మచ్చరింతురు పెచ్చు - లొచ్చులెంచి
మనవాడు మనకున్న - ఘనుడైన వెల్లని
యెదగొట్టు కొనుచు గుంజెదరు కాళ్ళు
పైక మెదురు ఛించి - మూక శిష్యుల బెంచి
మేళతాళాల్యా్బుల - మాలలెంచి
దుశ్శాలువల దోచి - దొడ్డ బిఱుదుల వాచి
స్వంత సమ్మానాలు - సంతరించి

ఎత్తు లెటిగిరి సమకాల - రిత్తకవులు
ఎందురో లేదా తప్పదు - వినగ నీకు
సంకట వినాశ మముబ్రోచు వేంకటేశ
వరద పద్మావతీ శ్రీశ - తిరుమలేశ

31

కనరాని నయనాలు - దినలేని యుదరాలు
ధ్యానులేల కైతల - గానములేల
కడుపు గాలుచునుండ - యొడలు వణకు చుండ
పడికట్లలంకార - భరిణలేల
సమ సమాజస్పృహ - గమనమే లేకుండ
కుసుమగుళుచ్ఛాల - ప్రసవ మేల
కుడువ గూడు గుడిసె - యొడలికి నుడుపులు
గలిగింప లేనట్టి - కవితలేల

యనెడు నవ సమాజపు ఘనుల విడచి
దెచ్చితినికైత నీవైన - మెచ్చుకొనవె
సంకట వినాశమము బ్రోచు - వేంకటేశ
వరద పద్మావతీ శ్రీశ - తిరుమలేశ

32

వర్ణభేదితులన్న - వర్గభేషజా లిన్న
హెచ్చు దగ్గులకెన్న -లొచ్చులేదు
దనుజా లు గ్రులపుడు - మనుజ దనుజ లిన్న
కుటిల క్రౌర్యాలకు - గొదువ లేదు

రచ్చ రాచటికాల - రక్కసుల్పౌరు లప్పు
రాజకీయుల పక్షి - రాజ్యమిపుడు
శుకవ్యాస మరగురుల్ - బ్రకట పండితలప్పు
పండిత వేషులే - ప్రబలు రిపుడు

సులభ పద్ధతి దైవమై - వెలుగు వార
లిపుడు మూరూర గలరుసీ - వెంచి వావె
సంకట వినాశ మము బ్రోచు వేంకటేశ
వరద పద్మావతీ శ్రీశ - తిరుమలేశ

33

మతము ల విమతాలు - మహిపులు యాచకుల్
మనములు పరిజేసి - మనిరదెందు
తనవారు బెఱవారు - ధనిక దరిద్రులు
కాటిలో గాకుండ - గలిసి రెందు
అధికారి యటు బంటు - లందున బనివాంద్రు
వైరాగ్నిలోగాక - బడుదు రెందు
ఎలుకలు బిల్లులు - జిలుకలు గ్రద్దలు
పాము ముగిసలెట్లు - బడయు హితము

ఇన్ని వికటముల్దల కెత్తి - కొన్నమనుజ
ప్రాణికబ్బునే యైక్యతా - భావ మిపుడు
సంకట వినాశమము బ్రోచు వేంకటేశ
వరద పద్మావతీ శ్రీశ - తిరుమలేశ.

34

ఐక్యతా భావాల - వాత్మార్పణము లేని
    అతి శయాహంకృతి - కృతులెగాని
భృత్యాను భృత్యుడౌ - పెమభక్తి గలదెందు
    అడుగడ్డ - దండము లిడుటెగాని
అమ్మ గన్నమ్మవని - నమ్మి మ్రొక్కుట లెందు
    గుమ్మనమ్మను జేయు - గొప్ప గాని
తారతమ్య మటంచు - దూరపోయు నెవ్వండు
    నమునించు ఘనుడెవండమట గాని

అన్ని పరిపాటి మాట పాటి కవియొపాటి
రిక్త భక్తిని విమగాల్చు - రీతులెల్ల
వంకట విహారమును బ్రోచు వేంకటేశ
వరద పద్మావతీ శ్రీశ - తిరుమలేశ

35

మొగమున నగవులు - మూపున పాపాలు
    పెదవిని దేవియల్ - పెట్టినాను
కామిని కౌగిలిలో - ప్రేమ పైత్యమ్ములో
    హృదయాన విమగాన - కదలినాను
వెళ్ళి వేదాంతముల్ - బుల్ల కెక్కించుకొని
    నీపాద ముల మ్రొక్కి - నిక్కినాను
తకముల్లు వేదాల - నృకముల్లు దర్గాల
    నృతజేసి విమలేర - వెలిచినాను

పరమ పక్వభక్తి ప్రసాద - వరముగనక
ముక్తి భ్రాంతిని సోత్కర్ష - మునిగినాను
సంకట వినాశనము బ్రోచు వేంకటేశ
వరద పద్మావతీ శ్రీశ - తిరుమలేశ.

36

నీదయలేనిదే - నేనెందు బోవుదు
        నఖిలాండములు నీ-యందనుండ
చీమ మొదలు బ్రహ్మ - సీమలన్ హృదయాల
        నాడుగు నీ బింబంబు - వదలు నెందు
కనుమూసి యజ్ఞాన - పెనుచీకటి బడియున్న
        నన్ను రక్షించుమని - నెన్నన్నలేను
పాపాంధ తమసాన- బడిపోవుచున్నాను
        వెలుగులో నిను జూడ వెఱచినాను

వేతున పవాద శతములు - విజ్ఞాడనని ;
ఇట్టి పెడదారి నన్నేల - పెట్టినావు
సంకట వినాశనము - బ్రోచు వేంకటేశ
వరద పద్మావతీ శ్రీశ - తిరుమలేశ

37

ప్రసవవేదన వేళ - పతివ్రతక గనవని
        పిరావతము జేయు - నారి యట్లు
వల్లకాటను గాలు - వల్లభ తతి గాంచి
        మఱిబిన్న వలదన్న - మనుజాలట్లు

సకల మెర్గుదునని - సుకములే తిరమని
వికటింప వెల్లనౌ - విజ్ఞాలట్లు
బ్రహ్మమ్మునేనను - భ్రాంతి వీడిన వెంట
నానార్తులొమ్మృషా - జ్ఞానులట్లు
పట్టుకొనలేక విడలేక - ప్రాణములను
వేంకటరమణా యని బిల్వ - వినవదేమి
సంకట వినాశ మము - బ్రోచు వేంకటేశ
వరద పద్మావతీ శ్రీశ - తిరుమలేశ.

38

దొంగ వ్రేల్గాటికి - నీ యుంగరము గ్రహించు
" జాగ్రత్త " యను బోధ - జార్చి నట్లు
ఇంద్రియాలకు నెల్ల - నెరలను జూపింప
నిగ్రహము వహించి - నిలువగలవె
ఆమూల బోకుడీ - అటబూచి కలడన
ఆమూలకేనేగు - అజ్ఞాలట్లు
విధినిషేధము లెల్ల - విపరీతముగ దోచి
మంచివీడి జెడుగ్ర - హించగలము
తప్పు జేయించి మాచేత - దండనిడకు
సతము నీభక్తి విడవట్టి - శక్తినిడుము
సంకట వినాశమము - బ్రోచు వేంకటేశ
వరద పద్మావతీ శ్రీ శ - తిరుమలేశ.

39

తర్కశాస్త్రము జాల - తలకెక్కినది నాకు
ఏవె దేవుడనుచీ - వెవడవందు
బుద్ధత్రిపిటకాల - బుద్ధిమొలెచ్చెను నాకు

సర్వమ్ము శూన్యమ్ము – క్షణిక మందు
జగము స్వయంభువ – సహజస్ఫోటితము
నిప్రమేయము మృషా నీతమందు
ద్వైతమ్ము తరతమ – భావాంధ తామిస్ర
నిరయ నిశ్శ్రేయ పథమ్మురయము మందు
మతికి మూఁతికి మితిపెడ్డ – కతలవల్లి
కూయు మేధోక్రిమికి శిలా – ప్రాయు డైతె
సంకట వినాశ మము బ్రోచు – వేంకటేశ
వరద పద్మావతీ శ్రీశ – తిరుమలేశ .

40

బూడెకు ముద్దకు – బోడుగడ్డగీతల
కచ్చుముద్దరలకు – రచ్చకెక్కి
పాదోదకము ద్రావ – పైజల్లు కొనుటకు
పిగవల్లగోత్రాల – సాగము బెంచి
కౌపీనమూ గూడ – కట్టా మడత పంచె
కచ్చాతగునటంచు – కక్షలెంచి
మీసాల గడ్డాల – మిడుకు వార్పెరవారు
పిలకల గడ్డాల – విలువ తెంచి
అహము విడకుండ పేచీల – సహరహమ్ము
దమ్ముకొను చుండ ధార్మి వి – దాల్చువెట్టు
సంకట వినాశ మము బ్రోచు – వేంకటేశ
వరద పద్మావతీ శ్రీశ – తిరుమలేశ

41

భువిపైని జనులంత - బాదెను బాయుచో
బాదెయే మిగులుటో - భూమినంత
మూడు నామాలతో - ముల్లోకములు నిండ
బరకీయముల రక్తి - భక్తి హెచ్చు
తారతమ్యములంచు - దన్నుకు లాడుచో
నాయకులందలా ల్మోయలేరు.
అల్లా జొరాష్టరు - యాక్రీస్తు నానకుల్
యెవరి గొప్పం వారు - దవిలి యుంద్రు
ఉన్నదొకడవే ప్రభుడవు - విన్నిభావ
రూపభిన్న సత్యములను - జూపుటేల
సంకట వినాశమము బ్రోచు వేంకటేశ
వరద పద్మావతీ శ్రీశ - తిరుమలేశ.

42

చార్వాకుడై బుట్ట - చారు సౌఖ్యములబ్బు
తార్కికుడైనచో - తలపెటుంగు
వైయాకరణుడైన - వాగ్దంభన ము హెచ్చు
పాశుపతుండైన - బలము బెటుగు
జిన శ్రమణకుడైన - జీవాలు మెయినాడు
బౌద్ధభిక్షకుడైన - బుద్ధిదొటుకు
అద్వైత మబ్బగా - నఖిలాండము మాయ
సత్తు చిత్తులు మన్మ - హత్తులగును
పెక్కువేల్లన్మలను గొల్వ - పెదవి విడవు
విరజ లింగభంగము కర్మ - వెడలు దనుక

సంకట వినాశ మము బ్రోచు - వేంకటేశ
వరద పద్మావతీ శ్రీశ - తిరుమలేశ

43

తూచాలు దప్పక - నీచొప్పులెరిగించు
పోతాలు పలుమార్లు - వల్లెవేసి
ఒంటినిండుగ భక్తి - యొంటిపూటను భుక్తి
యొంటికాలితపస్సు - నొంటి నిలచి
సుకములబోనాడి - శోధనలను గూడి
ప్రకటముగానీదు - ప్రభలబొగడి
భజనలజిందుల - యజనసత్కర్మల
అజినాసనముపై - నవధి బెంచి
కడకు దరిజేర వేతురే- గుడికి గడియ
నెడద తలుపులు తీసితి - నెడలి రమ్మ
సంకటవినాశమము బ్రోచు వేంకటేశ
వరద పద్మావతీ శ్రీశ - తిరుమలేశ

44

ఆదియు నంతము - లవిలేవు గావున
ఎందు జూచిన నందు - నుందువీవు
సద్గుణ సంపూర్ణ - సర్వేశుడవుగాన
నిర్గుణుండవు గావు - నిశ్చయముగ
సుఖదుఃఖముల స్వామి - నకళంకుడవు గాన
నిగ్రహానుగ్రహ - విగ్రహుడవు
భావాలకు మొదలు - భావమౌదువుగాన
ప్రాగభావములేని - పరముడీవు

ఉండు చుందువు సకలమ్ము - యిందు మండ
నుద్ధరింపగ మమ్మెల్ల - నుద్భవముల
సంకట వినాశమును బ్రోచు వేంకటేశ
వరద పద్మావతీ శ్రీశ - తిరుమలేశ

45

పరమ ముఖ్య ప్రవృత్తి - ప్రతిచోట నున్నావు
నామ సమస్తాలు - నావటంచు
పుట్టింప బోషింప - గిట్టించు కార్యముల్
నానార్థక్రియ లెల్ల - నావటంచు
నామాట లేనిదే - చీమైన గదలదు
నానాజగమ్ములు - నావటంచు
ప్రాగ్భావము నభావ - ప్రధ్వంసలు ను సదా
జ్ఞానభావము లెల్ల - నావటంచు
బల్కెడునియంత పౌకృపా - పరుడవీవు
తెలిసె నిను దక్కలేదిక - దిక్కుమాకు
సంకటవినాశమును బ్రోచు - వేంకటేశ
వరద పద్మావతీ శ్రీ శ - తిరుమలేశ

46

ఏనాటివాడవో - యెవరెఱుగుదురు నిన్ను
సిరియైన దెలియగా - దొఱక వీవు
నిజరూపమేమిటో - నిను జూచి రెవ్వరు
సృజియించు ధాతయు - జెప్పలేడు
పంచభేద ప్రపంచ - సంచయునుడవీవు
పంచభూతాలకు - బట్టుబడవు

దేవ జీవుల మోయు – జీవోత్తము డతడు
వాయుదేవుడు – నీదు భావమిడడు
ఎందుకీఛద్మవేషాలు – ఇందిరేశ
హృదయ మధి వసింపుచిదేల – నెదుటబడవు
సంకటవినాశ మము బ్రోచు – వేంకటేశ
వరద పద్మావతీ శ్రీశ – తిరుమలేశ.

47

శ్రీ లక్ష్మియైనను – నీలీలలెఱుగదు
జీవరాసులు నిన్ను – జేఱు టెట్లు
అందఱి హృదయాల – నలరారు చుందువు
కనులతో నీరూపు – గాంచుటెట్లు
తృణమైన కణమైన – నణుమహత్తైనను
నీ ప్రమేయము లేక – నిలుచు టెట్లు
పదునాల్గుభువనాలు – భయపడునీమ్రోల
నీవు తానను వారి – బ్రోవలెట్లు
సోఽయమాత్మాతదేతత్త్వ – సోఽహమస్మి
యనెడు దనుజాలకథలేల – వినిచెదీవు
సంకటవినాశమము బ్రోచు – వేంకటేశ
వరదపద్మావతీ శ్రీశ – తిరుమలేశ.

48

జీవుండె దేవుండు దేవుడే జీవుండు
భేద భావము మూర్ఖ – వాదమనుచు
సోయమాత్మాబ్రహ్మ – సోహంశి వోఽహము
తత్వమసియనుట – తథ్యమనుచు

బ్రహ్మమే సత్యమ్ము - ఇలు మిథ్య జగమంత
సకల నాశమ్మది - సత్యమనుచు
జ్ఞాన ప్రాప్తియెముక్తి - జ్ఞానమేబ్రహ్మమ్ము
ద్వైతభావము రౌర - వమ్మటంచు
వేదబాహిరదనుజవి - వాదగ్రస్త
వ్యాసపరి పంథి జనభ్రాంతి - బాపవేల
సంకటవినాశముబ్రోచువేంకటేశ
వరద పద్మావతీ శ్రీ శ - తిరుమలేశ

49

మిథ్యమిథ్యయటన్న - మిడిమేలమేలకో
మిథ్యతానగునేమి - మిత్తికెదుట
పిండబ్రహ్మాండంబు - లుండనేకాత్మలో
జ్ఞానార్జనము సేయ - ధ్యాని యెచట
స్వగతికమేలేక - బ్రహ్మనిర్గుణుడైన
ఆరోపిత ప్రమితి - కవధియెచట
సృష్టిస్థితి లయాలు - చేష్టలవృతమైన
పురుషసూక్తపరమ - పురుషుడెచట
ఆగమామమూవ ప్రసిద్ధ- యోగమువిడి
అస్మదాదులు బ్రహ్మలై - రనుట లెట్లు
సంకటవినాశముబ్రోచు-- వేంకటేశ
వరదపద్మావతీ శ్రీశ - తిరుమలేశ.

50

నీవు బ్రహ్మశ్రీవి - నేనుబ్రహ్మశ్రీని
సకల బ్రహ్మశ్రీలు - నొకటబ్రహ్మ
అజ్ఞాని యవివేకి - యగునట్టిజీవుండు
శుద్ధబ్రహ్మైన - నశుద్ధుడెవరు
బ్రహ్మనిర్గుణమైన - బ్రహ్మత్వచ్యుతిజెంది
దైవత్వమును బాసి - జీవుడగునె
మట్టివిత్తనమది - మామిడి పండౌనె
బట్టె గుట్టమగునె - బ్రహ్మయగునె
సర్వసమరూప భావము - ల్సాధ్యపడునె
దైవమును దూరమొనరించు - త్రోవగాని
సంకట వినాశమమ్ముబ్రోచు - వేంకటేశ
వరద పద్మావతీ శ్రీశ - తిరుమలేశ

51

శంకర కువిమర్శ - సల్పుదూషణకాదు.
శాస్త్రసమ్మతమైన - చర్చగాని
ఏడునూర్లశకాన - నెలిగించె శంకరుం
డద్వైత మార్గమ్ము - సర్వమనుచు
సోஉహమహంబ్రహ్మ - సోஉయమాత్మాబ్రహ్మ
తత్వమసియు - జీవ దైవమొకటె
యను నాల్గుసూత్రాల - కును వ్యాఖ్యలొనరించి
మాధ్యమ బౌద్ధుల - మాయవిడక
శూన్యమునె బ్రహ్మగా మార్చి - సూత్రతతుల
మాయను భజింప బ్రహ్మయే - మాయమయ్యె
సంకటవినాశమమ్ముబ్రోచు - వేంకటేశ
వరద పద్మావతీ శ్రీశ - తిరుమలేశ

52

కాముని విక్రమ - క్రమము దానెఱుగమి
పరకాయమున జ్ఞానమరయలేదె
రగులమంటల మేను - లక్ష్మీనృసింహుని
గేలాత్మకై స్తోత్ర - కృతులు గావె
ధనవసువనితల - దలపని గురుమౌళి
కనకధారల లక్ష్మి - గనడె మ్రొక్కి
తనకు దాద్రిహ్మయై - తాదాత్మ్యమును జెంద
ఇతర దైవాలస్తోత్రాల - నతులనిడడె
ద్వైతమున కృష్ణ - కాలాడి భక్తిగొలిచి
పరమప్రఖ్యాతి గాంచు - మ - ద్వైతిగాడె
సంకటవినాశమముబ్రోచు - వేంకటేశ
వరద పద్మావతీ శ్రీశ - తిరుమలేశ.

53

గంగ దాటెడు దాక - గడునమ్మిపడవను
దగుల బెట్టిదరేమి - దాటుపిదప
సగుణ సద్భక్తితో - సాన్నిధ్యసుఖమంది
స్వస్వరూపుడుజీవి - భస్మమగునె
అద్దాన బ్రతిబింబ - మపలు బింబము జూచు
పోయిగోరును గాని - మాయమగునె
అస్వతంత్రుడనంచు - నరయుగల్గును గాని
అధికారవిభవమ్ము - లందనగునె
నిత్యమగు జీవి హరిచెంత - నిలిచి గొలువ
హరికి బెరతత్వమగుగాని - పరముడగునె

సంకటవినాశ మము బ్రోచు - వేంకటేశ
వరద పద్మావతీ శ్రీశ - తిరుమలేశ

54

బ్రహ్మయజ్ఞానియై - పతనమ్ము దాజెంది
పరమ పాకృతుడౌనె - భవమునందు
అచ్యుతు. డవ్యయుం - డధముంపు జీవియై
విలపించునాయిల - దెలివి లేక
ప్రారబ్ధ సంచిత - పాపాల నాగామి
తిరుగాడు పురుగది - దేవుడగునె
రవిశశాంకులు తిమిరగముల య్యెదరేమి
శూన్యమే బ్రహ్మయౌ - సుభగుడేమి
అకటసోఽహమహంబ్రహ్మ - మనెడు భ్రాంతి
భక్తి వీడి చరించుచో - ముక్తి కలదె
సంకట వినాశమము బ్రోచు - వేంకటేశ
వరద పద్మావతీ శ్రీశ - తిరుమలేశ

55

శూన్యంబు సాధింప - శోధనలవియేల
నిర్గుణగమనము - నిర్గమనము
అతడచ్చునటంచు - నడుగుట యదిపాడి
అతడే నేనైన - అడుగుబెట్లు
అతని దెలియగా - నన్ని యోగమ్ములౌ
అతడు నేనైన నీ - కతలవేల
బ్రహ్మసత్యమనుట - పరమ సత్యమ్మైన
సత్యజము - జగ మసత్యమగునె

సత్యమౌ బ్రహ్మ సర్వమ్ము - సత్యజమ్ము
మిథ్యయను మాట మాయతో - మేలమాడు
సంకట వినాశ మము బ్రోచు - వేంకటేశ
వరద పద్మావతీ శ్రీశ - తిరుమలేశ.

56

పంచవింశతితత్వ - భంగ్యప్రపంచముల్
నిజము లొక్కటిగాదు - నిశ్చయముగ
తారతమ్యము లేక - వేరువేరుగగాక
స్వామి భృత్యులరొకే - బ్రహ్మగాదు
జీవనాశములేదు - దేవుడునిత్యుండు
ప్రకృతి పూరుషులొకే - ప్రకృతికాదు
ధ్యేయము జీవికి - జ్ఞేయుగమ్యుని జూడ
తెలియ బడెడు వాడు - దేవుడతడు
యుగయుగాది కల్పాంలలో నుండు వాని
శూన్య నిర్గుణమని జెప్ప - శుద్ధతప్పు
సంకట వినాశ మముబ్రోచు - వేంకటేశ
వరద పద్మావతీ శ్రీశ - తిరుమలేశ

57

పృథ్వితాగదలందు - వేగ నీరము బాఱు
సంకోచ వ్యాకోచి - జలము గాదు
గాలికి గలదు గా - ఘనతయు లఘిమయు
తేజము వలె వెల్గు - తీరులేదు
ఆకాశమున నుండు నవకాశ మఖిలమ్ము
దానికిలేదు వి - ధాన శక్తి

రూపరసము గంధ - రోచిష్మతత్వముల్
యొకటి కన్న మఱొక్కటుత్తమమ్ము
వీటినన్నింటి శాసించు - మేటి ప్రకృతి
మించునీశక్తి నేవంచు - మిడిసి పడెద
సంకట వినాశమము బ్రోచు - వేంకటేశ
వరద పద్మావతీ శ్రీశ - తిరుమలేశ.

58

జీవ దేవులు వేరు - జీవ జీవులు వేరు
జడజీవ జడజడాల్ - జడము బరము
పరగ చతుర్వింశతి - పంచభూత ప్రపంచ
తత్వాలకు నవలి - తత్వమతడు
పరతత్వుడాహరి - పరమాత్ముడైయుండ
సర్వమొక్కటను ట - సంగతమ్మ
హరిజీవులు వహింత్రు - తరతమ భేదాలు
సత్యనాటక రంగ - నిత్యగతుల
జ్ఞాన మిడు హరి గైకొను - తాను జీవి ;
కాకబ్రహ్మమేనను దనుజా - డాకతాయి
సంకట వినాశ మము బ్రోచు వేంకటేశ
వరద పద్మావతీ శ్రీశ - తిరుమలేశ

59

అద్వితీయుడు శ్రేష్ఠ- డందఱి ప్రథముండు
రెండవ స్థానాన - నుండడెపుడు
అద్వైతి యే కాకి - అన్నింట నొంటరి
అతనిమెచ్చెడు వాడు - నతడె యగును
పురుషపురాణుండు - బురుషోత్తముడు హరి

పరుడద్వితీయుడ - ద్వైతి కాదు
పరమఖండితమనాధారమద్వైతంపు
క్లీబ నిర్గుణమౌనె - కేశవుండు
జగము లరకంట శాసించు - సత్యుడతడు
బ్రహ్మ జడమై పదార్థమై - బరగునేమి
సంకట వినాశ మముబ్రోచు - వేంకటేశ
వరద పద్మావతీ శ్రీ శ - తిరుమలేశ

60

గంగానదిన్ ఘోష - గంగలో లేనట్లు
తరుశాఖ - చంద్రుండు దగులనట్లు
ప్రప్రత్యయము గూడి - ప్రజ్ఞాని క్లీబమై
ప్రజ్ఞాన బ్రహ్మమై - పట్టుబడడు
బ్రహ్మనాయందుండ - బ్రహ్మాహమస్మియే
సోఽయమాత్మా యన - దోయికాదె
తత్త్వమసి యనగ - దద్వత్త్వమసిగాదె
మఱి "అతత్త్వమసియై "- మాయమగునె
ఋగ్యజుస్సామనిగమాల - శ్రుతులవెల్ల
జీవబ్రహ్మైక్యపద్ధతి - జిక్కుకొనునె
సంకటవినాశమముబ్రోచు - వేంకటేశ
వరద పద్మావతీ శ్రీశ - తిరుమలేశ

61

బ్రహ్మమరుత్తులు - వరగరు డోరగుల్
రుద్రుడు యము డింద్ర - భద్రులెల్ల
రవిశశి పావక - ప్రవిమల తారకల్
పదునాల్గులోకాల - భవము లెల్ల
విశ్వమ్ము లంబొచ్చి - విశ్వాల బాలించి

విశ్వాల రక్షింప - విష్ణుడనగ
ఈశునావాస్యమ్మ - ఈ విశ్వమనిజెప్ప *
విశ్వమ్మువీశుండు - వేరుగాదె
అన్నియొకటన్న నది యేమి - యందమగునె
స్వామి నీవైన భృత్యులు - మేము గామె
సంకట వినాశ మమ్ము బ్రోచు - వేంకటేశ
వరద పద్మావతీ శ్రీశ - తిరుమలేశ

62

అద్వైతికైనను - అన్యులెవ్వరికైన
మానాథుడే దిక్కు - మఱిలమఱిల
మూడు సంధ్యల యందు - మూడష్టకమ్ములు
కేశవ నామముల్ - వాసిగనవె
ఆత్మనేస్వాహాను - మాత్మార్పణమనుచు
తమకాళ్ల మ్రొక్కుక - దనియగలరె
భజనలో శంభుడు - ప్రత్యక్షమై నంత
భగవంతులమని - పాటమార్చి
భస్మమొనరింతుబార్వతి - బడతుననుచు
పరుగులిడు భస్మరావణుల్ - భ్రష్టులెరి
సంకటవినాశమమ్ముబ్రోచు - వేంకటేశ.
వరద పద్మావతీ శ్రీశ - తిరుమలేశ

63

పలలమజ్జాస్నాయు - మలమూత్రపంకాల
బడివచ్చివాటినే - వలచుదేహి
దేహాన దేహియే - తిరుబ్రహ్మమనుచును
ప్రతిబింబములు బింబ - భక్తగనక

* "సయథా సైంధవ ఖిల్య" అఖాతము సముద్ర జలముల కాధారము

భ్రాంతివీడు డటంచు – బ్రహ్మభ్రాంతివి దాల్చి
గాలిమేడలు గట్టి – ఘనుల మనుచు
దృశ్యమ్మునశ్యమ్ము – దేహియే దైవమ్ము
సోఽయమాత్మాబ్రహ్మ – మాయదవిలి
ఉరము క్రిందుగ – నాభిపై బిఱుగుహోరివి
పదములంటి గ నరు స్వయం– బ్రహ్మలనుచు
సంకటవినాశముబ్రోచు – వేంకటేశ
వరద పద్మావతీ శ్రీశ – తిరుమలేశ

64

లీలావినోదియై – శ్రీపతి ప్రకృతితో
సరసములాడగా – నరులు గాంత్రు
నరులు నాటకములు – నటసూత్రధారులు
అందఱొకడనంగ – నాటయెటులు
నిర్గుణబ్రహ్మమ్ము – నిశ్చలమ్ముగనుండ
సంకల్పములవెట్లు – జగములెట్లు
హరి సూత్రధారియై నరుల బ్రోవకయున్న
తనను తా – బ్రోచుక – ధన్యుడగునె
సకలసద్గుణ సంపూర్ణ – సత్యసీశు
నాక గుణవిహీనుని జేయు – యుక్తులేల
సంకట వినాశముబ్రోచు – వేంకటేశ
వరద పద్మావతీ శ్రీశ – తిరుమలేశ

65

పురుషోత్తముడు మొదల్ - జరుగునింతటిదాక
సంభవించునదియసత్యమేమి
వేదోపనిషదాది - విజ్ఞాన శాస్త్రముల్
అష్టాదశ పురాణ- మనృతమేమి
వ్యాఖ్యాతృవర్గాల - బ్రహ్మసూత్రపు భాష్య
సత్యశోధనము ల - సత్యమేమి
బ్రహ్మ సత్యముమటి - వానికృత్సృకృతులు
జగములు మిథ్య ల సత్యమేమి
" వాడు " సత్యమ్ము సరిగాని - వానిచర్య
సకలము వితథమనుటెల్ల - శాస్త్రమేమి
సంకట వినాశ మముబ్రోచు - వేంకటేశ
వరద పద్మావతీ శ్రీశ - తిరుమలేశ

66

పులిజూచి నక్కతా - నలుపు వాతలు దాల్చి
ఇకిలించు నట్లుగా - నెక్కెసముగ
పరమాత్మవలెదాను - బ్రహ్మయేననుకొన
విశ్వపాలకుడౌచు - వెలుగగలడె
తనయందు ప్రభుశక్తి - తనదంచు భ్రమియించు
నరుడు దనుజాడు వా - నరుడెనుమ్ము
నీయందమదిచాలు - నిఖిలేశు సౌందర్య
బింబమ్ముగను నీ హృదంబరాన
నీదుచేతగాని తనము - సోదిచాలు
శరణు వేడుము విభునన్న - నరుడువివడు

సంకటవినాశ మముబ్రోచు - వేంకటేశ
వరద పద్మావతీ శ్రీశ - తిరుమలేశ

67

పందొమ్మిదులు దొల్లి - భాష్యాల దునుమడా
శంకరుండద్వైత శాస్త్ర చర్చ
ఇరువదియొకటి గా - గలిపె రామానుజాం
డావిశిష్టాద్వైత - మనుప్రపత్తి
మాతరిశ్వుడు మధ్వ - మౌని యై విలసిల్లె
ద్వావింశతీ భాష్య - ద్వైతసూక్తి
మధ్వుని ఖండించు - మహనీయులుండిరా
నేటికింభువిలోన - నీతి బెంచి
వాదములు పూర్తి పవనుని - భాష్యస్ఫూర్తి
దాని గ్రహియంప జెడుగౌనె - ధరణి ప్రజకు
సంకట వినాశమము బ్రోచు - వేంకటేశ
వరద పద్మావతీ శ్రీశ - తిరుమలేశ.

68

చెడును గర్హింపక - చిత్తమున్నతమౌనె
తప్పును దెగడుటల్ - దప్పులగునె
సకలమ్ము బొగడుటల్ - సరియౌనె సతతమ్ము
మంచి చెడ్డల నెంచ - మంచి గాదె
ఒగునోగుని మెచ్చు - యుత్తమ కార్యమే
దుష్టశిక్షణ ము తా - దుష్టమగునె
సహజ జీవనమది - సత్యమటయుగాదె
నిత్యసత్యుని సేవ - నిజముగాదె

బ్రహ్మసూత్రాంకపవ్యాఖ్య - ఫణితి బెంచి
వ్యాస హృదయమ్ము వరయని - భాష్యమేల
సంకట వినాశమమ్ము బ్రోచు - వేంకటేశ
వరద పద్మావతీ శ్రీశ - తిరుమలేశ .

69

అన్నంబుజలంవాయు - నశనమ్ము మానుచు
జీవిని సతము హింసించు వారు
వాజపేయిసమాన - వామదేవుని యోగ
గుహ్యజ్ఞానము లేక - గుందువారు
ప్రకృతి పూరుషరతుల్ - పాపకార్యములంచు
సృష్టిక్రమముగేలి - సేయు వారు
జననమరణ చక్ర - పునరావృతులమాన్పు
జక్రినెడద జూడ - జంకు వారు
స్వయముగా బ్రహ్మనను భ్రాంతి - వలలజిక్కి
కృశులైరెపోరె హఠయోగ - క్లేశములను
సంకట వినాశమమ్ము బ్రోచు - వేంకటేశ
వరద పద్మావతీ శ్రీశ - తిరుమలేశ

70

అతడు నేకాకటన్న - అతడు నేనైక్యమై *
ఒక్కడైపోదుమే - యొక్కచోట
ఒకటి కాకటి జేర - నొక్కటేయగునేమి
రెండుగావేమిటి - లెక్కసేయ
దేశకాలైక్యాలు - రాశిసమ్మిశ్రాలు
వ్యష్టిత్వసష్టిస - మిష్టంగునె

* ఏకత్ర భావము కేకస్య భావమగునా

ధనము చెంతలలేని - ధనపతి దరిద్రుడా
        ధనము మోసెడు బంటు - ధనదుడగునె
స్వామిమహిమను భృత్యులు మేమొకింత
చిన్నపరిమొన మోసిన - జిన్మయులమె
సంకట వినాశమమ్ము బ్రోచు - వేంకటేశ
వరద పద్మావతీ శ్రీశ - తిరుమలేశ

71

నరుడెన్ని రూపాల - పురుషోత్తముని రూపు
        గుఱుతింపగానేమి - హరియొకండె
వేనవేల్నామముల్ - విష్ణునకుండగా
        పేరేది బిల్చినన్ - వెలయునతడు
కేశవనామముల్ - కృష్ణాంకితములు
        ఆత్మనేపరములా - 'యఱసిజూడ
బ్రహ్మమ్మునేనైన బరమాత్ముభజనలు
        ననుగూర్చి భజనలై - నగవురాదె
వాదములవేల హరియంచు - బరుడటంచు
పరమపురుషుని గొల్చుట - నరకమేమి
సంకట వినాశమమ్ము బ్రోచు - వేంకటేశ
వరదపద్మావతీ శ్రీశ - తిరుమలేశ

72

బ్రహ్మస్వరూపాన - భావించుకొనినన్ను
        నీవలె నేనని - నిక్కు చుందు
నిముసమొక్కటి యైన - నీవులేకున్నచో
        నాదేహమగుబొంద - నాదిగాదు

మానసాధీశుడుమాపతి యలుగుచో
బుద్ధిస్వాధీనమై - వృద్ధిగాదు
తత్వదేవత లెల్ల - తమవశః మానుచో
నాదేహధర్మమ్ము - నాశముగును
బహుపరాధీనపు(బ్ర)తుకు - బంధనమిది
నీవుగరుణింపకవిడదు - నిజముగాను
సంకటవినాశ మమ్ము(బ్రో)చు - వేంకటేశ
వరద పద్మావతీ శ్రీశ - తిరుమలేశ

73

నానావిధాధమ - నరక మార్గములందు
జన్మించు యాతన ల్జాలలేదె
మూత్రపురీషాల - మాతృస్తనమ్ముల
గ్రోలెడుగోర్కెలు - జాలలేదె
నానా రు జాగ్రస్త - దీనస్థితిం జిక్కి
మూలుగుముక్కుటల్ - జాలలేదె
పుత్రమిత్రకళత్ర - భువికనకాల్కై
శాంతిని బాయుట ల్జాలలేదె
బంధితులుగారె ప్రతిజన్మ - భవములందు
నిత్యసంసారు లాత్మనీ - నెల[illegible]గనక
సంకటవినాశమమ్ము(బ్రో)చు - వేంకటేశ
వరద పద్మావతీ శ్రీశ - తిరుమలేశ

74

ఎవ్వాని దయచేత - నీవిశ్వములు వెల్గు

నట్టి విష్ణుని బొగడు టబ్బురంబె
వైశ్వానరుండౌచు - పచనాన్న సౌఖ్యముల్
కలిగించు హరినెన్న - కల్మషమ్మె
దుస్తరంపు భవాబ్ధి - దోడునీడగ నిల్చి
రక్షించు విభుగొల్వ - రచ్చయగునె
ఆదియంతముసదా - అంటియుండుననంతు
స్మరియించి దరిజేర - దురితమగునె
అంతయును బ్రహ్మనే బ్రహ్మ - ననునవజ్ఞ
వ్యర్థమౌ జన్మ ప్రాప్తించు - నసురజన్మ
సంకట వినాశమును బ్రోచు - వేంకటేశ
వరద పద్మావతీ శ్రీశ - తిరుమలేశ

75

అఖిలాండ కోటి బ్రహ్మాండ నాయకునిన్ను
నరుడల్ప ప్రాణి తా - నెఱుగుటేమి
లక్షలెన్నదినాల్గు - కక్ష్యాల జీవాల
నరునకేతెల్విదా - బఱగుటేమి
చినచేప పెదచేప - దినుతిమింగిలతిమిన్
దిను మాదిరిగ మిత్తి - దినుట లేమి
చేతనా చేతన - జీవ ప్రకృతులన్ని
తమకు దామెన్వతంత్ర - తత్వములరె
త్రాట ద్రిప్పవ బొంగరా - లాటలోన
త్రాడు నీవైన బొంగరాల్గాతు మాది
సంకట వినాశమును బ్రోచు - వేంకటేశ
వరద పద్మావతీ శ్రీశ - తిరుమలేశ

76

అష్టాంగ యోగముల్ అలవరించిన మాత్ర
కరతలామలకమా - పరమవిద్య
ధ్యానసమాధిలో - దన్మయించిన మాత్ర
సాక్షాత్కరించునా - సాక్షి సాక్షి
భజనకోలాటాల - బరవశించిన మాత్ర
విధివ్రాత దిద్దునా - విశ్వవిభుడు
పూర్తవిధులొనర్చి - పుణ్యమ్ముగను మాత్ర
కైవల్యధామమ్ము - ఇచ్చితమ్మ
శోధనలొనర్చి నీశుద్ధసాధనమ్ము
మెచ్చిదరిజేర్చుగములాక్షు - నిచ్చలేక
సంకటవినాశమమ్మబ్రోచు వేంకటేశ
వరద పద్మావతీ శ్రీశ - తిరుమలేశ

77

బ్రహ్మచర్యము గాదు - బడతినిద్వేషింప
బ్రహ్మతత్త్వము జూచు - వ్రతముగాని
యోగిబైరాగియా - భోగమ్ములను మాని
రాగద్వేషార్హ్వుడు - త్యాగిగాని
కందమూలము దిని - గనుమూయమౌనియా
కినిసి షడ్రిపులను - దునిమిగాని
భక్తాగ్రగణ్యుడా - బ్రహ్మతాననునంత
హరి బింబ మెదగొల్చి - మురియగాని
విష్ణుసర్వోత్తముని సేవ - వీడకుండు
భక్తిసంపద సతతమ్ము - బడయు వటుకు

సంకటవినాశమమ్ము బ్రోచు - వేంకటేశ
వరదపద్మావతీ శ్రీశ - తిరుమలేశ

78

"పురుషఃపురోఽగ్రతో - పూర్ణోఅజాయత
కల్పయన్వై చాన" - ఘనులు వినరె
పురుష పూర్ణప్రకృతి - బుట్టె ద్వైధాశక్తి
ప్రకృతి శ్రీలక్ష్మియై - పరిభ్రమించె
రవిశశితారకల్ దివము నక్షాదులు
సుఖదుఃఖద్వంద్వాలు - సురులసురులు
ప్రసవప్రస్థానాలు - బాపపుణ్యంబులు
ఉచ్చనీచగతులు - నుద్భవించె
వేరువేరుగ విభజించె - నీరు పాలు
పరమహంసలు హంస ప్ర - పంచమఅయ
సంకటవినాశమమ్ము బ్రోచు - వేంకటేశ
వరద పద్మావతీ శ్రీశ - తిరుమలేశ

79

నీచోచ్చభావాల - నిఖిల జీవమ్ములు
స్వస్వస్వరూపాల - సరళి వెంట
పూర్వకర్మగతుల - బుణ్యపాపఫలాల
నమభవింపుచు బుద్ధి - ఘనత బెంచి
పరుడప్రమేయుండు - ప్రతిచోట హరియుండు
టవగాహనము జేసి - దవిలి భక్తి
సర్వేశుడాతడే - సర్వోత్తముడటంచు
నిశ్చిత సత్యమ్ము - నిలిచి గొలిచి

*ఏషఃపురుషః ఏషః ప్రకృతిః (బ్రహ్మసూత్రం)

అల్పునను బ్రోచు దేవుం డ - నల్పుడనెడు
భక్తిగను చుండు సుఖప్రాప్తి - ముక్తి స్థితియె
సంకట వినాశమును బ్రోచు - వేంకటేశ
వరద పద్మావతీ శ్రీశ - తిరుమలేశ

80

యుగయుగావర్తాల - జగములు దిఱుగవా
కల్పాలనేకాల - గతులగతుల
రవిశశాంకుల జాడ - బవలిఱుల్బఱుగవా
వెల్గుతారలు వియ - ద్వీధులందు
జనిమృతి నావృత్తి - సంసార చక్రాల
మన్వంతరాల్ రావె - మఱల మఱల
జ్ఞానమజ్ఞానమ్ము - కష్టసుఖమ్ములు
మిట్టపల్లమ్ము ను - మిథ్యలగునె
చక్రి చక్రాంకితాల్జగ - చ్చక్రగతులు
గనుచు నపరోక్ష - జ్ఞాని యైమనుట ముక్తి
సంకటవినాశమును బ్రోచు - వేంకటేశ
వరద పద్మావతీ శ్రీశ - తిరుమలేశ

81

ముమ్మారు బలుమార్లు - మ్రొక్కి జాటించెద
దేవుడౌ శ్రీపతి - దిక్కుమనకు
ప్రకృతి రమణుడైన - పరమ పూర్ణుడతండు
వర రమేశుడు మాకు - బరమ రక్ష
అతని దయలేక - న్నాకైన గదలదు
అతని కృపమనకు - నవసరమ్ము

తెలిని గూర్చి యతండు - దెలియ జెప్పిన వేళ
తెలివి నాదేనన్న - దెలివి తప్పు
ముక్తి నివ్వంగ బంధింప - శక్తుడతడు
అతని పాటిగ బ్రహ్మనే - నను టముప్పు
సంకట వినాశమముబ్రోచు - వేంకటేశ
వరద పద్మావతీ శ్రీశ - తిరుమలేశ

82

ఇంద్రియ భోగాలు - నీకార్పణము టంచు
అతి మితి పాటింప - కతిశయించి
నిర్గుణ బ్రహ్మంబు - నేనొక్కటేనని
దేహవ్యాపారం బు - ధిక్కరించి
జహజహల్లక్షణా - మ్మనుసరించి చరించి
ఈ శుభానము నుంటి - నిచట నను చు
దేహివిదేహియౌ - దేవుడనేనంచు
ద్వైధా ప్రవర్తింప - వలనుకాదు
పరము డాతని దెలియుటే - పరమహితము
అతని ననుసరించుట ముక్తి - వ్రతము మనకు
సంకట వినాశమముబ్రోచు - వేంకటేశ
వరద పద్మావతీ శ్రీశ - తిరుమలేశ.

83

అన్నంబు దినుచు బ్ర - హ్మార్పణం బన్నచో
భుక్తియౌ జన్నంబు - భువనమందు
నీరమ్ము గ్రోలుచు నారాయణాయన్న
నీరమేయమృతమై - మారునిజము

వైశ్వానరుని కీల - బహుశ్రద్ధనాహుతుల్
విశ్వశ్రేయస్సుతె - వెలుగు ప్రభలు
ప్రతిపనిన్ పరహిత - పరమార్థముఅయుచో
విశ్వశాంతుల మెల్ల - వెలయునరుడు
ఆత్మవత్సర్వ భూతాని - యనెడు జీవి
తాను ధరియించి విభుజేరు - దారిజూపు
సంకట వినాశమున్బ్రోచు - వేంకటేశ
వరద పద్మావతీ శ్రీశ - తిరుమలేశ

**84**

పుట్టిన వెంటనే పుట్టవు వర్ణాలు
గుణ కర్మభాల - ఫణితిగాని
ద్విజుడైన వెనువెంట - విజ్ఞాని తాగాడు
శమదమాదుల గృషి పరిపి గాని
ఆజిని గెల్వగా - నబ్బదు క్షాత్రమ్ము
శిష్టసంరక్షణ - నిష్ఠగాని
విపణిలో సరుకమ్మ - బేహారి తాగాడు
ధర్మసంభారాలు - తాల్చిగాని
సత్యశ్రమ దానమొనరించు - సాత్వికులును
వరల జగముండు లేకున్న - వఱుస జెడును
సంకట వినాశమున్బ్రోచు - వేంకటేశ
వరద పద్మావతీ శ్రీశ - తిరుమలేశ

**85**

సహజ ధర్మము బాయ - నిహపరమ్ములులేవు
ఏకాల మందైన - నెచటనైన

వేదచయము నాల్గు - వృత్తి వర్గము నాల్గు
నితరనీచపుగతుల్ - బ్రతుకలేవు
చతురంగ బలములు - సతతమ్ము రక్షింప
పరిపంథులెప్పుడున్ - జొఱగలేరు
రాచటి కాబ్రభ్రజా - రాజ్యమ్ములైనను
మనుజహితము బాసి - మనగలేవు
విధినిషేధపు గ్రమములు - వెలితి బడవు
మనుజ మదమత్త మాలిన్య - మతులు గాని
సంకట వినాశమమ్ము బ్రోచు - వేంకటేశ
వరద పద్మావతీ శ్రీశ - తిరుమలేశ

86

ఆహార నిద్ర భయాది విషయమందు
పశులతో సముడైన - ప్రాణినరుడు
పరమాత్మగీర్తించు - వాక్శుద్ధి సాధించు
జ్ఞానమార్జింపు చో - మానవుడగు
మతములే వైనను - మానవత్వము తోడ
మనుజ ధర్మము బెంచి - మనుపుస్మృతులు
వైకుంఠసీమలో బరమాత్మసన్నిధి
దర్శనానందంపు - దన్మయతల
గర్మలుడుగగ జగదీశు - గాంచు ముండు
ధన్యులకు గాదె తన్ముక్తి - సన్నిధులును
సంకట వినాశమమ్ము బ్రోచు - వేంకటేశ
వరద పద్మావతీ శ్రీశ - తిరుమలేశ

87

తమసాంధలోకాల - క్రిమికీటజీవాల
వెన్నిజన్మమ్ములు - నీకుగాంచు
రౌరవమ్మనియెడు - రౌ్రవనరకమందు
స్రుతి సంస్థుల నతి గతి యదేమి
మానవ జన్మమ్ము మఱిగల్గబెన్నడో
పరమదుర్లభ మంద్రు - పాడొనర్ప
స్వాతిశయకుతర్క - పాండితీశరమూని
భంగపడుట లేల - భవ భవాల
దీప ముండగ గేహమ్ము - దిద్దునట్టుల
జీవముండగ శ్రీపతి - జేరవలయు
సంకట వినాశముమ్ముబ్రోచు - వేంకటేశ
వరద పద్మావతీ శ్రీశ - తిరుమలేశ

88

మనుజ శరీరమ్ము - మఱి మఱి రాబోదు
సాధన కనువైన - జన్మమిదియె
సురులు భ్రష్టులుగాగ - నరజన్మములు గోరి
పాపక్షయమ్మునకై - పరితపింత్రు
బహుయోనులనుమ్రగ్గి - పలుపాట్లు బడిగాని
దొఱకని నరజన్మ - ద్రోయరాదు
కరుణాళు డైహరి - నరజన్మగలిగించె
వ్యర్థమ్మొనర్చుట - నర్థమగును
నన్ను రక్షించు సంకల్ప - మున్నగాని
హరియొసంగడు నరజన్మ - ధరణిపైన
సంకట వినాశముమ్ముబ్రోచు - వేంకటేశ
వరద పద్మావతీ శ్రీశ - తిరుమలేశ

89

లక్షలెన్పదివాళ్ళ - కక్ష్యలు దాటక
జీవికి నరజన్మ - జేరరాదు
అక్షర జ్ఞానమ్ము - అలవడు నందాక
నరునకు దెల్విదా - తిరము గాదు
ధాత్రిలో తనయల్ప - స్థాయి నెఱుంగక
ఉన్నతి పైనుండి - యూడి పడదు
స్వీయచైతన్యాన - విష్ణుని గొల్వక
నైజముక్తి సుఖము - నడచిరాదు
వీడు బండెను భక్తి - నే వీని బ్రోతు *
ననుచు గరుణించి - హరిమమ్ముగ నెడువఱకు
సంకట వినాశమము బ్రోచు - వేంకటేశ
వరద పద్మావతీ శ్రీశ - తిరుమలేశ

90

నినుబోలు కరుణాత్మ - గనలేరు విశ్వాన
నను బోలు వంచకున్ - గనగలేరు
జ్ఞానమిడెడు నిన్ను - గనలేను గర్వాన
జ్ఞానినినే నంచు - గర్వపడెద
విపుల విశ్వమ్ములో - వెలయు నెంతటివాడ
విశ్వేశు డేనని - వెలుగ నెంతు
చీమకన్నను చిన్న - దోమ కన్నను చిన్న
దగు బుద్ధి బ్రహ్మహ - మస్మియందు
నిన్ను దలపని దౌర్భాగ్యమున్న వాని
నన్ను గరుణించి దయబ్రోచు - మున్నతుడవు

* పరమభక్తి పక్వ మేనం మోచయామి. అని దైవసమయము

సంకట వినాశ మమ్ముబ్రోచు - వేంకటేశ
వరద పద్మావతీ శ్రీశ - తిరుమలేశ

91

నాలుగు వర్ణాలు - నాలుగు వేదముల్
ఆశ్రమాలొప్పగ్గని - వ్యాసుడని యె
అస్తవ్యస్తమ్మైన - ఆమ్నాయములదీర్చి
సూత్రాళితో బ్రహ్మ - సూత్రమిడియె
ఇరువది యొకమారు - ధరణీపులను ద్రుంచె
పరశురాముడు రా - చటికములను
ఇరువది యొక భాష్య - సరళిని ఖండించి
మారుతి వెలయించె - మధ్వశాఖ
విష్ణువుప్రభువు నధీనమ్ము - విశ్వమనియె
సర్వమైక్యమై గననౌనె - జగములెల్ల
సంకట వినాశమమ్ముబ్రోచు - వేంకటేశ
వరద పద్మావతీ శ్రీశ - తిరుమలేశ

92

నిత్యబుద్ధవిశుద్ధ - నిఖిల చైతన్యైక
రస నిర్గుణము శంకరము బరమ్ము
శేషి శేష విశిష్ట - సేవ్యసేవక మైక్య
పథము రామానుజ - వైష్ణవమ్ము
విష్ణుడొక్కడెస్వామి - వేరలెల్లరు తార
తమ్యాల దదధీన - దాసక్రమము
జగదీశుడు జగము - సకల తత్వాల్భిన్న
ములు సత్యమను మధ్వ - ముని మతమ్ము

ఇన్ని కథలేల వెన్నుడా -- నీవుగాక
భక్తి మెచ్చిముక్తి నొసంగు - ప్రభువెవండు
సంకట వినాశమమ్ముబ్రోచు - వేంకటేశ
వరద పద్మావతీ శ్రీశ - తిరుమలేశ

93

పాంచభౌతికతత్వ - పరిణత దేహమ్ము
సందుండు విభుడు దానంటు కొనక
పంచభూతములందు - పవనుండు లేకున్న
మనుజ శరీరమ్ము - మనుట కల్ల
పవనుడు లేకున్న - పరమాత్మతోడరాడు
పవనుండు వెడలిన - ప్రభువువెడలు
పవను డే మమ్ముబ్రోచి - పరమాత్మదరిచేర్చు
జీవోత్తముడగుమా - దేవగతికి
భావిబ్రహ్మయై మము హరి - పదము చేర్చు
పవనజుడు మధ్వముని యయ్యె - భువనమందు
సంకట వినాశమమ్ముబ్రోచు - వేంకటేశ
వరద పద్మావతీ శ్రీశ - తిరుమలేశ

94

విష్ణుతత్వమురామ - వేషానభువిరాగ
మారుతియై తాను - మహిజెలంగె
విష్ణుతత్వము కృష్ణ - వేషమ్ము ధరియింప
భీమసేనుడగుచు - వెలసెపృథ్వి
కృష్ణద్వైపాయన - విష్ణుతత్వమురాగ
పవనుడు మధ్వుడై - పరగెభువిని

పరిపూర్ణతత్త్వలా - హరిరమల్రిన్నిలే
హనుమధాత సుతత్వ - మగును పిదప
బాయరొండొరుల వతార - ప్రతియుగాల
తత్వమిరువది నాల్గైపై - తత్వ డీవు
సంకట వినాశమముబ్రోచు - వేంకటేశ
వరద పద్మావతీ శ్రీశ - తిరుమలేశ

95

వాయుతత్వములేక - వరల వేతత్వముల్
పరతత్వమునకైన - పరమహితుడు
జీవోత్తముడతడు - జీవుల ప్రతినిధి
అతడు జూపిన గాని - హరినిగనము
ప్రాణాదుల నుమ్మఖ్య - ప్రాణుండు జగతిలో
ప్రాణికోటికి జీవ - భావమతడు
ఆమహాజాని శక్తి - ధీమితి కెనలేదు
ప్రబలజవు డతడు - భావిబ్రహ్మ
వినయనయశీలి ధీశాలి - విమలభక్తి
ప్రణతి మాను నే హరిసేవ - క్షణము నైన
సంకట వినాశమముబ్రోచు - వేంకటేశ
వరద పద్మావతీ శ్రీశ - తిరుమలేశ

96

ధాతయయ్యేడు యోగ - మాతని కున్నను
దాసాను దాసుడౌ - శ్రీశునకును
అతడు మనోజవుం - డతులిత బలశాలి

ఎన్నదీశాలిజి - తేంద్రియుండు
ఆతడస్ఖలితుండు - నకళంక హృదయుండు
సాటియేలేనట్టి - మేటిజోదు
వజ్రశరీరుండు - భక్తి వినమ్రుండు
సుమసదృశుడెడద - సుందరుండు
వినయ పుంజీకృత ప్రవృత్తి - విమల పథియు
విష్ణునకు ముఖ్య సచివుండు - బేరు హనుమ
సంకట వినాశమమ్ముబ్రోచు - వేంకటేశ
వరద పద్మావతీ శ్రీశ - తిరుమలేశ

97

దేవునొక భుజాన - జీవునొకభుజాన
వహియుంచు హనుమంత - వాయుజుండు
ప్రాణాగమన వేళ - ప్రాణనిర్గమవేళ
బఱగు ధనంజయ - వాయువతడు
నవసూత్రనామక - నవక వ్యాకృతినిధి
గఱగించు శిలనైన - గానపటిమ
నిజసుఖమను ముక్తి - నిజభక్తి మార్గమ్ము
ప్రవచించు నాచార్య - ప్రథముడతడు
హనుమ భీమ మధ్వాఖ్యుడై - యంజలించు
శ్రీహరిని గొల్చుదా జిరం - జీవి యగుచు
సంకట వినాశమమ్ముబ్రోచు - వేంకటేశ
వరద పద్మావతీ శ్రీశ - తిరుమలేశ

98

పూర్ణతత్త్వము గొల్చు - పూర్ణప్రజ్ఞుడు మధ్వ
డానందతీర్థస - వాఖ్యుడతడె

తుది భాష్యమతనిదే - యదునాతనమ్మగు
ఒంగీకరింప బ్ర - యాసలేల
వ్యక్తి దూషణలేని - భక్తి వాదమ్ముల
సమదృష్టి సూత్రాల - సమత బెంచి
విశ్వశ్రేయము గోరు - విజ్ఞాన వరులెల్ల
మధ్వసిద్ధాంతమ్ము - మహిమనటిసి
తత్వ సంఖ్యానమెటిగించు - తత్వవాది
ద్వైతజ్యోతిని వెల్గించు - పథముగనరె
సంకట వినాశమమ్ముబ్రోచు - వేంకటేశ
వరద పద్మావతీ శ్రీశ - తిరుమలేశ

99

వ్యాస బీజావాప్తి - ద్వైతమ్ము శ్రుతిభుని
భగవత్పదాంబుజ - భక్తి మొలిచి
ప్రత్నమీషద్భిన్న - వ్రతి జని జయ శాఖ
జయతీర్థమలయార్ధ్ర- సస్యమెదిగి
ముని వ్యాస తీర్థుండు - మొగ్గలు దొడిగింప
విజయీంద్రుల సుధీంద్ర - వికచవిరుల
గురురాఘవేంద్రుని - పరిమళసుఫలాల
మంత్రాలయము వెల్గు- మధ్వమహిమ
రాఘవేంద్రుడు బూజించె - రామచంద్ర
వేంకనగ బుట్టి నీసేవ - వేంకటేశ
సంకట వినాశమమ్ముబ్రోచు - వేంకటేశ
వరద పద్మావతీ శ్రీశ - తిరుమలేశ

100

శ్రీవిష్ణునిం బ్రొక్కి - శ్రీలక్ష్మిని మహిని
మఱిమ్రొక్కి బ్రహ్మను - మాతరిశ్వ
గాయత్రి భారతిన్ - గరుడోరగుల మ్రొక్కి
రుద్రదేవుని నగజ - భద్రకాళి
శ్రీ రమాతనయుని - శ్రీయుమాతనయుని
విఘ్నవిష్వక్సేన - విభుల మ్రొక్కి
యముని శ్యామల మ్రొక్కి - యాపురందరుశచిన్
రవి శశితారకా - వివిధతత్వ
దేవముని పితృభూపధీ - జీవతతుల
తారతమ్యమెఱిగిజన్మ - దాటు డనియె
సంకటు వినాశమమ్ముబ్రోచు - వేంకటేశ
వరద పద్మావతీ శ్రీశ - తిరుమలేశ

101

శుష్క వేదాంతాల - జొప్పు గుప్పించుచు
వింతవాదమ్ములు - వెలయసాగె
ఆశ్రమాల్ ప్రతియూర - నల్లిబిల్లిగనుండె
అందఱుయోగులై రందముగను
వీధివీధికి విశ్వ - విద్యాలయములుండ
విశ్వవిజ్ఞానమ్ము - వెలితిబడియె
ధర్మాసనాసీన - ధర్మకర్తలు వేడు
దైవాలరక్షించు - దక్షులెరి

ఎవరి చొప్పులు వారలే - యవధరింప
భక్తజనములన్న బ్రజలకు - భయము హెచ్చె
సంకట వినాశమము బ్రోచు - వేంకటేశ
వరద పద్మావతీ శ్రీశ - తిరుమలేశ

102

పెత్తనాల్ వహియించు - పెద్దమనుష్యులు
పెద్దరిక ము- బాసి - పిన్నలైరి
బ్రహ్మకర్మరతులెల్ల - బడుగునుద్యోగులై
పొట్టకూటికి గూలి - బట్టుకొనిరి
వ్యాపారదృష్టితో - పాపసాధములెంచి
కోట్లకు బడగెత్తు - క్రూరులైరి
ఘనకృషీవలు లెల్ల - కర్షకమ్ములు మాని
రాజకీయాలలో - రాజుకొనిరి
స్వీయ ధర్మాలు విడిపర - కీయమెంచి
తికమకల వరుల్ పరమ నాస్తికులరైరి
సంకట వినాశమము బ్రోచు - వేంకటేశ
వరద పద్మావతీ శ్రీశ - తిరుమలేశ

103

దైవమున్ వంచించు - దర్శనాచార్యులు
బుట్టగొడ్గులవోలె - బుట్టినారు
ఇంద్రియానందమే - ఈశ్వరార్చనయను
నక్తేశులాచార్య - నాథులైరి
వీధివీధికి గుడి - పేరుపేరు మఠమ్ము
విద్యుత్ప్రమాది ప్ర - వీణులైరి
ఆసవపాన విన్యాస సమాధులు
ప్రతి పట్టణము నందు - బాదుకొనియె
దైవ భావన మపహాస్య - దర్ప మయ్యె
భక్తుడనగానె సంశయాల్ - భయము హెచ్చె
సంకట వినాశముముబ్రోచు - వేంకటేశ
వరద పద్మావతీ శ్రీశ - తిరుమలేశ

104

మనుధర్మ స్మృతున్ని - మాంధాత కథలయ్యె
గీతబోధన లిపుడు - రోతలయ్యె
నిజము జెప్పెడు వారు - నిజముగా గఱువైరి
ధర్మాత్ములైరి చా - దస్తజనులు
ప్రతిరంగమున గుళ్లు - ప్రతినోట డంబమ్ము
ప్రతిచోట భయము సం - ప్రాప్తమయ్యె
జారచోరత్వముల్ - స్వైరప్రవృత్తులు
నేరముల్ కావను - తీఱు హెచ్చె

పిదప బుద్ధులు సామాన్య - విషయమయ్యె
చేటు గాలమువచ్చెవా - శ్రీనివాస
సంకట వినాశముబ్రోచు - వేంకటేశ
వరద పద్మావతీ శ్రీశ - తిరుమలేశ

105

ఋతువులు గతిదప్పె - క్రతువులు గలవయ్యె
విశ్వశ్రేయాల్పట్టి - వేడ్కలయ్యె
అజ్ఞానమౌఢ్యత - లందెబరాకాష్ఠ
కుందేళ్లమూగాళ్ల- గులుకుచుండె
యతులలో రతిరాజ - వ్రతులెక్కువైనారు
రతిసమాధులు గ్రైపు - హితములయ్యె
మారణాయుధముల - మహిమలు వేగాలు
ప్రళయావధినిమిష - ములకు దించె
భస్మమగునేమొ పుడమితా - భగ్గుమనుచు
వికట నరసృష్టికుటిలాణు - భృకుటికిల
సంకట వినాశముబ్రోచు - వేంకటేశ
వరద పద్మావతీ శ్రీశ - తిరుమలేశ

106

అంగడిలో నుండు - అల్లమా బెల్లమా
దేవునివిపణిలో - దెచ్చుకొనగ
మాయల గారడీ - మహిమలా మంత్రాల
దేవుని లీలలన్ దెలిసి కొనగ
వేదాంతవిపినాల - వాదోపవాదాల
దేవుని జాడలు - దేవిరింప

వేదశాలలలోన - శోధవార్పటములా
దేవుని చిద్రూపు - దిద్దిజూప
సతము బహిరంత రంగాన - సాక్షియై న
వాని నాత్మబందుగు నిన్ను - బట్టుకొనరు
సంకట వినాశముబ్రోచు - వేంకటేశ
వరద పద్మావతీ శ్రీశ - తిరుమలేశ

107

అల్పాక్షరాలన - నల్పార్థములనెంచి
బల్కుచోరమ్యమ్ము - వాక్సుమమ్ము
కరుకుకంఠమ్ముతో - పరుషవాక్యములాడ
మంచి మాటలు గూడ - మలినమగును
చెప్పెడు బనిజేసి - జేయగలది చెప్పి
చేసి చూపించుట - శ్రేష్ఠమగును
సత్యమార్గమిపుడు - పరతత్వమును బాసి
డొంకవీధులబడి - వంకరయ్యె
తిక్కప్రశ్నల శాస్త్రాల - చిక్కుజేసి
మాయమిథ్యాప్రలోభాలు - మానరేల
సంకట వినాశముబ్రోచు - వేంకటేశ
వరద పద్మావతీ శ్రీశ - తిరుమలేశ

108

శ్వాససమముజేసి క్లేశము లొడ్డించి
జలశుద్ధి మలశుద్ధి సరియొనర్చి
అంతరాత్మదలంచి - కంతలబంధించి
చిత్తచాంచల్యంబు నొత్తిపట్టి

జపతప సాధనాల్ - సత్సోధనలు సల్పి
ధ్యానాన మా నాథు - దయను బడసి
హృత్కమలతలాన - నెంచి నాభికి బైన
వరిముల్లమొనవోలె - బఱగుహరిని
బింబమూర్తి ని సతతమ్ము - బ్రీతి మ్రొక్క
గలవిదేహస్థితిని నిల్వ - గలుగుముక్తి
సంకట వినాశమమ్ము బ్రోచు - వేంకటేశ
వరద పద్మావతీ శ్రీశ - తిరుమలేశ

109

మితముగా భుజియించి - హితముగా మాట్లాడి
మానవత్వపు నైజమహిమనెఱిగి
ఇరుగుపొరుగు వారి - కిలసహాయమొనర్చి
ఇంతతాదిని వారి - కింత యొసంగి
లేమి గీముల నోర్చి - లెస్సలు బరికించి
చూపోపమిని ద్రోసి - సుకముబంచి
తమ గొప్ప జెప్పక - తమతప్పు దిద్దుక
తమసమ్ము విడనాడి - యమృతసిద్ధి
మనుట మానవత్వపు తీరు - మనుజతతికి
మానవత్వమె హితము సమ్మతము హరికి
సంకట వినాశమమ్ము బ్రోచు - వేంకటేశ
వరద పద్మావతీ శ్రీశ - తిరుమలేశ

110

వదలిచీకటిదారి - మెదలి వెల్గుల దారి
అపమృత్యువును బాసి - యమృతులగుచు

సత్యమ్మువే పల్కి - చరియించిధర్మాన
మాతాపితృగురుల - బ్రీతిగనుచు
పంచఋణముల దీర్చి - పంచపూనము బాసి
పంచభేదమ్ముల - పణితులెంచి
విష్ణునిహృదయాబ్జ- బింబమ్ము నంగాంచి
భక్తిమార్గాన నా - సక్తిబెంచి
విభుని సందర్శనానంద - వేద్యులగుచు
నరులు గనుచుంద్రు నీచెంత నైజముక్తి
సంకట వినాశమము బ్రోచు - వేంకటేశ
వరద పద్మావతీ శ్రీశ - తిరుమలేశ

111

దేహమ్ములోనుండి - దివ్యవ్యాపారంబు
గావించు శ్రీహరిం - గాంచవలదె
వంచకులార్జురి - పంచనన్నుంచక
మంచి బెంచెడు హరి - నెంచవలదె
కలిమిలేములలోన - ఘనరోగ సమయాల
దిక్కగు మాధవున్ - మ్రొక్కవలదె
సద్బుద్ధి బెంచుచు - శాంతి నొసంగుచు
బ్రోచు రమాకాంతు బొగడ వలదె
అతడు రక్షింప సకలమ్ము - హితము గాదె
అత డలిగిన సర్వమ్ము - రోతగాదె
సంకట వినాశమము బ్రోచు - వేంకటేశ
వరద పద్మావతీ శ్రీశ - తిరుమలేశ

112

వైకుంఠమును జేరి - విష్ణుమూర్తిని గొల్వ
జీవించు సద్భక్తి - జీవి ముక్తి
కర్మంబు పక్వమై - కాయంబు బక్వమై
బరమపక్వపు భక్తి - బడయు ముక్తి
పరములో నిహములో - వాసుదేవుని మూర్తి
గాంచుచు మనుటలో - గలదు ముక్తి
తుంటి యహంభావ - మొంటి జరింపక
వెంట నుండెడు హరి - నంట ముక్తి
నియత గురుపరమగురుల - నిరత కృపను
శ్రీశ నీదయ నిజముక్తి - చిక్కుగాత
సంకట వినాశమమ్ము బ్రోచు - వేంకటేశ
వరద పద్మావతీ శ్రీశ - తిరుమలేశ

113

నేను నమ్మెద నిన్ను - నీవు నావాడవే
నేను బ్రహ్మ మనుట - మానుకొందు
సకలవేదాంతంపు - సారంబు దెలియుచో
సర్వజ్ఞుడనను నా - గర్వమూడ్చు
సంగీత సాహిత్య - సరసత్వమెఱుగుచో
గానాల నీగుణ - గాన మెంతు
సద్భక్తి సజ్జన - సాంగత్యముల్లగ్గి
చింతనామృతముల - సంతరింతు
ఇదియె తుదిజన్మ యని నాకు - నిమ్ము ముక్తి
నీదు చిద్రూప మెడదలో - బాదుకొలిపి

సంకట వినాశమును బ్రోచు - వేంకటేశ
వరద పద్మావతీ శ్రీశ - తిరుమలేశ

114

దీనుని గానీకు - హీనుని గానీకు
నను బ్రోవు దయ జూచి - నళిననాభ
సత్యమార్గమ్ములో - సతతమ్ము నను నిల్పి
కరుణ జూడుము - తండ్రి పరమపురుష
వంచకులెవ్వరో - మంచి వారెవ్వరో
ఎంచి గాంచగలేను - ఇందిరేశ
ఏరీతి నిను గొల్చు - పెరిగించి బ్రోవవే
చిద్రహస్యము దెల్పి - శ్రీనివాస
మౌన మే శరణ్యమను నీ - మహిమజూపి
లేమి బాపుము సాన్నిధ్య - లేశమిమ్ము
సంకట వినాశమును బ్రోచు - వేంకటేశ
వరద పద్మావతీ శ్రీశ - తిరుమలేశ

115

సకల సౌభాగ్యాలు సమకూరు జగతిలో
విష్ణునాతని జగతి - విశ్వసింప
చతురబ్ధి మేఖలావృత యౌ ధరిత్రి దా
సస్యశ్యామలఫల - శాద్వల యగు
న్యాయ మార్గములెంచి - నడచెడు ప్రభుతలు
మనుజాళి ధర్మాన - మనుట లెంత్రు
సకలలోకమ్ములు - సుకములు గనియెడు
భక్తి మార్గము భువి - ముక్తినిడును

శ్రీహరి రమ దుగ్ధాబ్ధి బా - చికలీల
శాంతి డోలల నూగు ము - జ్జగము లెల్ల
సంకట వినాశమమ్ముబ్రోచు - వేంకటేశ
వరద పద్మావతీ శ్రీశ - తిరుమలేశ

116

అయివుణ్ బులుక్కులు హల్వృద్ధి ర్వాదైచ్లు
నారాయణ గురుడు - నాకు దెలిపె
మణిమంజరీ మధ్వ - ముని విజయమ్ముదా
జెప్పె గాప్రేశుండు - శిష్టశాల
మేఘమూఘాదుల - మిలిత పాణిని గూర్చి
పూర్ణప్రజ్ఞుడు కావ్య - బోధ జేసె
బ్రహ్మ సూత్రపు సుధా - వ్యాఖ్యానము ల్దెల్పె
రంగనాథాచార్య - ప్రాజ్ఞగురుడు
బలిజెపల్లి దివాకర - తెలుగు బోధ
లిడగ రచియింతు శ్రీరాఘ - వేంద్రు గృపను
సంకట వినాశమమ్ముబ్రోచు - వేంకటేశ
వరద పద్మావతీ శ్రీశ - తిరుమలేశ

117

శ్రీ విష్ణు కీర్తనల్ గావింతు గీర్వాణి
సద్భక్తి సంగీత - సరసగతుల
శ్రీరామ శ్రీకృష్ణ - శ్రీ సుప్రభాతముల్
రాఘవేంద్ర కరావ - లంబములును
విరియింతు నాంధ్రాన - వేంకన్న విభవమ్ము
శ్రీశతత్వామృతాల్ - చిరుద్విపదులు

హనుమ సత్యాగ్రహ - మ్మనికథల్ పలవాటి
వాటి వీరబ్రహ్మ - నాటకములు
హరి పవన గురు రాజులు - వరము లిడగ
భువి సుధీంద్ర సుకవి వని - బుధులు బిల్వ
సంకట వినాశముమ్ముబ్రోచు - వేంకటేశ
వరద పద్మావతీ శ్రీశ - తిరుమలేశ

118

ఆత్రేయ గోత్రుండ - నాంధ్రాన కోసిగి
రాయలేలిన రమ్య - రత్నసీమ
శ్రీలక్ష్మినరసింగ - సిరిభూసురుల జ్యేష్ఠ
సుతుడను ప్రహ్లాదు- డితి సుతుండ
యధికార విశ్రాంతి పదవి- నందిన వాడ
కేంద్రప్రభుత్వాంధ్ర - కేంద్రములను
సంపూర్ణయాత్రలో - సకల క్షేత్రేశుల
నాశుస్తోత్రార్ఘ్యాల - నర్చనలిడి
సద్గృహస్థినై సాహితీ - సత్కుటుంబ
విపుల గోష్ఠుల బుధుల సత్కృప లసింతు
సంకట వినాశముమ్ముబ్రోచు - వేంకటేశ
వరద పద్మావతీ శ్రీశ - తిరుమలేశ

119

కృతి సమస్త మ్మిమ్మద్ది - కేశ - వార్పితమగు
నాచంద్రతారార్క - మవనియందు
నా శక్తియుక్తులు - నాకైతలెల్లను
శ్రీశుని గుణకీర్తి - సేయుచుండు

ఐక్యతాభ్రాంతుల - ననుమానముల గ్రుంగు
జీవాళి కమృతంపు - జినుకులివ్వి
నిత్యసుమములివ్వి - నిష్కల్మషమ్ములు
శ్రీనివాసుని చెంత జేరుగాత
ద్వైత విశ్వవిద్యాలయాల్ ప్రభల బెంచ
విష్ణుతత్త్వమ్ము వెల్గించు - విశ్వశాంతి
సంకట వినాశమము బ్రోచు - వేంకటేశ
వరద పద్మావతీ శ్రీశ - తిరుమలేశ

120

హరిచరణ యు గార్ద్రీభూత కావ్యం మనోజ్ఞం
సురుచిర శుభశైలీసుందరం ముగ్ధరమ్యాం
హరిగురురనిలా శీః జాతకన్యాం ప్రసన్నాం
హరిచరణ సరోజాంఘ్రే సమర్ప్యన్నమామి

ఇతి

# శ్రీ శ్రీశ తత్త్వామృత మంథనం నామకావ్యే
## ద్వితీయాశ్వాసం
## సంపన్నమ్

# శ్రీ శ్రీ శతత్వామృత మంథనమ్

## తృతీయాశ్వాసము

## త్రివిక్రముని – త్రిపద – విన్యాసములు

## త్రిపద ముక్తకములు

1

శ్రీలిచ్చు శ్రీతల్లి – మేలెంచు శ్రీవిభుడు.
భూలక్ష్మి భరలోర్వి – త్రైలోక క్షేమమ్ము
లాలించు గనుడు జనులార

2

వివరించు వేదాల – కవుల సత్కావ్యాల
ప్రవచించు పవనగురు – ప్రవిమలమ్మౌ నిజము
చెవులొగ్గి వినుడు జనులార.

3

శ్రీకారమును జుట్టి – లోకాల జీకట్లు
బోకార్చు ప్రభుభక్తి – గైకొందు సర్వజ్ఞ
బోకడం ద్రిపది – జనులార

4

ఎన్నియుగముల గూర్చె – నెన్ని కల్పము లేర్చె
వెన్ను డఖిల జగాల – సన్నిహిత సద్గతికి
మిన్న. గమ్యుడగు జనులార

5

తొలుత నుమాసుతుని – దలచి మ్రొక్కక యున్న
జెలగు విఘ్నములు గు – ప్పలుగ మున్నతనినే
దొలుతన్ నుతింతు జనులార

6

హరి రమా భూబ్రహ్మ - హరి వాయు బ్రహ్మణీ
వరభారతీ గరుడు - ఉరగ రుద్రాళితో
వరుస తిరమంద్రు జనులార

7

పలుకు నవబోడి లో - దలపక సాగునే
లలితోక్తి సుకవితా - కలితోక్తి సరసోక్తి
వెలుపొప్ప భక్తి - జనులార

8

కవివ్యాస కాళిదాస్కు విదండి వలెగాక
గవు లితరు ల కవులగు - కవి కాక నాములే
కవుల కవి హరియె జనులార

9

మానవుని నైజమ్ము - మానవత్వము సుమ్ము
వేనవేల్ వైషమ్య - హీనబుద్ధులు మాని
జ్ఞానమ్ము గనుడు జనులార

10

తెలిసె సర్వమ్మనుట - తెలివిజాడ్యము సుమ్ము
కలిమిలేముల నీర్ష్య - కులవర్గ వికటముల
ఖలులు గావలదు జనులార

11

సహజ సహజీవనము - లిహవాస ధర్మముల
విహరించు మనుజాళి - సహజ శాంతుల తోడ
సహజ సుఖ మరయు జనులార

12

ఎనలేని ప్రభుశక్తి - గను విశ్వగోళముల
జనియించు జీవములు - ఘనముక్తి పయనముల్
కనవలయు సతము జనులార

13

ఆది యంతములేని - వేదముల్ గనలేని
ఆదిమూలుని గాంచ - బ్రోదిసేయుడు భక్తి
నాదమోంకృతుల జనులార

14

అతడుండు నన్నింట - నతని దాకగలేరు
అతడొసగు తెలివితో - నతని నెరుగగదుదకు
గతియతడె సుమ్ము జనులార

15

అతని బాయగలేము - అతని జూడగలేము
అతడస్తి నాస్తి యను - బ్రతివాదముల్ విడచి
హితశ్రుతుల వినుడు జనులార

16

బహిరంతరంగముల - జహజహల్లిక్షపు
సహజసద్భావముల - దహరాంబరములోన
విహరించు గనుడు జనులార

17

దేహమను కోవెలను - దేహియొక పూజారి
కోఽహమను బెటిగి దాసోఽహమని ప్రభుగాంచి
త్రాహి యనవలయు జనులార

18

అతని దెలిసితి నంచు - అతడు నేనని యెంచు
మితబుద్ధులకు నతడు - సతము దెలియగ రాడు
హిత భక్తి లేక జనులార

19

అతని మాహాత్మ్యమ్ము - అతని యైశ్వర్యమ్ము
అతని చాతుర్యమ్ము - సతత మరయగ వచ్చు
అతని గనలేము జనులార

20

అతడు కర్తయటంచు - అతడు భర్తయటంచు
అతని విడలేమనుచు - శ్రుతులు హితములు జెప్పు
అతని కెనగాము జనులార

21

కాదనుచు వాదింప - నాదియంతములేని
వేదవేద్యుడు దుదకు - వీధిలో దాఊకునే
నాది వీదనగ జనులార

22

పరిమితియె లేనట్టి - పరమాత్మ ప్రభుశక్తి
పరికింప జిన్మూర్తి - విరిబోలు హృత్పీఠి
నెరుగుటే ముక్తి జనులార

23

నరుల హృదయములందు - విరిభక్తి నెగబూయు
వరువరోజము క్రింద - వరిముల్లు కొనవోలె
హరిబింబముండు జనులార

24

పరమ ముఖ్యప్రవృత్తి - హరి సర్వహృదయముల
బరగు బింబపు కాంతి - సరయు బ్రతిబింబముల్
పరభక్తి శ్రద్ధ జనులార

25

జగదీశు డనవద్య - నిగమ వేద్యుండగును
జగతి నామములన్ని - సుగతి గేశవుజేర్చు
బ్రగతి - గతి ముక్తి జనులార

26

త్రిపద వామన వటుడు - విపుల విశ్వముగొల్చె
త్రిపద సర్వజ్ఞుండు నుపమ కన్నడనుడికి
త్రిపదు లెన్నెదను జనులార

27

కవి వేమన వ లె దా - జవులూరు వచనాలు
బ్రవిమలమ్ముగ జెప్పె - శివయోగి సర్వజ్ఞ
డవని గన్నడము జనులార

28

అక్కయను బియెంబ - బెక్కన్ను పిల్లెంబ (10+10)
చొక్కటదతేజిగుర్రెంబ తెలుగన ( 17 )
సొక్కనోడెంద సర్వజ్ఞ (కన్నడవచనం) ( 13 )

29

అక్కగవి 'బియమను - బెక్కన్ను పిల్లియను ( 20 )
చొక్కమగు తేజివాక - గుక్కతో గుర్రమను ( 20 )
తిక్క తెల్గనియెజనులార ( 13 )

30

దేశద్రిమ్మరి యతడు - ఆశువుగ వచనములు
వ్రాసి రాశిగజెప్పె - వ్యంగ్యమర్యాదలో
దేశికైతలను జనులార

31

శర్వశివు దత్తమ్ము - సర్వజ్ఞ వచనమ్ము
గర్వితమునకుఠార - యుర్వి సద్విహితమ్ము
పర్వమ్ము భక్తి జనులార

32

ఇంద్ర గణముల నెన్ను - ఇనునితో నొప్పారు
చంద్రగణ భలనలల - సలలితోడనైదింట
సాంద్రమ్ము ద్విపది జనులార

33

సీసపద్యము వోలె - వ్రాసి దూగునుగాని
చూపె చంద్రుల త్రిపద - బాసెగీతల వెలది
వేసె మూడడుగు జనులార

34

తగదు నుత్కళిక జిగి రగడ "యమజ" గణముల
సుగమ మగు ప్రాసతో - సుగుణ ముక్తకశైలి
ముగియించు ద్విపది జనులార

35

సగము షట్పది గాదు - నిగమత్రిష్టుపు గాదు
తగ దనుష్టుప్ శైలి - మొగలి పొగసుల రేకు
సిగపూవు త్రిపది - జనులార

36

పది మాత్రలకును యతి - మొదట నిర్వది బల్కి
పిదప దా బదునేడు - దదుపరిన్ బదమూడు
గుదిరించె నతడు జనులార

37

పదిమాత్రలకును యతి - మొదట రెంటిరువదుల్
తుది మూట బదమూడు సుధలొలుక బ్రాసతో
ముద మొప్పవ్రాతు - జనులార

38

అతని యదార్థవాద మతని రీతినిమెచ్చి
అతని లోకజ్ఞాన - వితతి నీతులు మెచ్చి
నుతులిడిరి ప్రజలు జనులార

39

అతని నీతులు గొన్ని - ప్రతిభ కెక్కినవాని
మతిమెచ్చి స్వేచ్ఛతో - మితముగా బచరింతు
హితులు మెచ్చంగ జనులార

40

పలక బలపము బట్టి - పలుకు నేర్వడు గాని
విలువైన గీర్వాణి - మలుపు తెలుగడు గాని
గులికించు ద్రిపది జనులార

41

ముక్కుమాటిగ నీతి - మక్కువలతో జెప్పు
జిక్కు పొడుపు కథలను - జక్కగా పాడిపించి
తిక్క గుదిరించు జనులార

42

మొగమాట మదిలేక - జగదీశు నైన దా
నగవు వ్యంగ్యము లెగయు పగిదిలో నిగమార్థ
మగుపింప జేయు జనులార

43

తనతల్లి యౌమాళి - తన తండ్రి ద్విజాడంచు
తన గోడు జెప్పుకొని - తనుగూడు నెఱజాణ
జెనటి యని రోసె జనులార

44

అతివలన్ క్షితిసురుల - కితవవామాచార
ఋతరిపుల జిన బౌద్ధ - వ్రతుల మెచ్చండితడు
స్థిత ప్రజ్ఞుడనిరి జనులార

45

అతనివలె గాకున్న - నతని శైలిని కొంత
ప్రతతితో దెలుగులో - హితసూక్తులను గూర్చి
నుతియింతు శ్రీశు జనులార

46

కాలమను పాతఱన్ - గైతలన్ ఊరింతు
వీలెంచి విజ్ఞతతి - మేలు గీడుల దెలియ
జాలగా భావి జనులార

47

ఘన సువర్ణచ్ఛటల - తనువర్ణనలు లేవు
మనసి సుమనస్సులగు - మనవి మ్రొక్కులు గలవు
గొనబులగు నవలు జనులార

48

నిగమోక్త సారముల - సొగసైన తెలుగులో
త్రిగుణ త్రిపదుల హేల - సుగమ ముక్తక మెంతు
సుగుణ సుందర శైలి జనులార

49

త్రిపద వచనము దెల్గ - సుపదముల గనరావు
ద్విపద షట్పదకంద - ముపజాతి రగడలును
విపులముత్కళిక జనులార

50

పిడుపర్తి పాల్కురికి - ఉడుసోమనాథులు
పడిచామరనుడుగ -న్నడము దెల్గ రచనలు
నుడివిరందముగ జనులార

51

ద్విపద షట్పదు లెంచి ద్రిపదులంగానలేదు
త్రిపది నీషద్భిన్న - సుపదమ్ము లనుతింతు
ద్రిపద వామనుని జనులార

52

కన్నడము నాపితరు లెన్ని మ డివిన భాష
మిన్నగా భావముల దిన్నగా దెవిగింతు
సన్నుతుల ద్రిపది జనులార

53

ఇన శశుల్సూరపతుల - భవలతో నలలతో
నానగూర్చి యమజ లమ - గనకుండ ద్రిపదిలో
ననల గొనలిత్తు జనులార

54

ప్రతి రెంట నిరువదులు - యతి పదింటను బ్రాస
త్రితయగతి బదమూడు - సతివోలె ద్రిపద స
ద్గతికి మేల్పంతి జనులార

55

సర్వస్వతంత్రుండు - సర్వేశు డమ్యుతుడు
సర్వదేవత ల తని - సర్వరీతుల గొల్త్రు .
సర్వోత్తముడని జనులార

56

జగదీశు నాజ్ఞచే - ఖగశశుల్తారకలు
సుగతి నిర్ణిత రీతి - బ్రగతి బయనించెదరు
పగలురేల్జగతి జరులార

57

కడలి చెలియలి కట్ట - గడచి పైనడుగిడదు
ఉడురాజా కవ్వింప - మిడిసిపడు కెరటాల
విడదు తన నడత జనులార

58

అనలుడు బురోహితుడ - వని మహానన మందు
జనులకున్ బచనాన్న - మున సౌఖ్యమిడువేల్పు
గనలించు నఘము జనులార

59

శమనుండు శాసకుడు - దమన దండ ధరుండు
సమవర్తి జీవాల - తమ - సౌంధ నిరయాలి
గ్రమశిక్ష గూర్చు జనులార

60

రుద్రుడు గ్ర నటేశు డద్రిజా విభుడతడు
రుద్ర భూముల జీవ - భద్రులకు సచ్చిత్త
చిద్రూపు జూపు జనులార

61

పవనుండు జీవాళి - బవలిరుల్ విడబోడు
ప్లవన కారకుడయ్యు - పవమాను డతిహితుడు
జవ సూత్రధారి జనులార

62

సిరి వాణి లలితయై - పరదేవతాంబయై
సిరి విభూతుల గూర్చు - వరము లెనిమిదులిచ్చు
పరము - విభు జూపు జనులార

63

గజముఖుడు త్రిజగతీ - యజనాది పూజితుడు
ప్రజిత సుమశర ధన్వి నిజమనసిజా డనంగు
డజ్ఞానైన విడడు జనులార

64

హితతత్వ దేవతలు - తత చతుర్వింశతులు
సతతమ్ము జీవ సత్స్థితులలో నిల్పెదరు
వ్రతులు హరిసేవ జనులార

65

పంచభూతము లైదు - పంచ గుణకారముల
అంచితుని హరియాజ్ఞ - నెంచునిరువదినాల్గు
మంచి తత్వముల జనులార

66

ఇవి తత్వ శాస్త్రముల వివర ప్రమాణములు
భువి నవీనములైన - వివిధ విజ్ఞానంపు
టవధాన గతులు జనులార

67

ఏనాటి వారైన - వైనమ్ము లివియంచు
వేనవేల్ శాస్త్రాల - జ్ఞాన సంపద లొసగు
దీనిధానములు జనులార

68

సకల శాస్త్రపు గరిమ - వికషాయ మానముగ
బ్రకటింప బడునిచట - వికట తర్కము మాని
సుకృతి నెఱుగెదము జనులార

69

ఒక సూర్య గోళమ్ము -నకు జక్రభ్రమణాల
గికురించు గ్రహగతుల - వికసించి ప్రభుకరుణ
సుకములను గనుడు జనులార

70

సవితృ నామక విష్ణు - డవధరింప గ్రహాల
నవకములు సవరించు - పవలిరుల ద్వంద్వాల
నవతీర్ణులగుడు జనులార

71

దినకరుని కిరణాల - గనునంబుజమువోలె
మన హృదయ ప్రతిబింబ మున విశ్వపతి బింబ
మును గాంచవలయు జనులార

72

పంచ భూతమ్ములున్ - పంచతన్మాత్రలును
పంచ ప్రపంచంపు - పంచ భేదము లెల్ల
నెంచు తరతమము జనులార

73

పరమాత్మ దర్శనపు - తిరమైన దారిలో
ధరలోని జీవాళి - తరతమపు శ్రేణిలో
పరమ పదమందు జనులార

74

సకల జీవుల కన్న - ప్రకట ధిషణుడు నరుడు
సకల సాధనలరసి - సకల జీవులు బ్రహ్మ
లొకటి కాదనియె జనులార

75

సకలమ్ము శాసించు - నొకబ్రహ్మ నిజము;
అకట మిథ్యా జగతి - ప్రకట నరబ్రహ్మ. యే
రకపు నిజమయ్యె జనులార

76

జగదీశుడొక నిజము - జగములింకొక నిజము
నిగమ వేద్యుని ప్రభుత - సుగమ భక్తియు నిజము
ప్రగతియే జగతి జనులార

77

సకల మేకమ్మైన - సుఖదుఃఖ మొకటియా
ఒక జీవి సుఖియుంప - నొకడేడ్పు నెందులకు
ప్రకట ద్వంద్వములు జనులార

78

నిశిత ఖిద్ది యొకండు - అశనైకరతుడొకడు
నసిధారలోనొకడు - వ్యసనముల పుట్టొకడు
మశక కరులవలె జనులార

79

తన ధర్మమున నుండు గొనబోడు పరధర్మ
మెనలేని దైన ; సజ్జనసేవ హరిసేవ
యనిదలచు నెపుడు జనులార

80

తన ధర్మమున నుండు - నొనగూడు గడుదృష్టి
ఘనడయ్యు పరధర్మ - ధనకనక పరదార
గనడు సజ్జనుడు జనులార

81

మతములను కులములను శ్రుతి శుద్ధగతిమాని
అతికలుష విషయాస్థ హితజగతి గతిమరచి
కితవు లయ్యెదరె జనులార

82

మతములన్ జెడులేదు - గతిహీన మతులకట
మతమన్నముసుగులో - బ్రతుకీడ్చు కితవులరు
నతిమూర్ఖ జనులు జనులార

83

మతములేవైన న - నృతమాడు మనియెనే
సతత వైరప్రవృత్తి - గుతుక గొమ్మనియెనే
హితనీతిగాక జనులార

84

భువి జీవ జాలముల్ - సువిధముం గుమిగూడి
వివిధ వర్గములగుచు - నవనవోన్మేషులై
నివసించు గాదె జనులార

85

రుచిరాన్న పక్వములు - శుచిశుభ్ర సౌఖ్యములు
ఖచితమగు భిన్నరుచి - నిచయము లనేకగతి
బచరింప వేమి జనులార

86

పొదిన, కరివేపాకు - మదనమంజరి జాజి
సుదతి పచ్చడి జేయ - నుదయించునవే రుచులు
విధులు, వివిధములు జనులార

87

ప్రతిమనిషి హితమతికి - మతమన్న మాటయ్యె
మతములే వందన్న - దతిమూత్నమతమయ్యె
హతమయ్యె స్వేచ్ఛ జనులార

88

వ్రతదీక్ష విశ్వహిత - శ్రుతిసూక్తి హితమతము,
మతము బాకుగజేసి - కుతుకలందెగగోయు
మతరిపులు హితులె జనులార

89

కొలనులో గుంపులై వశివములు మీనములు
దిలకింప బహుపొంపు వెలిడీయ మరణించు
గలుపుచోరోత జనులార

90

కులములో మతములో - గల భిన్న భావముం
తిల కాష్ఠ సమిధాజ్య - జ్వలనానలానిలము
గెలుకంగ వలదు జనులార

91

ఎవరికేది హితమ్ము - బ్రవచించు హృదయమున
నివసించు విభుబింబ - మవిరామ శుభ్రశైలి
జెవులొగ్గి వినుడు జనులార

92

కులములవి వలదన్న "కులగర్వ"మని తెలిసి
అలమతము జెడుగన్న నిల "మతద్వేష" మని
విలయములు విడుడు జనులార

93

మతములన్ గులములన్ - ఇతర దేశము మనల
తత భిన్నతలు గూర్చి - రతిచేష్ట విశ్వహిత
మతము ఋతవాక్కు జనులార

94

జగతి శ్రేయము గోరి - నిగమములు నినదించె
సుగుణ సర్వోత్కృష్ట - సుగమ మార్గము జూపె
జగతి భరతోర్వి జనులార

95

హిమనగౌన్నత్య - మమృతోక్తి మనసూక్తి
దుమికి వైషమ్యాల - తమక పశ్చాత్తాప
తమసమ్ము వలదు జనులార

96

మతవైరకుండముల - తతవైల జ్వాలలో
సతము వెగడుచు నుండు - బ్రతుకులను రణములం
దితరులున్నారు జనులార

97

సర్వజనులకు హితము - సర్వమను మనమతము
సర్వాధిపత్యముల - సర్వాస్త్ర శస్త్ర - ముల
గర్వింతు లోరులు - జనులార

98

ఇనుములో తైలంపు - బసదీయు మూర్ఖులే.
అసురాణు రణములో - నశియింపు చున్నారు.
దెస  జూడరయ్య జనులార

99

మతయుద్ధమెచ్చోట - సతతమ్ము జరుగునో
ప్రతిశకము ప్రతిజాతి - ప్రతిదేశ మెరుగదా
తత మధ్య ప్రాచి - జనులార

100

శాంతికై యుద్ధములు - క్రాంతివిద్రోహములు
శాంతి క్రాంతుల జ్వాల - శాంతి నేతల గోల
భ్రాంతి సుఖశాంతి - జనులార

101

రామరావణము సంగ్రామకురుక్షేత్రమ్ము
స్వామి రాక్షస శిక్ష - సీమయుద్ధమొనర్చె
సేమమ్ము నలుప - జనులార

102

అతిధర్మ యుద్ధముల - కితవులను దెగటార్చి
హితమార్గ పాంథికుల - సతతమ్ము హరిబ్రోచె
మతము లన్నింట - జనులార

103

పరదేశముల వారు - పరిపాలనము సేయ
పరధర్మములు మనకు - బరమ ధర్మములయ్యె
బెరిగె మతరుచులు - జనులార

104

పరధర్మముల గొనని - పరనిందలను గనని
వరభారతీయులే - ధరసమస్తపు శాంతి
గరిమ గాంచెదరు - జనులార

105

భిన్నమతములవెన్ని - యున్న నిది మనదేశ
మున్నతిని విడబోదు - సన్నిహిత సహనమ్ము
విన్నపము జేయు - జనులార

106

మేరునగధీరులను - వీరనారీమణుల
శూరధీ విక్రముల - గూరినది భరతోర్వి
శ్రీ రమణులందు - జనులార

107

మనదేశ గౌరవము - మనుసూక్తి మహితోక్తి
మనత్యాగమున శక్తి - మన యోగమున భక్తి
మనము విడరాదు - జనులార

108

పరహితము సమ్మతము - పరమతానుకరణము
పరప్రీతి కోసమై - పరమాప్త ధర్మ ముల్
భరతోర్వి విడదు - జనులార

109

ఎవరి ధర్మము వారలవగాహనము విడరు
భువిదేశ భక్తాళి - స్వవిషయసుధర్మముల
కువిషయాల్ గనరు - జనులార

110

క్రమగతుల విడబోరు - యమ వరుణ రవిశశులు
కుమతులే సన్మతవు - గ్రమము దప్పింతురు
సుమతి భరతోర్వి - జనులార

111

సకల మత సహనమ్ము - మకుటాయమానమ్ము
ప్రకట వాదమెగాని - వికట యుద్ధము లేదు
శుక హితము మతము - జనులార

112

శుకము రుచి జూచు నా - సకల ఫలములు దీపి
వికటార్థములు వీడ - సకల శాస్త్రహితమ్ము
లోక విభుని జూపు - జనులార

113

మనదేశ గరిమలను - మనము బెంచగవలయు
మనలోన మనమెపుడు - గినిసి జగడము లాడ
ఘనత యెట్లగును - జనులార

114

జగతికిని భరతోర్వి - ప్రగతి మార్గము జూపు
జగతి మేధోవర్గ - సుగుణసంఘము మెచ్చ
నిగమ సూక్తులను - జనులార

115

కులమతము గ్రమశిక్ష - గలిగించు వ్రతములే
కుల వికృతి మతగర్వ - ములు హెచ్చ గడుచిచ్చ
కలహింప రాదు - జనులార

116

పతి పత్నులు వివాహ - వ్రతగతుల రతులెన్ని
మితి హితము దెలియులే - తతముక్తి మార్గమ్మ
సుతపుత్ర సూత్ర - జనులార

117

హరితా స్వతంత్రుండు - సిరితాహరికధీన
సిరియె చిచ్ఛక్తి యై - బరగు లోకము నింద
వర ద్వైతగతుల - జనులార

118

హరియె సర్వోత్తముడు - సిరితత్వమాపిదప
ఇరుతత్వ నియతిలో - వరుస నిరువది నాల్గు
వరతత్వ వితతి - జనులార

119

శ్రీ మాతయే మిన్న - శ్రీ హరికి దరువాత
ఏ మాత్ర సాధన - మ్మేమి బంధములేదు
స్వామివలె ముక్త - జనులార

120

జగతి యే శ్రీప్రకృతి - జగదీశు నాజ్ఞచే
వగణి తో - పాధులను - యధమోచ్చ జీవాల
బ్రగతి గల్గించు - జనులార

121

జగదీశుహృదయమున - జగదంబ వసియించు
యుగయుగా వర్తముల - సొగసెల్లనియమించు
సుగుణాబ్ధి జాత - జనులార

122

జయలక్ష్మి శుభలక్ష్మి - సంతాన వరలక్ష్మి
శ్రీయలక్ష్మి మరివాణి చిరమోక్షలక్ష్మియై
జయసిద్ధులిచ్చు - జనులార

123

అబలంతా నబలయే - ప్రభున కర్ధాంగియై
సొబగు సోయగముతో - శుభ సౌఖ్య డోలలో
త్రిభువనాంబయగు - జనులార

124

ఉ విద లబలటంచు - భువిలోన ప్రథగలదు
భువి జీవ జాలమ్ము - లు విద గర్భావాస
భవములను బండు - జనులార

125

ఒక సీత మాతగా - నొకరాధ ప్రేయసిగ
నొక గౌరి సోదరిగ - నొక మాధవుని జాట్టి
వికసించు వనిత - జనులార

126

అంగనకు సంగన క - సంగ జనకాహాంగ
మంగళా లింగ శ్రీ రంగ, రాసక్రీడ
శృంగారపూజ - జనులార

127

పితృడొక్కమాధవుడు - పతి సుతుడు మాధవుడు
అతివ కల్పుటిలుగూడ - హితుడొక్కమాధవుడు
స్థితికి బ్రగతికిన్ - జనులార

128

కాలపూరుష పూష - కరము మృదులతుమతీ
కేళి బ్రకృతి హేళి - లీలా వినోదమగు
డోలయగు జగము - జనులార

129

ప్రకృతి పూరుష సరళి - బ్రతిజీవి వికసించి
సకృదస కృదనుభవవు - సుకృతిన్ సు మప్తిలో
ప్రకృతి విభుగాంచు - జనులార

130

యుగయుగావర్తముల - జగతి శ్రీ రమణమ్ము
జగదీశునాటకము - నిగమనైజ విధాన
సుగతి సౌఖ్యమ్ము - జనులార

131

ప్రకృతి పూరుషయోగ - సుకృతి సూత్రద్వైత
సకృదసకృదనుభూతి - ప్రకృతి నైజము గాక
వికృతి యొంటరిది - జనులార

132

అతివలును బురుషులును - మితిమీరి కలహించి
వ్రతభంగ మొనరింప - హితమగునె జగతి స
ద్గతికి మున్నతికి - జనులార

133

నరనారి కలహ మొంటరితనము - సరిగాదు
సరియైన జతగూడి - చరియించుమటే తత్వ
పరిపూర్ణ ఫలము - జనులార

134

వరకట్న మోలియని - పరిదానము గ్రహించు
పరిణయ ప్రణయములు పరమదౌర్భాగ్యములు
విరస సరసములు - జనులార

135

వరుడు కట్నమ్మడుగ - బురుష గణికుడు గాదె
తరుణి శుల్కమ్మడుగ - మరి వారవనితయే
ధం[illegible]బులు - జనులార

136

ప్రణయామృతాబ్ధిలో [illegible]తాల్ ప్రణవ
గుణసూక్తి మురిపించు- మణిరత్నహే[illegible]ములు
గణికలకు గడన - జనులార

137

పుంసవన శుభమరసి - పుంసుండు బుత్రుడన
యంశగని పున్నామ - సంశయము విడచి - సత్
శంసనము గాంచు - జనులార

138

నరనారు లిరువురును - వెరపి నరహరి గొల్తు
సురలోక సౌఖ్యాల - ధరలోన బులకింత్రు
పరిపూర్ణులగుచు - జనులార

139

పరమ పావన మైన - నరనారి ప్రణయమ్ము
తిరముక్తి దాయకము - బరమదూష్యమొనర్తు
నిరయపాంథికులు - జనులార

140

మనతాతముత్తాత- లను బోలు ఋషిమూల
మనుమాట వెగటయ్యె - మనవవ్యమానవులు
"జెనిటిక్కు" లంద్రు - జనులార

141

కంది జొన్నలు పెసర - లందు నవధాన్యములు
విందులిడు నిజరుచుల - వెందులకు నైజపు బ
సందులను విడవు - జనులార

142

జగజీవ జాలములు - విడలేవు నైజములు
విడివిడిగ తమ జాతి - గడు శుభ్రముగ నుండ
జెడుగు మన కేల - జనులార

143

రతి - కార్య - మ పచార - మతి హేయమనరాదు
మితరతుల హితచర్య - పతిపత్ని వ్రతులు స
ద్గతుల నందెదరు - జనులార

144

కాముడీల్గక మోక్ష - ధామమ్ము గనరంధ్రు
కాముండు గామినీ - హేమమ్ము లెఱుగక
స్వాములెల్లెరి - జనులార

145

మలమూత్రముల చెత్త - పెలపంకమని రిత్త
దలచెదరు తామెల్ల - ధన్యులై తద్వార
ముల బండిరారె - జనులార

146

ఉప్పుకారము దినెడు - తప్పుతడికెల దేహి
పప్పులో కాల్వేయు - దప్పులన్నియు దిద్ద
నొప్పుహరి గొల్పు - జనులార

147

దురిత వామాచార - విరతి జొక్కని జీవి
పరమువైకుంఠమున - సిరిపతిని గని మ్రొక్కి
చిరసౌఖ్యమందు - జనులార

148

జహజహల్లక్షణము - గ్రహియింప గలజీవి
అహరహము బరమాత్మ - దహరాంబరములో
విహరింప జూచు- జనులార

149

కుజన సోఽహం భ్రమయె - రజత శుక్తి భ్రాంతి
రజత శక్తులు వేరు - నిజము దెల్పున జాండు
సుజను లెరుగంగ - జనులార

150

ఒకటి శ్రేష్ఠ స్వతంత్ర - మొకటి తన్నియమితము
ఒకటి పరమాత్మ - ఇంకొకటి విశ్వమగు
ప్రకట మివి రెండు - జనులార

151

ఇంద్రియానుభవాలు - నిందిరేశునపొంగ
చంద్రికాకృపలంచు - సత్సమర్పణబుద్ధి
సాంద్రమగు భక్తి నరులార

152

సక్తిలో దామసము - రక్తిలో రాజసము
భక్తిలో పరమాత్ము - శక్తి దర్శింపగా
ముక్తుడగు జీవి - జనులార

153

క్రియలందు నింద్రియాల్ - వ్యయములగు గాన స
త్క్రియల సత్ఫలితముల - కేశవుని చరణముల
జయసిద్ధి గనుడు - జనులార

154

సుఖికాదు సన్యాసి - ప్రఖరగ్రీష్మప్రవాసి
సఖియతో జతురార్థ - నిఖిలముగను గృహస్థి
సుఖద మోక్షార్థి - జనులార

155

జననమరణాదులను- గనిపెంచు మిథునములు
విమలశ్రీ చిచ్ఛక్తి - యనెడు శ్రీ చక్రముల
నను దినము దిరుగు - జనులార

156

జనని జనకుడు గాక - జనుమ మొంటరి ఫలమె
మనుజ సామాన్యులు - మనరాదు యొంటరిగ
జనుమ వృథయగును - జనులార

157

ఘనులు గోదా మీర - లను ద్రిమత గురులవలె
ఘన శ్యాము పైభక్తి - ముని నిష్ఠ గనకున్న
ననుకరణ కీడు - జనులార

158

అతివలను జన్నముల - శ్రుతి సూక్త పురుష స
ద్రతికి గతి హరియంచు - స్థితప్రజ్ఞ నుండెదరు
నితరాంసువ్రతులు - జనులార

159

స్నేహ ప్రతాపమ్ము - మోహాది విభ్రమము
దేహ వ్యాపారమ్ము - గ్రాహమ్ము లైపట్ట
దేహి యొంటరియె - జనులార

160

తొలికర్మ దలవంచి - తలచి ద్వైతసుభక్తి
నిలుచులేగొప్పయన - నలనొంటరిగ బ్రహ్మ
ములరె జీవాళి - జనులార

161

నరుడు నొంటరి వాడు - ధర నజాండములెల్ల
పరిపాలనము జేసి - వరమిచ్చి బ్రోచునే
బురద క్రిమిగాక - జనులార

162

ఈ యహం భావకృతు- లీయవిరళావివే
కాయత్తయున్మత్త - జాయమానములెల్ల
హేయ సంగతులు - జనులార

163

ఘనవిటపి నితరత్ర - మనుప్రాణులెన్నియో
తిను నిద్ర గను భయము - గను మైథునపు సుఖము
మనతెలివి జెడవు - జనులార

164

స్త్రీపుంస యోగమ్ము - శ్రీ పతియె హితమంచు
నీ పగిది జగతి సత్ - వ్యాపకమ్ముల ద్రవ్య
రూపు లొనగూర్చు - జనులార

165

ఒకజీవి దినెడు నిం - కొక జీవి యాకలిని
ఒక కణము బెరిగి నిం- కొక కణమ్మును గూడ
ప్రకట మగు జగము - జనులార

166

అణుకణ మమీబాల - కణకణము వృద్ధిలో
కణ మిథున గుణరాశి - తృణరేణు భువిప్రాణి
గుణియించు ప్రభువు - జనులార

167

జనన మరణములేని - ముసు నైజరూపమున
ఘన విశ్వవ్యాప్తునిం - గని మురియు మిథునములు
గను ముక్తి సుఖము - జనులార.

168

ఆగమన నిర్గమన - మౌగతుల దొంగించు
నాగమును మంత్రముల - యోగములు వివరింప
తీగనుడు విభుని - జనులార

169

ఘనులమేమని దలచి - మును స్వరూపము మరచి
దినదిన మహంకార - మనువిరయ స్రు తి సంస్థ
వినలేరు శ్రుతులు - జనులార

170

ఘనవిభుని దయచేత - వానగూడు ఘనభక్తి
వినయ మున దన రూప - మును జాపు హరిగాంచు
జనులు ముక్తులరు - జనులార

171

భువిని మేధోజీవ - సువిధాన మిదియంచు
భువి విశ్వశ్రేయులగు - భవ ప్రవక్తలరెల్ల
బ్రవచించినారు - జనులార

172

అవయవములొక దేహ - వివిధ వర్గములయ్యు
జవమిచ్చి జీవముల - భువనేశు దరిజేర్చు
దివిజ తత్వగతి - జనులార

173

సహజ సహజీవనము - లిహవాస ధర్మములు
అహరహము వికటమతి - బ్రహసవాల్ కలహాల
జహియింపు డతని - జనులార

174

కితవ వంచనలచే - నితరులను హింసించి
బ్రతుకు టది నీచమ్ము - సతతము హితముల గూర్చు
బుత్తవాక్కు వినుడు - నరులార

175

గ్రసనముల వ్యసనముల - గుసగుసల ప్రణయముల
పసి జీవ నౌషధుల - గసిరాజకీయముల
విసము లిడవలదు - జనులార

176

తనకుక్షి నింపుటకు - జనములను వంచించి
తినునది యమేధ్యమ్ము - జనహితపు బ్రతుకుకై
దినుట మానవత - జనులార

177

వేదిక లుపన్యాస - వాదచర్చలు బెంచి
నాది నీది యటంచు - వీధివీధికి ముఠా
కాదు జనసేవ - జనులార

178

మంచి బుద్ధుల వారు - వంచకుల విడనాడి
మంచి గురువుల నుడుల - మంచినే గ్రహియించి
మంచి నిడవలయు - జనులార

179

భేదములు వలదన్న - వాదములు సరిగావు
వేదము లనంతములు - శోధించు బరమాత్మ
సౌధమ్ము జూపు - జనులార

180

మనం నడిపెడు వాడు - ఘనుడు విశ్వవ్యాప్తు
డని మ్రొక్కువారెల్ల - ఘనులైరి; నేనతడ
ననెడు దనుజుండు - జనులార

181

నామములనెన్నైన - స్వామి యొక్కడు గాదె
ప్రేమతో మ్రొక్కిన - బ్రేమతో మముబ్రోచు
బ్రేమ ద్వైతమ్ము - జనులార

182

మముబ్రోచు ప్రభుప్రేమ - సుమభక్తి మనప్రేమ
సుమరమారమణుండు - విమల భక్తికి వశుడు
సుమ సమర్పణల - జనులార

183

వాదముల భేదగతి - సాధించు సత్యంపు
మోదముల జగతికిన్ - స్వాదులందించుటే
వేదముల ప్రగతి - జనులార

184

జగదీశుడగపడడు - నిగమ వేద్యుడు గాని
నిగమములు విశదించు - జగదీశుప్రభుశక్తి
యుగకల్పకళల - జనులార

185

కనబడని తత్వమ్ము - ఘనద్రవ్యరాశిలో
ఘన వేదమనుమాన - మనయమను సాక్షి శ్రీ
వనమాలి గాదె - జనులార

186

నరచిరంజీవులే - హరిచెంత గొల్చెదరు
నరబుద్ధి నిశితమై- యరయు సత్యముగాని
నరుడు హరిగాడు - జనులార

187

గురుశ్రేష్ఠులనిశమ్ము- బరమాత్మ నెదగాంచి
పరిశోధనలు జేసి - సిరి ప్రకృతి విభుడైన
హరి విష్ణువనిరి- జనులార

188

గంగ గుడిసెల రెమ్మ - పంగలో జందురుని
తొంగిచూచెడు భంగి - రంగనాథునిజగతి
రంగమున గనుడు - జనులార

189

హరిబింబ మరయగా - నరజన్మ సాధనపు
టరుదైన బ్రతిబింబ - వరభక్తి పరికరము
చిరముక్తి వెలుగు - జనులార

190

హరియైన హరుడైన - పరదేవతయునైన
కరుణతో దరిజేర్చి - తిరిగి పంపని వరము
చిరముక్తి పథము - జనులార

191

నరుల దేహావస్థ - నెఱుక గల్గించుచోట
పరమాత్మ కరుణ యగు - నరుడహంకృతి బొంది
తిరిగి రాదగదు - జనులార

192

శక్తి మిన్నయని వ - ద్భక్తితో దొరకునని
యుక్తితో సాధించి - శక్తి నేనన గడు గు
యుక్తి నిరయమ్ము - జనులార

193

అతనివలె నేనవిన - నతడు నేన్వేర్వేరు
అతడవే నేనవిన - నతడెట్టులగుపడును
ద్వితయ శూన్యలకు - జనులార

194

పరమాత్మ జీవాత్మ - బరికింప నొకటనుచు
పరమొకటి తిరమనుచు - మరి జగతి మిథ్యయన
ధర ముక్తి మిథ్య - జనులార

195

అవిరాము లవినాశు - లవతారు లవ్యయులు
జవ జీవ జగదీశ - భువి లక్ష్మి శ్రీవిభులు
భవచక్ర ధరులు - జనులార

196

యుగకళల కల్పముల - జగదీశుడు సృజించు
మగిడించు తతసుప్త- త్రిగుణముల జగములను
నిగమ సద్వృత్తి - జనులార

197

జవసత్వ వికసనము - భువనేశుచే గలుగు
భువనోపసంహరణ - భువనేశుడే చేయు
భువు లెరుగ గలవె - జనులార

198

భువులుండు నందాక - భువనేశు నాటకము
జవజీవ ములు గాంచు - నవనికల విశ్వముల
భవ భవములందు - జనులార

199

దశవిధేంద్రియ వశము - రసబుద్ధి; దిశమార్చు
దశవిధేంద్రియ రతుని - దశకంఠు దునుమడా
దశరథుని సుతుడు - జనులార

200

దురభిమానము దుష్ట - కురుపతిని జంపదా
పరదార పరధరము - లురగ దంష్ట్రలు గదా
గరిమ సద్బుద్ధి - జనులార

201

హరి "రసో వైసః" నృహరి దశాద్యవతారి
అరులార్గురిని యణచి - సరిజేయునరబుద్ధి
నరుడు హరికాడు - జనులార

202

అంతరంగమునందు - సంతతము హరిబింబ
చింతనామృ త సక్తి - వింతగను ప్రతిబింబ
సంతసము జీవి - జనులార

203

ఈ సుఖము రుచిజూడ - చేసిరి సుశోధనలు
వాసి నరసెడు జీవ - రాసు లీసులు గనక
నీశు గనవలయు - జనులార

204

భిన్నవాదులరయ్యు - మున్నతిని సత్ స్థితిని
సన్నుతుని జూపగల - మిన్నలే గనవలయు
సన్నిధిని హరిని - జనులార

205

ఎందరెందరొ గలరు - సుందరానుభవమ్ము
సుందరేశుని భక్తి - బంధింపగలవార
లందరికి నతులు - జనులార

206

బసవణ్ణ ప్రభుదేవ బసవేశ్వరుడు జెన్న
బసవ శివ శరణు దెస - కుశలాక్కమాదేవి
యసమాక్షు గొలిచె - జనులార

207

శివశరణ యనుభవపు - శివయోగ సారముల
ప్రవచించె నిజగుణుల - భవి భవామృత సూక్తి
సువచన శైలి - జనులార

208

అక్కమహాదేవి - చక్కనౌ వచనముల
ముక్కిముక్కని గాక - తక్కువెక్కువగాక
జక్క దెనిగింతు - జనులార

209

ఆపె శర్వాణ్యాంశ - తా పతిగ శివునెంచి
తాపసిగ విభుగొలిచి - రూపించె శివ శక్తి
స్త్రీపుంస తత్వములు - జనులార

210

ఇందొ ఆకు నిధి వోలె - ఫలములో రుచివోలె
తిలతైలధారవలె - జెలువుగా బ్రహ్మమ్ము
వెలయుననె సృష్టి - జనులార

211

ధర్మపాలన చింత - కర్మధారణ చింత
ధర్మపోషణ చింత - నర్మసౌఖ్యము చింత
మర్మమనె బ్రతుకు - జనులార

212

ఉదరపోషణ కొరకు - ఖదిరవేషము కొరకు
మదమోహషడ్వర్గ - విధములవి వలదంచు
మదిని శాసించె - జనులార

213

మలమూత్రముల కడవ - కలుష మెముకలతడిక
లలచీము రక్తముల - ఖిలదేహమలినమ్ము
వలదంచు నుడివె - జనులార

214

లేగరూపును జూప - సాగునే శుకబోధ
శ్రీ గరిమ విభుగనని - యోగులరు-సద్భక్తు
లే! గరికలనియె - జనులార

215

పంచభూతములందు - పంచేంద్రియవు గతులు
పంచత్వముల గలియ - వెంచు మునుపేప్రభు ద
లంచ సుఖమనియె - జనులార

216

వరిపాట్టునకు పీరు - మరలింప వరియగునె
ఖరబుద్ధి నాచార- పరుడు సుఖియించునే
గురుపూజ ననియె - జనులార

217

శ్రీమల్లికార్జునుడు - కామారి నామగడు
కామాంధులకు జిక్కు - భామనేగానని
ప్రేమించె హరుని - జనులార

218

పగలశన నిశివ్యసన - యుగళముల ముని గెదరు
నాగిల్తృష్ణ రజకుండు - దెగి నీట బడినట్లు
మృగతృష్ణలనియె - జనులార

219

బంగారు సంకెళ్లు - రంగు మణిఖడ్గములు
హంగు ముత్తెపువలలు - శృంగారలీలతె
బృంగి సుఖమనియె - జనులార

220

లింగాంగముల బుట్టి- లింగాంగములరక్తి
నింగితము గనలేని - శృంగభంగుల నీతు
లెంగి లనె తల్లి- జనులార

221

గంధము నరగదీయ - గుందునా పరిమళము
చందమోడునె పసిడి - వింధు పేయదె జెఱుకు
చిందుచో ననియె - జనులార

222

కాయమింద్రియ గతులు - బాయలేవొండొరుల ;
కాయజారి దహిం - హేయములు దొలగిపట్
జ్ఞేయమగు నవిద్య - జనులార

223

జాలరులు మృగయులును - మీలుమృగముల బట్టి
చాలసంతోషింతు- రేల నేడ్తురు హిత జ
నాళిమృతి కనియె - జనులార

224

అడవిలో గుడిగట్టి - కడలితటి దడిగట్టి
దడుపేల గెరటు మృగ- మిడు సుఖము దుఃఖములు
విడవనియె జంట - జనులార

225

జగదీశునాడిలోని - సుగుణాబ్ధిజాత శ్రీ
జగతి ప్రాణాదులను - త్రిగుణ పంచకములను
ప్రగతు లిడుననియె - జనులార

226

విభుడు బింబముగాగ - సుభగప్రతిబింబములు
ప్రభవించు జీవములు - విభుజేర తత్సుఖము
శుభమనియె దుదకు - జనులార

227

పశువు బడగల పాము - రసగాన రసికులును
బుసబుసల విసములను - కసిపానగు షడ్రిపుల
వశము విడరనియె - జనులార

228

పశువులన్ ష్కడీవుల - నవమాక్షుడు బిగింప
శిశువులై రసరాజా - కుసుమశరు పితయనుచు
దిశ లెరుగు వనియె - జనులార

229

శ్రుతులెన్నిజదువగా - మతిని సందేహములు
మితిమీరుదర్కగతి - కతలున్ బురాణములు
మితి సుగతి యనియె - జనులార

230

మదగజము సూకరము లెదురైన హేయమ్ము
విదలింప - కరి యొదుగ - నది బీరువని పంది
ముదమొందుననియె - జనులార

231

గంగ పాషాణములు - లింగసాలిగ్రామ
జంగము స్థావరా ల్లింగుటర్చన స్వాంత
రంగ సుఖమనియె - జనులార

232

జపతపము లు - పవాస - ముపశాంతి కాదనియె
విపుల విశ్వానంతు- డపరిమితు నచ్యుతుని
కృప వేడుమనియె - జనులార

233

పాలలో నేయివలె - మేలిమిని రంగువలె
వాలోన నివసించు శూలి - నా మగడంచు
లాలించె శివుని - జనులార

234

సరస సంగీతములు - వరకావ్య సాహిత్య
గురుతర్కమీమాంస - సరిపోదు హరిహరుల
కరుణ వలయుననె - జనులార

235

చెలువులో ధనములో - దెలివి దర్కమ్ములో
నలవి కాదనియె హరు - వలచి వలపించుకో
వలయు సుమ్మనియె - జనులార

236

గిరి మేఘముల గనక - బురివిప్పునా నెమలి
సరసి జలముల గాక - దిరుగునా కలహంస
హరునామెవలచె - జనులార

237

పరిమళము సుధలేని - విరిగనునె భ్రమరమ్ము
చిరుమావి దివి దాక - స్వరమెత్తునే పికము
హరుడామె బ్రోచె - జనులార

238

నరజాతి పతియొకడు - పరమందు విభుడొకడు
ఇరుమగల కాపురము - నిరయమని తావెంచి
హరుజేరె నామె - జనులార

239

ఒక్క హరునకు దక్క - దక్క నింకొకరికను
అక్కమ మహాదేవి - జిక్కెను మహేశునకు
నిక్కమ్ము సుమ్ము - జనులార

240

కాయమను పీఠమ్ము - కాయజారికి వేసి
ప్రియాత్మనర్పించె - శ్రీ యద్రిసుతవోలె
ఆ యక్క - మాంద - జనులార

241

గడిపె శ్రీశైలమున - గదళీవనమ్ములో
మృదుమల్లి కార్జునుని - హృదయమ్ములోనిల్పి
గడిపె గదముక్తి - జనులార

242

ఉడుతడివి తాబట్టె - గడుదీక్ష గదళిలో
గుడి మల్లికార్జునుని - యడుగులన్ గని మ్రొక్కె
బడసె శివభక్తి - జనులార

243

ఇవి యక్కమాదేవి - శివశరణ వచనములు
శివదృష్టిప్రజ్ఞాని - భవదృష్టి విజ్ఞాని
శివశరణయామె - జనులార

244

త్రిపదు లాళువు ను డివె - డుపదేష్ట సర్వజ్ఞ
డుపమాన ముపమేయ త్రిపద సొగసుల గన్న
డపునుడుల నింపె - జనులార

245

తెలుగు గన్నడ బండి - తులు కవులుభయసోము
లిల దెల్గు ద్రిపదులను - బలుకలేదెందులకొ
దెలియంగరాదు - జనులార

246

తెలుగు గన్నడ శైలి - చెలువు కందము రగడ
పలు షట్పదోత్కళిక - వెలుగు జిందగ దెనుగు
వెలయనిది ద్రిపది - జనులార

247

త్రిపద ఛందస్సునకు - నుపదర్శకు డతండు
విపుల రుచి సర్వజ్ఞ- నుపదేశము విమర్శ
త్రిపదు-లమృతములు - జనులార

248

పలక బలపము బట్టి - గిలుక లేదే చదువు
పలు విజ్ఞలను జేరి - దెలిసితిని సద్విద్య
జలధి చదువనియె - జనులార

249

తొలియక్కరమ్ముల న్ - ఇలదిద్దలేదితడు
లలిసంస్కృతపు కావ్య- ముల జూడలేదితడు
పలికె నమృతోక్తి - జనులార

250

ఉపమాన ముపమేయ - ముపచారిత ధ్వనుల
విపుల శ్రుతి పేయముల - సుపద హంసలనడల
ద్రిపది గులికించె - జనులార

251

యమక రూపక వ్యంగ్య - మమరు ప్రాసలనొగసు
సుమసదృశ శ్లేషలో - సములు లేరితనికని
సుమతులన్నారు - జనులార

252

శర్వుశివునందలో - సర్వహిత నుడివేర్చి
గర్వహీనత శాస్త్ర - పర్వతము నైతినని
సర్వజ్ఞుడని యె - జనులార

253

శివయోగి కవులందు - శివశరణ భవులందు
భువిమేటి సర్వజ్ఞ- కవి వేమనకు సాటి
చవులూరు నుడుల - జనులార

254

ఇతనిమాటలు సూటి - ఇతని పోలిక మేటి
ఇతని త్రిపదుల ధాటి - తత వేమనకు సాటి
కృతు లాట వెలది - జనులార

255

తనతల్లి మాళియని - జనన మంబాలూరు
తనతండ్రి మాసూరు - ఘనభూసురుండనుచు
తను జంగముడనె - జనులార

256

మనవేమనుని పోల్కి - చెనటి యొక తెను రోసి
ఘన జంగములవోలె - జనపదములందిరిగి
త్రినయునిన్ గొల్చె - జనులార

257

ఘన శ్రుతుల స్మృతి సూక్తి - వినసొంపు నెరిగించి
వెనుకముందులు లేక - జెనటులను సువిమర్శ
లను ముంచె నుడుల - జనులార

258

మతపిచ్చి కులపిచ్చి - నితరతిక్కలవన్ని
కులకులతల నుడికించె - హితవచన బాణాలివి
స్థితప్రజ్ఞజ్యోతి - జనులార

259

క్షితిసురుల నతివలను - కితవ వామాచార
తతబౌద్ధశ్రమణకుల - హితులంచు నరయండు
వ్రత హీనులనియె - జనులార

260

సర్వజ్ఞ వచనములు - పర్వములు కన్నడులు
సర్వులకు శ్రుతులట్లు - గర్వితుల కసిధార
లుర్వికిని హితము - జనులార

261

శివయోగి జంగముడు - భవపాదచారియై
భువనాను భవమెల్ల - వివరించె ద్రిపదులను
భవునిపై భక్తి - జనులార

262

ఏడు కోట్లను లక్ష - లేడు వేల్దెబ్బదుల
వాడిగల వచనముల - నాడితిని ద్రిపదిలో
జూడు మనెషునుడు- జనులార

263

అతిసూటి వాగ్ధాటి; - అతి వ్యంగ్యమర్యాద
లతని వచనము లెల్ల - హితనీతి సుగుణములు
రతనమ్ములంద్రు - జనులార

264

తత్త్వశైలి తెగడకను - హితసూక్తులను గొన్ని
మితముగను వచియంతు- నతని ద్రిపదుల తెన్ను
చతురతరశైలి - జనులార.

265

కన్నడపు వచనములు - మిన్నైన వెన్నైదను
అన్ని మతముల వారు - సన్నుతించెడు రీతి
నున్నతిని విడక - జనులార

266

అతని వచనపు సొగసు - ప్రతతి బెంచెడు రీతి
యతి ప్రాస నియమముల - హితమైన తెలుగులో
మితిగ వచియింతు - జనులార

267

నందినెక్కినవాని - ఇందురుని సిగనైన
నందముగ విడువాని - నందనుని మతియుంతు
ముందుగా ననియె - జనులార

268

ఊరుజేరగనెవరు - దారి జూపిన నేమి
సారించి నిజమైన - దారి జూపెడు వారు
ధీరగురులనియె - జనులార

269

బంధువులు దివిపోవు - మందలేగాని భువి
బంధనము బాపెదరె - సుందరేశునికన్న
బంధు వెవరనియె - జనులార

270

పితృనకున్ గురునకును - తతభేద మొకటుండు
పితృడెంచు సద్గురుని - గతిజూపు సద్గురువు
హితముక్తి కనియె - జనులార

271

గురుని మనుజా డటన్న - హరుని శిలయని జెప్ప
కరుణ ప్రసాదములు - మరి యెంగిలను వాడు
నిరయ క్రిమియనియె - జనులార

272

ఎద్దువలె తొత్తువలె - మొద్దువలె బెరటిలో
విద్దెనేర్వగ గురువు - వద్దకు శ్రూషచే
బుద్ధి గనుమనియె - జనులార

273

పెఱుగు జిల్కగ వెన్న - దొఱలివచ్చెడు భాతి
గురువు నుపదేశముల - వరభక్తి జిన్ముక్తి
దొఱుకు సుమ్మనియె - జనులార

274

పందిచందనమలద - గంధగజమగునేమి
మందమతిగురువైన - సుందరము సత్యమ్మ
దందదనె శివము - జనులార

275

దానముల భక్తిలో - నేననుట మరువవలె
నేననెడు రోగమ్ము- లేనిచో జ్ఞానమ్ము
తానె గనుననియె - జనులార

276

శ్వానమ్ము టెంకాయ - దాను దినగలం దేమి
హీనమతి కుపదేశ - జ్ఞానమ్ము బోధింప
హానియగువనియె - జనులార

277

చెక్కముక్కలు రెండు - దిక్కుండ ఫలమేమి
ఒక్కటను మథియింప - జక్కనౌనగ్ని చే
జిక్కునని బల్కె - జనులార

278

పచ్చికట్టెల దెచ్చి - చిచ్చొనర్పగ నగునె
తుచ్ఛ విషయాసక్తులకు - వచ్చునే గురుకరుణ
లచ్ఛముగ ననియె- జనులార

279

చదువ వాదములేల - సొదపురాణములేల
విధితర్కమీమాంస - రొదలేల దైవస
న్నిధియె సుఖమనియె - జనులార

280

ఇంగువను వాసనను - గంగ టెంకాయలో
భృంగకోకిల గళము - లంగాన మిడెదు శ్రీ
రంగు డె పరవియె - జనులార

281

తనలోని విభుబింబ - మును గాంచి మ్రొక్కడతి
ఘనముగా బ్రతిమలం - దనుదినము దోమెడివి
ఘనుగానడనియె - జనులార

282

ఆహారమును గోరు - దేహిజంగము గనక
మాహేశలింగాని - కాహారమిడిమ్రొక్కు
ద్రోహాత్ములనియె - జనులార

283

రాతిలింగపు దలను - ప్రీతి పత్రిని బెట్టి
నేతి దీపము నుంచి - భీతిమ్రొక్కినవేమి
నీతిగనరనియె - జనులార

284

సురులపతి కరినెక్కి - వరమివ్వడొకటైన
మ్మరి జరద్గవ మెక్కి- వరములం గురిపించు
హరుడె దైవమనె - జనులార

285

బాస కంటెను మేలు - దాసునకు నధముండు
మోసకారికి గతులు - శ్రీశ పరమేశులకు
వాసి యెవరనియె - జనులార·

286

శేషు కన్నను బలుడు - పూషు కన్నను హితుడు
దోషాకరు ధరించు · యోషార్ధుడీశుడే
పోషకుండని యె - జనులార

287

అపుడురా ఇపుడురా - ఎపుడొరా యనకుండ
అపుడె దానమొసంగు - నుపకారి బ్రోచుదా
శివివిష్ణుడనియె - జనులార

288

యాచించి గడియించి - పాచనం బచరించి
చూచి క్షుధార్తునిన్ - గాచువానిని శుభము
బ్రోచు నమ్మనియె - జనులార

289

అడుగకన్నిడు ఘనుడు - అడుగనిడు మధ్యముడు
అడిగినన్నిడబోడు - గడునధము డగువాడు
పెడమూర్ఖుడనియె - జనులార

290

మానవుని దుర్గుణము - నేను జెప్పగనుగుని
దానమీయడు నుంత - వేనవేలపరాధ
హానిబడుననియె - జనులార

291

అన్నదానము కన్న - మిన్నదానములేదు
ఎన్నియున్ననదేమి - అన్నమేప్రాణిహిత
మన్న మజాడనియె- జనులార

292

వేదవాదముజేసి - బూదెబూసినజనులు
వేదములహృదయాల- నాదములు వినలేక
బూదెయ్యెరనియె - జనులార

293

అమదిన స్నానమ్ము- తనుజేర్చునేదివికి
అమదినము జలములో - మునుగు గప్పలవేల
జనవు దివికనియె - జనులార

294

గంధమ్ము దిలకమ్ము - సుందరమ్ము గదిద్ద
నందునే నాకమ్ము - గంధంపు సొనదివి
బొందనటులనియె - జనులార

295

బూదెబూసినయంత - నాదగునె సర్వమ్ము
బూదెలో బొర్లాడి - మోదించు ఖరము దివి
సాధింపదనియె - జనులార

296

పెక్కూర్ధ్వ పుండ్రముల - నెక్కుతక్కుగ బూసి
అక్కమల వనమాల - నెక్కువగ ద్రిప్ప దివి
దక్కునా యనియె - జనులార

297

నాలుకకులేదెముక - మేలగునె నిర్ధనికి
దూలముండునె గగన - బైలునకు కులమేది
శూలికని యడిగె - జనులార

298

భువిరజస్వలమూల - భవమెల్ల మైలయని
భువిభవానందముల - దివిసౌఖ్యమనియెంచు
బ్రువులె మైలనియె - జనులార

299

ముట్టైనవనితలను - తిట్టె వెలినుంచెదరు
ముట్టుగట్టిఫలింప - బుట్టు శిశువులవెట్లు
గట్టి ముద్దనియె - జనులార

300

ఎంగిలెంగిలియనుచు - భంగపడు మడివారు
ఎంగిలి శరీరంపు - బెంగితుల మరుబారి
దొంగలైరనియె - జనులార

301

అవయవము లెల్లరకు - భువి సమములై యుండ
భువి దివిజ శ్వపచులని - వివిధ మత్సర మెంచు
కవుల కథలనియె - జనులార

302

అవయవము లెన్నైన - శివుని దలచెడు దేహి
భవబంధితుడు గాక - శివుని సామీప్యమున
ఛవిగాంచుననియె - జనులార

303

మెండివానినిపీతి - దండింప ఫలమేమి
బండటాయిని వాన - దండిగా దడుపుచో
గండి పడదనియె - జనులార

304

ఆకలికి నంబలియు - కాకెండ కోకగొడుగు
వేకటికి గోడలును - లోకమున కోకనేత
సాకల్యమనియె - జనులార

305

ఘనులం దలంచుమను - వినయగతి నడచుమను
వనితలకు నెరగాక - మనువాని కాధీన
మనియె మోక్షమ్ము - జనులార

306

మధుపాయి కడురోత - మదవరాహము కవ్వ
వది శుభ్రమొనరించు - ముదభుక్తి కొందరికి
మధువు పూయమనె - జనులార

307

కల్లు త్రాగినవాని - ఇల్లుయొళ్లను గుల్ల
వల్లమాలిన వమం - చిల్లుబడి తెగిజచ్చు
కల్ల సుఖమనియె - జనులార

308

పరసతుల గోరకుడు పరధనము పరధర్మ
మరయకుడు పరనింద విరుగుపొరుగుల తోడ
స్థిరబుద్ధిననియె - జనులార

309

సిరులు సౌఖ్యమ్ములు - దిరమంచు నమ్మకుడు
మరిసంతలో జనము - దిరిగిపోయెడు రీతి
దరుగునుమ్మనియె - జనులార

310

వనితచే నిహముండు - వనితచే బరమరయు
వనితచే సిరిబడయు - వనిత మెచ్చనివారు
ఘనులు గాదనియె - జనులార

311 .

ఇలచీమ మొదలుగా - నలబ్రహ్మపర్యంత
ములజీవ జాలములు - ఫలియించు మదతిపా
త్రిలులలో ననియె - జనులార

312

స్మరుని గాల్చిన నేమి - హరుడర్ధనారియై
వరపార్వతీ పతికి - యురము నర్పింపడే
గరిత వరమనియె - జనులార

313

హరియురములో లక్ష్మి - హరుని తలపై గంగ
వరధాత వాక్కుపై - వరశ్రుతుల శ్రుతి వాణి
గరిమనియె గరిత - జనులార

314

గణన ధనమది లెస్స- ఋణము దీరిన లెస్స
గణిక రోయుట లెస్స - గుణముగల సతి లెస్స
గుణవంతు కనియె - జనులార

315

అంగనయె తనుమెచ్చ - బంగరము జేజిక్క
సంగరమ్ముజయింప - జంగమేశునికరుణ
పొంగు వరమనియె - జనులార

316

పిల్లలున్న గృహమ్ము - నుల్లసిత పికవనము
సల్లలిత కవనమ్ము - పిల్లతెమ్మెఱగాన
మొల్లరవె జడులు - జనులార

317

మనసైన వనితతో - జనువు ముచ్చటలతో
మనసార దనిపించు - మనువుతా నమృతంపు
పావల తావియనె - జనులార

318

తనుమెచ్చనట్టి పర - వనిత గవిసెడు వాడు
వనరాజా భోజనము - దినగోరు నక్కవలె
పెనులేకి వాడనియె - జనులార

319

మాత దిట్టెడు సుతుడు - నీతివెఱుగని సతియు
రీతి నెఱుగని బంటు - కోతులాడెడు గృహము
భాతి రోతనియె - జనులార

320

నారితా నుపకారి - నారి స్వర్గపు దారి
నారి భువిహితకారి - నారి గినిసిన వింటి
నారి శరమనియె - జనులార

321

పవన నియమమ్మెఱుగ - శివుడు సన్మతినిచ్చు
భవమూల భువిద్రెంపి - భవుని మదిలో గొల్చి
శివు గాంచు మనియె - జనులార

322

నవద్వారములు మూసి - శివధ్యానమున నున్న
నవఖండ పృథ్విలో- బ్రవచించు ప్రణవమ్ము
చెవివింపు ననియె - జనులార

323

జీవిజీవిని జంపి - జీవించు జగమెల్ల
జీవులంగాక వే - రేవి తిందురట భువి
జీవ మయమనగ- జనులార

324

సర్వజ్ఞనుడి నెఱుగ - సర్వమెఱిగిన యట్లు
సర్వజ్ఞవచనముల - నుర్వి దలపని వారు
గర్విష్ఠులనియె - జనులార

325

వనితలో సుధజిలుకు - వనితలో విసమొలుకు
వనితలో నియమమున - మనువాడు యోగమున
గను ముక్తి ననియె - జనులార

326

మాటలెఱిగిన వాడు - మేటియగు ధరలోన
సాటిగౌరవమందు - సూటిమాటలపోటు
కాటి మూటనియె - జనులార

327

రాగులను దినెడుచో - రోగమ్ము రాదనియె
రాగిబీదలకూడు - భోగియొల్లడు వాడు
రోగి యగుననియె - జనులార

328

అక్కరములేఖలకు - జిక్కుతర్కమ్ములకు
తక్కుచదువులు కూడు - మెక్కుటకు ముక్తి రెం
డక్కరము లనియె - జనులార

329

ఎల్లవెఱిగిన వారు - కొల్లలుందురటయ్య
తల్లలిత సాహిత్య- మెల్లరకు సరిరాదు
చల్లగా ననియె - జనులార

330

మల్లెవలె వికసించి - నుల్లపిత  సుధయగుచు
మల్లికార్జునుగుడికి - తెల్ల వెలుగైన శిల
వెల్ల విరియనియె - జనులార

331

కాలులేదాగి బ్రాకు - కేలు లేదెగసిపడు
నాలుకయు లేదు  వచ - నాంకిలకిల లాడు
హేల " నది" యనియె - జనులార

332

రాతి బండకు మ్రొక్క - నీతి కాదనియెదరు
రాతిలోకళలుంచు - చేతి విన్నాణంపు
జ్యోతి ప్రభువనియె - జనులార

333

శిలల వెలిగెడు దైవ - కళ బింబ కాంతులను
తిలకించు ప్రతిబింబ - ములభక్తి వివశతయె
ఇలముక్తి యనియె - జనులార

334

మరణింప దొరుకునే - తిరమైన మోక్షమ్ము
మరణించు మునుపె శ్రీ - హరి హరుల వరయుటే
స్థిరముక్తి యనియె - జనులార

335

కుండలిని గనువాడు - పెండిలిందలచునే
కుండలివిభూషణుడె - యండ యనువాడు మ్రి
తృండ మొల్ల డనె - జనులార

336

నాడనెడు దేహమున - రూఢివిడు బ్రాణుండు
నాడు వెడు రూఢివెడు - తేడు ప్రాణుడు దొలఁగ
" వీడు " కాడనియె - జనులార

337

భృంగశ్రుతి రాయంచ - భంగిముల లయరీతి
సంగతుల పికగీతి - పొంగు సత్కవిత ప
త్పంగ ధృతిననియె - జనులార

338

సత్యద్రష్టలు వారు - మృత్యుగతు లనబోకు
సత్యసుధ లమృతోక్తి - నిత్యమిడు శ్రుతులవలె
స్తుత్యులని పల్కె - జనులార

339

కప్పచేపలు క్రిములు - గుప్పలుండెడు జలము
లొప్పునే తీర్థమై - గొప్పపజ్ఞవ గోష్ఠ
లొప్పు దీర్థమనె - జనులార

340

కర్మచేత శివుండు - చర్మమ్ము ధరియించె
గర్మనజా డజమయ్యె - కర్మ హరి గొల్లడగు
కర్మ తప్పదనె - జనులార

341

గాయత్రి తల్లి యామ్నాయముల కనిబొగడి
వేయారు శాఖలను - బాయరీ ద్విజులెల్ల
శ్రేయులని దెగడె - జనులార

342

వేదమంత్రములెల్ల - బోధించు ప్రభుభక్తి
వాదభేదము విడక - వేదపండితులెల్ల
బీదలైరనియె - జనులార

343

ఈ మతృభిన్నముల - దోషములుగానెంచి
రోష ద్వేషము బెంచు - భాషాఢ్య భూసురులు
వేషధరు లనియె - జనులార

344

బసవేశ్వరుడు దనకు - కుశలకాలజ్ఞాన
భసిత మిడి చెప్పగా - నసమాక్షు పై - భక్తి
దిశ గుదిరె ననియె - జనులార

345

వీరబసవంతుండు - ధీరు బిజ్జలు మీరి
పోరె కలిదైవమై - వైరెవ్వరతనికిన్
గారనియె సాటి - జనులార

346

రాగమ్ము దూర్పునను - యోగముత్తరమందు
రోగమ్ము బడమటన్ - భోగముధ దక్షిణము
సాగు జనమనియె - జనులార

347

ఉడికించి[1] తూర్పునను - వడిగాల్చి[2] యుత్తరము
3 పిడితట్టి పడమటన్ - గడు[4] - ముద్ద దక్షిణము
గుడుచు కూడనియె - జనులార

1. వరి , అన్నము 2. చపాతి 3.జొన్నరొట్టె 4. రాగిముద్ద

348

దరిసెనము లారిటను పరప్రమాణము మూట
తరగనిది పరతత్వ - మరయు మనువారు స
ద్గురువర్యు లనియె - జనులార

349

పరతత్వ మెదుట బడి - యెరిగింపనోల్లక
వరరూప ధారియై - తిరుగునిల దైవమై
గురువుగానమ్మనియె - జనులార

350

సురతరువు బ్రోడగునె - సురభి గోడ్డావగునె
హరుడు బాషాణమే - నరుడు పరతత్వమే
హరులు గురులనియె - జనులార

351

సుకము లింద్రియ వశత - లోకభోగమనకుండ
సకలమీశార్పిత - మ్మకళంకమని దెలియు
శుకుడు గురువనియె - జనులార

352

కాయమను కోలనులో - బాయు హృత్కమలంపు
వేయిదళముల సుఖము - కాయజారికి నిడుట
ధ్యేయవిధియనియె - జనులార

353

వీడిసహజపు నడత - వేడుకల పవలిరుల
షోడశవిధార్చనల - వేడినమ విభుడుండు
జాడెరుగ రనియె - జనులార

354

సహజ సహజీవనము - లిహవాప ధర్మముల
జహియించి భజనలో - విహరింప గనబడునె
గుహాని పితయనియె - జనులార

355

జననముల కల నలువ - మనుగడకు మాధవుడు
హననమునకు హరుండు - ఘనులరని వేదములు
వినుతించు ననియె - జనులార

356

జ్వరమున్న వారికిన్ - మరి పాయసము చేదు
నరకమున బడువారు - హరిహరామృతపాన
విరస జడులనియె - జనులార

357

హరికరుణ లేనిదే - పరశివుని దలపనిదె
ధరలోని నరులెల్ల - పరమపురుషుని గాంచు
స్థిరత గనరనియె - జనులార

358

జాతధీరుడు జాతి - నీతివిడి భీతిలునె
జాతస్యమరణం ధ్రు- వేత ద్వినిశ్చిత
జ్యోతిగను ననియె - జనులార

359

సజ్జనులస్నేహమ్ము - గొజ్జంగి పరిమళము
పజ్జదుర్జనులన్న- పజ్జ దుర్వ్యాధివ్రాత
గజ్జి రొచ్చనియె - జనులార

360

శంకరుడు భిక్షుకుడు - పంకేజ నాభుండు
లంకవాపులంగాయు - వంకపేడి కిరీటి
జంకి విధికనియె - జనులార

361

యోనిజాలు యోనులను - హీనమనజెల్లనే
యానందమిదుజన్మ - మౌనులకు మూలమ్ము
జ్ఞాన గతులనియె - జనులార

362

మదగజము జలకాన - బెదరునే చేపలకు
వదరుచున్ శునకమ్ము - లెదురైన జడియునే
బుధులరల్లనియె - జనులార

363

గంధమ్మురగదీయ - గుందునా పరిమళము
సుందరేశుని భక్త - బృందములు గష్టముల
గుంది చెదరనియె - జనులార

364

గుటిలేని శరవృష్టి - గురిపింప ఫలమేమి
సరిమాటలేనట్టి - బిరుదుదర్పములెల్ల
హరు జూపవనియె - జనులార

365

వేద శాస్త్రాగమపు - వాదనల శ్రమలేల
వాదోంకృతి శ్రుతిలయ - సాధించి పరమాత్మ
శోధింపు మనియె - జనులార
అవతార మూర్తులకైననూ విధి లిఖితము తప్పదనియె

366

వెన్నకుంపటి చెంత - నున్నచో గరుగదా
కన్నెదటిమాణవకు - డున్నచో జదువెల్ల
సున్నయగుననియె - జనులార

367

సిద్ధాంతియనువాడు - నిద్దురను వాసనల
బద్ధకము 'విడనాడ - శుద్ధయోగము వరయు
సిద్ధుడగుననియె - జనులార

368

ఖరమల్లు బూదెలో - బొరలుచో బరతత్వ
మరయునే మానవుడు - హరిహరాదులనాత్మ
బరికింప కనియె - జనులార

369

దండకౌపీన మిడి - గుండు నున్నగ గీసి
నిండు భస్మము బూసి - ముండమిడికెడు దోషి
దండి కాడనియె - జనులార

370

నీత దేశముమధ్య - నీతి సాధము లెల్ల
పాతకుల చెఱసాల - నీతిమంతుల స్వర్గ
వ్రాతమ్ములనియె - జనులార

371

క్రీడలన్ బాల్యమ్ము - ప్రౌఢమున భోగములు
గాఢ చింతలు ముదిమి - బీడు దేహము జూడ
మేడిపండనియె - జనులార

దండ సన్యాస

372

నాలుగున్ దశలందు - నాలుగాశ్రమములను
నాలుగున్ ధర్మముల - నాలుగున్ బురుషముల
మేలెంచు మనియె - జనులార

373

శివయోగి సర్వజ్ఞ - భువి భవానుభవమ్ము
లవలీలగా జెప్పె - నవిరళపు గన్నడం
బవని త్రిపదులను - జనులార

374

అతని వచనములన్ని - కితకితలు బెట్టించు
హితము లయ్యును చుఱుకు - కితవులన్ దెగటార్చు
వ్రతి సిద్ధుడతడు - జనులార

375

శివకేశవుల నతడు - కవనముల నుతియించె
త్రివిధమగు వచనముల - శివయోగమున దాను
భవములం బాపె - జనులార

376

తిక్కన్న ముత్తాత - యొక్క భాస్కరుడును హు
ళక్కిభాస్కరు డొకడు - జక్కరామాయణము
దక్కించ్రి తెనుగు - జనులార

377

గోనబుద్ధారెడ్డి - మానినీమణి మొల్ల
తేనెలూరెడు కవిత - జానకీ జాని కథ
వీను విందిడిరి - జనులార

ఇక్కడికి సర్వజ్ఞని వచనముల భావాను వాదములు ముగిసినవి. తక్కిన త్రిపదులు స్వీయరచనలు

378

తాళ్లపాకవమయ్య - తాళ్లపాక్తిమ్మక్క
పిల్లపాటలు మొదలు - కొల్లవేదాంతముల
నుల్లమ్ముగానిరి - జనులార

379

తరిగొండ వేంకమ్మ - తిరుమలేశుని భక్తి
బిరుదు గొని తెనుగులో - విరివిగా రచియించె
సిరిరమణు కధలు - జనులార

380

హరిహరులు ధాత రవి - పరదేవతా తత్వ
పరదైవ మెవ్వరైన - హరియె యంతర్యామి
పరుడు విష్ణువును - జనులార

381

యోనామధాయేక - మేనమ్మ " ని హరిని
ధ్యానమ్ము నన్ నిల్పి - జ్ఞానమ్ము బడసెదరు
దీనాథు లిలను - జనులార

382

హరి యంచు గొందరున్ - హరుడంచు గొందరున్
హరిహరుల రొక్కరని - పరదేవతాఢ్యయని
విరివి గల హిం(తు - జనులార

383

ఒక విష్ణుమూర్తియే - సకల నామములందు
సకల హృదయములందు - ప్రకట వివిధాకృతుల
వికసించు గాదె - జనులార

384

పేరేమిపైన దా - వోరార మనసార
శారీర త్రికరణవు - ధారాళుచింగొలువ
శ్రీరామ రక్ష - జనులార

385

నేటివిజ్ఞానమ్ము - నాటిశోధవంపై
నాటుకొన్నవి గాదె - సాటియేలేనట్టి
మేటివిధు జూపు - జనులార

386

ఎన్నినేర్చిన నేమి - యెన్ని గొలిచిన నేమి
సన్నుతాఢ్యులు గూడ - భిన్నగతి స్వార్థమతి
పిన్నవారైరి - జనులార

387

కులములన్ మతములన్ - పొంత ప్రేమమ్ములన్
కళలలో భక్తిలో - పలు రాజకీయముల
కలుషము ల్గలెపె - జనులార

388

మూలమంత్రము గాదె - మూలరూపము తోడ
మూల పురుషుని గొలువ - మేలు గను విశ్వములు
చాల కాలమ్ము - జనులార

389

ఈ జగత్సృష్టికిన్ - దేజస్వి రవి సాక్షి
తేజస్విలో సాక్షి - రాజగత్సాక్షి యగు
వోజస్వి హరియె - జనులార

390

అన్నిరూపములందు - అన్నితత్వములందు
అన్ని కార్యములందు - అన్నివేళలయందు
వెమ్నడే వెలుగు - జనులార

391

కులము లీనాటివా - కెలికి శోధింపగా
కలిపి మర్దింపగా - చిలికి చికిలింపగా
కులము సంకులము - జనులార

392

పొలతి హృదయమ్ములో - విలుకాడు మన్మథుడు
వలపు ములుకులు గ్రుచ్చ - గుల ధనము, రూప, గుణ
ములవి యడ్డు నే - జనులార

393

ప్రారబ్ధ సంచితము - దూరంపు వాగామి
తీరైన విధులలో - బోరాడు జీవాళి
వారించు టగునె - జనులార

394

పరిణయార్థివిలోన - మరి మునుపె సిద్ధమని
నరులు నమ్మెదరు - విధి గరిమ గంతకుబొంత
సరిజేయు ననుచు - జనులార

395

సంకరము భావమ్ము - సంకరము వర్ణమ్ము
సంకరము సకలమ్ము - శంకరుండెటుదొరుకు
సంకితుల కిలను - జనులార

396

ఇది పిష్టపేషణము - మదమత్తవక్రోక్తి
ఇది చపలమతి సూక్తి - యెదియైన నేమనెడు
పిదప కాలమిది - జనులార

397

పూర్వకర్మపురీతి - సర్వజీవులు జగతి
సర్వకర్మల నరపి - నిర్వికారత నుండ
సర్వమ్ము శుభము - జనులార

398

తొలి మార్గమును విడక - నిలప్రస్తుతమువిడక
కులవైరములు గొనక - నిల సద్భుహస్థియై
దిలకించు హరిని - జనులార

399

మనుజ లోకములోన - మనుజాడై సహజత్వ
మున మమట లీనాడు - మొనకత్తిపై నడక
ఘనకార్య మగును - జనులార

400

పెదవి తుదజిఱునవ్వు - లెదలోన ధనకనక
మధువు గను గణికవలె - మద ముదిత జనులు తుది
మొదలు విష్మక్రిములు - జనులార

401

వెయ్యములు వియ్యములు - కయ్యమ్ములై మిగుల
దయ్యములు దలలోన - కయ్యలము గెంతించు
పయ్యాటకముల - జనులార

402

పరుని ప్రాణము వేడు - పరకాంత కోరగాదు
తిరకాసు ప్రతిచోట - మురుగు కంపుల పీట
దిరుగాడు పురుగు - జనులార

403

గ్రామ వైరముల్లోన - వాషీచదువులలోన
దేశప్రేమికులుండ్రే - ఈసు ప్రతి నిధులందు
మోసములు రాశే - జనులార

404

వివిధ రంగములందు - వివిధ వేషములందు
శివాశివా! హరిహరీ! - ప్రవచవాడంబరము
పవి వింధు వేడు - జనులార

405

పెదవిపై జిలుగునవ్వు - హృదయమందున విషము
తుదకత్తి పూదేనె - మృదువాక్కు లొలికింత్రు
మృదుల వంచకులు - జనులార

406

పైకమ్ము గడియింప - గాక బంగారంపు
షోకు గణికల ఖ్యాతి - లేక గురువుల పితి
డోకు గలిగింత్రు - జనులార

407

వేదముల వల్లించి - పొదెతెచ్చెనిలికి
వాదబ్రహ్మలు లంచు - వాదముల జెండాడి
వాదె బొల్లెదరు - జనులార

408

సంగ నామము లుంచి - హంగు పూజలొనర్చి
మంగళారతులిచ్చి - రంగనాథుని మఱచి
యంగనల గోర్త్రు - జనులార

409

వ్రతము లుపవాసములు - తత షోడశార్చనల
రతిపతికి దండ్రి శ్రీపతి యంచు దెగమ్రొక్కి
రతి విరతి విడరు - జనులార

410

ప్రజలందిరాజ్యమ్ము - ప్రజకు సేవంకితము
ప్రజలకే భోజ్యమని - ప్రజల రక్తము దీర్త్రు
ప్రజల నాయకులు - జనులార

411

పదివంద లోక మూక - విధి వేల నాకనేత
పదివేల లోకదేశ - మధుమార్గము లందు
పదిదిక్కు లీద్రు - జనులార

412

ప్రతిచోట దంభములు - ప్రతిచోట వంచకులు
ప్రతిపీట బోధకులు - ప్రతహితులు ధిషణులను
కితవ తండములు - జనులార

413

ఏలనీవంచనము - లేల నీ ద్రోహమ్ము
లేల నీ ద్వివిధంపు - గోల గగ్గోల మా
మూలు బ్రతుకులో - జనులార

414

అణుశాంతి బ్రణవమున - రణగుణధ్వని వింపి
కణకణము వింపగా - క్షణములో సృష్టి వి
ఘ్నణము పేతురిక - జనులార

415

జగతి పేమములంచు - జగతి మిథ్యలటంచు
జగతినే ద్వజియుంప - మిగులు పవ్యానమ్ము
లాగి బూదె గాదె - జనులార

416

నేతినేతి యటంచు - నేతులను దెగ్రదావి
నేతలము మనమంచు - జాతిద్రోహము జేయ
ప్రేతలయ్యెదరు - జనులార

417

జగదీశుడీభువుల - మిగిలించు వెందులకు
దెగడి జచ్చుటకేమి - మిగులనిర్గుణ బ్రహ్మ
లగుటకా ! తుదకు - జనులార

418

జీవితా విలబుట్టు - జీవి తా విలజచ్చు
జీవి భక్తి జ్ఞాన - నావలో ప్రభుసేవ
త్రోవ నిత్యుండు - జనులార

419

అతడు హరి యచ్యుతుడు - అతడు విభులకు విభుడు
అతడె బుట్టించు మఱి - యతడె గిట్టించు తత
హిత ముక్తి కతడె - జనులార

420

అతడ ప్రమేయుడని - అతడ నే నేనని

అతడు జేసెడు పనులు - ప్రతతి జేయంగలమె

శ్రుతులొప్పునట్లు - జనులార

421

తలను బోడి యొనర్చి - మొలనూలు దెగగోసి

బలిమిథ్య జగమన్న - కలిమిలేముల యుగళ

చలములని విడునె - జనులార

422

ఈ జగజ్జీవనము - నీ జీవ దేహములు

నాటాకుగా నెల్ల - నాజగత్ప్రాణుని

రాఘ్రాణింపు కరుణ - జనులార

423

భక్తి పేలవమయ్యె - యుక్తి మిన్న నియెంచు

రక్తి పైదోడయ్యె - ముక్తి విభ్రమమను కు

యుక్తి హితమయ్యె - జనులార

424

చార్వాక పద్ధతులు - గర్వితుల వ్రతమయ్యె

మర్త్య జీవన మిపుడు - సర్వభోగాలకను

నిర్వచనమయ్యె - జనులార

425

భోగలాలసులైరి - రాగరంజితులైరి

త్యాగయోగమువీడి - రోగపీడితులైరి

వీగెదరు ప్రజలు - జనులార

426

తమసుఖము కొరకువై - సుమములన్ వలిపెదరు
రమణీయ ప్రకృతిలో - తమ వికృత కృత్యులుంచి
తమ గొప్పలంద్రు - జనులార

427

జీవ రాసులను మే - ధావి మానవు డంద్రు
భావ మాధ్యమ బౌద్ధ- దైవశూన్యపు గతుల
కావి గట్టుట లేల - జనులార

428

వేదోపనిషదాది - మాదిరి పురాణములు
బోధించు సత్యముల్ - స్వాదులెఱిగిన గాని
రాదు నిజసుఖము - జనులార

429

గట్టి శాస్త్రము లెన్ని - భట్టి పట్టిన వేమి
వట్టిప్రాతలు నీట - గుట్టు దెలుపం గలవె
తుట్టతుది పట్టు - జనులార

430

శాస్త్రమ్ములకు వక్ర - శస్త్ర ఛేదనజేయు
వస్త్రములు వాదనలు - భస్త్రికలు వెగశ్యాన
విస్త్రాణ వలదు - జనులార

431

రూఢియగునర్థంపు - వాడు - కలువిడవాడి
మ్రోడులగు పిడివాద - మాడుచో ఫలమేమి
జాడ చెడిపోవు - జనులార

432

సతి యనుచు జితి బేర్చి - సతిబల్మి దహియింప
సతికి మోక్షము లబ్బి - పతి - యాత్మ మెచ్చునే
వ్రతము శ్రుతి హితమె - జనులార

433

అలచకోరపు జంట - వలె విరహమోర్వక
సులభస్వచ్ఛందముగ - లిలి ప్రాణముల్విడువ
బలవంత మగునె - జనులార

434

తన మరణవార్తవిని - తన భార్య బ్రతుకదని
తనమృషామృతి వార్త - వినిజచ్చు బ్రణయగతి
గనడె భర్తృహరి - జనులార

435

ఆ మహా సాధ్వి స - త్ప్రేమగతి మూర్ధన్య
సామాన్య జనులకీ - మోమోటము గ్గలవె
కామ వాసనల - జనులార

436

ప్రేమ యోగాగ్నిలో - భామతనువును వీడ
వేమమని, బలవంత - మేమూల శాస్త్రములు
నోమింపగలవు - జనులార

437

రామాయణముగాని - ఈమహాభారతము
సామాది . త్రితయములు - సీమాదిరివ్రతాలు
సీమమ్ము లనెవె - జనులార

438

మనశ్రుతుల నున్నదా - తనసతిని గాల్చునని
ఘనప్రేమ యోగాగ్ని - తను త్యాగ మదిసతియె
చనదు సతిబల్మి - జనులార

439

రాము మాతలు గాని భీము తల్లియు గాని
నోమి చితులను బేర్చి స్వామితో సతిగనిరె
ఏమి వ్రతమిద్ది - జనులార

440

ఈశు డిటు జెప్పెనే - వ్యాసుడిటు వ్రాసెనే
వాసియనునట్లుగా - బాసజేసెదరెట్లు
మాసి మసి బూసి - జనులార

441

మొగలాయి ప్రభువులు - పగబూని కులసతుల
బొగిలింప జితులలో - నెగసి దూకిరి శీల
మెగిరి పోకుండ - జనులార

442

చిత్తూరు పద్మినిని - తత్తరపు సులతాను
ముత్తెంపుటద్దమున - చిత్తరువు హత్తగా
నత్తరుణి గాలె - జనులార

443

తొలిఘోరితైమూరు - మలిటిప్పు సులతాను
లలనలను జెఱబట్ట - నిల చితుల దూకి రవి
దలప సతిగావు - జనులార

444

అమలిన ప్రేమమ్ము - అమరునే యెల్లరకు
అమరత్వమది సతికి - భ్రమగాదె ముక్తికని
సమయింప బల్కె - జనులార

445

జీవకారుణ్యమ్మె - దైవమున కిష్టమ్మె
ఏవిధిని "సతి" యయ్యె - జీవులకు హిత వ్రతము
దేవుడే యెరుగు - జనులార

446

శ్రుతుల మంత్రములకు - మతిలేని వ్యాఖ్యాన
కృతకముల మౌఢ్యంపు - గతి బాయ రేలకో
క్షితి జనుల రవని - జనులార

447

సత్యమ్మె బ్రహ్మన, య - సత్యమ్మె జగమగునె
నిత్యమ్మె బ్రగతి గల - సత్యమ్మె జగమయ్యె
మిథ్యయగువెట్లు - జనులార

448

"తత్వమసి" యన్నచో - సత్వశ్రేష్ఠుని వలన
సత్వ తరతమ శ్రేణి - తత్వదేవులు వివిధ
సత్వులెరనుట - జనులార

449

సోహమన ప్రభునివలె - దేహినిత్యుండనుట
దేహి స్వల్పానందు - డాహరి వలె జగన్ని
ర్వాహకుడు గాడు - జనులార

*తత్ - THAT / IS త్వం THOU అసి - ART
THAT IS & THOU ART. TWO STATES

450*

సంపూర్ణషాడ్గుణుడు - సంపూర్ణుడగు హరిని
సంపూర్ణ దుగ్ధాబ్ధి - నింపుకొనుతన పాత్ర
సంపగల భక్తి - జనులార

451**

పూర్ణు డట పూర్ణుడట - పూర్ణమున పూర్ణుగాని
స్పూర్ణ సద్భక్తి భ - వార్ణవము దాటవలె
పూర్ణాణువులగు - జనులార

452

అయమాత్మ బ్రహ్మయ - అయమొకడు బ్రభువొకడు
వ్యయుమౌ శరీరమ - వ్యయుడు శ్రీ హరియన్న
ద్వయమయ్యె గాదె - జనులార

453

ఇది ద్వైతసారమ్ము - విది ప్రకృతి గతియంచు
సదయుండు పవనజుడు - హృదయ వ్యాసునిగొల్చి
తుది భాష్యమిడియె - జనులార

454

పరపరాత్పరులైన - సిరిహరి ద్వితయులకు
తరువాత సరివములు - వరధాత పవనజులు
మరి బ్రహ్మ పదవి - జనులార

455

యుగయుగావర్తముల - జగతి సంభ్రమణమ్ము
జగదీశు కర్తృకం బగణితందగు నైజ
ముగమ సౌఖ్యమ్ము - జనులార

* : భక్తి బోధోపలబ్ధి జీవోపాధి పరిమితం - ఆనందాను భూతి సమం కాదు
** : అణువు-మహత్-జీవ, ఈశ తారతమ్యమే గుణ సామ్యమే కాని ఏకం కాదు

456

జగతి చక్రము లందు - యుగళ ద్వాదశ తత్వ
మొగి నిగమ వేద్యునకు - సుగుణ సేవావృత్తి
మగుడుచును దిరుగు- జనులార

457

శ్రీ మాత శ్రీ పకృతి - శ్రీ మహీభారతులం
నేమించు నజ రుద్ర - సోమ రవి తారకల
స్వామి హరి యాజ్ఞ - జనులార

458

మాతరిశ్వుండతడు - మనుజజీవాళికిన్
ప్రీతి భక్తి ని బెంచి - విష్ణుసన్నిధిజేర్చు
ధాత యగుభావి - జనులార

459

హరియె సర్వోత్తముడు - ననిల జీవోత్తముడు
పరమ పాపము లెల్ల - బరిమార్చి జీవులను
హరిముందు నిలుపు - జనులార

460

ప్రాణులకు ముఖ్యమగు - ప్రాణవాయువితండు
ప్రాణుని యవావృత్తి - ప్రాణు లెల్లరి మిత్తి
ప్రాణమయి జగతి - జనులార

461

హరిరామకృష్ణులకు - హనుమ భీముండయ్యె
హరి కృష్ణ వ్యాసునకు - మరి మధ్వుడైగొల్చె
గరుడ శేషాంశ - జనులార

462

మరుతజాడు రాకుండ - మాధవుడు రాబోడు
మరుతజాడు వెడలుచో - మాధవుండును వెడలు
ఇరువు రొక జంట - జనులార

463

ఆతడు హరి విష్ణుండు నితడు హరి మారుతియు
అతని వాకిట నితడు - నిత డొప్ప నతడిచ్చు
హితవైజముక్తి - జనులార

464

నవవిధ వ్యాకరణ - నవరసాల్ గానముల
ద్రవియింప గా జేయు - సువిధి హనుమత్ప్రోడి
స్థవిర శిల్పవైన - జనులార

465

అనిలవేగము జవము - మనము దేజమున రవి
ఘనజితేంద్రియ యుక్తి - హనుమంతు డతి బలుడు
వినతుండు భక్తి - జనులార

466

అనిలజాడె హనుమంతు డవెడు జీవోత్తముడు
అనిలజాడె యాధార- మఖిల జీవుల కిలన్
ముని మధ్వుడతడె - జనులార

467

ప్రాణ నియమమ్ము తో - ప్రాణ నాథుని గొల్చి
ప్రాణపతి మంత్రమ్ము - ప్రణవ సహితావృత్తి
ప్రాణి జపియించు - జనులార

468

ఆనంద తీర్థాఖ్యు డౌ హనుమమధ్వ వ్యా
ఖ్యానం జేసి స - జ్ఞానదాత ననంతు
ధ్యానగతి గొలుచు - జనులార

469

అజాని సృష్టి క్రమము - ద్రిజగదంతర్వ్యాప్తి
గజచర్మధారి లయ - నిజ స్వరూపవు జేసి
ఋజావు గనుచుండు - జనులార

470

ఎవరి పని వారిదే - యెల్ల రొక్కటి కాదు
పవలిరులు జీవాళి - నవవిధపు భక్తితో
వివిధముగ గొల్చు - జనులార

471

పంచభూతాళిని బ్ర - పంచితమ్మగు దనువు
నెంచి - కొని సాధనం - మంచిగని జేసి యే
తెంచు ప్రభుచెంత - జనులార

472

నిజమిట్టులుండగా - నజాద ! బ్రహ్మపటంచు
భుజకీర్తి బ్రహ్మలు దమజాలై వెలంగుచో
నిజమగునె ముక్తి - జనులార

473

ఉన్నషున మంత్రముం - దిన్నగా దెలిపికొను
వెన్నగా లేక దా - మన్ని దుర్వ్యాఖ్యలను
బన్నెదరు ఖలులు - జనులార

474

హరియుండు నెదలోన - హరుడుండు మదిలోన
నరుడుండు దేహమున - నరబింబ ప్రతిబింబ
నరునలో తిరము - జనులార

475

నరుడు హరిహరుడగునె - నటుడు దివికేగునే
హరుడు చిత్తము నిల్ప - హరిబింబ మెదగాంచు
నరుడు ముక్తుండు - జనులార

476

మదిలోని శివునడిగి - యెదలోని హరిగాంచి
పదముల శ్రీరమణు - పదయుగ్మ మందుటే
ముదభక్తి ముక్తి - జనులార

477

ఇదికల్ల కాదయ్య - ఇది హరివిహారమ్ము
ఇదిరమా మందిరము - నిది ప్రకృతి శ్రీ జగతి
విధివశులం మేము - జనులార

478

విధినవను లిద్దరొక - పదవి పరివారంద్రు
అధికారి బ్రహ్మ భా - వ్యధికారి పవనజుడు
తుది సూత్ర ధారి - జనులార

479

హరిరమా శివశివా - వరధాత వాణివలె
నరవారి రతి పతులు - హరిని సేవించుటే
పరమ ధర్మమ్ము - జనులార

480
వేకువను తానమ్ము - వాకటికి భోజనము
తేకువను సత్క్రియలు - చీకటిని హరిసేవ
మాకు సహజమ్ము - జనులార

481
న్యాయంపు టార్జనము - మాయా విగర్హణము
స్వీయాతిశయము విడి - ధ్యేయు శ్రీ - శివు చేర
శ్రేయమ్ము మనకు - జనులార

482
ఇరుగు పొరుగుల హితము - నెరిగి చరియించుచో
పొరపొచ్చెములు రావు - దురితమ్ములకు మనము
దొరకి పోరాదు - జనులార

483
ఈసు మాసోవమిని - దోసముల మదిరోసి
లేశమైనను మంచి - చేసి నివసించుచో
వాసియగు మనకు - జనులార

484
పంచభూతములెంచి - పంచమానము తేర్చి
పంచగుణముల దీర్చి - పంచభేదములెఱుగ
మంచికిని దారి - జనులార

485
ఒకడు శాకాహారి - యొకడు మాంసాహారి
యొకడు పవనాహారి - సకల జీవులంరెల్ల
నొకవిధముగాదు - జనులార

486

ఎవరింట వారు తిన - ఎవరి పని వారు గన
మివుల సుఖదుఃఖముల్ - వివిధమ్ములుగ నుండు
సవరింప లేము - జనులార

487

ఎవరి కేది హితమ్మొ - వివరించు విభుడాత్మ
వవిరళా పేక్షతో - సవిరామగతి నీతి
పవలు నిశి మనకు - జనులార

488

ఎల్లరొక త్రోవలో - నుల్లసిలగా లేరు
ఎల్లరెన్ని విధాల - నల్ల - నయ్యను గొల్వ
జెల్లదాయేమి - జనులార

489

జగదీశుడచ్యుతుడు - నగపడడు కన్నులకు
జగతిలో బ్రతిచోట - నిగమవేద్యుండగును
దగ గొల్వదగదె - జనులార

490

హరి యప్రమేయుడై - నరులను నియోగించు
హరిహరుడ నేనంచు - మురియు దనుజాధముల్
కొఱగారు తుదకు - జనులార

491

ధగధగల రవిగాంచ - దగులబడు మనకములు
ఖగకోటి తేజాడగు - జగదీశుల - మె మనము
నగు బాటు - గాదె - జనులార

492

కడలి కెరటము కెదురు బడి బ్రతుకగాలేము
బుడిబుడిని బ్రహ్మలని - మడిగట్టు కొనియెదము
పెడబుద్ధిగాదె - జనులార

493

యుగకల్ప ప్రళయాల - విగతులము గాకుండ
బిగదీసి కళలతో - జగదీశు డొదిగించ
మగిడి వచ్చెదము - జనులార

494

సర్వస్వతంత్రుండు - సర్వోత్తముండతడు
సర్వజీవుల జొచ్చు - సర్వకాలము బ్రోచు
గర్వితుల మేము - జనులార

495

జగతి జన్మలు మనకు - జగదీశుడేయొసగు
నిగమోక్త సారముల - నొగిదెలియు దేహముల
సుగతులొనగూర్చు - జనులార

496

పదితలల మెదడు తో - గదలించె నే గిరిని
మొదటి రావణబ్రహ్మ - పదితులపు మెదడుతో
విధియగునె జీవి - జనులార

497

హరి విష్ణునేపేర - తిరముగా బిల్చుచో
వరమిచ్చి బ్రోచెడిని - హరబ్రహ్మవేవనిన
నరక మే ప్రాప్తి - జనులార

498

పరమ వాప్తి కు లిపుడు - హరి హర బ్రహ్మలను
మరి శ్రుతి పురాణముల - సరికాదు పొమ్మనిరి
వరుడె గురుడనిరి - జనులార

499

ధరసర్వభోగములు - పరమాణు శాస్త్రములు
పరమాత్మయను పేరు - వరుని సృష్టియటంద్రు
పరుడు గాడంద్రు - జనులార

500

పుక్కిటి పురాణముల - పెక్కువ్రాతలు వ్రాసి
చిక్కుభక్తిని బెంచి - మ్రొక్కించి బోరలించు
తిక్కవారనిరి - జనులార

501

రాగమయ జీవితవు - భోగలాలసులరై
వేగభౌతిక శాస్త్ర - మూగయంత్రవుసేవ
రోగిష్టులైరి - జనులార

502

ఒక గులాబిని గాని - యొకమల్లెనిరిగాని
యొక కణము రుధిరమ్ము - సుకృతింప గాలేరు
వికట ప్రష్టలరు - జనులార

503

పురివెమ్మ వాడించు - స్వరపికము గూయించు
పరిమళవు విరిసాగను - వరసృష్టి సేతురే
వరప్రజాపతులు - జనులార

504

అణుమారణాస్త్రం - క్షణములో జగతిని
తృణముగా పడి గాల్చు - ఘన శాస్త్రములు శాంతి
గుణ నాశకములు - జనులార

505

ప్రగతి గూర్చగలేరు - కుగతి జంపంగలరు
రగడలును సృజియింత్రు - దెగహింపం జరింత్రు
నిగము నింద్యులరు - జనులార

506

పదిమందినడచుచో - పదిబాట యది విడచి
మదమత్తు లనంతంపు - విధి విధాన మెరుగక
పథములయ్యేదరు - జనులార

507

తరణి మండల గతులం - దిరుగు గ్రహముల భూమి
నరుడెంత నలువంత - గరువమ్ము కొండంత
పరమాత్మ ననెడు - జనులార

508

ఖగరవికి బలురెట్లు - నగుపడెడు తారకలు
గగనమండల మందు - నగబడనివవి యెన్ని
జగదీశుడేయెఱుగు - జనులార

509

ఈ యనంత విశాల - న్యాయలోకములందు
మాయుర్వి యొక నలుసు - నీయుర్విలో నరుడు
తోయధిని కణము - జనులార

510

నరుడెఱుగ గాగండు - పరమాత్మ వైభవము
గురుభక్తి సద్బుద్ధి గురి - కుదిరినంగాని
దరిసెనము గాదు - జనులార

511

హరి కుక్షిలో దిరుగు పరమ బ్రహ్మాండముల
నరుని హృది ప్రతిబింబ - మరయు చిద్బింబమై
గురుకరుణ వెలుగు - జనులార

512

మనుజుల మనీషముల్ - మనువెవని కరుణచే
మనజన్మలెవనిచే - మును శాంతి బడసెడిని
ఘనుని దయగాక - జనులార

513

తనను దెలిపెడు తెల్వి - మనకతడు నిడకున్న
మన మనీషులందెల్ల గనగలరు మంచి చెడు
ఘనుని దర్శనము - జనులార

514

మనుజాలు మనీషులై - మనగల్గ జాలుచో
జెనటి కపటి కుహనా - జనులెల్ల బుట్టెదరు
మును కర్మగాక - జనులార

515

శ్రీ రమేశ యుమేశ - శారదాపతి త్రైత
హారముల త్రిగుణములు - జేరి నిలు పరజన్మ
గోరి నిజముక్తి - జనులార

516

ప్రకృతి పూరుష ద్వైత - మొకపూర్ణయోగమ్ము
సుకృతి వరులనిమేసులకు దివ్య సాధనము
సకలంక వృత్తి - జనులార

517

సగుణమ్ము త్రిగుణమై - యగణితో - సాధులను
తెగదిరిగి సుగుణమై - సుగుణ సంపూర్ణుడగు
నిగమ విభుగమను - జనులార

518

ఇది పరమనీషాజ్ఞ - నుదయింప గాలేదు
ఇదిపూర్వ కర్మంపు - గుదిబండ హరికరుణ
తుదిజేరు నుమ్ము - జనులార

519

ఇది యదియు బ్రహ్మయను - ఒది మూర్ఖవాదమ్ము
ఇదియదియు ద్వైతమ్ము - తుదిమొదలు శాశ్వతము
ము[illegible] సతతము - జనులార

520

పరబ్రహ్మసూత్రముల [illegible] భాష్య మిరువది రెంట
గరిమ సంపన్నతా - పరిపూర్తి ముద్రచే
గురుమధ్వుడయ్యె - జనులార

521

భాష్యముల దొల్లిటివి - దూష్యమ్ములందువిమి
భాష్యమిడె శిష్యనికి - పూష్యోదయముచాలె
సౌష్య భాష్యమ్ము - జనులార

522

గురుమధ్వ భాష్యమ్ము - దరుగదే ఖండనము
నరవిందుడును మెచ్చె - ధరను ధీమతులెల్ల
శిరమూపిరయ్య - జనులార

523

గురువు హరిబోధింప - నరుడరయు హృదయమున
వరద్వైత సద్భక్తి - గరిమమ్ము విది కలిసి
వరమంచు గాంత్రు - జనులార

524

తొల్లి భాష్యపు వ్యాఖ్య - లెల్లగల్లలు బల్కి
వెల్లనై వెలివడియె - నల్లమధ్వుని భాష్య
మెల్లెడల విరియ - జనులార

525

వివిధ తత్వములనక - భువినరుల్ బ్రహ్మలన
భువనముల భువనేశు- డవతరించుట లేల
నవని మిథ్యమని - జనులార

526

హితవ్రతులు మతిమెచ్చ - మతజాతులేర్పడియె
ప్రతికూల శ్రుతి హీన - మతమౌఢ్య తతవైర
గతులు గావయ్య - జనులార

527

జ్ఞానహీనులగూడి - కలిమి గూడుట కంటె
జ్ఞానవంతులతోడ - బూనువర్తలు మేలు
జ్ఞానలోక మతము - జనులార

528

చదువు లెఱిగిన వారు - బదిమంది కదిజెప్ప
పదవి నుండెడు వారు - నిధులన్ని సమకూర్ప
నుదయించు సమత - జనులార

529

శతక కారులు నీతి శతకోటి - బల్కెదరు
బ్రతుకు గుంపులలోన - హితమతము లుండవా
మతశూన్యమేల - జనులార

530

ఏనాటివేదముల - నానాప్రబోధములు
మౌనీంద్ర బృందముల - జ్ఞానోపదేశముల
బూని మతమయ్యె - జనులార

531

మనుజ వానరులతో - దనుజాలను గెల్చెహరి
మనుజాలే కోతిమతి - దనుజులై పోవగా
ఘనుడెట్లు బ్రోచు - జనులార

532

దనుజాలను వధియింప - మునుపెన్నిమారులో
జనుల బ్రోచినవాడు - ఘననీల శ్యాముండు
గనుపించు మతుల - జనులార

533

మనతల్లి దండ్రులే - మనకన్న ఘనులన్న
మనుజాండు నిజమరయు - జనని జనకుల మరచు
మనుజా లమరులే - జనులార

534

తలిదండ్రులకుగాక - నిలబుట్టునరుడెట్లు
నిలనయోనిజాడు దా నల - ఘనశ్యాముండు
నిలజీవియగునె - జనులార

535

నరహృదయ పద్మముల - వరబింబ తేజమై
హరియుండ దిలకించు - నరుడు ప్రతిబింబమై
సరిసములె వారు - జనులార

536

హరిగాని హరుగాని - పరదేవతనుగాని
నరజీవులున్ గొలువ - సరియైన దారియది
చిరకాల జగతి - జనులార

537

విజ్ఞాన యంత్రయుగ - ప్రజ్ఞనెరిగిన మాత్ర
ప్రజ్ఞాని కాబోడు - సుజ్ఞాన మరయమిని
యజ్ఞాని నరుడు - జనులార

538

విద్యలరువదినాల్గు - నుద్యమమ్ము గనేర్పు
నధ్యాపకాచార్య - విద్యాశ్రమాల్ నాడు
వేద్యమ్ములయ్యె - జనులార

539

పరిమిత జ్ఞానమ్ము - పరిమితాటోపముల
నరకొరల గరిమ సంబరపు టాచార్యులై
గరిపెద రవిద్య - జనులార

540

ఉదరపోషణకునై - పదిమాటలను నేర్చి
పదిలమ్ము లేనట్టి - మది వంచగాలేక
బెదరి జచ్చెదరు - జనులార

541

ఒక పూట దినకున్న - సుకుమార వదనములు
తికమకల జెందు మది - వికటముగ దాగుందు
నిక వ్రతము లెట్లు - జనులార

542

నరుడల్ప ప్రాణియే - తిరుబ్రహ్మగాలేడు
చరమకాలముదాక - హరిభక్తినుండుటే
గరిమమగు ముక్తి - జనులార

543

మతములను నిందించి - కులములను దెగగోసి
ఫలమేమి షడ్రిపుల నిల గెల్వలేనిచో
గలుగనే సుఖము - జనులార

544

మితభుక్తి మితసూక్తి - మితరతుల జరియించి
ప్రతిచర్య హరిభక్తి - సతతమర్పించెదరు
హిత జీవులిలను - జనులార

545

అతిచేష్ట సకలమ్ము - మతిలేక జరియించి
వితథమార్గము లెల్ల - హితమంచు గర్వింత్రు
మృతప్రాయ జనులు - జనులార

546

స్వాదు స్నిగ్ధపుటశన - మాదరవు హితవచన
మేది చేసిన గాని - శ్రీధరుని కరుణయని
మోదింత్రు బుధులు - జనులార

547

కులమతమ్ముల సారముల సర్వమొక్కటే
కళల శాస్త్రముల జదు - వులమర్మమొక్కటే
శౌరిప్రభుని గనుట - జనులార

548

ఎన్నికులములు వచ్చె - ఎన్నిమతములు హెచ్చె
ఎన్నిచదువులు బలిసె - నెన్ని " యిజములు " వెలసె
వెన్నునిం గనరు - జనులార

549

ఎవరి కులమత హితము - లెవరావు బొందులకు
భువిసమాన సమాజ - మవియొక్కటముద్దయా
వివిధములు గాక - జనులార

550

ఆత్మకల్పకలమన - వాత్మత్యాగముకాదు
ఆత్మలన్నిటి బెద్ద - యాత్మగలువుటకాదు
ఆత్మ విభుగనుట - జనులార

551

మును ప్రవక్తలెల్ల - బునరుక్తులనకుండ
ఘనమంత్రములు జెప్ప - గినిసి పిల్లల వోలె
జెనకెదరు ఖలులు - జనులార

552
శశి వెల్గు గుడిపైపై - బ్రసరింప దాయేమి
దిశదిశల హరికరుణ - నిశిదినము బ్రోవగా
అసహనమదేల - జనులార

553
తొల్లి కర్మఫలమ్ము - కల్లకాదనుభూతి
యుల్లమ్ము నిలుచునే - వెల్లుల్లి వడ గొరికి
కల్లుగ్రోలంగ - జనులార

554
ఒక కార్యమునకు మును - పొకట సంకల్పమ్ము
యొకజన్మ సంకల్ప - మొక త్రికరణపు శుద్ధి
సకలేశు జూపు - జనులార

555
కారణములేక నె - వ్వారుభువి రాబోరు
తీరుచో కర్మఋణ - మూరుచో దృఢభక్తి
జేరెదరు హరిని - జనులార

556
ఎన్నియుగ గర్భముల వెన్నిపితృగర్భముల
ఎన్ని జన్మల భువుల మన్నారమో యెఱుగ
మెన్నటికి జడత - జనులార

557
మనమె కర్తలమంచు - ఘనముగా బల్కుచో
ఘనశ్యాము డతిచోద్య - మనినవ్వు మనమెఱుం
గనిది మునుకర్మ - జనులార

558

పరజన్మ దొరకుటే - పరమ దుర్లభమంద్రు
పరమాత్మ శుభదృష్టి - పరవిముఖ మరయమివి
ధరమందుటగువె - జనులార

559

ముందునకుబోవునది - తొందరగ కాలమ్ము
వందు-దిరుగదు వెన్క - కుందిగిరాగు సతముగో
విందు పదమందు - జనులార

560

దీపమున్నప్పుడే - కాపురము దిద్దవలె
కాపురపు దేహమ్ము- ద్దీపమ్ములో జ్యోతి
జాపు హరి సతము - జనులార

561

జగములుండుట నిజము - జగదీశుడతి నిజము
నిగమమ్ములున్ నిజము - యుగలయలనాటకపు
సొగసెల్ల నిజము - జనులార

562

దివకరుడు ప్రతిదినము - జనియించు మరిగ్రుంకు
షుమడట్లె భువనాల - జనిమృతి స్థితి గతుల
వివరావృతంచు జనులార

563

కొన్నిటికి సమాధాన - మెన్నగాలే మెపుడు
ఇన్నితత్త్వములేల - భిన్నములవెందులకు
వెన్నుడే దెలియు- జనులార

564

నందినందిని జేయు - నంది నందిని జేయు
కొందరల వ్యాఖ్యాన - మందమ్ము గాదయా
సుందరము భక్తి - జనులార

565

జగతిలో బడివచ్చి - జగతి నుండగలేము
జగతిరాకలు పోక లాగి - మనకు వశములే
జగపతికి గాక - జనులార

566

భరతదేశమునందు - సురులు దేవతలెల్ల
విరివి ముప్పదికోట్ల - పరివారముల వారు
పరదైవ మొకడె - జనులార

567 *

హరియన్న హరుడన్న - పరదేవతాంబయన
మరికేశవునినామ - వరమంత్ర జపములై
హరిజేర్చు గాదె - నరులార

568

భిన్నవచనములెల్ల - అన్నమోగిరమట్లు
భిన్నమతములవెల్ల - మన్ననుని ప్రభుజూపు
వన్నిహిత గతుల - జనులార

* " సర్వ దేవ నమస్కారః కేశవంప్రతి గచ్ఛతి "

569

హరిసర్వ శ్రేష్ఠుడని - గురుతించి గుడిగట్టి
పరిశుద్ధతలు లేని - యురములం దరమరల
దురితమ్ము లేల - జనులార

570

కరచరణ శుద్ధమతి - కరుణ సంయమనమ్ము
వరయనిది గుడిజొచ్చు - టరయ సత్కార్యమ్మె
గరిమ యనబడువె - జనులార

571

యమనియమ వ్రతగతుల - శమదమవు క్రమగతుల
తమరిటుల్ తెగదిట్టి - యమగండములంటంచు
సమయింప నగువె - జనులార

572

జనులెల్ల ఘనబుద్ధి - మనధర్మములు దెలియ
మనమాట మనబాట మనము దెగడగ రాదు
మన మనుస్మృతుల - జనులార

573

నాలుగున్ ధర్మములు - నాలుగున్ వర్ణములు
నాలుగున్ వేదములు - నాలుగాశ్రమములును
నాలుగేఫలము - జనులార

574

ఒకడు దాయోచింప - నొకడు సంపాదింప
నొకడు దా రక్షింప - నొకడు దా శ్రమియింప
రకములవి నాల్గు - జనులార

575

ఒక కంబ మదిగూల - సకల భువనము గూలు
ఒకదానికింకొకటి - ప్రకట మిత్రములైన
సుకముండు జగతి - జనులార

576

నాలుగున్ స్తంభముల - నాలుగు రకాలాట
నాలుగున్ కాలాల - నాలుగే విధములను
లీలలై మిగులు - జనులార

577

జగము సుకముండుటే - నిగమ యోగము లెల్ల
నిగమ శాసనములే - ప్రగతి మార్గము జూపు
కుగతు లవిగావు - జనులార

578

నిగమమొక్కరు వ్రాయు - సుగమ కావ్యము కాదు
నాగిపూర్వ పూర్వజాల - ప్రగతి సాధనములే
నిగమమ్ము లగును - జనులార

579

నిగమ మొక మతముచే - దగ సృష్టికాలేదు
నిగమ సాధకులెల్ల - సుగమ యాస్కుని రుక్త
ప్రగతి దర్శకులు - జనులార

580

కులమేదియైన ని- ర్మలపు ఏమతమైన
నిలదైవమొక్కడే - గలపేరులెన్నైన
దెలిపి కొనరయ్య - జనులార

581

వికట బుద్ధులవెన్ని - మఖపుబ్బజనిమ్మృతుల
బ్రకటింప ఫలమేమి - సకలసాధనలలో
సుకమది సుషుప్తి - జనులార

582

జగమొక్కకలయైన - సగమందు నిద్రలో
నాగనిద్ర ననుభూతి - సుగమ వ్యాఖ్యానమగు
నిగమార్థమగును - జనులార

583

కలలోని యనుభూతి - బలుమిథ్యయని తెలుపు
ఛలవాదమే మిథ్య - కలలజూపు విభుండు
కలగాంచ మనము - జనులార

584

కలలోన రసరూప - ములు నట్లె గంధములు
ఫలమిచ్చు సురభూజ - కలితార్థ శబ్దములు
బలికించు విభుడు - జనులార

585

కలలోని యాద్యంత - ముల కలల కవి బ్రహ్మ
కలలోని యాద్యంత - ముల గాంచు కవిపక్షు
లిలజీవులెల్ల - జనులార

586

కలగాంచు హృదయముల - వెలుగొందు విభుబింబ
చెలువమ్ము ప్రతిబింబ - ములరగుచు జీవాళి
తిలకించు చుండు - జనులార

587

శయనింప నింద్రియాల్ - నియమాలు విరమింప
నయబోధ హితరీతి - దయజూపు హరియె తా
శయనించునెడద - జనులార

588

తెలివిగల జీవితా - మెలకువన్ గ్రహియించి
కలగాంచు సుఖమెల్ల - గలిగించు హరిగాంచ
వలెను నిరతమ్ము - జనులార

589

అతని జూచుట ముక్తి - అతని గొల్చుట భక్తి
అతనిదే కర్తృత్వ- మతడు శ్రీ పరమాత్మ
అతడు నరుడగునె - జనులార

590

అతని వైభవ మేడ - అతని శక్తులవేడ
అతని వలె మనమన్న - ధృతియగునె తత్వమసి
కృతక వ్యాఖ్యాల - జనులార

591

ఎన్నినేర్చిననేమి - ఎన్నిగూర్చిననేమి
ఖిన్నులము మనమెంత - ఉన్నతుడు హరిచెంత
చిన్ననలుసంత - జనులార

592

దేహసాధమునందు - దేహిగాడధికారి
శ్రీ హరియె కరుణింప - దేహముక్తి కలుంగు
సోఽహమనరాదు - జనులార

593

దేహమున మెలగుచున్ - దేహిదేవునిబింబ
మాహాత్మ్య ప్రతిబింబ - మాత్రుడైగాంచు దా
సోఽహమను వృత్తి - నరులార

594

మనతిండి మనబట్ట - మనయిల్లు మనదేశ
ఘనత వివిధములైన - మనము భిన్నులమైన
మన - గోశ మొకటి - జనులార

595

భిన్నులయ్యును గూడ - నున్నతుని గాంచు బల్
సన్నుతుల కులజాతి - భిన్నతల నొంచకుడు
మనుజ వర్గముల - జనులార

596

మనుజా భిన్నులరెల్ల - గినిసి కాట్లాడుచో
మనపుత్రపౌత్రాళి - మనకీర్తి నెటుబెంచు
ఘనతలని యెంచి - జనులార

597

మనభరతమాతయే - ఘనవేదమాతరా
ఘనశ్రుతుల సారమే - ఘన - శ్యాము జగతిరా
జననాంతరాల - జనులార

598

జగతి శ్రేయమ్మలే - నిగమ బోధనలురా
సుగుణ సంపూర్ణుండు - జగతి వెలినుండురా
ఖగవాహనుండు - జనులార

599

ఖగమనగ బక్షియగు - ఖగుడనగ సూర్యుడగు
ఖగమనగ బృథ్వియగు - ఖగవాహనుడు విష్ణు
జగ పవిత్రుడగు - జనులార

600

తరణి గ్రహతారకం - మరి జీవ హృదయముం
బరగు నంతర్యామి - హరి జీవములు వేరు
మరి శంకలేల - జనులార

601

మేరుపర్వత పక్షే - ధీర గంభీరాబ్ధి
భూరి కే దార జలం - పూరవాహినులం నలం
రారు. భరతోర్వి - జనులార

602

ఇచట బుట్టుట లెఱిగి - శచిభర్త సేవకులు
శుచి మోక్ష మందుచో - విచికిత్స దుర్మతులు
పచరింతురేల - జనులార

603

భరతదేశము మనది - పరమాత్మ భక్తులము
మరివిశ్వశ్రేయముల - కొరకె జీవింతుమని
యెరుగు జగమెల్ల - జనులార

604

ఈ యుర్విబుట్టుటే - వేయినోముల ఫలము
శ్రేయమగు విశ్వమున - ధ్యేయుడగు శ్రీ విభుడు
జ్ఞేయగమ్యుండు - జనులార

605

అతితెలివి జెడవలదు - రతిసతము హితమంచు
సతతమ్ము సుఖములకు - నితరులను బీడించు
బ్రతుకీడ్వవలదు జనులార

606

వేలాది లోకముల - భూలోక మొకలోక
మాలోకమున మనము - ఏలాటి బ్రహ్మలము
డోలాయమాన - జనులార

607

అందరిది యీనేల - అందరివి సౌఖ్యములు
అందరివి దుఃఖములు - కొందరే ఘనులంద్రు
మందభాగ్యులరు - జనులార

608

ఎవరేమి చెప్పినను - ఎవరేమి చేసినను
ఎవరికిన్ వారలే - రవితనయ తీరమున
శివమెత్త నేల - జనులార

609

మనసులో నొకమాట వినిపింపు మందురా
అనవరతమును మంచి - తనము మార్పసి మందు
ఘనుడు గనిపెట్టు - జనులార

610

సతతమ్ము సత్కర్మ - లతులితపు భక్తితో
ప్రతిఫలము ప్రభుపాద - పద్మముల ముందుంచు
మతులు గావలయు - జనులార

1. కాళింద - యమునా - విరజా

611

నడక నేర్చిన వారు - పడబోరు ధరలోన
నడత యే లేనట్టి - జడుం మేలెంచుటే
పుడమి గనవలయు - జనులార

612

వినదగునని - మె సుమతి - వినరవేమని మెవే
మన కందముల వెలది - పనన తొన ద్రిపదులన్
వినిచె సర్వజ్ఞ - జనులార

613

తొలి భక్తులెల్లరకు - దెలుపగా మార్గములు
కలుషములు గనకుండ - తెలివిగ్రహియింపుడే
ఇలజీవులార - జనులార

614

పుట్టునది గిట్టునను - గుట్టు మీరెఱిగియును
బట్టరే పాదములు - గట్టిగా హరియంచు
బొట్టి వామనుని - జనులార

615

ఎన్నిజన్మలలోన - నెందరు పితరులో
అన్ని జన్మల గూడ - వెన్నంటిబ్రోచు హరి
వెన్నుండుగాదె - జనులార

616

మంచిభక్తులబ్రోచు - కించిత్తు శ్రమలేక
వంచకుల కించనుల - వంచి రక్షింప శి
క్షించు నరహరిగ - జనులార

617

హరు డజాడు వరమివ్వ - పరమ క్రూరత మించు
సురవైరి తండముల - హరిగూల్చు టలవాటు
నిరత యజ్ఞముల - జనులార

618

ఘనుల గోదామీర - లనమయ్య తిమ్మక్క
తనిగొండ వేంకమ్మ - ఘనశ్యాము గాంచరే
జనుల సమదృష్టి - జనులార

619

బసవణ్ణ బసవంతు - దెస "అక్కమాంబలును"
కుశలుడగు సర్వజ్ఞ - నసమాన ద్రిపదులను
పసగాంత్రు జనులు జనులార

620

శర్వులును వైష్ణవులు - సర్వులును సుఖముండ
గర్వరాహిత్యంపు - పర్వనమ సంఘముల
సర్వజగముండు - జనులార

621

నను గన్న తలిదండ్రు - లను లక్ష్మినరసింగ
ఘనుల నాత్రేయజాల - ననయమ్ము గొలిచివే
వినిపింతు మతులు - జనులార

622

రాయలేలిన రమ్య - రతనాల సీమలో
రాయరగు గురురాజ - రాఘవేంద్రులసేవ
వ్రాయగా వేర్తు- జనులార

623

గురువనగ గురురాజా - దొరతిరుమలేశుండు
వరరాఘవేంద్రుండు - వరద వేంకటపతియు
పరమగురులయ్య - జనులార

624

అవని నాపస్తంబ - భువిదివిజు లాత్రేయ
సవనహిత నరసింగు - డు విద లక్ష్మమగర్భ
భవుడ జ్యేష్ఠుండ - జనులార

625

రాయలేలిన సీమ - రాయగురురాజాన కు
పాయనములిడు కోష్టి - రాయగుండూకృష్ణ
రాయపౌత్రుడను - జనులార

626

నరసింగరాననెడు - స్థిరకీర్తి నాతండ్రి
గురు డుపాధ్యాయుండు - గరిమ శిష్యులు గలరు
ధరలోన నేడు - జనులార

627

సన్నెన్ని లఘుకోపి - వెన్నగుండియ దండ్రి
మున్నెరిగి సద్గతిని - వెన్నునిన్ దర్శించె
మిన్నైన భక్తి - జనులార

628

ఎనుబదేడులు మనియె - ఘనముగా నాతల్లి
వినయ సద్గుణశీల - నముజమ్మ లార్యగిరివి
గనె చల్లనమ్మ - జనులార

629

నాదు. జనకుడు గడున్ - వేదముల హృదయమున
స్వాదుగని వరసింగ- డై దగిన భక్తితో
వేదజాని జేరె - జనులార

630 *

నామాంత.జనకుండు - శ్యామావ మల్దారు;
నోమె చిత్రపుదుర్గ - భూమి నను ప్రభవంబు
నామె తొలికాన్పు - జనులార

631

పిత్రుని శిష్యులరెల్ల - నతివినయ శీలులరు
నుతియింతురిప్పటికి - నతని బెత్తపుబోధ
హితుడు నాతండ్రి - జనులార

632

అతడు నాతొలి గురువు - మతుడు బలిజేపల్లి
హితదివాకరుడల్లె - తతరామకృష్ణులరు
గతులిడిరి తెనుగు - జనులార

633

గరిమ గీర్వాణాన - గురులు నారాయణుల్
వరకొప్రనరసింహు- లరు పళ్లెపూర్ణాఖ్య
గురుప్రజ్ఞబోధ - జనులార

634

మాఘమేఘాదులను - బాగుగా రఘువంశ
మాగమపు శ్రుతి సార - యోగ వ్యాకరణమిడు
వాగురులు మునులు - జనులార

* ప్రభవ 1927 భాద్రపద శుద్ధ ప్రతిపత

635

వ్యాకరణ పండితుడు - వాసావ్ఝపముశాస్త్రి
శ్రీ కుప్పైరాగి - చెరుకు కామవధాని
నాకిడిరి శ్రుతులు - జనులార

636

శ్రీ జమ్మలమడకవి - రాజమాధవశర్మ
నోజ తల్లా వ్ఝ- రాజకవి రామ్రాజ
నైజకవి వవిరి - జనులార

337

కరుణ శ్రీ జంధ్యాల - కవివచో మాధురీ
కరుణార్ద్రి తమరోక్తు - లరసి సందర్శించి
మురిసి కవినైతి జనులార

638

భాషాత్రయ సుకవీ ! - ప్రహ్లాద క సుధీంద్ర
భేషంచు దీపాల - పిచ్చయ్య శాస్త్రి. సం
తోషించి మెచ్చె జనులార

639

అప్పజోడ్కవి రాజా - దొప్పెద్రాక్షాపాక
మెప్ప శ్రీ పద్మనా - భప్పముమ్నడిమ్రాసె
గొప్ప వ్యాకర్త - జనులార

640

నాగురుల్ శ్రీరంగ - నాథమాగడి బోధ
మాగినది మద్భక్తి - మధ్వముని మద్వైత
యోగ తత్వముల జమలార

641

పవన మత వ్యాపకులు - భువిటీకవ్యాహాది
భువి దివిజ గురురాజ - కవి రాఘవేంద్రులరు
పువు సేవలిడిరి - జనులార

642

ఒకరు మల ఖేడులో - నొకరు సోపలె యందు
ఒకరు మంత్రాల యపు - సుకృత బృందావనుల
ప్రకట గురులైరి - జనులార

643

హరి సర్వశ్రేష్ఠుండు - మరి జీవ శ్రేష్ఠుండు
గురు మధ్వపవనడుజా - గురి భక్తి గొల్చుచో
హరినెదను జూపు - జనులార

644

గురువు మంత్రాలయపు - వరరాఘవేంద్రుండు
తెలిపిలేకుండగా - వరమిచ్చుచున్నాడు
దురితములు బాపి - జనులార

645

అతని యాజ్ఞనునేము - అతని బోధనలెఱిగి
తత్ద్వైత మార్గంపు - హిత మెరిగి కవనాల
నుతియింతు హరిని - జనులార

646

శ్రీ వేంకటేశుండు నావేల్పు నిలవేల్పు
భావింప గురురాజా - నావిద్యలకు గురువు
"క్యావు" మనునాడె - జనులార

647

పసికందు రోగిష్టి - పుసినన్ను శ్రీ పాద
స్పర్శముగా పేర్మార్చి - వెసబిల్చె "ప్రహ్లాద"
శిశువనుచు దండ్రి - వరులార

648

మరణించు దశమార్చి గురురాఘవేంద్రుండు
కరుణతో నన్ప్రోచె - మరలి ప్రహ్లాదుడని
ధరకు వచ్చితిని - జనులార

649

నాగురువు గురురాజా - శ్రీగురువు పవనజాడు
ఆగురుని గురువు శ్రీ - నాగశయనుడు-గాదె
యోగసద్దృష్టి - జనులార

650

తంత్ర ప్రదీపాఢ్య - మంత్రాలయ గురుండు
మంత్రాక్షతల నిడిని - మంత్రణసుధీంద్ర స్వా
తంత్ర కవి వనియె జనులార

651

మనుజ లోకము లోన - మనుజ సంతతినేడు
జనని జనకుల సేవ - లను దైవముం గనరు
జనుల దిరుగుచును - జనులార

652

జనని జనకులుగూడ - మును నవ్యభావకులె
తను గన్న తరమునకు - దన సంతతికిజూడ
పెనుభేదముండు - జనులార

653

తరతరాల జనాళి - పరధర్మముల మెచ్చి
పరిపాటి మునురోసి - మరల తమరాతరవు
మరుగునం బడరె - జనులార

654

హరివాయు గురుపూజ - సిరిరమణు దరిసెనము
నరయ బ్రహ్లాదుడై - వరసుధీంద్రులు మెచ్చ
గురిసె నా కవిత - జనులార

655

భవపు బ్రహ్లాదుడను - కవిసుధీంద్రుడనైతి
కవులెల్ల నను బిల్చి - సవినయంచు శిరసూపి
కవివి సుమ్మనిరి - జనులార

656

శ్రీశ తత్వామృతము - శ్రీ సుప్రభాతముల్
శ్రీశ రామశ్యామ - శ్రీచరిత అమరోక్తి
వ్రాసితిని భక్తి - జనులార

657

సకల క్షేత్రేశుల ప్రకటాళు శ్లోకముల
సుకృతి నర్పింతిని - త్రికపాదవిక్రముని
నికట చరణాల - జనులార

658

హనుమ సత్యాగ్రహము నముల పలనాటి కథ
ఘనవీరబ్రహ్మేంద్ర - వినుత నాటక కృతుల
వనికల లసించె - జనులార

659

వెంకన్న పీసముల - బింక వ్యాజస్తుతుల
వెంకన్న త్రిపదము ల - లంకరించి తి ద్రిపద
శంకలేకుండ - జనులార

660

ఇదితరణి శశితార - పదితరాల తరాల
మధురోక్తి సుధలూరి - ముదమిచ్చు జనకోటి
హృదయాల మీటి - జనులార

661

రవిశశాంకులదాక - భువులుండు నందాక
కవిత లమ్మదీయాలు - భువనేశు నుతుల గే
శవు దరిన్ జేర్చు - జనులార

662

కలమున దీయ దేనియలు - గాలువలై ప్రవహింపగా సుకో
మల కలకంఠ గీతికల - మాధురులు ప్పతిలం ద్రవింప ను
జ్వలగతి విశ్వశ్రేయగతి - శాంతి ప్రదాయకవాచకమ్ములై
నిలిచెడు దేవ నా కృతులు - నిత్యసుమాలు తవాంఘ్రి సేవలన్

663

శ్రీ పద్మేశాంఘ్రి ద్వంద్వార్ద్రో
త్ఫుల్లం కావ్యోద్గీతం శ్రుత్వా
ఆచంద్రార్కం - ఆశీర్భాగ్యాన్
దేయాత్ శ్రీశః శ్రేయోహాయాన్

664

శ్రీ శ్రీనివాస పదపంకజ మంగళ శ్రీః
శ్రీ బహ్మ మారుతి పదాంబుజ భారతీ శ్రీః
ఈశాన గౌరి దివిజేంద్ర పరంపరా శ్రీః
దేయాత్ శుభాన్ సత మనంత నితాంత భక్తిమ్

ఇతి
శ్రీ శ్రీశ తత్వామృత నామ కావ్యే
తృతీయాశ్వాసం
సంపన్నమ్

## శ్రీశ తత్వామృతమంథనం నామ కావ్యే చతుర్థాశ్వాసము

## మంత్రాలయ శ్రీ మద్రాఘవేంద్ర స్వాముల దండకము

1

ఓమంత్రాలయవాస, యోపరమ - హంసోత్తంసయోకల్పకా
యో మందారజనావనా గురువరా - యోరాఘవేంద్రప్రభూ
యే మాలిన్యము లేని చిత్తజనిత - మీ్మదండకమ్మే్మ సదా
నీమూర్ధిమ్మున తారహారముగ స-ంధింతున్ బ్రపంచింపరా

2

కూర్మి శ్రీరాము పదములు - గొల్చు నుడుత
యెంగిలి ఫలమ్ములర్పించు - వెర్రిశబరి
గంధలేపమ్ము మైబూయు - గన్నె కుబ్జ
పరమ భాగవతోత్తంసు - లరయగాదె.

3

భక్తియేగాని ముఖ్యమే - శక్తివెన్న
గానమన్మనః కుసుమిత - కల్పమిదియె
గొమ్ము గైకొమ్ము దండక - మిమ్ము సేవ
రాజిత సుయశః సాంద్ర శ్రీ - రాఘవేంద్ర

4

దండకము : శ్రీరాఘవేంద్రా సుధీంద్రాఖ్యమౌ నీంద్ర
చంద్రాంకు రాధీర వాగ్దీర కల్పద్రు - మాకార సద్భక్త
మందార,ప్రహ్లాద సత్శంకు కర్ణాఖ్య శ్రీవ్యాసతీర్థేతి ధాత్రీసు - రాద్యావతారా,
నృసింహాఖ్య హరిన్ విష్ణునిన్ సేవించి కృతయుగమ్మందు
సందేహ మందేహులైనట్టి దైత్యాళి కత్యంత శ్రేయమ్ము
సన్ముక్తి మార్గమ్ము, నారాయణుం గొల్పుతత్వోపదేశమ్ము

బోధించు ప్రహ్లాద భూమీధవా హేమ గర్భాఖ్య
పుత్రుండవైవెండి యాద్యాపరమ్మందు శ్రీద్వైత విద్యేమలన్
జేర్చి చెండాడి జృంభించి శ్రీకృష్ణసంతుష్టుగా గొల్చు
బాహ్లీక భూపుండవై, కలియుగమ్మందు శ్రీవ్యాస
తీర్థుండవైద్వైత పక్షాన రాద్ధాంత సిద్ధాంత
తర్కాలలో గెల్చి, శ్రీద్వైత వేదాంత తత్వార్థ
ముల్విల్చి,సద్బుద్ధి యోజించి గ్రంథాలు, గ్రంథాలు
తర్కాలు కావ్యాలు, వేదాంత భాష్యాలు వాఖ్యాన
మన్నింట ముత్యాలు రత్నాలు గుప్పించి పెంపెక్కి
శ్రీ మధ్వశాఖోప శాఖమ్ములంబెంచి తుదకున్
శ్రీమన్మహా సర్వ సర్వంసహాచక్ర చక్రమ్ములం జంబు
ద్వీపమ్ము గావెల్గు భరత ఖండమ్ములో నందు
నుత్తుంగ శృంగోప శృంగప్రదేశాంత
సంజాత సంజాత నీలేందుకాంతోపలారమ్య
రమ్యప్రదేశాలలో వక్ర వక్రమ్ము గాబాఱి కర్ణాట
మారాష్ట్ర సౌరాష్ట్ర భూభాగ ముల్మెట్టి యాంధ్రావనిన్
సంగమేశ్వరంబ న్న ప్రాంతమ్ములో బారు
శ్రీ కృష్ణ కృష్ణాంబులన్ సంగమంబౌచు కర్ణాట
మాలక్ష్మి కిన్మేఖలం బైన నుత్తుంగ రంగత్తరంగి ణీ
తుంగ భద్రానదీ తీరతీరాలలో కెల్ల మేలైన
దైయొప్పు నానావిధానూన వృక్షమ్ములందీగె
లల్లాలి బిల్లాలి గానల్లి కొన్నట్టి బదరికాశ్వత్థ
తక్కోల హింతాల తాలాది వృక్షాల శాఖోప
శాఖమ్ములన్మల్లికాపుష్ప సాదృశ్య పుష్పాళి సౌరభ్య

మల్లిమ్ము గంధస్సుగంధమ్ము తో మంద మందాని
లానామ గంధవాహమ్ములన్వేల్చి డెందమ్ము లానంద
సందోహడోలాయ మానమ్ముగా జేయు
తండమ్ము కేకిశుకాద్యాళి శాకుంత సంతాన
సౌహార్ద సంతృప్త సంగీత సంపూత వన్యప్ర
దేశమ్ము - నన్ యొప్పు మంత్రాలయంబన్న మంచాలె
యంచన్న ఆదోని ప్రాంతమ్ములోనుండు గ్రామమ్ము
మిమ్ము సేవింప నేతెంచు వేలక్షభక్తాళి కిన్
జాల నిష్టార్థము ల్గూర్చు శ్రీ రాఘవేంద్రావతారుండ వై
లీల నారాయణున్ ముక్తి కాంతామణీసంగ
ప్రేరేపణున్ గమలినీ షండ గండాంతరావిర్భ
వాంభోజ గర్భాఖ్యసత్పుత్రకాద్యుక్తవేద వేదాంత
తత్వార్థపారాయణున్ సిద్ధసాధ్యోరగా ద్యక్ష
గంధర్వ బృందారకాధ్యక్ష వక్షప్రదేశాంత
సంచారణున్ విష్ణు జిష్ణు స్పృహిష్ణున్ భక్తి సేవించి
భక్తాళి కత్యంత యుక్తమ్ము నిత్యమ్ము ముక్తిన్
బ్రసాదించు మార్గమ్ము శ్రీ వేదవ్యాసరాణ్మౌని
సంస్థాపితార్థమ్ము శ్రీ మధ్వ సిద్ధాంత సూత్రమ్ము
శ్రీటీక రాట్సుధా వ్యాఖ్యమ్ము శ్రీ వ్యాస చంద్రికా
వ్యాఖ్యాన పీయూష పాత్రమ్ము పరిమళాఖ్యాన
వ్యాఖ్యాపవిత్రమ్ము షడ్వర్గశత్రునిర్మూలనా
సూత్ర స్తోత్రమ్ము పాపా లతా లవిత్రమ్ము గోపాల
ఛత్రమ్ము కంజాతపత్రమ్ము శ్రీముక్తి కాంతామణీ
సంగమున్ లీల నందించు భూకల్ప వృక్షమ్ము
తోబోలు శ్రీ మధ్వ వృక్షమ్ము నంజిన్ని జిన్నారి

పుష్పాలు గైపేపి కాశిరామేశ్వరమ్మాదిగాగల్గి
మేదినీ భాగమందెల్ల నీద్వైతసిద్ధాంత ప్రాత
రుత్ఫుల్ల మందార మందానిలమ్ముల్ బ్రసారించి
పేరెన్ని కెక్కంగ ఏడూన్నరు వర్షాలు శ్రీమధ్వ
మతమున్ వ్యాప్తమ్ము గా జేయు నీ శక్తి సామర్థ్య
సత్యమ్ము నీభక్తి తాత్పర్య తత్వమ్ము నీయుక్తి
లీలోపదేశమ్ము నీముక్తి సంధాన సూత్రమ్ము
గీర్తింపగానేమొ యాయాది శేషుండు వేలాది
జిహ్వాగ్రము ల్దాల్చె త్వత్కీర్తి వ్యాప్తద్యుతుల్ గాంచ
గానేమొ దేవేంద్రుడే వేయినేత్రమ్ము లందాల్చె
వేలొండు దుగ్ధాబ్దియే యంచు నాశ్చర్యముంజూపి
నీవైన పాండుద్యశోవ్యాప్త డిండీరముల్
జూపి సంభోజనాభుండె శ్రీదేవితో జెప్ప
పల్లాపముల్పల్ప సన్నంగనున్నట్టి మాట్లబోంట్ల
కేమౌను జాటు వాచాటతల్జూపుటేగాక
మన్నింపు మోస్వామి యోదేవదేవాకారుణ్య
సంభావ భావాబ్ధికే నావ యానావకే నీవు
జుక్కానిగావా సుధీంద్రాఖ్య మౌనీంద్ర పీఠాంకు
రాధీర నీపాదద్వంద్వమ్ము పై రజో లేశలభ్యమ్మె
మామౌళి దాల్పంబవిత్రమ్ము నీనామసంకీర్త
నమ్మొక్కటే మాకు సంగీతశాస్త్రమ్ము నీరూపు
రూపించి నిన్నేభజింపగ మాకండ్ల కానంద
బాష్పాభిషేకమ్ము నీసేవజేసేత, హృత్కంజ
కంజాత పుష్పాంజలిన్ మ్రొక్కి మ్రొక్కంగ
మాకొంగుబంగారు పుంజమ్ము నీయర్ఘ్య

పాదోద కా ప్రోక్ష్యమే మాకు శ్లేష్మకఫః పిత్త
నానావిధానేకరోగాలకున్ రక్షకవచమ్ము
నీనామమాత్రమ్మె దుష్టగ్రహాఘోర
వ్యాఘ్రాహి భల్లూకముల్లోవలంఘింపలేనట్టి
ఛత్రాతి వప్రమ్ము నీస్తోత్రమే మాకు సంసార
క్లేశమ్ము ద్రోద్రోచు మార్గమ్ము త్రైకాలము ల్విష్ణ
శ్రీ యప్పణాచార్య వాగ్ధారచేస్తోత్ర
రూపమ్ములో నొప్పు శ్రీ రాఘవేంద్రస్తోత్రమ్ము
తోబాటు నీభక్త కోటాను కోటిలో నొక్క
రేణ్వంశమాత్రుండ సాహిత్య భూయిష్ఠమౌ
లోకమ్ములో గుప్తనామమౌ సూధీంద్రు
డన్పేర రాజించు ప్రహ్లాదు డన్వానిచే వ్రాయ
గానైన శ్రీ రాఘవేంద్రోరు దండకమ్మున్
దెల్గుప్రసూనమిద్దాని నాంధ్రోర్విలో నుండు
సద్భక్తులౌవారు నిన్గూర్చి కీర్తింపగా గల్గుదానిన్
వర్లింప దోషమ్ముద్వేషమ్ము క్లేశమ్ముదారిద్ర్య
ముల్పీడ - లన్ బాపిసర్వేప్సితామ్మాయు రారోగ్యభాగ్యమ్ము
లబ్బంగ నిక్కమ్ము శ్రీమద్ధయగ్రీవ దేవుండె
తాసాక్షి గానుండు నంచీవు నీశిష్యుడైనట్టి
శ్రీఅప్పణాచార్య మౌనీంద్రుకున్ దర్శనమ్మిచ్చి
బ్రోవంగలేదే శ్రీ ముఖ్యప్రాణాంతరంగమ్ము
లోనుండు శ్రీవిష్ణుసత్సన్నిధిన్జేర్పునీవేర్పు
లోకాలు జూడంగలేదే గావనీమూర్తి దర్శింతు
నీకీర్తి గీర్తింతు నీపాదముల్సేవలె వ్వేళలంజేతు

నిన్నేభజింతున్ శ్రీ రాఘవేంద్రాయతీంద్రా
మంత్రాలయేంద్రా సుధీంద్రాబ్ధిచంద్రా
నమస్తే నమస్తే నమస్తే నమోన్నమ ॥

పదపడిదివ్యయోగమున - భక్తజనాళి త్రికాలమందు స
మ్మదమున నీదుదండకము దూనికతో పఠియింతురేని,యా
పదలను లేమి గీములను - బాపి తిరమ్ముగ నభ్రవీధిలో
సదనము గట్టి కొందురు ని - జమ్ముగనిజమ్మని గేశవుండు బల్
బదిలముగా నృసింహుడయి - బల్కొగదయ్య సుధీంద్రనందనా

కీర్తన ( మోహన)

ప॥ శ్రీమంత్రాలయ - స్వాముల మహిమను
ఏమని బొగడుదు నో మనసా

అను॥ బృందావనమున - వందితజనమన
మందారుడు మనరాఘవేంద్రగురు ॥ శ్రీ ॥

1) స్థితిసత్యమ్మున - శంకుకర్ణుడై ! కృతయుగమందున ప్రహ్లాదుండై
యతియై సొసలె వ్యాసతీర్థుడై సతతము శ్రీహరి సద్భక్తుండగు ॥ శ్రీ ॥

2) యద్వాన్నమగునా - యాసురీ స్థితి ప్రధ్వస్తబరాస్తముగాగా
మధ్వాచార్యుల పీఠపరంపర సద్విధిప్రహ్లాదవరదుని గొల్చెదు ॥ శ్రీ ॥

3) హరిసర్వోత్తమ వాయుజీవోత్తమ సిరిభూచేవాణీ గరుడఫణీంద్రుల
బరగరుద్రాదుల సంగతులెరిగిన - బరమాత్ముడు ప్రహ్లాదవరదుడను ॥ శ్రీ ॥

ఇతి

## శ్రీ శ్రీశ తత్వామృత మంథనం నామకావ్యే
## చతుర్థాశ్వాసం
## సంపన్నమ్

( * రచనా కాలము 1944 స్వామి ఆరాధన నంద్యాల )

# శ్రీ శ్రీశతత్వామృత మంథనం
# పంచమాశ్వాసం
# సకల తత్వ దేవతా స్తుతి కృతిమంజరి

1

## శ్రీ విఘ్నేశస్తుతికృతి

నాట - ఆది

ప॥ శ్రీ విఘ్నేశం - శిరసానమామి
యావద్భువనుత మనిశంభజామి ॥ శ్రీ ॥

అ-ప ॥ నమిత సురాసుర-ప్రమథ గణేశం
ఉమామహేశ్వర - ప్రముదితహాసం ॥ శ్రీ ॥

చ ॥ 1. గజముఖ సుందర - కుందైకరదనం
గజ శూర్ప కర్ణం - ఘనలంబోదరం
సుజని, సువిద్యా - శుభఫల దాయకం
విజయ వినాయకం - విఘ్ననివారకం ॥ శ్రీ ॥

2. మూలాధార - క్షేత్ర సంస్థితం
లీలాగురుగుహ - బింబతోషితం
పాలిత తురీయ భావప్రకాశితం
మూలరామహిత - సుధీంద్రసుతనుతం ॥ శ్రీ ॥

2

# శ్రీ విష్ణుస్తుతికృతి

కేదారగౌళ - రూపక

ప॥ భావయామి సంభావ యామి
దేవ దేవ రమేశ విష్ణుం ॥ భా ॥

అ॥ప॥ భావజారి విధాత వాసవ
దేవ మునినుత - పావనాంఘ్రిం ॥ భా ॥

చ - 1 క్షీరసాగర - శేషశయనం
వారిజాక్షం - పద్మనాభం
క్షీర సాగర - కన్యకా పరి
చారితాంఘ్రి - సరోజయుగ్మం ॥ భా ॥

2 మరుద్విధి - ద్విజ - యురగ రుద్ర
సురప, వైశ్రవణ శమన
వరుణ రవిశశి, మదన పావక
గురుమునీంద్ర సుతార్చితం - తం ॥ భా ॥

3

# శ్రీ లక్ష్మీస్తుతికృతి

శ్రీ - రూపక

ప । నమామి ముహుర్ముహుర్నమామి
సుమాత్ర జననీం హరిణీం ।న।

అ-ప। నమామి - ఉమా - రమావాణీ
త్రిమాతరాద్యామాద్రాం ।న।

చ-1. విమల విశ్వ విధి విధాయిని
శమన సృజన లయావర్తిని
సమయశాసని యశోజ్వాలిని
అమృతహిరణ్యయీ రూపిణి ।న।

2. అష్టైశ్వర - వృష్టి వర్షిణి
సృష్టి రిష్టా - భీష్టదాయిని
జ్యేష్ఠ నష్టారిష్ట వారిణి
శిష్ట సుధీంద్రజ సుతాంఘ్రిం ।న।

## 4

# హనుమత్స్తుతి కృతి

తోడి - త్రిపుట

ప ॥ ప్రాంజలిం నమ - ఆంజనేయం
అంజనాసుత - మనిల తనయం ॥ ప్రాం ॥

అ-ప॥ భంజకం రిపు ప్రాణనిచయం
రంజకం శ్రీరామపదద్వయం ॥ ప్రాం ॥

చ॥ ఖేచరద్రవి - గృహ్యమాణం
వీచికోదధి - లంఘ్యమాణం
వాచకైర్నవ - వాక్ర్యమాణం
ప్రాచరీకృత - తోడితానం ॥ ప్రాం ॥

2. పవన చాలిత - భువన ప్రాణం
భవసుమమ్నా - భాసమానం
పవిత్ర భక్తి పథప్రమాణం
భువి సుధీంద్ర సుతార్చ్యమాణం ॥ ప్రాం ॥

5

## శివస్తుతికృతి

సారంగ - ఆది

ప॥ వందేశంభుం - పార్వతిరమణం
వందేయువశశి - పావకనయనం ॥ వం ॥

అ-ప॥ ఫాలలోచనం - వ్యాళభూషణం
నీలకంధరం - చంద్ర శేఖరం ॥ వం ॥

చ॥ 1 హిమాద్రిగేహం - ఉమార్ధదేహం
రమేశ స్నేహం - సుమాస్త్ర దాహం
క్షమాస్వభావం - కృపాప్రభావం
ప్రమథ రుద్రగణ - ప్రముఖాది దైవం ॥ వం ॥

2 త్రినేత్ర ధారిం - త్రిశూలపాణిం
పినాక ధనుషం - శశాంకచూడం
అనద్యావహ వాహ భసిత దేహం
మునిసుధీంద్రనుత - వినుతం. శివం ॥ వం ॥

6

హిందోళ - ఆది

ప॥ సాంబసదాశివ - తాండవసమయే
రమ్యహిమాద్రివి - తర్దికువలయే ॥ సాం ॥

అ॥ వినదతి ఢమరూ - నవపంచవారం
వర్ణసముచ్చయ వాక్ర్శుతిపారం ॥ సాం ॥

చ ॥ గిరిగుహపామూ పరితా జలజల
తరుశాఖాపిక - గీతీ కలకల
నందిసుమర్దళ - భృంగి కాహళ
తుంబురునారద - వీణానిస్వని ॥ సాం ॥

2. వృషభో భజతి - రింఖైస్తాళం
ఫణినాఖేలతి - కాలవ్యాళః
ప్రమదాగానై - ప్రమథాన్నృత్యైః
నమంతి భ్రమరీ - భృంగాభరణం

3 సురగంగా శ్రిత - సుజటాజూటే
శశిరేఖాంకిత - చూడాముకురే
స్మరసంహారక - గిరిజాలింగనె
సుధీంద్ర సుతకృత - శ్రుతివ్యాఖ్యానే ॥ సాం ॥

## దేవీస్తుతికృతి

7 భైరవి - రూపక

ప॥ పరిపాలయ - పరిపాలయ
పరిపాలయ - మాంభైరవి ॥ ప ॥

అ-ప॥ పురత్రితయ భంజని పురాణి
వరదే నిగమ నిజ స్వరూపిణి । ప ।

చ॥ 1. మధుకైటభ మదప్రహారిణి
మదితమహిషా సురవిదారిణి
క్రుధితశుంభనిశుంభనాశని
విదిత వేదను - ధాబ్ధివాసిని । ప ।

2. కమలనాభస హెూదరీ మణి
కమలజాండ క్రమోద్ధారిణి
అమితతైజసు - ముక్తి దాయిని
సుమతి సుధీంద్ర - సుతసు పోషిణి । ప ।

## శ్రీ రామస్తుతి కృతి

8 ఆరభి - ఆది

ప॥ రామంనమ శ్రీ రామం - రఘు
రామం జగదభి - రామం - సీతా । రామం ।

అ.ప॥ హేమాంగిని భూమి సుతావామం
ప్రేమాంజలి నత - హనుమం శ్యామం । రామం ।

చ 1. పురతోలక్ష్మణ - భరతశత్రుఘ్నం
సురనరవానర - గురుయుతవిజ్ఞం
వరసింహాసన - సతీసమగ్రం
కరుణాలోకన - కార్యనిమగ్నం । రామం ।

2. దనుజవిరామం - ధైర్యలలామం
ఇనకుల సోమం - మునిమనధామం
జనమనరంజక - రాజ్యారామం
మునిసుధీంద్రసుత - వినుతసునామం । రామం ।

## శ్రీ కృష్ణస్తుతి కృతి

9 మోహన - ఆది

ప॥ మురళీమోహన - మోహనకృష్ణా
కురుమయి కరుణా - దరణం కృష్ణా । ము ।

అ-ప॥ దురితభవార్ణవ - దుస్తరజలమయ
తరణోపాయం - దేహి - కృష్ణా । ము ।

చ॥ 1. యదిజగతీ ఖలు - ముదితారాధా
హృదయాబ్జే రమ - యదుపురుషోత్తమ
సదయనివేదిత - దధి నవ నీతే
మృదితాధరమధు - మధురం త్వంపిబ. । ము ।

2. యమునా కూలే - సుమితోద్యానే
రమరమరమణీ - రమణీమధ్యే
విమల అప్రాకృత - రాసవిన్యాసే
సుమతి సుధీంద్రజ - సూత్రార్థేరమ ‖ ము ‖

## శ్రీ కృష్ణస్తుతి కృతి

10 శంకరాభరణం - ఆది

ప ‖ యదిసంగీతం - నహిజానామి
హృదయోద్గీతం - కింనకరోమి ‖ య ‖

అ- ప ‖ మధుమయ మురళీ - మృదువాదనచణ
సుదతీమోహన - యదుకులకృష్ణ ‖ య ‖

చ ‖ 1. చతురిత రిషభమంతర్గాంధారం
శ్రుతిశుద్ధమధ్యమ - హితసుపంచమం
చతుర సుధైవత - తతకాకలీ ధ్వని
ప్రతిపద హిత శ్రుతి - ప్రపూర్ణతానం ‖ య ‖

2. హితసంవాదే మితసంచారం
చతురాలాపన ప్రతివాది స్వరం
అతిశారస్థిత తురీయజ్ఞానం
యతిసుధీంద్రనుత - కృతిసంగీతం ‖ య ‖

# శ్రీ కృష్ణస్తుతి కృతి

తోడి - ఆది

ప॥ అనుసరకృష్ణం - మనసా
అనుదినమనిశం - దహరాకాశే ॥ అ ॥

అను॥ వినుతవశీకృత - త్రిపుటివికాసే
ఘన శ్యామంనమ - హృదయనివాసే ॥ అ ॥

చ॥ 1. జనిజనిమరణే - పునరాగమనే
జననీజఠరే - శయనావేదనె
భణిత త్రయైషణ - భవసంచారణ
ఘనవిపినే .. గహనే మాచర ॥ అ ॥

2. పరమదయాళుం - భవోత్తారిణం
కరుణాపార కృపార్ద్రలోచనం
నరనారీజన - సురభూజం హరిం
గురుసుధీంద్రసుత - కృతి సద్భూషణం ॥ అ ॥

## శ్రీ కృష్ణస్తుతి కృతి

12 దేశి - ఆది

ప॥ రమయసికిం - తిసారసంసారే
నమకోమలపద - కృష్ణమురారే ॥ ర ॥

అ ప కుమతి కుమార్గే - కృపణోమాభవ
సుమరాళోభవ - సుమనసయానే ॥ ర ॥

చ 1. క్షేత్రహేమమణి - సాధను పంక్తి
పుత్రకళత్రసుమిత్రప్రసక్తి
తవాంత్యకాలే - నాఽను గమంతీ
నాఽను గమంతీ - నాఽను గమంతీ ॥ ర ॥

2. గీతామృతోక్తి - కేశవ సంస్తుతి
పూత సు ధీంద్రను - పుత్ర సుసూక్తి
తవాంత్యకాలే - పరిరక్షంతీ
పరిరక్షంతీ - పరిరక్షంతీ ॥ ర ॥

# శ్రీ మాధవ స్తుతికృతి

13 భూప్

ప॥ రేమానస రేమానస - కామాళింత్యజ కుగతిం
వామాంకిత శ్రీమాధవ - నామాళింభజసతతం ।రే।

అ॥ప॥ మరణాంతక స్మరసంగతి , చరితాఘంత్యజత్వరయా
నరకాంతక చక్రాంకిత - చరణాబ్జంనమకృపయా ।రే।

చ 1. యదుమాధవ, పదపల్లవ , మృదుయుగళంధర శిరసా
మధుసూదన, వచనామృత - మధుపానం కురు మనసా ।రే।

2. పునారావృతి , జనినిర్గమ - నిశిమార్గం త్యజ చిరసా
ఘవయోగి సుధీంద్రనుత వినుతం భజ - శుచివచసా ।రే।

# శ్రీ హరిస్తుతికృతి

14 భైరవి - ఆది

ప॥ శ్రుణు హరిపూజావిధానమిదం
భణితమతిసులభభక్తి ప్రణీతం ।శ్రు।

అ॥ ప॥ అశక్త రుజార్తి తార్ప కానాం
సుసూత్ర పథమిద - మధఃపతానాం ।శ్రు।

చ 1. రమేశో హృది స్థితబింబమూర్తిః
సమీరో భృత్యః స్వజనాః ప్రాణాః
సమస్త సుకర్మ - సుభాషణాని
సుమార్చనాని హరికీర్తనాని ॥ శ్రు ॥

2. యజనం విషయోపభోగరచనం
నిజపదాటనం హరిప్రదక్షిణం
సుజన భాషణం - శ్రుతిస్మృతిపురాణం
నిజజీవనం ఖలు ధర్మ సాధనం ॥ శ్రు ॥

3. స్వగ్రామోదివిః స్వదేవో హరిః
స్వగేహంసౌధం - స్వతనురాలయం
సుగుణాశయాః సతిసుతాదయా
సుగురుసుధీంద్ర సుతవిధమిదానీ ॥ శ్రు ॥

## హరిభక్తిసంస్తుతీకృతి

15 కదనకుతూహలం

ప॥ ధిగస్తు ధీజాడ్య మదోన్మత్తానాం
ప్రగల్భ పాండిత్య - పటాటోపకానాం ॥ ధి ॥

అ-వ బధిరాంధమూకఖంజాత్మకానాం
విధిప్రోక్తనైజ స్థితి దూషకాణాం ॥ ధి ॥

చ 1. స్థగిత ద్వైతాద్వైత - సంశయాత్మకానాం
నిగమవనాటనాకుతర్క గర్వితానాం
సగుణతారతమ్య సమ్యక్జ్ఞాన హీన
మృగతృష్ణోపమిత - మీమాంసకానాం ।ధి।

2. హృదయాంతరంగే సతతంచరిష్ణుం
సదానందపూర్ణం - జగదీశవిష్ణుం
సుధాబ్ధిమధ్యే - నితరాంశయానం
కదాఽపి దృష్టుంనహిశక్నువానాం ।ధి।

3. స్వరగమకగతిహీన - వృథాచర్వణానాం
వరభావశ్రుతిరాగ - లయలోపకానాం
హరిచరణయుగభక్తి - హీనాత్మకానాం
గురుసుధీంద్రసుతనుత - హరిదూషకాణాం ।ధి।

## శ్రీ విష్ణుస్తుతికృతి

16 చారుకేశి

ప। నానాఘపంకే - నితరాంస్థితంమాం
దీనంప్రపన్నం - పరిపాహివిష్ణో ।నా।

అ। ప। ఏనంక్షమస్వ - తవార్ద్రదృష్ట్యా
జ్ఞానంసుభక్తిం - ముక్తింప్రదత్వా ।నా।

చ 1. వేదాంతమీమాంస సుతర్కన్యాయే
స్యాదీవ అష్టాంగ - సుయోగమార్గే
నాదఃశ్రుతిస్తాళ సు రాగ యోగే
వేదోత్పలం ద్వైతపథంనజానే ॥ నా ॥

2. ఆనందతీర్థోక్త - సుభక్తిమార్గే
జ్ఞానప్రమాణీకృతతారతమ్యే
ధ్యానప్రభాబింబ స్వరూపినంత్వాం
కేనాప్యుపాయేగ్రహితుంనజానే ॥ నా ॥

3. శ్రీ మద్రమే శార్ద్రకృపాకటాక్షే
శ్రీమారుతీదివ్య సుపక్వభక్త్యా
శ్రీ మత్సుధీంద్ర సుతప్రోక్త వ్యాఖ్యాత్
శ్రీమధ్వశాస్త్రా ర్థ సు ఫలం నజానే ॥ నా ॥

## శ్రీ కృష్ణస్తుతికృతి

17 సింధుబైరవి

ప ॥ నహిసహ్యామితవపదవిరహం
నహిముంచామి - తవపదస్మరణం ॥ న ॥

అ॥ ప॥ క్షణమపియుగమివ - గమయతికృష్ణా
కణమపి ఘనమివ - ఘటయతి కృష్ణా ॥ నా ॥

చ॥ 1. యదిత్వంసరసీ - జలచరమహమివ
యదిత్వంకులగిరి- తృణకణమహమివ
యదిత్వంసుతరుః విహంగ మమహమివ
యదిత్వం సూత్రః మణిగణమహమివ ।న।

2. వాగర్థావివ - సుమసుగంధమివ
రాగభావమివ - ప్రకృతిపురుషమివ
యోగభక్తిరివ - ముక్తి జ్ఞానమివ
యోగిసుధీంద్రజ - పక్వభక్తి రివ ।న।

## శ్రీ కేశవస్తుతికృతి

18 యమన్ కల్యాణి

ప॥ ఈశావాస్యమిదం సర్వం - శ్రీ
కేశవ విష్ణ్వా - వాసమ్మఖిలం ।ఈ।

అ॥ ప॥ సత్యజ్ఞానా నంతో విష్ణుః
తేనప్రశస్తం విశ్వం సమస్తం ।ఈ।

చ॥ 1. అణరోరణీయాన్ - మహతోమహీయాన్
అనాదిమధ్యాంత మనంత కాలాత్
సునిర్వచనీయో - అనుభవ వేద్యో
అనవద్యో రచింత్యస్య - అద్భుతావాసం ।ఈ।

2. తేనత్యక్తేనభుంజీథామితి
కేనత్యక్తా నక్రియతే కించనారే
తేనసృష్టి స్థితిలయకార
తేనసుధీంద్రనుతనుతమోహనన్య | ఈ |

## శ్రీ మన్నారాయణస్తుతికృతి

బృందావనసారంగ

19 (ఆపస్తత్వము)

ప॥ హరిఓం - నారాయణ
సత్యజలధి శయనా | హ |

అ॥ సరిదనంత మధురవారి
శీతసేవనా | హ |

చ॥ 1.జలధిసదన జలధి శయన, జలప రాయణా
జలజనయన, జలదవచన, భువనకారణా | హ |

2. ఆపగమన, తాపశమన జీవ జీవనా
ఫలప్రపోష అమృతవర్ష ఘనఘనాఘనా | హ |

3. జలదలతిక, తతప్సృతాచి, పవిప్రతారణా
విలయహేల, ప్రళయకాల - లయప్రకర్షణా | హ |

4. కలిత కల్పసుతసుధీంద్ర నుతిప్రపోషణా
దళసుమార్గపథసుభక్తి ద్వైతభావనా ॥ హ ॥

20

## తేజోతత్వస్తుతి

తేజోతత్వము
దీపక

ప॥ దాహప్రతాపా - తేజస్వరూపా
పాహప్రభో హే - స్వాహావిభో ॥ దా ॥

అ॥ ప॥ అంగారవర్ణా - మేషారూఢా
చత్వారిశృంగా - సప్తజిహ్వ ॥ దా ॥

చ॥ 1. జాతవేదా - దక్షిణాగ్ని
త్రేతస్వరూపా - ఆహవనీయ
వీతిహోత్రా - గార్హపత్యా
ప్రాతర్నమస్తే - వైశ్వానర ॥ దా ॥

2. జఠరాగ్నిస్త్వం - పవనాగ్నిస్త్వం
దావానలస్త్వం - బడబానలస్త్వం
అహస్కరస్త్వం - శశితారకాస్త్వం
కాలాహికీల - జ్వాలానల ॥ దా ॥

3. త్వం ప్రాణిదేహే - ప్రవిష్టవన్
చతుర్విధాన్నం - పచనంకరిష్యసి
హితాగ్నిదేవా - పురోహితస్త్వం
సుధీంద్రసుతనుతయోగనృసింహా | దా |

## పార్థసారథీస్తుతికృతి పార్థివతత్వము

శహన

21

ప|| హేపార్థసారథి పృథ్వీసముద్ధార | హే |

అ|| ప|| మాంపాహిభూనాథవరాహావతార | హే |

చ|| 1. హేమకలధౌతసప్తధాతుప్రశస్త
భూమిజద్వాదశలవణసంయుక్త | హే |

2. శ్యామల శాద్వల సస్యసముపేత
స్వామిసుధీంద్రజ - నుతభూమితత్వ | హే |

## శ్రీ సరస్వతీస్తుతికృతి

22 సామ - ఆది

ప|| నాద సు ధార్ణవ సంజనితే వాగ్దేవతె
వేదత్రయీ సుపూజితె శ్రుతిసూక్తిగతే | వా |

అ॥ ప॥ ముఖరిత వీణా - నాదాలంకృతె
సుఖసంగీత సు సాహిత్యగతే ॥ నా ॥

చ॥ 1. విమలోంకారజ - శ్రుత్యుతిపూరితె
అమలిన రాగభావసంచారితె
ప్రముదితాభంగమృదంగలయాన్వితె
అమృతం గమితుం - సామాన్నమితే ॥ నా ॥

2. శిశూనాంహితే - పశూనాంహితే
ఆశీవిషహితె - విశ్వారాధితె
త్రసక జనిమృతి - పథవిదూరగతె
మసకరి సుధీంద్రజ - వ్యాఖ్యానసుతే ॥ నా ॥

## వ్యోమకేశమహేశస్తుతికృతి ( ఆకాశతత్వము )

23 సునాదవినోదిని

ప॥ వ్యోమాభ్రాకాశ - వ్యోమకేశ ఈశ
వామేయుమావాస - పాహిమాంమహేశ ॥ వ్యో ॥

అ॥ ప॥ కామేశ్వరీహాస - కామదేహనాశ
శ్రీ మాధవస్య - చింతనానువేష ॥ వ్యో ॥

చ॥ 1. కైలాసవాస - గంగార్ద్ర శీర్ష
ప్రాలేయభూషా - ప్రమథాళి పోష

బాలేందు డోలీకృతచిద్విలాసా
లీలాసుతాండవ - కేళీనటేశా ।వా।

2. సురనదీనినాద- ఐరావతప్రమోద
సురభి, సురతరు - సురనర్తకీ వినోద
తరణిశశితారకా, నిత్యరథ్యాపథ
గురుసుధీంద్రసుత - భక్తి మార్గాస్పద ।వా।

## ముఖ్యప్రాణస్తుతికృతి ( వాయుతత్వము )

24 హంసానంది

ప॥ నమస్తేమాతరిశ్వ - సమస్తజగత్ప్రాణానిల ।న।

అప॥ నమస్తేవాయుదేవా - భావిబ్రహ్మ మహాబలా ।న।

చ॥ 1. సకల ప్రాణిసమ ..... శ్వసన
ప్రాణాపాన ఉదానవ్యానసమాన
పాంచభౌతికగతి సంజీవన
పంచప్రాణవి - ధాన ముఖ్యప్రాణా ।న।

2. మలయప్రాలేయాచలకిశోరా
సుమప్రసూనసుగంధవాహా
హిందోళ డోలిత వనసమూహా
సకలజీవోత్తమ స్వభావా ।న।

3. దహనదాహోద్దామస్నేహా
జ్వలనధ్వంసనగతిప్రోత్సాహా
యుగయుగాంతరలయప్రభావా
మధీయద్రుమతనుత - సూత్రదేవా ।న।

## శ్రీ రాఘవేంద్రస్వామిస్తుతికృతి

25 భూపాల

ప॥ ఉత్తిష్ఠగురురాజ - ఉదితభక్తిసరోజ
ఉత్తిష్ఠ మంత్రాలయ - కల్పభూజ ।ఉ।

అను॥ ఉదరవి కిరణైః ముదితానికమలాని
గదిత శ్రుతివాద - విదితాః భ్రమరాః ।ఉ।

చ॥ 1. మధ్వమునితత్వాబ్జ- భాష్యాణివికచంతి
మధ్వామృతం భక్తి - మధుపాః పిబంతి
విద్వాంసవేదాంత - వైణికాః గాయంతి
సుద్వైతశాస్త్రాణి - వసుధాం సుశోభంతి ।ఉ।

2. తవభావదీప ః స్తుతతంత్రదీపః
త్రివిధవేదవ్యాఖ్య - పవమానజలధిః
తవభావభాట్ట - సంగ్రహన్యాయదీపః
స్తువంతిసుధీంద్రజ - సుకృతిపరిమళా ।ఉ।

## శ్రీ రాఘవేంద్రస్తుతికృతి

26 కల్యాణి

ప॥ బృందావన స్థితగురుంనమరాఘవేంద్రం ॥ బృ ॥

అ॥ ప॥ బృందార కాప్తహరిభక్తి యుతంయతీంద్రం ॥ బృ ॥

చ॥ 1. శ్రీ మూలరామపదభక్తి సుపక్వమాణం
ఆమోదవ్యాకరణతర్కత్రయీప్రమాణం
శ్రీ మధ్వ శాస్త్ర సమలంకృతమంత్రగేహం
స్వామింతథామరతరుం సురకామధేనుం ॥ బృ ॥

2. సర్వోత్తమం పరమహంసగురుం శ్రీం
ఉర్వీం విధి రవిల వాణీసువర్ణ శేషం
శర్వంచ సద్గురు పరంపరతారతమ్యే
సర్వజ్ఞ మధ్వవిజయీంద్రసుధీంద్రిసూనుం ॥ బృ ॥

## శ్రీ రాఘవేంద్రస్తుతికృతి

27 దర్బార్ కావడ

ప॥ యాచేఽహం ప్రభు తవపదసేవనం
హేచింతామణి భక్త బృందావన ॥ యా ॥

అ॥ ప॥ మంత్రాలయప్రభు రాఘవేంద్రా
తంత్రప్రదీప - తత్వాబ్ధిచంద్రా ॥ యా ॥

చ॥ 1. అనుదినగంగా తుంగా స్నానం
ఘనాఘమర్షణ – మర్ఘ్యప్రదానం
జనిజాడ్యాపహ – తీర్థ పానం
ఘనబృందావన – నిత్యసందర్శనం ॥ యా ॥

2. దధిఘృతక్షీర – నారికేళఫల
మధు-శర్కర హిత – ఘనసారజల
కదలీమిశ్రిత – తతపంచామృత
ముదితబృందావన – మూలప్రదక్షిణం ॥ యా ॥

3. జలజభవకర – కమలార్చితసుమైః
జలదనిభమూల రామ విగ్రహ
స్థలమంత్రాలయ – నిత్యసుమార్చనే
కలితమంత్రాక్షత – సుధీంద్రజార్చనం ॥ యా ॥

## శ్రీ రాఘవేంద్రస్వామిస్తుతికృతి

హిందోళ

28

ప॥ భజరే మానసగురురాజం ...
భజమంత్రాలయ విరరాజం .... ॥ భ ॥

అ॥ ప॥ రాఘవేంద్ర పరివ్రాజం దురి
తాఘ భంజన – రాజాధిరాజం ॥ భ ॥

చ॥ 1. వీణావంశజ - వీణానిపుణం
ప్రాణాగమ నవ - వ్యాకరణ చణం
ధ్యాన ప్రతిష్ఠిత - సీతారమణం
జ్ఞాన భూషణం - భక్త పోషణం ॥ భ ॥

2. మధ్వమతాద్భుత - మహిమాంభరణం
సుద్వైతామృత సూక్తి వితరణం
విద్వన్మండిత - విజ్ఞానధనం
సద్విధానయుత - శాస్త్రాచరణం ॥ భ ॥

3. ప్రతిదినవ్రతతుషితాన్నదానం
శ్రుతి విద్యాలయ - ఛాత్రసుపోషణం
కృత సమీరసమ - యాభివర్ధనం
యతిసుధీంద్రజేతి - స్తుత్య మాణం ॥ భ ॥

## శ్రీ రాఘవేంద్రస్వామిస్తుతికృతి

29 రీతిగౌళ

ప॥ మంత్రాలయావాస - మాంపాహి పాహి ॥ మం ॥

అ॥ ప తంత్రప్రదీప - వీణాప్రవీణపాహి ॥ మం ॥

చ॥ 1. మంగళ ప్రద మూల రామార్చకా పాహి
అంగీకృతానంద - తీర్థసన్మతపాహి
తుంగా నదీశిత - పవనార్చితా పాహి
సంగీత సచ్ఛాస్త్ర పారంగతాపాహి ॥ మం ॥

2. సౌందర్యహరిభక్తి - సౌందర్యపాహి
బృందావన స్థ నత - బృందావనాపాహి
మందార హితభక్త - మందార మాంపాహి
బృందారకనుతవత - బృందార్చితాపాహి ‖ మం ‖

3. సురభూసురేంద్రనుత - సుగుణ సంస్థితపాహి
వరభక్తి సిద్ధాంత - వర్ధకామాంపాహి
దురితాఘ భవరోగ - నిర్మూల కాపాహి
గురుసుధీంద్రసుతేతి - సంకీర్తితా పాహి ‖ మం ‖

## శ్రీ రాఘవేంద్రస్వామిస్తుతికృతి

30 శ్రీరాగం

ప‖ వందే రాఘవేంద్రం - జగద్గురుం
వందే ....రాఘవేంద్రం ..... ‖ వం ‖

అ‖ బృందావనేరమ్య మంత్రాలయేస్థితం
ఛందస్సు సంగీత - వ్యాకృతీ శోభితం ‖ వం ‖

చ‖ 1. మందానిలోర్మికా పూతతుంగాతటి
మందిరావాసభూసుర కల్ప భూజం
ఇందిరేశ పదాబ్జసుందరార్చితభక్తి
చందనా లేపిత - బృందావనస్థం ‖ వం ‖

2. హరిరమాభూబ్రహ్మపవనగరుడ
ఉరగరుద్రాగత - తతతారతమ్యే
గురుపూర్ణప్రజ్ఞా- ణుభాష్యసంగ్రథిత
పరిమళేతిసుధా - చంద్రికా భావదీపం ‖ వం ‖

3. స్వరశాస్త్ర నిపుణేతి - వ్యాఖ్యానకర్తృరితి
కరుణాసముద్రేతి - గురుసార్వభౌమేతి
నిరతాన్నదాతేతి - వరదాయకేతి
గురుసుధీంద్రసుతేతి - సంస్తుత్యమానం ‖ వం ‖

ఇతి

శ్రీ శ్రీశ తత్వామృత మంథనం నామకావ్యే
పంచమాశ్వాసం సంపన్నం
సర్వాంసు సంపన్నం
త్వదీయం వస్తుగోవింద తుభ్యమేవ సమర్పితమ్